# తపశ్చక్రవర్తి దివ్యసప్తతిపూర్తి

శృంగేరి జగద్గురువులు శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థ మహా సన్నిధానం 71వ వర్ధంతి మహోత్సవ విశిష్ట సంచిక







# దర్శనమ్

ఆధ్యాత్మిక వార్తామాసపత్రిక

సభక్తిక సమర్పణమ్



# శ్రీ భారతీతీర్థాష్టకమ్

శ్రిత నత సురవృక్షం శృంగగిర్యాలయస్థం
శ్రుతి గత పరమార్థం సూక్ష్మతో భాషయంతమ్
భరత భువి చ ధర్మం స్వార్చిషా పోషయంతం
గురుచరణ ముపాసే భారతీతీర్థహంసమ్ 1

విదిత వివిధ శాస్త్రం విద్వదార్య ప్రపూజ్యం
సకళ మభయహస్తం సత్తపః ప్రాజ్య రాజ్యమ్
సదయ హృదయ భాసా భక్తహృత్తాపహారం
గురుచరణ ముపాసే భారతీతీర్థహంసమ్ 2

మృదుల మధుర భాషం మాన్య కాషాయవేషం
పరిహృత నిజ దాస స్వాంత రాగాది దోషమ్
స్వమనసి పరిపూర్ణ ప్రాంచ దోంకార ఘోషం
గురుచరణ ముపాసే భారతీతీర్థహంసమ్ 3

విహిత మహిత విద్వద్భూరి గోష్ఠీషు నిత్యం
ప్రవినుత పరతత్త్వం ప్రాపయంతం ప్రణుత్యమ్
స్వహృదయ సరసీజే దర్శయంతం చ సత్యం
గురుచరణ ముపాసే భారతీతీర్థహంసమ్ 4

కలిత లలిత భావం భస్మరేఖా ప్రభావ
విలసిత నిజ తన్వా సప్తసప్తి ప్రభాసమ్
సుకృత సుకృతి దీప్తం సప్తతి ప్రోత్సవాఢ్యం
గురుచరణ ముపాసే భారతీతీర్థహంసమ్ 5

కన దభినవ విద్యాతీర్థ సంయమ్యుదార
కర సరసిజ జాతం పుణ్యనైపుణ్య గీతమ్
వినుత విమల తుంగా వాహినీవ ప్రపూతం
గురుచరణ ముపాసే భారతీతీర్థహంసమ్ 6

ప్రతి దినమపి భక్త్యా శారదా చంద్రమౌళీ
శ్వర పరమ సమర్చాం లోకకల్యాణ హేతోః
సవిధి సుకలయంతం శాంత చిత్తం చ దాంతం
గురుచరణ ముపాసే భారతీతీర్థహంసమ్ 7

నిజగళ ధృత దీక్షా స్వక్షమాలా ప్రకాశా
న్నిజ కర కలితాంచ ద్దివ్య దండ ప్రకాండాత్
పరముపమిత దీవ్య ద్దక్షిణామూర్తి దేవం
గురుచరణ ముపాసే భారతీతీర్థహంసమ్ 8

- డా. జి.యం. రామశర్మ, శతావధాని

## తపశ్చక్రవర్తి దివ్యసప్తతిపూర్తి

దక్షిణామ్నాయ శృంగేరి శ్రీ శారదా పీఠాధీశ్వరులు జగద్గురు శంకరాచార్య శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థ మహా సన్నిధానం **71**వ వర్ధంతి మహోత్సవ విశిష్ట సంచిక

**'దర్శనమ్'**

ఆధ్యాత్మిక వార్తా మాసపత్రిక ప్రత్యేక ప్రచురణ

ముద్రణ : 18-04-2021

ప్రతులు : రెండు వేలు

టైప్ సెట్టింగ్ : రామలక్ష్మి సుబ్రమణ్యం

లేఅవుట్ : శ్రీనివాసరావు త్రిపురాన

ముద్రణ : సాయి తిరుమల ప్రింటింగ్ ప్రెస్ చిక్కడపల్లి, హైదరాబాద్.

ప్రతులకు : మరుమాముల వెంకటరమణ శర్మ సంపాదకులు,దర్శనమ్ ఆధ్యాత్మిక వార్తామాసపత్రిక, 29-105/4/1, శ్రీరామ సిద్ధాంతి భవనం న్యూ విద్యానగర్, నేరేడ్‌మెట్, సికిందరాబాద్ - 500056. Ph: 94410 15469

**ఈ గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయాన్ని అందించిన శాంత-వసంత ట్రస్ట్ వారికి ధన్యవాదములు**



## శ్రీ భారతీతీర్థ నవరత్నమాలికా!



శ్రుతిస్మృతిపురాణోక్త సువచోభాషణప్రభుమ్
శృంగేరీభారతీతీర్థ స్వామినం సతతం భజే 1

ఆదిశంకరసంప్రాప్త పీఠికానందనందనమ్
శృంగేరీభారతీతీర్థ స్వామినం సతతం భజే 2

బ్రహ్మసూత్రసమారబ్ధ తత్త్వజ్ఞానప్రబోధకమ్
శృంగేరీభారతీతీర్థ స్వామినం సతతం భజే 3

దర్శనాఖ్యానవాఙ్మాలా భూషితప్రవచోధరమ్
శృంగేరీభారతీతీర్థ స్వామినం సతతం భజే 4

తుంగాతరంగరంగశ్రీ శృంగేరీతీర్థభాసురమ్
శృంగేరీభారతీతీర్థ స్వామినం సతతం భజే 5

స్తోత్రసంకీర్తనస్వాంత రాగసింధురబంధురమ్
శృంగేరీభారతీతీర్థ స్వామినం సతతం భజే 6

అద్వైతామృతసంధాన వాక్యప్రవచనోన్ముఖమ్
శృంగేరీభారతీతీర్థ స్వామినం సతతం భజే 7

శారదాచంద్రమౌళీశ పాదపంకజచింతకమ్
శృంగేరీభారతీతీర్థ స్వామినం సతతం భజే 8

విశ్వశ్రేయఃప్రదానశ్రీ సదాచారప్రవర్తకమ్
శృంగేరీభారతీతీర్థ స్వామినం సతతం భజే 9

అయాచితాన్వయోద్భూత నటేశ్వరకవీడితా
నవరత్నస్తుతిరభూయాత్ భారతీకరుణాప్రదా !

'శిరోమణి' డా.అయాచితం నటేశ్వరశర్మ

దర్శనమ్
ఆధ్యాత్మిక వార్తా మాస పత్రిక

# తపశ్చక్రవర్తి దివ్యసప్తతిపూర్తి

దక్షిణామ్నాయ శృంగేరి శ్రీ శారదా పీఠాధీశ్వరులు జగద్గురు శంకరాచార్య
శ్రీశ్రీ భారతీతీర్థ మహాసన్నిధానంవారి 71వ వర్ధంతి మహోత్సవ విశిష్ట సంచిక








## విషయ సూచిక










# దక్షిణామ్నాయ శృంగేరీ శ్రీశారదా పీఠాధీశ్వరులు జగద్గురు శంకరాచార్య శ్రీశ్రీశ్రీభారతీతీర్థ మహాసన్నిధానం వారి దివ్యసప్తతి మహోత్సవం సందర్భంగా దర్శనమ్ ప్రచురిస్తున్న విశిష్టసంచికకు శ్రీచరణులు ప్రసాదించిన ఆశీరనుగ్రహ శ్రీముఖమ్



श्री श्री जगद्गुरु शङ्कराचार्य महासंस्थानम्, दक्षिणाम्नाय श्रीशारदापीठम्, शृङ्गेरी

Sri Sri Jagadguru Shankaracharya Mahasamsthanam
Dakshinamnaya Sri Sharada Peetham, Sringeri - 577139

శృంగేరి 13-04-2021

'దర్శనమ్' పత్రిక సంపాదకులు శ్రీమరుమాముల వేంకటరమణశర్మ గారికి,

మీరు శ్రీమహాసన్నిధానంవారి సప్తతిపూర్తి మహోత్సవ సందర్భములో ఒక విశేష సంచికను ప్రచురించనున్నారని తెలిసికొని శ్రీజగద్గురు మహాస్వామివారు సంతోషించినారు.

శ్రీశారదా చంద్రమౌళీశ్వరుల అనుగ్రహమువలన ఈ సంచిక ఉత్తమ లేఖనములతో సుందరముగా వెలువడుగాక, దర్శనం పత్రిక ఇతోధికముగా ఆస్తిక జనాదరమును పొందుగాకయని శ్రీచరణులు ఆశీర్వదించినారు.

ఇట్లు
T. Dakshinamurthi

www.sringeri.net E-mail: adminoffice@sringeri.net Phone: 08265 - 250123 / 250192 Fax: 08265 - 250792

# సర్వతంత్ర స్వతంత్ర ధర్మమూర్తి.. జ్ఞానదీప్తి



**మా**నవ జీవన సాఫల్యానికి సనాతన ధర్మాన్ని ఆచరించడంతో పాటు సాటివారి పట్ల ఆదరణ భావంతో వ్యవహరించాలని, సమాజంలో మంచిని పెంచడానికి చిత్తశుద్ధితో కర్తవ్యాన్ని నిర్వహించడమే తపస్సుగా భావించాలని శ్రీ శృంగేరి జగద్గురు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారు తమ అనుగ్రహభాషణంలో ఉద్బోధిస్తుంటారు. సమాజ హితానికి ధర్మాన్ని ఆచరించడమే శరణ్యమనే వాస్తవం పూజ్య జగద్గురు శ్రీచరణుల ప్రవచనం ద్వారా తేటతెల్లం అవుతుంది. నిజానికి సమాజంతో సంబంధం లేకుండా సాటివారి కష్టసుఖాలు పట్టించుకోకుండా కాలం వెళ్లదీయడమంటే ధర్మాన్ని అతిక్రమించడమే అవుతుంది. అడవులకు వెళ్లి ముక్కు మూసుకోవడమే తపస్సు కాదని, కుటుంబ బాధ్యతలకు పూర్తి న్యాయం చేస్తూ కూడా తపస్సు చేయవచ్చునేది శ్రీచరణుల మార్గదర్శనంలోని పరమార్థం. సమాజం పట్ల బాధ్యతగా వ్యవహరించాలనేది ఇందులో అవగతం అవుతుంది. మనస్సు, మాట, శరీరం ద్వారా ఉత్తమ సంస్కారంతో వ్యవహరించడాన్ని అలవాటు చేసుకోగలిగితే అంతకుమించిన తపస్సు, ధర్మాచరణ మరేముంటుంది. దైవాన్ని ఆరాధించడం, పెద్దలను గౌరవించడం, అన్నివేళలా శుచిగా ఉండగలగడం, నైతిక విలువలు పాటించడం, ఇతరులను బాధించకుండా ప్రేమభావంతో మన్నించడం, సత్యానికి కట్టుబడి ఉండడం మొదలైన అంశాలను అనుసరించడం అక్షరాలా తపస్సే అవుతుంది.

నానాటికీ మారుతున్న కాల పరిస్థితులకు అనుగుణంగా సనాతన ధర్మ సంస్కృతుల పరిరక్షణ ఆవశ్యకతను సామాన్యులకు సైతం అవగాహన కలిగే విధంగా ప్రబోధిస్తున్న శ్రీచరణుల సందేశాలు సమస్త మానవాళి సంక్షేమానికి విశేష ధార్మిక ప్రేరణలు కలిగిస్తున్నాయి. దైనందిన జీవనంలో ధర్మం ఉపదేశించిన మేరకు ఉత్తమ సంస్కారంతో వ్యవహరించడమే తపస్సు అవుతుందని, ఈ క్రమంలో ఎదుటివారిలో దైవాన్ని దర్శించగలిగే ఉదాత్త విధానం సొంతం అవుతుందని శ్రీచరణుల సందేశం. నిన్నటి మంచిని నేటి పరిస్థితులకు అన్వయించి రేపటి లక్ష్యాల సాధనలో ధర్మబద్ధమైన సమాజ హితం కోసం చిత్తశుద్ధితో కర్తవ్యాన్ని నిర్వహించడం కన్నా వేరే తపస్సు లేదు. నిజానికి సమాజ జీవనంలో వేగం, కాలం కీలకభూమిక పోషిస్తున్నాయి. ఈ తరుణంలో భౌతికాంశాల్లో పరమార్థ దృక్పథాన్ని జోడిస్తేనే ధర్మాచరణ సులభసాధ్యం అవుతుంది. జీవన గమనంలో శాశ్వతమైన శాంతి, సుఖాలను కేవలం ధర్మం మాత్రమే ఇస్తుంది. కాబట్టి ధర్మసమ్మతమైన కార్యక్రమాలను ఆచరించడమే శ్రేయస్కరం. ధర్మాన్ని ఆచరించడం, అధర్మాన్ని విడనాడడం ద్వారానే మానవ జన్మకు సార్థకత చేకూరుతుంది.

ఈవిధంగా సకల ధర్మసారాన్ని సామాన్య జీవనశైలికి అన్వయించి సమస్త ప్రాణకోటి సంక్షేమానికి, ప్రపంచ శ్రేయస్సుకు పూజ్య శ్రీచరణుల బోధనలు దిశానిర్దేశం చేస్తున్నాయి. త్రికరణశుద్ధి, ధర్మనిబద్ధత, సమాజహిత కాంక్ష ద్వారా మానవ జీవన సాఫల్యతకు చేరువ కాగలమని ప్రబోధిస్తున్న శ్రీచరణులు అపరశంకరులే. వారి బోధనలు శిరోధార్యంగా స్వీకరించడమే మన కర్తవ్యం. ఈ సందర్భంగా పూజ్య జగద్గురువులకు వారి దివ్య సప్తతి పూర్తి మహోత్సవాన 'దర్శనమ్' సభక్తికంగా సమర్పిస్తున్న గురువందనమ్!



# తపశ్చక్రవర్తి... దివ్యసప్తతి పూర్తి

కర్మభూమి భారతావనికి ధార్మికదిక్సూచి.. సనాతన ధర్మపరిరక్షణకు మార్గదర్శి.. సాక్షాత్తూ శారదాంబ స్వరూపం.. అపర ఆదిశంకరుల అవతారం.. అద్వైత సిద్ధాంతాన్ని విశ్వవాప్తం చేస్తూ జ్ఞానరోచస్సును ప్రసరింపజేస్తున్న మహాస్వామి. వారే దక్షిణామ్నాయ శృంగేరీ శ్రీశారదాపీఠం బ్రహ్మవిద్యావ్యాఖ్యాన సింహాసనాన్ని అధిరోహించిన ప్రజ్ఞాననిధి, తపశ్చక్రవర్తి , జగద్గురు శంకరాచార్య శ్రీమదనంత శ్రీవిభూషిత శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారు. ఆర్షధర్మ సమస్త అంశాలు సమగ్రంగా అధ్యయనం చేసిన మహాతపస్వి, వేదవేదాంత యోగశాస్త్రాల్లో అపార పాండిత్యధురీణులు శ్రీచరణులు.. శృంగేరీ శారదాపీఠాధీశ్వరులుగా ముప్పైరెండు సంవత్సరాలకు పైగా యావద్భారతావనికి జ్ఞానభిక్ష ప్రసాదిస్తున్న మహనీయులు వారు. లౌకిక అంశాలకు దూరంగా ఉంటూ, వేదశాస్త్రాధ్యయనాలను ప్రోత్సహిస్తూ నిరంతరం ధార్మిక కార్యాచరణతో ఆస్తికలోకానికి మార్గదర్శనం చేస్తున్న జగద్గురువులు.. అసంఖ్యాక శిష్యకోటి జగద్గురు శ్రీచరణులను నడయాడే దైవస్వరూపంగా సంభావిస్తూ ధన్యులవుతున్నారు. సనాతన ధర్మసంస్కృతులను శిరోధార్యంగా భావించే పూజ్య జగద్గురు శ్రీచరణుల దివ్యసప్తతి పూర్తి మహోత్సవం లోకకల్యాణం కోసం.. శృంగేరీలోని దక్షిణామ్నాయ శ్రీశారదాపీఠంలో అద్వితీయంగా జరగనుంది. ఏప్రిల్ 13వ తేదీ నుంచి 27వ తేదీ దాకా జరగనున్నఈ మహోత్సవం లక్షమోదక గణపతి హోమంతో ఆరంభమై..అతిరుద్ర మహాయాగం.. అయుత చండీమహాయాగం, కోటికుంకుమార్చన క్రతువుల అనంతరం లలితాహోమంతో పరిసమాప్తి కాబోతోంది.18వ తేదీన జగద్గురు శంకరాచార్య శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాసన్నిధానం వారి సప్తతి పూర్తి మహోత్సవం..71వ వర్ధంతి ఉత్సవం.. ఆహ్నిక దర్శనమ్.. గురువందన సభ కన్నుల పండువగా జరగనున్నాయి. ఈ మహత్తర కార్యక్రమాల్లో మనమంతా భక్తిశ్రద్ధలతో పాల్గొందాం. పూజ్య జగద్గురు శ్రీచరణుల అనుగ్రహభాషణంలో పునీతులమై ధార్మిక ప్రేరణలు స్వీకరిద్దాం. ధన్యులమవుదాం. జగద్గురు శ్రీచరణుల దివ్యసప్తతి మహోత్సవం సందర్భాన్ని పురస్కరించుకొని 'దర్శనమ్' సభక్తికంగా అర్పిస్తున్న అక్షరార్చన...

# నమామి భారతీతీర్థం..
# జ్ఞానదం బుధసేవితం



సదాశివ సమారంభాం శంకరాచార్య మధ్యమాం ।
అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరాం ॥

భారతీతీర్థ నామ్నాయో - భాభిస్సదీపయన్ జగత్ ।
అజ్ఞానధ్వాంత సంఛేత్తా - జయత్యద్య జగద్గురుః ॥

భారతీ కరుణాపాత్రం భారతీ పదభూషణమ్ ।
భారతీ పదమారూఢం భారతీతీర్థమాశ్రయే ॥

విద్యావినయ సంపన్నం వీతరాగం వివేకినాం ।
వందే వేదాంత తత్త్వజ్ఞం విధుశేఖర భారతీం ॥

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య, పదవాక్యప్రమాణ పారావార పారీణ, యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణాధ్యాన సమాధ్యష్టాఙ్గ యోగానుష్ఠాననిష్ఠ, తపశ్చక్రవర్తి అనాద్యవిచ్ఛిన్న శ్రీ శంకరాచార్య గురుపరంపరాప్రాప్త, షడ్దర్శనస్థాపనాచార్య, వ్యాఖ్యాన సింహాసనాధీశ్వర, సకల నిగమాగమసార హృదయ, సాంఖ్యత్రయప్రతిపాదిక, వైదికమార్గ ప్రవర్తక, సర్వతంత్ర స్వతంత్ర, ఆది రాజధానీ, విద్యానగర మహారాజధానీ, కర్ణాటక సింహాసన ప్రతిష్ఠాపనాచార్య, శ్రీమద్రాజాధి రాజగురు భూమండలాచార్య, ఋష్యశృంగపురవరాధీశ్వర, తుఙ్గభద్రా తీరవాసి, శ్రీమద్విద్యాశంకర పాదపద్మారాధక, శ్రీమజ్జగద్గురు శ్రీ మదభినవ విద్యాతీర్థ మహాస్వామి గురుకరకమల సంజాత, శ్రీమజ్జగద్గురు శ్రీమద్భారతీ తీర్థ మహాస్వామినాం, తత్కరకమల సంజాత శ్రీమజ్జగద్గురు శ్రీ విధుశేఖర భారతీ స్వామినాంచ పాదారవిందయోః సాష్టాంగ ప్రణామాన్ సమర్పయామః

శ్రీచరణ పద్మములకు అనేక సాష్టాంగ ప్రణామములాచరించి 'దర్శనమ్' ఆధ్యాత్మిక వార్తా మాసపత్రిక సభక్తికంగా 'జగద్గురు దివ్య సప్తతి పూర్తి మహోత్సవ' సందర్భంలో సమర్పిస్తున్న విశిష్ట సంచిక.

శ్రీచరణుల ఆశీరనుగ్రహంతో గత పదహారు సంవత్సరాలుగా సనాతనధర్మ పరిరక్షణ, సమాజంలో ఆధ్యాత్మిక చింతనను పెంపొందించే లక్ష్యంతో బుడిబుడి అడుగులు వేస్తూ... పాఠకుల ఆదరణను చూరగొంటున్న 'దర్శనమ్' తెలుగునాట జగద్గురువుల విజయయాత్ర సందర్భంగా 'గురువందనమ్' సమర్పించి పునీతమయింది. ఈ పదహారేళ్ల ప్రస్థానంలో అనేకమార్లు శృంగేరిలో జరిగిన పలు విశేష సందర్భాల్లో దర్శనమ్ గురుతర బాధ్యతగా విశిష్ట సంచికలను వెలువరించి జగద్గురువుల ఆశీరనుగ్రహాన్ని పొందింది. సాక్షాత్తూ శారదాంబ స్వరూపమైన జగద్గురు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాసన్నిధానం వారి దివ్య సప్తతి పూర్తి మహోత్సవం సందర్భంగా మరోమారు విశిష్ట సంచికను అందించే భాగ్యం కలగడం దర్శనమ్ సుకృతం. ఈ సంచిక రూపకల్పనలో ప్రత్యక్షంగా, పరోక్షంగా చేయూత నందించిన ప్రతి ఒక్కరికీ జగద్గురువుల సంపూర్ణ ఆశీస్సులు లభించాలని ప్రార్థిస్తూ...



సదా జగద్గురువుల సేవలో..
**మరుమాముల వెంకటరమణశర్మ**
**సంపాదకులు**
**దర్శనమ్ ఆధ్యాత్మికవార్తా మాసపత్రిక**



## శారదాంబ దివ్య సన్నిధి

# శృంగేరి



చుట్టు సహ్యాద్రి పర్వత ప్రాంతం......

ఒకవైపు తుంగ, మరోవైపు భద్రానదుల మధ్యలో అందమైన ప్రకృతి ప్రదేశం......

జంతువుల సైతం జాతివైరాన్ని మరచే చోటు......

సాక్షాత్తూ జగన్మాతయే శారదాంబగా వెలసిన దివ్యభూమి......

శంకర భగవత్పాదులవారు తపోశక్తితో శ్రీచక్రాన్ని ప్రతిష్ఠించిన పుణ్యస్థలి......

రామాయణకాలంలో దశరథమహారాజుకు పుత్రకామేష్ఠి నిర్వహించిన ఋశ్యశృంగుడు సిద్ధి పొందిన సిద్ధక్షేత్రం......

అఖిల భారతావనికి ధర్మనిర్దేశం చేస్తున్న జగద్గురువులు నడయాడే ధర్మభూమి......

అదే దక్షిణామ్నాయ శృంగేరి శారదా క్షేత్రం.

పుణ్యభూమియైన భరతఖండములో నదీ, నదములు పుట్టిన ప్రదేశములు, అవి ప్రవహించు ప్రదేశములు, అడవులు, పర్వత ప్రదేశములు. సముద్ర తీరములు మొదలైనవన్ని అత్యంత పవిత్రమైనవిగా, మహత్తుకలిగినవిగా వాసికెక్కినవి. ఆసేతు హిమాచల పర్యంతము వ్యాపించి ఉన్న తీర్థములు పుణ్యక్షేత్రములు మహాఋషుల తపస్సుకు కేంద్రములై, భక్తి జ్ఞాన వైరాగ్యములకు జన్మస్థానములై ఉన్నాయి. ఈ నదీనద, గిరి, సముద్ర ప్రదేశాలు భారతీయ సంస్కృతికి మూలమై, సనాతన ధర్మ వ్యాప్తికి జవ జీవములను అందిస్తున్నాయి. ఇలాంటి ప్రదేశాలలో కనపడే ప్రశాంత వాతావరణం ప్రకృతి సౌందర్యం మన హృదయాలలో ఆధ్యాత్మిక భావనలను కలిగింపజేస్తాయి.

అలాంటివాటిలో కర్ణాటకలోని సహ్యాద్రి పర్వత సానువులలో పావన తుంగా తీరమున పరమ రమణీయ ప్రకృతి సౌందర్యముతో అలరారుతు శృంగేరిలో వెలసిన శ్రీ శారదాపీఠం సుప్రసిద్ధమైనది. ఈ క్షేత్రానికి షిమోగా, తరికెర మొదలైన ప్రాంతాలవరకు రైలు సౌకర్యమున్నది. అక్కడ నుండి అరవై డెబ్బై మైళ్ళు ఘాట్ రోడ్డు మీద బస్సు ప్రయాణం. ఆ కొండ కోనలలో ప్రయాణమే ఒక గొప్ప అనుభవం. ఎటు చూసినా పచ్చనిచెట్లతో ప్రకృతి దేవత సహస్ర శిరస్సులతో తలఊపుతు రమ్మని పిలిచినట్లు, వేయికన్నులతో భక్తులపై కటాక్ష వీక్షణములు ప్రసరింపజేస్తున్నట్లు అనుభూతి కలుగుతుంది. మనము దర్శించబోయే శృంగేరి క్షేత్ర మహత్మ్యము యుగయుగాలుగా ప్రసిద్ధము. శ్రీశంకర భగవత్పాదుల మొదలు నేటివరకు శ్రీ శారదాపీఠమును సేవిస్తూ తేజోభరితము చేస్తున్న అనంతశ్రీవిభూషిత పరమహంస పరివ్రాజకారచర్య పరంపరా ప్రాశస్త్యము, ఖండాంతరలలోను ఖ్యాతిపొందింది.

వాక్కు వెంట అర్థంలా, పూవు వెంట తావిలా, శృంగేరి శ్రీ శారదాపీఠ చరిత్ర శ్రీశంకర భగవత్పాదుల జీవితచరిత్రతో పెనవేసుకొని ఉన్నది. యావద్భారత భూమిని ఒక పవిత్ర యజ్ఞవేదికగా చేసుకొని నాల్గు దిక్కులలో నాలుగు ఆమ్నాయ పీఠాలనుస్థాపించి సనాతన ధర్మమును సుస్థిరము చేసిన మహనీయులు శ్రీశంకరులు.

“ఆ పాంచాలాదా కటకాత్ వాయువ్యాగ్నేయ రేఖయా
ఆ గోకర్ణాశ్చ కాశ్మీరాత్ నైఋతీసాన్య రేఖయా....”

వాయవ్యము నుండి ఆగ్నేయము వరకు, నైఋతి నుండి ఈశాన్యము వరకు రెండు రేఖలతో నాలుగు త్రిభుజాకారములుగా చేసి, వాటిలో దక్షిణమున యజుర్వేదాత్మకమగు శృంగేరిలో శ్రీశారదా పీఠమున

శ్రీసురేశ్వరాచార్యులను, ఉత్తరమున అథర్వవేదాత్మకమైన బదరికాశ్రమములో జ్యోతిష్పీఠమున శ్రీ తోటకాచార్యులను, తూర్పున శ్రీ జగన్నాథ (పూరీ) క్షేత్రము శ్రీగోవర్ధన పీఠమున శ్రీపద్మపాదాచార్యులను, పశ్చిమమున ద్వారకా పీఠమున హస్తామలకాచార్యులను, అధిపతులుగా నియమించి శాశ్వతంగా అద్వైత విద్యాప్రచారమునకు ఏర్పాట్లు చేశారు.

"వర్ణాశ్రమ సమాచారాః అస్మాభిర్యే ప్రసాధితాః
రక్షణీయాస్తు ఏవైతైః స్వే స్వే భాగే యథా విధి."

అని మఠామ్నాయ శాసనము రచించారు. చాతుర్వర్ణ, చతురాశ్రమ ధర్మపరిపాలనాధికార బాధ్యతలు నాలుగు పీఠములకు సమానమే. కాని శృంగేరి పీఠమునకు దశవిధ యతి సాంప్రదాయ ప్రవర్తనాధికారము, శాఖోపశాఖా పీఠ స్థాపనాధికారము, యావద్భారత సంబంధ ధర్మ నిర్ణయాధికారము ప్రత్యేకముగా ఉండటంతో ఇది సార్వభౌమ పీఠముగా వెలుగొందుతున్నది. శృంగేరీ క్షేత్ర మహాత్మ్యము యుగయుగాంతరాలుగా అనేక పురాణాలలో ప్రసిద్ధము. శంకర భగవత్పాదులు దక్షిణ, ఉత్తరదిశలలో పర్వత ప్రాంతములందును, తూర్పు, పశ్చిమదిక్కులలో సముద్ర తీరములందును వైదిక జ్ఞానకేంద్రములనదగిన ఆమ్నాయ పీఠములను స్థాపించి భారతదేశమంతా ఒకేసంస్కృతికి ఒకే ధర్మమని నిరూపించినారు.

ఆంగ్లేయుల పాలనానంతరమే ఈనాటి రాజకీయ, సాంస్కృతిక ఐక్యత సంభవించిందనుకోవటం ఒక అపప్రథ. ఈవిషయం ఆనాడే నిరూపణ చేసినట్లు 8వ శతాబ్దముననే భారతదేశమున ధార్మిక, సాంస్కృతిక ఐక్యతను పునరుద్ధరించినారు. ఉత్తరాది మహిష్మతీ నగర విద్వాంసుడగు సురేశ్వరులు దక్షిణాది మఠ ఆచార్యులైనారు. దక్షిణాది బ్రాహ్మణుడగు తోటకాచార్యుడు ఉత్తరభారతదేశంలోని జ్యోతిష్పీఠాధిపతిగా నియుక్తుడైనాడు. కేరళ నంబూద్రి బ్రాహ్మణులు బదరీలో పూజారులుగా, కర్ణాటక దేశీయులు నేపాలు లోను, మహారాష్ట్ర బ్రాహ్మణులు రామేశ్వరము లోను అర్చకులుగా ఉండవలెనని నియమము చేశారు. ఇంతకన్న మహోదాత్తమైన జాతీయ సమైక్యతా సంఘటన మరొకటి ఉంటుందా? ఇది నూటికి నూరుపాళ్లు స్వచ్ఛమైన జాతీయ భావన అనడం అతిశయోక్తి కానేకాదు.



శ్రీ శంకరుల వారు మనకు ధర్మతత్త్వాన్ని బోధించి మితిమీరిన కర్మకాండను అదుపుచేసి నాస్తికుల జడవాదాన్ని ఓడించి నేడు మనమందరం సగర్వముగా హిందువులం



అనుకొనుటకు మార్గాన్ని ఏర్పరచిన మహనీయులు. ఆనాడు వారు అవతరించి ఉండకపోతే నేడు హిందూ మతముగా పిలువబడుతున్న ఈ సనాతన ధర్మము, ఆర్ష సంస్కృతి, వేదములు, దర్శనములు మొదలైనవేవీ ఈమాత్రమైనా నిలిచియుండేవి కాదేమో.

యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.

అన్నట్లు - పరమేశ్వరుడు మానవులకు జ్ఞానభిక్ష పెట్టుటకు కృతయుగమున దక్షిణామూర్తి రూపములో, ద్వాపర యుగమున వేదవ్యాస రూపములో, కలి యుగమున శ్రీ శంకరుల రూపములో అవతరించాడు. "యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జిత మేవవా / తత్తదేవాన గచ్ఛత్వం మమ తేజోంశ సంభవమ్ - సృష్టిలో అసాధారణమగు తేజముగాని, శక్తిగాని, ఐశ్వర్యముగాని వేటియందు ప్రకటితమగునో అవన్నియు నా తేజోంశములే" అన్న గీతావాక్యాన్ని ఇక్కడ గుర్తుచేసుకోవడం అవసరం. శ్రీ శంకరులు సాక్షాత్తు శివావతారమనడానికి ఎటువంటి సందేహము లేదు. దీనికి శైవ, వాయు, కూర్మ, పురాణాలలో ప్రమాణములున్నాయి. అటువంటి శంకరుల అవతార విశేషములను ఇపుడు తెలుసుకుందాం.

# శ్రీ శంకర భగవత్పాదుల జీవిత సంగ్రహము



నేటి కేరళ రాష్ట్రములోని తిరువాన్కూరు మండలమున 'కాలడి' అనే గ్రామము కలదు. ఈ గ్రామ సమీపములో పూర్ణానది ప్రవహిస్తుంటుంది. ఈ కాలడి గ్రామ ఆవిర్భావము గురించి ఒక ఇతిహాసము ఉన్నది.

పూర్ణానది తీరమున పరమేశ్వరుడు స్వయంభూలింగ రూపమున ఆవిర్భవించి, తన ఆవిర్భావ వృత్తాంతమును కేరళాధీశుడగు రాజశేఖరునికి కలలో కనిపించి చెప్పినాడు. ఆ మహారాజు స్వయంవ్యక్త చంద్రమౌళీశ్వరునకు ఆలయ, మండప, ప్రాకారాది నిర్మాణములు చేశాడు. ఆ ఆలయములో నిత్య అర్చన, ధూప దీప నైవేద్యాదులకు లోటు రాకుండా మాన్యాన్ని ఏర్పాటు చేశాడు. అంతేగాక నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవములు నిరాటంకంగా జరుగుటకు ఆదాయము వచ్చే ఏర్పాటుగూడ చేసినాడు. ఆ సమీపములో 'కాలడి' అనే పేరుతో ఒక అగ్రహారము నిర్మించి, దానిని నంబూద్రితెగ బ్రాహ్మణులకు దానంగా సమర్పించాడు.

ఈ కాలడియే శంకరుల జన్మస్థానమని ప్రాచీన గ్రంథములు పేర్కొన్నాయి. చిద్విలాసుడు అనేవారు సాక్షాత్ శంకరులకు ప్రత్యక్ష శిష్యులని ప్రతీతి. వీరు శంకర విజయ విలాసము అను పేరున శంకర జీవితచరిత్రను రచించారు. "అలకేవపురీయత్ర కాలటీతి ప్రతిశ్రుతా" అని చిద్విలాసుడు పేర్కొనడాన్నిబట్టి 'కాలడి' శంకరుల జన్మస్థానమని చెప్పవచ్చు. ఇక అత్యంత ప్రామాణిక గ్రంథమగు విద్యారణ్యకృత, మాధవీయ శంకర విజయము కూడా కాలడియే శంకరుల జన్మస్థానమని చెబుతోంది.

ఈ కాలడి అగ్రహారమున ఓ పండితుడు విద్యాధిరాజుకు శివగురువు అనే వేదవేదాంగ కోవిదుడైన కుమారుడు ఉన్నాడు. అతని భార్యపేరు ఆర్యాంబ. ఈ దంపతులకు సకల సంపదలు ఉన్నప్పటికి పుత్రసంతానం కలగలేదు. దానితో వారు సమీపములోనున్న వృషభాచలేశ్వర సన్నిధానానికివెళ్ళి తపస్సు చేయడం ప్రారంభించారు. ఒకనాడు పరమేశ్వరుడు శివగురువునకు కలలో దర్శనమిచ్చి, 'మీ కోరిక తీరునట్లు మీకు పుత్రసంతానం కలుగుతుంది. కాని దీర్ఘాయుస్సు కల్గిన మూఢుడగు కుమారుడు కావలెనా, లేక అల్పాయుష్షుతో సర్వజ్ఞుడగువాడు కావలెనా కోరుకో' అనిఅడుగగా ఆ దంపతులు ఆలోచించి సర్వజ్ఞుడగు కుమారుడే కావలెనని కోరుకున్నారు.



**శంకరుల జననం**

శివానుగ్రహముతో కొన్నిరోజులకు ఆర్యాంబ గర్భందాల్చింది. విభవ నామ సంవత్సర ఆర్ద్రా నక్షత్రయుక్త వైశాఖ శుద్ధ పంచమి (క్రీ.శ. 788) శుభఘడియలలో, శివాంశ సంభూతుడైన మగశిశువును ప్రసవించింది. లేక లేక కుమారుడు కలిగినందుకు పరమానందభరితుడైన శివగురువు పిల్లవానికి జాతకర్మాది విధులను వైభవోపేతముగా జరిపించి "శంకరుడు" అని పేరు పెట్టినాడు. ("శం – (శుభము) కరోతి యితి శంకర:" అని భావికాలమున సార్థకనామధేయుడయ్యాడు). ఆ బాలుడు ఏడాది తిరుగేటప్పటికి మాటలాడటం ప్రారంభించాడు. రెండవయేట చదవడం రాయడం వచ్చింది. మూడవయేట శాస్త్రప్రకారంగా చౌళకర్మ జరుపబడింది. ఆ బాలుడు కావ్యశాస్త్రాది సకల విద్యలు సునాయాసముగా అభ్యసిస్తూ దినదినాభివృద్ధి పొందుతున్నాడు. త్వరలోనే ఉపనయన సంస్కారము జరిపించి వేదవిద్య నేర్పించాలని శివగురువు ఆలోచన. కాని అటువంటి భాగ్యం తండ్రికి లేకపోయింది. విధివశాత్తు శివగురువు శివైక్యం చెందినాడు. కుమారునికి ఐదేళ్ళు రాగానే ఆర్యాంబ బంధువుల సహాయముతో కుమారునికి ఉపనయనం జరిపించింది. అనంతరము శంకరులు గురుకులంలో ఉంటు నాలుగు వేదాలను, శిక్ష ,వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అనే ఆరు వేదాంగాలను, తర్కమీమాంసాది శాస్త్రములు, ఇతిహాస, పురాణాది సకలవిద్యలను అవలీలగా అభ్యసిస్తున్నారు.

శంకరులు గురుకులంలో ఉన్నపుడొక విచిత్ర సంఘటన జరిగింది. ఒకనాడు శంకరులు భిక్ష (మధుకరము) కొరకు ఒక ఇంటికి వెళ్ళారు. ఆ ఇల్లాలు భిక్ష వేయటానికి శక్తిలేక, "భవతి భిక్షాందేహి" అన్న బ్రహ్మచారిని వట్టిచేతులతో పంపడానికి మనసురాక ఇల్లంత వెదకితే, ఒక ఉసిరికాయ దొరికింది. దాన్ని శంకరులకు సమర్పించింది. శంకరులు ఆఇల్లాలు ఆ క్షణమున అనుభవించిన మానసికవ్యధను గ్రహించి ఆమె అనుభవిస్తున్న దారిద్ర్యానికి చింతించినాడు. వెంటనే ఆశుకవిత్వముతో అమ్మవారిని స్తోత్రము చేయగా, ఆ తల్లి బంగారు ఉసిరికకాయల వర్షాన్ని కురిపించి ఆ ఇల్లాలి దారిద్ర్యాన్ని పోగొట్టింది. శంకరులు చేసిన ఈ స్తోత్రమే కనకధారా స్తోత్రంగా ప్రసిద్ధి చెందింది.

ఏడవ సంవత్సరము నిండేప్పటికి శంకరులు సర్వవిద్యలు నేర్చుకుని గురువుల ఆశీర్వాదములు పొంది, ఇంటికి తిరిగివచ్చి మాతృసేవలో కాలము గడుపుతున్నారు. ఆర్యాంబ ఇంటినుండి ప్రతిరోజు పూర్ణానదికివెళ్ళి స్నానమాచరించి వస్తుండేది. ఒకనాడు ఆమె స్నానము చేసి తిరిగి వస్తుండగా మార్గమధ్యంలో ఆయాసంతో కూలబడింది. ఈ సంఘటన చూసిన శంకరులు పూర్ణానదిని ప్రార్థించి, ఆ నది తమ ఇంటి సమీపమున ప్రవహించేటట్లు చేసారు.

శంకరుల మహిమల గురించి విన్న కేరళ దేశాధీశుడైన రాజశేఖర మహరాజు తన మంత్రినిపంపి శంకరుని రాజభవనానికి ఆహ్వానించారు. తపస్సు, వేదాధ్యయనం, భిక్షాటనం, సంచారం మొదలైన యతినియమాలను పాటించే మాలాంటివారు రాజమందిరాలను దర్శించడం యుక్తము



కాదని చెప్పడంతో స్వయంగా మహారాజే కాలడికి వచ్చి శంకరుల దర్శనం చేసుకొని, అనేక కానుకలు సమర్పించాడు. తాను రచించిన మూడు నాటకాలను వినిపించాడు. చివరగా పుత్రసంతానాన్ని ప్రసాదించమని కోరాడు. శంకరుడు రాజశేఖరుని భక్తిప్రపత్తులకు ప్రీతిచెంది మహారాజా మీకోరిక అనతి కాలంలోనే సిద్ధించగలదని ఆశీర్వదించాడు. రాజు కానుకలు సమర్పించగా బ్రహ్మచారులమైన మాకు ఈకానుకలతో పనిలేదు. వీటిని యోగ్యులైన గృహస్తులకు దానంచేయమని చెప్పారు. పుత్రసంతానము కలుగబోతోందన్న సంతోషముతో రాజు మరలిపోయినారు.

సామాన్య మానవులకు సాధ్యంకాని ఇలాంటి ఎన్నో మహిమలను ప్రదర్శిస్తున్నప్పటికి అమాయకురాలైన ఆర్యాంబా శంకరులు అవతార పురుషులనే సంగతి గ్రహించక, త్వరలో ఆయనను ఒక ఇంటివానిగా చేసి, కొడుకు కోడలితో సుఖముగా ఉండాలనే ఆలోచనలో ఉన్నది. బాలశంకరులకు అటువంటి ఉద్దేశ్యం ఏ కోశానా లేకపోగా, సన్యాసాశ్రమాన్ని స్వీకరించాలనే ఆలోచన ప్రబలమవుతూ వచ్చింది.

ఒకనాడు శంకరులు పూర్ణానదిలో స్నానం చేస్తుండగా ఒక మొసలి ఆయన కాలినిపట్టుకుని నదిలోకి లాగడం ప్రారంభించింది. ఎంత విదిల్చినా అది పట్టిన పట్టు విడవవడంలేదు. కుమారుని అరుపులువిని ఆర్యాంబ నదివద్దకు వచ్చింది. సన్యాసాశ్రమాన్ని స్వీకరించేందుకు తనతల్లి అనుమతి కోరడానికి ఇది మంచి అవకాశం అని భావించిన శంకరులు సన్యసించుటకు అనుమతించమని తల్లిని వేడుకొన్నారు. పుత్రుడు ఏదోవిధముగా బ్రతికి బయటపడిన చాలునని తలపోసి, ఆ తల్లి సమ్మతించినది. తల్లి అనుమతితో వెంటనే శంకరులు మనస్సులోనే ఆతుర సన్యాసాన్ని స్వీకరించారు. విచిత్రంగా మొసలి ఆయన కాలిని వదలిపెట్టింది.

నదిలోంచి బయటకు వచ్చిన శంకరుడు "అమ్మా, సన్యాసి అయినవాడు ఇంటిలో ఉండటం ధర్మంకాదు. నేను దేశ సంచారానికి బయలుదేరతాను, అనుమతి ఇవ్వమని

అడిగాడు. తల్లి ఆర్యాంబ కొడుకు మాటకు ఎదురు చెప్పలేక దుఃఖాన్ని ఆపుకుని, నాయనా! నాదొక్క కోరిక. నా అవసాన సమయంలో నీవు నా వద్ద ఉండాలి. నిన్ను కనిపెంచినందుకు నీచేతుల మీదుగా నా అంత్యసంస్కారాలు జరగాలి. ఇది నాఆఖరి కోరిక. కాదనకు నాయనా అంది. శంకరుడు....అమ్మా! నీవనుకున్నట్టే జరుగుతుంది. నీ చివరికాలంలో నన్ను ఒకసారి స్మరిస్తే చాలు ఎక్కడున్నా నీ వద్దకు వస్తాను. నీ కోరిక తీరుస్తానని మాట ఇచ్చారు. తల్లిని బంధువులకప్పగించి ఏ లోటూ రాకుండా చూడమని ప్రార్థించారు. తల్లికి పాదాభివందనం చేసి ఇంటిలోనుండి బయలుదేరాడు. ఆయన క్రమ సన్యాసం స్వీకరించడానికై తగిన గురువును వెదుకుతు నర్మదా నదీతీరం చేరాడు. అక్కడ "అమరకాంతం" అన్న చోట ఒకగుహలో తపస్సమాధిలో ఉన్న గోవింద భగత్పాదులను దర్శించారు. శంకరులను చూడగానే గోవిందభగవత్పాదుల ముఖం వికసించింది. ఎప్పటినుండో పరిచయమున్న వ్యక్తిని చూసినట్లు ఆత్మీయభావన కలిగింది. గురు శిష్యుల ఆత్మలు ఒకరినొకరు పోల్చుకున్నట్లుగా ఉంది ఆ సన్నివేశం. క్రమ సన్యాసదీక్ష అనుగ్రహించవలసిందిగా ప్రార్థించాడు శంకరుడు. ఈ నాటికి తగిన శిష్యుడు లభించాడన్న సంతోషంతో సన్యాసదీక్ష ఇవ్వడానికి సన్నాహాలు మొదలుపెట్టారు గోవింద భగవత్పాదులవారు.

లీలామానుషవిగ్రహుడు జ్ఞానమార్గమున లోకమును ఉద్ధరించుటకు అవతరించిన శివరూపుడే ఇతడు అని యోగ దృష్టితో గ్రహించారు. శిష్యుడు ఎంతటి ప్రజ్ఞావంతుడయినా గురుముఖతః బ్రహ్మతత్త్వోపదేశం పొందటం సంప్రదాయం.

**ఎవరీ గోవింద భగవత్పాదులు**

వ్యాసమహాముని కుమారుడు శుకుడు. ఈ శుకుడు తండ్రివద్ద నేర్చుకున్న వేద, వేదాంతాలను భారతదేశంలో ప్రచారం చేశారు. గౌడపాదుడు హిమాలయాల్లోని బదరికాశ్రమంలో ఉంటున్న శుకుని వద్ద వేదాంతశాస్త్రం నేర్చుకున్నాడు. ఆయన మాండుక్యోపనిషత్తును వివరించుచూ కారికలు రాసారు. వేదాంత గ్రంథాలకు కారికలు, భాష్యాలు రాశారు. ఈ గౌడపాదుని శిష్యుడే గోవింద భగవత్పాదులు. ఈయన నర్మదా నది ఒడ్డున ఆశ్రమం ఏర్పాటు చేసుకున్నారు. గోవిందభగవత్పాదులు వ్యాకరణ మహాభాష్యాన్ని అధ్యయనం చేసిన దిట్ట. వీరు శంకరులకు గురువై క్రమసన్యాసదీక్షను అనుగ్రహించారు.

**శంకరులు శంకరాచార్యులుగా**

గురుకృపతో శంకరులు మహావేదాంత వాక్యోపదేశము పొంది, చతుర్వేదాలకు శిరస్సులనదగ్గ (1) ప్రజ్ఞానం బ్రహ్మ (విశిష్టమైన జ్ఞానమే బ్రహ్మ), (2) అహం బ్రహ్మాస్మి (నేను




బ్రహ్మమైయున్న వాడను), (3) తత్త్వమసి (అది (బ్రహ్మ) నీవై ఉన్నావు), (4) అయమాత్మా బ్రహ్మ (ఈ ఆత్మయే బ్రహ్మము) అనే నాలుగు మహావాక్యాల ఉపదేశం పొంది సన్యాస దీక్ష స్వీకరించారు. నాటినుండి శంకరులు "శంకరాచార్యులు"గా ప్రసిద్ధులై, గురుపరంపరలో ఒకరై, ప్రముఖ స్థానమలంకరించారు. శంకరాచార్యులవారు వేదాంతాది శాస్త్ర శ్రవణము చేస్తు మూడు సంవత్సరాలు నర్మదానదీతీరంలో గురుపాద సన్నిధిలోనే గడిపారు.

అది వర్షాకాలము. నర్మదానది పొంగిపొరలుతు, ఆశ్రమాన్ని, ఆ చుట్టుప్రక్కల ఉన్న గ్రామాలను ముంచెత్తింది. అదిచూసిన శంకరులు, తమ కమండలమును మంత్రించి నదీ ప్రవాహానికెదురుగా ఉంచారు. ఉప్పొంగుతున్న నర్మదానదీ ప్రవాహమంతా ఆ కమండలములో ఇమిడిపోయింది. అంతవరకు సమాధిలోఉన్న గోవిందభగవత్పాదులవారు సమాధినుండి లేచి ఈ వింతను గమనించారు. "ఉప్పొంగే నదీప్రవాహాన్ని తన కమండలములోకి సంగ్రహించగలిగినవాడే తన బ్రహ్మసూత్రములకు భాష్యము వ్రాయ సమర్థుడని" వ్యాసులవారు చెప్పిన సంగతి ఆయనకు జ్ఞప్తికి వచ్చింది. వ్యాసులవారి నివాసస్థానమైన కాశీక్షేత్రమే బ్రహ్మసూత్ర భాష్యరచనకు సముచిత ప్రదేశమని భావించిన గురువుల ఆజ్ఞానుసారము శంకరులు కాశీక్షేత్రము చేరుకొన్నారు. అక్కడే వారు బ్రహ్మమీమాంస, శారీరక మీమాంస అనే నామాంతరాలు గల బ్రహ్మసూత్రాలకు, పన్నెండు ఉపనిషత్తులకు, భగవద్గీతకు భాష్యరచన చేసి ప్రస్థానత్రయ భాష్యకర్తలని పేరు పొందారు.



# శ్రీశంకర భగవత్పాదుల శిష్యులు

**పద్మపాదుడు :**

శంకరాచార్యులవారు కాశీక్షేత్రములో నివసిస్తున్న సమయంలో చోళ దేశంనుండి ఒక ముముక్షువు వచ్చి వారిని దర్శించుకొని, సేవచేస్తు ఉంటున్నాడు. అతని భక్తిశ్రద్ధలను గమనించిన ఆచార్యులు, సన్యాసదీక్ష ఇవ్వడానికి ఇతడు యోగ్యుడని భావించి సన్యాసదీక్షనిచ్చి సనందనుడనే యోగపట్టాన్ని ఇచ్చారు. ఒకనాడు శంకరులు గంగకు ఆవలి ఒడ్డునున్న సనందునితో పనిబడి గట్టిగా సనందా! అనిపిలిచారు. ఆ పిలుపు వినగానే ముందు వెనుకలాలోచించక, నేలపై నడిచినట్లుగానే గంగానదిపై నడవడం ప్రారంభించాడు. ఆశ్చర్యంగా అతడు అడుగుపెట్టిన చోటల్లా పద్మములు పుట్టి ఆయన చక్కగా గంగను దాటినాడు. శంకరులు సనందనుని గురుభక్తిని కొనియాడారు. ఆనాటినుండి సనందనుడు పద్మపాదుడనే పేరుతో ప్రసిద్ధుడయ్యాడు.

**ఎవరు తప్పుకోవాలి**

ఒకరోజు మధ్యాహ్నం గంగాస్నానం చేసివస్తున్న శంకరులకు ఒక ఛండాలుడు ఎదురుగా వచ్చాడు. శంకరులు అతనిని తప్పుకొని దూరముగా తొలగుమన్నారు. అప్పుడా ఛండాలుడు "ఎవరిని తప్పుకొమ్మందువు? శరీరమునా? ఆత్మనా? ఆత్మవిద్య తెలిసిన అద్వైతవాదియగు నీవంటి సన్యాసులకు ఇట్టి భ్రమ ఎలా కలిగిందని" ప్రశ్నించాడు. ఆతడు సామాన్యుడు కాడని, గొప్పజ్ఞాని అని శంకరులు గ్రహించి సాష్టాంగ ప్రణామం చేసారు. ఛండాలుడు అదృశ్యమై అతనిస్థానంలో పరమేశ్వరుడు ప్రత్యక్షమైనాడు. బ్రహ్మసూత్రములకు భాష్యము రచించమని, యోగ్యులగు శిష్యులను నియోగించి, అద్వైత మతము నుద్ధరించి ప్రచారం చేయమని ఆదేశించి అంతర్ధానమయ్యాడు.

ఒకనాడు శంకరులు శిష్యులకు బ్రహ్మసూత్ర భాష్యములను బోధిస్తున్న సమయములో ఒక వృద్ధ బ్రాహ్మణుడు అక్కడికివచ్చి బ్రహ్మసూత్రములను గురించి ప్రశ్నించాడు. శంకరులు సూత్రార్థమును వివరించి చెప్పగా, అతడు దాన్ని ఖండించడం, శంకరాచార్యులవారు ఆ వృద్ధుని వాదము ఖండించడం ఇలా ఎనిమిది రోజులు వాద ప్రతివాదములు జరిగాయి. ఎంతకు ఈ వాద ప్రతివాదనలు ముగియకపోవడంతో పద్మపాదుడు ఆశ్చర్యపడి ఈ వృద్ధ పండితుడు సాక్షాత్తు వ్యాసభగవానుడే అయి ఉండునని భావించి...

శంకరశ్శంకర స్సాక్షాత్, వ్యాసో నారాయణస్స్వయం
తయోర్వివాదే సంప్రాప్తే, కింకరః కింకరోమ్యహం

శంకరాచార్యులవారు సాక్షాత్తు శంకరుని స్వరూపం. వ్యాసులవారు స్వయంగా నారాయణులే. అలాంటి వారిద్దరి మధ్య వాదప్రతివాదాలు జరిగితే సామాన్య సేవకుణ్ణి



నేనేమి చేయగలనుకుంటు ఆసక్తిగా వారిని గమనిస్తున్నాడు పద్మపాదులవారు. అనంతరం శంకరులు వచ్చినవాడు సాక్షాత్తు వేదవ్యాసుడని తెలుసుకొని ఆయనకి నమస్కరించారు. బ్రాహ్మణుడు ముసలివాని రూపాన్ని విడిచి వ్యాసరూపములో సాక్షాత్కరించారు. వ్యాసులవారు ఆచార్యులవారి సూత్రభాష్యమును మెచ్చుకుని పదహారేళ్ళ వయసులో ఉన్న శంకరులకు ఇంకో పదహారేళ్ళ ఆయుష్షును అనుగ్రహించాడు. దుర్మతములను ఖండించి, వేదప్రతిపాదిత మతమును సుస్థిరము చేయమని, అద్వైత వేదాంతమును భరతఖండమంతటా ప్రచారము చేయమని ఆజ్ఞాపించి ఆంతర్ధానమయ్యారు. వ్యాసమహర్షి ఆజ్ఞానుసారము శంకరులు శిష్యసమేతముగా కాశీక్షేత్రము నుండి బయలుదేరి, త్రివేణి సంగమస్థానమైన ప్రయాగ చేరుకొన్నారు.

కేవలము కర్మమార్గము చేతనే మోక్షము సాధించవచ్చని విశ్వసించే కర్మమార్గానుసారియైన కుమారిలభట్టును ఎదుర్కొని, వారిని జయించి, అద్వైత సిద్ధాంతమును ఆయనచేత అంగీకరింపచేయటం తన ప్రథమకర్తవ్యమని తలచి కుమారిలభట్టును దర్శించారు. సరిగ్గా అదే సమయానికి కుమారిలభట్టు తన దోష పరిహారార్థము తుషాగ్ని శిక్ష విధించుకొని, తుషాగ్ని (వరిపొట్టుకుమ్ము) మధ్యలో మరణావస్థలో ఉన్నారు. వారిని మరణ సంకల్పము విడిచిపెట్టవలసిందిగా శంకరులు విన్నవించిరి. కాని కుమారిలభట్టు అంగీకరించలేదు. "శంకరా! మహిష్మతీ నగరంలో ఉండే నాశిష్యుడు మండనమిశ్రుని కలిసి, అతనితో వాదించు. అతడు అన్ని విషయములలో నా అంతటివాడు. అతనితో వాదనంటే నాతో వాదించినట్లే" అని పలికి శంకరయతీంద్రులు చూస్తుండగానే ప్రాణములు విడిచినాడు.

**సురేశ్వరాచార్యులు :**

కుమారిలభట్టు చెప్పిన మండనమిశ్రునిజాడ వెదకుతు మహిష్మతీపురంలోని మండనమిశ్రుల ఇంటికి చేరుకున్నారు శంకరులు. ఆ సమయంలో వారి ఇంటి తలుపులు మూసి ఉండగా యోగశక్తితో ఆ ఇంటిలోకి ప్రవేశించారు శంకరులు. లోపల మండనమిశ్రులు ఆబ్దీకము పెడుతున్నారు. సన్యాసులు కర్మభ్రష్టులు కాబట్టి వారి ముఖాన్నికూడా చూసేందుకు ఇష్టపడని మండనమిశ్రులు ఇలా శ్రాద్ధసమయంలో నేరుగా ఇంట్లోకే వచ్చిన సన్యాసిని చూస్తూనే ఎక్కడలేని కోపముతో ఊగిపోయారు. ఇద్దరిమధ్య మాటామాటా పెరిగి వాగ్వాదంగా మారింది. అక్కడున్న మిగతా బ్రాహ్మణులు వారిని శాంతింపజేసి "అభ్యాగతః స్వయంవిష్ణుః" అని కదా సంప్రదాయం. కాబట్టి శంకరులకు భిక్ష ఇవ్వవలసిందిగా సూచించారు. అప్పుడు శంకరులు అన్నభిక్ష కోసం రాలేదు, వాద భిక్షకు వచ్చామని చెప్పడంతో సరేనన్న మండనమిశ్రుడు మరునాడు శాస్త్రచర్చ ప్రారంభించుటకు అంగీకరించాడు.

మండనమిశ్రుని భార్య ఉభయభారతి. సకలశాస్త్ర పారంగతురాలు, అపర సరస్వతీదేవి అవతారం. ఆమెను మధ్యవర్తిగ అంగీకరించి వారిద్దరు చర్చ ప్రారంభించారు. ఈ వాదనలో శంకరులు ఓడిపోతే సన్యాసాశ్రమాన్ని విడచి గృహస్థాశ్రమం స్వీకరించాలి. మండనమిశ్రులు ఓడిపోతే సన్యాసాశ్రమం స్వీకరించేందుకు అంగీకారము కుదిరింది. చాలారోజులు వాదోపవాదములు- ఖండన మండనములు జరిగాయి. చివరకు శంకరులు ప్రతిపాదించిన అద్వైత సిద్ధాంతమును మండనమిశ్రులు అంగీకరించి ఓటమిని ఒప్పుకొన్నారు. సురేశ్వరాచార్యులనే యోగపట్టముతో సన్యాసం స్వీకరించి శంకర

భగవత్పాదులకు శిష్యులయ్యారు. గృహస్థాశ్రమ బాధ్యత ముగిసింది కాబట్టి ఉభయభారతి శరీరము చాలించి సత్యలోకమునకు ప్రస్థానం చేసేందుకు సిద్ధమయ్యింది. శంకరులు ఆమెను వారించి తాను స్థాపించబోయే చతురామ్నాయ పీఠములలో సాన్నిధ్యం అనుగ్రహించి ఆయా పీఠములను, వాటి భక్తులను కాపాడుతుండమని ప్రార్థించారు. ఉభయభారతి అందుకు అంగీకరించి శంకరులవెంట అదృశ్య రూపములో అనుసరించటం ప్రారంభించింది.

శ్రీసురేశ్వరులు తైత్తిరీయ, బృహదారణ్యకోపనిషత్తులపై, పంచీకరణముపై, మరియు దక్షిణామూర్తి స్తోత్రముపై (మానసోల్లాసవార్తికం) వ్యాఖ్యలను వ్రాశారు. శంకర భగవత్పాదులు ప్రతిపాదించిన మౌలిక సూత్రములను వివరిస్తు నైష్కర్మసిద్ధి అనే గ్రంథాన్ని వ్రాశారు. శంకర భగవత్పాదుల తర్వాత అద్వైత ప్రతిపాదితమైన పలు గ్రంథాలు వ్రాసినవారు శ్రీసురేశ్వరాచార్యులు.

శంకరులు తమ దిగ్విజయ యాత్రలో దివ్యక్షేత్రమైన శ్రీశైలం చేరుకొన్నారు. అక్కడ విచిత్రమైన ఒక సంఘటన జరిగింది. ఒక కాపాలికుడు శంకరులను దర్శించి సశరీరంతో కైలాసాన్ని పొందాలనే తన కోరిక తీరేందుకు చక్రవర్తి శిరస్సు కాని, సర్వజ్ఞుడైనవాని శిరస్సుగాని పరమేశ్వరునికి సమర్పించాలని, చక్రవర్తి లభించడం కష్టం కాబట్టి సర్వజ్ఞులైన తమ శిరస్సు కావలెనని ప్రార్థించాడు. అందుకు శంకరులు చిరునవ్వుతో అంగీకరించి ఒక




ఏకాంత స్థలముకు రమ్మని చెప్పారు. శంకరులు చెప్పిన స్థలానికి వచ్చిన కాపాలికుడు శంకరులను వధించడానికి సిద్ధపడగా అక్కడే ఉన్న పద్మపాదుడు నృసింహస్వామిని ప్రార్థించగా స్వామి ప్రత్యక్షమై ఆ కాపాలికుని సంహరించి శంకరులను రక్షించాడు.

**హస్తామలకాచార్యులు:**

అనంతరం శంకరులు పడమటి దిక్కుకు దిగ్విజయ యాత్ర చేస్తు బలిపురం అనే అగ్రహారానికి చేరుకున్నాడు. అక్కడ ఉలకక, పలకక పిచ్చివానిలా కనబడుతున్న ఒక పిల్లవాన్ని వెంటబెట్టుకుని వాని తల్లిదండ్రులు శంకరుల దగ్గరకు వచ్చి ఈ పిల్లవానిపై దయచూపి బాగుచేయమని ప్రార్థించారు. దాంతో శంకరులు ఆ పిల్లవాన్ని నీవెరవు? ఇలా జడునిలా ఎందుకు ప్రవర్తిస్తున్నావని అడిగారు. అప్పుడు ఆ పిల్లవాడు...

“నాహం జడః కింతు జడః ప్రవర్తతే, మత్సన్నిధానేన”...

స్వామీ, నేను జడుడని కాను. నిత్యజ్ఞాన స్వరూపియైన ఆత్మనని పలికాడు. అప్పటికప్పుడు ఆశుధారగా ఆత్మతత్వాన్ని విశదీకరిస్తు పన్నెండు శ్లోకాలు చెప్పాడు. అది విన్న శంకరులు బ్రహ్మజ్ఞాన సంపన్నుడైన ఈబాలుడు తనవద్ద ఉండతగినవాడని నిశ్చయించి, ఆ తల్లిదండ్రులను ఒప్పించి ఆ పిల్లవానికి సన్యాసదీక్షనిచ్చారు. వేదాంత సారమంతా అరచేతిలో ఉసిరికకాయలా సులభంగా వివరించి చెప్పినందుకు అతనికి “హస్తామలకుడు” అనే యోగపట్టాను అనుగ్రహించి తమ శిష్యగణములో చేర్చుకొన్నారు.

**తోటకాచార్యులు:**

శంకరయతీంద్రుల శిష్యగణంలో గిరి అనే అతడు అన్నివేళలో గురుసేవలోనే మునిగి తేలుతుండేవాడు. వేదాంత విద్యా విచారములో అతడికి గల యోగ్యత బహుతక్కువ. అందువల్ల మిగిలిన శిష్యులు ఇతనిని చులకనగా చూస్తుండేవారు. దీన్ని శంకరులు గమనించి “వ్యాది దేశ సచతుర్దశ విద్యాస్సద్య యేవ మనసా గిరి నామ్నే” అని సంకల్పమాత్రం చేతనే గిరికి సర్వవిద్యలు అనుగ్రహించారు. గురువులకృపతో హఠాత్తుగా సంభవించిన అఖండ జ్ఞానానికి ఆనందాశ్చర్యములకు లోనై ఆచార్యులవారికి పాదాభివందనం చేసి ఆశువుగా కొన్ని శ్లోకాలతో గురుస్తుతి చేశారు. ఆ శ్లోకములన్నీ తోటక వృత్తములలో ఉన్నందున గిరి “తోటకాచార్యుడుగా” ప్రసిద్ధుడయ్యాడు.ఆ శ్లోకాలు తోటకాష్టకంగా ప్రాచుర్యం పొందాయి.

-ప్రసాదవర్మ కామఋషి

# మహిమాన్విత దివ్య ధామం శ్రీ శారదా పీఠం



నేడు శృంగేరిగా ప్రసిద్ధిచేందిన ప్రదేశం పేరు ఋష్యశృంగగిరి. ఆ పదమే సంగ్రహంగామారి శృంగగిరిగా, శృంగేరిగా అయింది. దశరథమహారాజుచేత పుత్రకామేష్టి యాగము చేయించిన ఋష్యశృంగ మహర్షి ఈ ప్రదేశంలో సంచరించినందుకు ఆయన పేరుతోనే ప్రసిద్ధి పొందింది. ఋష్యశృంగుని తండ్రియైన విభాండక మహర్షి ఆశ్రమ స్థలమే ఇది.

విభాండమహర్షుల వారు ఆరాధించి, అనంతరం వారు ఐక్యం చెందిన శివలింగము మలహానికరేశ్వరుడు అనే పేరుతో ఊరిమధ్యలో ఒక ఎత్తయిన కొండపై వెలసి ఉన్నది. పడమటి కనుమలలోని ఈ పర్వతమే ఋశ్యశృంగ పర్వతంగా పిలవబడుతోంది. వారి కుమారుడు ఋశ్యశృంగమహర్షి ఆరాధించి ఐక్యచెందిన శివలింగం శృంగేరికి సుమారు ఆరుమైళ్ళ దూరములోని 'కిగ్గ' అనే చిన్న గ్రామంలోని శివాలయంలో ఉన్నది. ఋశ్యశృంగుడు లింగైక్యము చెందినాడనేందుకు గుర్తుగా ఆ శివలింగముపై శృంగము (కొమ్ము) వంటి గుర్తు ఈనాటాకీ మనంచూడవచ్చు.

శృంగేరి పట్టణం కర్ణాటక రాష్ట్రంలో మలనాడునందు చిక్కమంగళూరు జిల్లాలో, నాలుగువైపులా కొండల మధ్యలో పెద్ద లోయలో ఉన్నది. 14వ శతాబ్దిలో శృంగేరీమఠానికి 12వపీఠాధిపతులైన శ్రీవిద్యారణ్య స్వాముల సంకల్ప, అనుగ్రహ, ఆశీర్వాదాలచేత, ఆర్ష సంస్కృతిని రక్షించేందుకు హిందూ సామ్రాజ్య స్థాపనకు పునాదులు వేయబడ్డాయి. తదనుసారం హరిహర, బుక్కరాయ సోదరులు విజయనగర రాజధాని పట్టణ నిర్మాణం చేయడం, రాజ్య విస్తరణ మొదలైన సంఘటనలు సంభవించాయి. అప్పుడు శ్రీభారతీకృష్ణతీర్థులు అనేవారు శృంగేరి పీఠాధీశ్వరులుగా విరాజిల్లుతున్నారు. ఆదిశంకరాచార్యులు చందనపు చెక్కతో చెక్కించి ప్రతిష్ఠించిన శ్రీశారదాదేవి విగ్రహమును స్వర్ణవిగ్రహంగా మార్పుచేసి, ఆలయాన్ని విశాలముగా కట్టించింది వీరే. క్రీ.శ. 1346లో ఆచార్యులవారి తపోనుష్ఠానాలు నిర్విఘ్నంగా సాగేందుకు, వారి సిబ్బందిలో 40 మంది బ్రాహ్మణుల పోషణ నిమిత్తం ఆనాటి పాలకులు 9గ్రామాలు దానమిచ్చారు. ఆ తరువాత బుక్కరాయలు విద్యాశంకర ఆలయ కుంభాభిషేక సమయంలో మరికొన్ని భూములను శృంగేరి మఠసమీప స్థలములలో బ్రాహ్మణ కుటుంబాలు నివాసముండేందుకు వసతిని ఏర్పాటు చేశారు. అంతవరకు ఆచార్య–శిష్యులు మాత్రమే ఏకాంతంగా ఉంటున్న స్థలం ఆనాటినుండి గ్రామంగా, పట్టణముగా మార్పు చెందడం ప్రారంభమైంది. దీనిప్రకారం ఈనాటి శృంగేరి పట్టణానికి సుమారు 660 సంవత్సరాల చరిత్ర ఉన్నదని చెప్పవచ్చు. ఇలా శారదా పీఠానికి భౌతికపరమైన సంపద నానాటికీ వృద్ధి చెందెందుకు ఆనాడే బీజం పడింది.

మఠానికి 11–12వ ఆచార్యులైన శ్రీభారతీకృష్ణతీర్థ శ్రీవిద్యారణ్యస్వాముల వారి కాలంనుండి ఎన్నో మార్పులు సంభవించి, శారదా పీఠం అనేక రకాలుగాప్రాచుర్యాన్ని పొంది, మహాసంస్థానముగా మార్పుచెందడం ప్రారంభమైంది. విజయనగర సామ్రాజ్యస్థాపకులయిన విద్యారణ్యస్వాముల వారికి చక్రవర్తి తన కృతజ్ఞతాసూచకంగా కిరీటం సింహాసనం ఛత్ర చామరాది రాజలాంఛనాలను సమర్పించి వాటిని స్వీకరించవలసిందిగా ప్రార్థించాడు.రాబోయే రోజులలో కలియుగ ప్రభావంతో మానవులలో ఆస్తికభావన సన్నగిల్లిపోయి, వైదికాచార వ్యవహారాలు అడుగంటిపోయే ప్రమాదాన్ని ముందుగానే గుర్తించి, దానిని నివారించడంకోసం లౌకికపరమైన అధికారం, సామాన్యులను ఆకర్షించే ఆడంబరాలు అవసరమే అని భావించి, విద్యారణ్యులవారు ఆ రాజలాంఛనాలను అయిష్టంగానే స్వీకరించుటకు నిర్ణయించుకొన్నారు.

# గురుపరంపర




**నారాయణ పద్మభువం వసిష్టం శక్తించ తత్పుత్ర పరాశరంచ**
**వ్యాసంశుకం గౌడపదం మహాంతం గోవింద యోగీంద్రమధాస్య శిష్యం**
**శ్రీ శంకరాచార్య మథాస్య పద్మపాదంచ, హస్తామలకంచ శిష్యం**
**తం తోటకం వార్తికకార మన్యానస్మద్గురూన్ సంతతమానతోస్మి.**

అనాది కాలంగా వస్తున్న గురుపరంపర దివ్యౌఘము, సిద్ధౌఘము, మానవౌఘము అనే మూడువిధాలుగా ఉన్నదని పెద్దలు చెబుతారు.

**దివ్యౌఘము**

మొదటగా పరమేశ్వరునివద్ద నారాయణుడు ఆత్మజ్ఞాన సిద్ధిని పొందాడు. నారాయణుని నుండి బ్రహ్మదేవడు దీన్నిపొందాడు. ఈ పరంపరనే దివ్యౌఘము అంటారు.

**సిద్ధౌఘము**

బ్రహ్మనుండి వసిష్ట మహర్షి, వసిష్టుని నుండి శక్తి మహర్షి, శక్తినుండి పరాశర మహర్షి, పరాశరుని నుండి వేదవ్యాసుడు, వ్యాసభగవానుని వద్ద ఆయన కుమారుడు శుకమహర్షి పొందినారు. ఈవిధంగా వేదాంత జ్ఞానము వంశపారంపర్య క్రమములో సంక్రమిస్తు వచ్చింది. శుకమహర్షి అనంతరం ఈ గురుపరంపర వంశపారంపర్య క్రమములోగాక, గురుశిష్య పరంపరాగతంగా సాగింది. శుకమహర్షి-గౌడపాదాచార్యులకు, గౌడపాదులు-గోవింద భగవత్పాదులకు ఈ విద్యను ప్రసాదించారు. వీరు సాక్షాత్తు పతంజలి అవతారమని అంటారు. ఈ మహానుభావులకే శంకరులవారు శిష్యులై విరాజిల్లారు. ఈ పరంపరను సిద్ధౌఘమని అంటారు.

**మానవౌఘము**

శ్రీశంకర భగత్పాదుల శిష్య చతుష్టయం అనబడే పద్మపాద, సురేశ్వర, హస్తామలక, తోటకాచార్యులతో మానవౌఘము ప్రారంభమై నేటివరకు అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్నది.

శృంగేరిలో శ్రీ శారదా పీఠాధిపత్యం వహించిన ప్రథమాచార్యులు శ్రీసురేశ్వరాచార్యులు. పూర్వాశ్రమంలో వీరు కుమారిలభట్టు శిష్యులని, మండనమిశ్రులనే పేరుగలవారని, ఉభయభారతితో గృహస్థాశ్రమములో ఉన్నవారనే విషయం ఇంతకు ముందటే వివరింపబడింది.

శ్రీ సురేశ్వరులు చాలాకాలము శృంగేరి పీఠాధిపత్యాన్ని నిర్వహించారని తెలుస్తున్నది. వీరు శంకరుల



ఉపనిషద్భాష్యానికి, దక్షిణామూర్తి స్తోత్రముకు వార్తికములు వ్రాసి, వార్తికకారులని ఖ్యాతిగాంచారు. వార్తికమంటే ఉక్తానుక్త అర్థములను స్పష్టపరచే వ్యాఖ్యాన గ్రంథమని చెప్పవచ్చు. వీరు క్రీ.శ. 834 వరకు పీఠాధిపత్యం వహించినట్లు ఆధారములున్నాయి.

వీరి తరువాత వీరిశిష్యులు, తర్కవేదాంత శాస్త్ర నిష్ణాతులైన 'నిత్యబోధ ఘనాచార్యులు' క్రీ.శ. 848 వరకు పీఠాధిపతిగా ఉన్నారు. అనంతరం జ్ఞానఘనాచార్య, జ్ఞానోత్తమ శివాచార్య, జ్ఞానగిరి, సింహగిరి, ఈశ్వరతీర్థలనే వారు శారదాపీఠ ఆచార్యులుగా విరాజిల్లినట్లు తెలిస్తున్నది. క్రీ.శ. 1146–1229 మధ్యకాలమున శ్రీ నృసింహతీర్థ నామధేయులు 9వ ఆచార్యునిగా పీఠాధిపత్యాన్ని వహించారు. వీరు గురుదేవుల పేరున 'సింహగిరి' అగ్రహారాన్ని నిర్మించారు. వీరి కాలములో ఉచిత సౌకర్యాలతో అనేక శాస్త్ర పాఠశాలలు నెలకొల్పబడినట్లు, దానిలో అనేకమంది విద్యార్థులుండుటమే కాక, ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్ర, గౌడ, చోళ దేశ విద్వాంసులు తరచు శృంగేరి దర్శిస్తుండేవారని చరిత్ర.

**శ్రీవిద్యాతీర్థులు**

గురుపరంపరలో తరువాత పదవ పీఠాధీశ్వరులుగా వెలుగొందిన వారు శ్రీవిద్యాతీర్థుల వారు. పీఠాధిపత్యకాలము క్రీ.శ. 1229–1333గా తెలుస్తున్నది. వీరికి విద్యాశంకరులని నామాంతరమున్నది. వీరు అనేకశాస్త్ర పారంగతులని, యోగనిష్ఠులని, అవతార పురుషులని కీర్తింపబడ్డారు. విజయనగర సామ్రాజ్య నిర్మాణములో వీరి సంకల్పబలం ఎంతగానో తోడ్పడిందని చెబుతారు. ఆంధ్ర దేశములోని ఓరుగల్లు నుండి ఇద్దరు సోదరులు వచ్చి వీరివద్ద శాస్త్రాభ్యాసం చేశారు. ఆ సోదరులలో చిన్నవారు క్రీ.శ. 1328లో సన్యాసదీక్ష స్వీకరించారు. అప్పుడు వారికి భారతీతీర్థ అను యోగపట్ట నామాన్ని, మూడు సంవత్సరముల అనంతరము పెద్దవారు సన్యసించగా వారికి విద్యారణ్య అనే యోగపట్ట నామాన్ని జగద్గురువులు అనుగ్రహించారు. శ్రీ విద్యాశంకరులు వందసంవత్సరాలకు పైగా మఠనిర్వహణ సాగించారు. చివరకు తుంగానదీ తీరములో ఒక భూగృహము నిర్మించుకొని దానిలో యోగసమాధి కావలెనని సంకల్పించుకొన్నారు. ఆ సందర్భమున నాలుగు ముఖములు గల ఒక విచిత్ర శిల్పము చేయమని ఆజ్ఞాపించారట. ఎదురుగా విద్యాతీర్థుల ముఖము, మూడువైపుల బ్రహ్మ విష్ణు మహేశ్వరుల ముఖాకృతులు, విద్యాశంకరుల శిరస్సుపై లక్ష్మీనృసింహ విగ్రహము, దాని పైభాగమున మహాలింగాకారము. ఈ శిల్పమునకు



రెండువైపుల తమ ప్రియ శిష్యులైన భారతీతీర్థ–విద్యారణ్యమూర్తులు ఉండేటట్లు నమూనా శిల్పాన్ని ఒకదాన్ని తయారుచేయించారు. వారు భారతీతీర్థులకు, తదితర శిష్యులకు భూగృహములో యోగనిష్ఠలో ఆసీనులు కాగానే తలుపులు మూసివేయమని, 12 సంవత్సరముల వరకు తెరువవద్దని, 12 సంవత్సరముల అనంతరము తమ భౌతికదేహము, ఆ విచిత్ర శిల్పరూపములో కనబడుతుందని చెప్పారు. 12 సంవత్సరముల గడువు పూర్తియ్యేవరకు ఆగలేని శిష్యులు భారతీతీర్థస్వామి వారు సంచారంలో ఉన్నసమయంలో మూడు సంవత్సరాలకే తెరచిచూడగా సమాధిలో శిల్పపైభాగమైన లింగాకారం మాత్రం ఆవిర్భవించి ఉన్నది. సంచారములోనున్న భారతీతీర్థులకు ఈ విషయము తెలిసి చాలా విచారించారు. విద్యాతీర్థులు వారికి కలలో కనబడి "చింతించవద్దు. భగవత్సంకల్పము ఇలాగే ఉన్నది. ఇక్కడ ఇంకొక లింగాన్ని ప్రతిష్ఠించి ఆరాధించమని" చెప్పారు. దానితో భారతీతీర్థస్వామివారు అక్కడొక అద్భుతమైన ఆలయము శ్రీచక్రాకారములో కట్టించి దానిలో లింగమును ప్రతిష్ఠించారు. అదే విద్యాశంకరాలయమని ప్రసిద్ధిపొందింది.

అనంతరకాలంలో విద్యాతీర్థులు తయారుచేయించిన శిల్పమూర్తికి 'చతుర్మూర్తి విశ్వేశ్వరుడు' అని పేరుపెట్టి సింహగిరి అనే ప్రదేశములో ప్రతిష్ఠించి నిత్య పూజాదికములు జరిగేటట్లు ఏర్పాటు చేశారు.

విద్యాశంకర ఆలయములో ఈనాటికీ విద్యాతీర్థులు యోగనిష్ఠతో ఉన్నట్లు, రాత్రివేళ దేవతాగణాలు వచ్చి వారిని సేవిస్తున్నట్లు ఘంటానాదాలు వినబడుతాయని ఒక విశ్వాసం.

ఘంటానాదపురస్సరంప్రతిదినం రాత్రౌ సురానాం గణైః
భక్త్యాపూరిత మానసైః సుమవరైః కర్పూర నీరాజనైః
ధూపైర్దీపచయైర్మనోహరతరైఃసంపూజ్యమానం ముహుః
విద్యాతీర్థ పదారవిందయుగళం వందే జగత్పావనం.

అని 'భక్తిసుధాతరంగణి' యందు శ్రీ సచ్చిదానంద



శివాభినవ నృసింహ భారతీస్వామివారు వర్ణించారు. విద్యారణ్యుల తర్వాత శృంగేరి పీఠాధిపత్యము నిర్వహిస్తున్న గురువులందరూ ఈ విద్యాశంకరులనే పీఠాధీశ్వరునిగా భావించుచున్నారున. మఠమువారు వెలువరించే శ్రీముఖములన్నింటిలో "శ్రీ విద్యాశంకర" అనే ముద్రనే వాడుట దీనికి తార్కాణం. అంతేగాక, జగద్గురు బిరుదావళిలో "శ్రీవిద్యాశంకర పాదపద్మారాధక" అన్న బిరుదు ఈనాటికి కూడా మనం చూడవచ్చు.

విద్యాశంకరుల తరువాత 11వ పీఠాధిపతిగా శ్రీభారతీ తీర్థులు క్రీ.శ. 1333లో బాధ్యతలు స్వీకరించి, 47 సంవత్సరములు శారదాపీఠ కార్యభారాన్ని వహించారు. ఆ సమయములో శ్రీ విద్యారణ్యులు మఠ నిర్వహణలో, శాస్త్ర గ్రంథ రచనాది కార్యకలాపాలలో వీరికి చేదోడు వాదోడుగా ఉండేవారు. హరిహర-బుక్కరాయ సోదరులు భారతీకృష్ణ తీర్థులను దర్శించి, విద్యాంసుల, విద్యార్థుల పోషణకు మఠనిర్వహణ కొరకు కొన్ని గ్రామాలను, భూములను, భూరి విరాళములను సమర్పించిన సంగతి పూర్వ అధ్యాయములలోనే చెప్పబడింది. క్రీ.శ. 1380లో భారతీకృష్ణ తీర్థులు బ్రహ్మీభూతులయ్యారు.

పదునాల్గవ శతాబ్దం ప్రారంభం నుండి భారతదేశమంతా సంక్షోభభరితమై అల్లకల్లోలంగా ఉన్నది. దీనికి కారణం ముస్లిములు దండయాత్రలు చేసి అనేక హిందూ సామ్రాజ్యాలు, వీటికి ఆయువుపట్టు అనదగ్గ దేవాలయాలు, సుందరమైన, సుసంపన్నమైన నగరాలను నాశనం చేయడం ప్రారంభించారు. ఈ ఉపద్రవం దక్షిణ భారతానికి వ్యాపించింది. ఇటువంటి విపత్కర కాలంలో రాజ్యాన్నికోల్పోయిన హరిహర-బుక్కరాయ సోదరులు మతంగ పర్వతముపై తపస్సు చేసుకొంటు విద్యారణ్యయతీంద్రులను ఆశ్రయించారు. హిందూరాజ్య స్థాపనకు, ఆర్షసంస్కృతి పరిరక్షణకు కంకణబద్ధులయిన విద్యారణ్యులు భువనేశ్వరీదేవిని ఉపాసించగా ఆ తల్లి కనకవర్షము కురిపించింది. ఆ ధనాన్ని వారు హరిహర-బుక్కరాయ సోదరులకిచ్చి రాజ్యాన్ని పునస్థాపించమని ఆదేశించారు. విద్యారణ్యుల ఆదేశానుసారం రాజసోదరులు ఆ ధనంతో తుంగభద్రా నదీతీరములో క్రీ.శ. 1336లో శ్రీచక్రాకారములో, 9ద్వారములతో ఒక పట్టణాన్ని నిర్మాణం చేసి విద్యానగరమని పేరు పెట్టారు. కొంతకాలం తరువాత దాన్నే విజయనగరమని పిలుస్తుండేవారు. రాజ సోదరులు విజయనగర సామ్రాజ్యాన్ని సుస్థిరంగాచేసి దక్షిణభారతంలో అనేక దేశాలను జయించారు. తమ రాజ్యసంపదనంతా విద్యారణ్యులకు గురుదక్షిణగా సమర్పించారు. విద్యారణ్యులు వారి గురుభక్తికి చాలాసంతోషించి తమ ఆశీరనుగ్రహాలనందించారు. వారిద్దరినే రాజ్యపాలన భారం వహించవలసిందిగా ఆదేశించారు. అప్పటినుండి శృంగేరి పీఠాధీశ్వరుల బిరుదావళిలో "కర్ణాటక సింహాసన ప్రతిష్ఠాపనాచార్య" అనే బిరుదు చేర్చబడింది.

క్రీ.శ. 1380లో శ్రీ భారతీతీర్థుల నిర్యాణానంతరం 12వ పీఠాధిపతిగా శ్రీ విద్యారణ్యులవారు వ్యాఖ్యాన సింహాసనమలంకరించారు. వీరు వేద, తర్క, వ్యాకరణ, మీమాంస, జ్యోతిశాస్త్రములందు నిష్ణాతులు. అంతేగాక మంత్ర తంత్ర, యోగవిద్యా పారంగతులై, శ్రీవిద్యోపాసకులుగ, బ్రహ్మవేత్తగ, బహుగ్రంథకర్తలుగా ప్రశంసింపబడ్డారు. శ్రీ విద్యారణ్యులు నాల్గువేదములకు భాష్యము వ్రాసిన మహనీయులని, హరిహరరాయలుకు విజయనగర సామ్రాజ్య సార్వభౌమత్వము ప్రసాదించినవారని లక్ష్మీ-సరస్వతులనిద్దరిని తన వశం చేసుకోగల్గినవారని, శంకర భగవత్పాదుల వలె విద్యారణ్యులు కూడా అందరికి గురువులై విరాజిల్లుతున్నారని, ఇలావీరి ప్రతిభా పాటవాలను ప్రశంసించే ఎన్నో శ్లోకములు శాసనములలో ఉన్నాయి.

హరిహరరాయలు తమ పూర్వీకులవలె గురువులపట్ల, శారదా పీఠముపట్ల మిక్కిలి భక్తి ప్రపత్తులు, గౌరవ, ఆదరములు కల్గినవాడై మరికొన్ని భూములను సమర్పించడమేగాక శృంగేరి సమీపములో విద్యారణ్యపురం అనేఒక అగ్రహారాన్ని నిర్మించాడు. చందనపు చెక్కతో మలచబడిన శారదాదేవి ఆలయములోని మూలవిరాట్‌ను విద్యారణ్యులు సువర్ణవిగ్రహముగా మార్చుచేసి, ఆరాధనా

పద్ధతులను సంస్కరించారు. తురుష్కుల దోపిడీకి గురై శిథిలమైన దేవాలయాలను ఎన్నింటినో పునరుద్ధరించి నిత్య పూజాదికాలు ఏర్పాటు చేశారు. మహాతపస్వి, ఆర్షధర్మ ప్రతిష్ఠాపకులు, రాజనీతిజ్ఞులు, బహుగ్రంథ నిర్మాణధురీణులు, విజయనగర సామ్రాజ్య స్థాపకులు, మహర్షులు, జగద్గురువులు అయిన విద్యారణ్య యతీంద్రుల ప్రభావంతో సనాతన ధర్మం వర్థిల్లుతున్న సమయమది. అద్వైత సిద్ధాంత ప్రచారం జరిగి ప్రజలలో నైతికవర్తనం, పాపభీతి, తత్త్వచింతనలో ఆసక్తి పెంపొందాయి. పీఠారోహణము చేసే నాటికే వయోవృద్ధులయిన వీరు ఆరు సంవత్సరములపాటు పీఠాధిపత్యాన్ని నిర్వహించి 1386లో విదేహముక్తి పొందారు.

విద్యారణ్యుల అనంతరం చంద్రశేఖర భారతి-1, శ్రీ నరసింహభారతి-1, పురుషోత్తమ భారతి-1 అనేవారు క్రీ.శ. 1386-1448 మధ్యకాలములో శారదా పీఠాధిపత్యాన్ని నిర్వహించారు. పురుషోత్తమభారతి కాలములే విజయనగర ప్రభువులు ఆండవళ్ళి, కంగువళ్ళి, హరేహళ్లి అను గ్రామాలను పీఠానికి అర్పించారు. క్రీ.శ. 1448-1479 సంవత్సరముల మధ్యకాలములో శంకరానందభారతి, చంద్రశేఖరభారతి-2, నృసింహ భారతి-2 అనేవారు శారదా పీఠాన్ని అలంకరించారు.

రెండవ పురుషోత్తమ భారతీ స్వాములవారు 19వ జగద్గురువుగా 1479లో శారదా పీఠాన్ని అలంకరించారు. వీరి కాలములోనే విజయనగర సామ్రాజ్యము, హరిహరరాయల వారసుల శక్తి సామర్థ్యాలు క్షీణించడంతో, వారిసేనాపతులలో ఒక్కడైన నరసింహనాయకుడనే వానికి చిక్కింది. ఇతని రెండవ కుమారుడే విఖ్యాతిగాంచిన శ్రీకృష్ణదేవరాయలు. రాయలవారి కాలములో రాజ్యము చైతన్యవంతమై, నూతనశోభతో అలరారింది. కళింగ దేశాధీశుడైన వీరభద్రగజపతిపై దండయాత్రకు పోయేసమయంలో రాయలవారు పురుషోత్తమ భారతీస్వాములవారి అనుగ్రహాశీస్సులను అర్థించడం, వారి ప్రార్థనతో జగద్గురువులు వారిముఖ్య శిష్యులలో ఒకరిని విజయనగరానికి పంపి తమ ఆశీస్సులనందించడం జరిగింది. శ్రీకృష్ణదేవరాయలు హుయ్యూరు దాని పరిసర గ్రామాలను మఠానికి సమర్పించాడు. అన్యాక్రాంతమైన గాజనూరు, హరకేరి, శిమోగా, సొళ్ళేబైలు అను గ్రామాలను తిరిగి శృంగేరి సంస్థానానికి స్వాధీనం చేశారు. శృంగేరి మఠానికి చెందిన గ్రామములలోని ప్రజలందరు శృంగేరి గురువుల ఆజ్ఞకు బద్ధులై ఉండాలని శాసనం



చేశాడు. పురుషోత్తమ భారతిస్వామివారు క్రీ.శ. 1517 వరకు పీఠాన్నలంకరించారు.

పురుషోత్తమ భారతిస్వామి వారి అనంతరం క్రీ.శ. 1517 మొదలు క్రీ.శ. 1560 వరకు 43 సంవత్సరములు శృంగేరి పీఠాధిపత్య నిర్వహణ గావించినవారు శ్రీరామచంద్ర భారతీస్వామివారు. వీరి కాలములో శ్రీకృష్ణదేవరాయలయొక్క అల్లుడైన సదాశివరాయలు విజయనగరాన్ని పాలించాడు. ఇతడుకూడా తమ పూర్వీకులవలే శృంగేరి శారదా పీఠం పట్ల అత్యంత భక్తిశ్రద్ధలు కలిగినవారు. వీరు బస్తిహళ్ళి అనే గ్రామమును సేనాపతియైన హొన్నప్ప నాయకుని ద్వారా శృంగేరి సంస్థానానికి సమర్పించినట్లు ఆధారాలున్నాయి. శ్రీరామచంద్రభారతీ స్వామి వారు ఒకసారి సంచారంలో భాగంగా కర్కాళ గ్రామమునకు పోయారు. అక్కడి జైనుల ఆహ్వానం మేరకు జైనమందిరానికి వెళ్లి అనంతపద్మనాభస్వామిని ధ్యానించగా, జైన విగ్రహము అనంత పద్మనాభ విగ్రహంగా మారిందట. పిమ్మట మూడవ, నాల్గవ, అయిదవ నరసింహభారతి స్వాములు ముగ్గురును 1560-1600మధ్యకాలమున శృంగేరి పీఠాధిపత్యము నిర్వహించారు.

ఈ ముగ్గురు నరసింహభారతుల తర్వాత అభినవ నరసింహభారతి-1 అనువారు 1600 సంవత్సరమున శారదా పీఠాధిపత్యాన్ని స్వీకరించి 1623 వరకు పీఠాధిపతిగా కొనసాగారు. వీరు శివగీతకు వ్యాఖ్యానాన్ని వ్రాశారు. ఒకనాడు మలహానికరేశ్వరస్వామి ఆలయానికి వెళ్ళి విఘ్నేశ్వర పూజ చేయాలనకున్నారు. కాని అక్కడ గణపతి విగ్రహం లేదు. దాంతోవారు అక్కడి స్తంభంపై పసుపు కొమ్ముతో గణపతి రూపాన్నిగీసి దాన్నే అర్చించారు. ఆ తరువాత వారు గీసిన ఆకారం మేరకు రాతిస్తంభం ఉబికివచ్చి గణపతి విగ్రహంగా ఏర్పడింది. స్తంభం వెనుకవైపు విగ్రహ ఆకారంలో డొల్లగా మారింది.

వీరి పీఠాధిపత్యసమయంలో శివగంగలో ఒక శాఖామఠాన్ని స్థాపించారు. వీరి కాలమున ఇక్కేరి



సంస్థానాధీశులు శ్రీ విద్యాశంకర ఆలయమునకు కానుకలు, శృంగేరి మఠానికి కొన్ని మాన్యాలు సమర్పించినట్లు 1621 నాటి శాసనమొకటి ఉన్నది. శృంగేరిలో వీరు సిద్ధిపొందారు.

తదనంతరము 25వపీఠాధిపతిగా 1623లో సచ్చిదానంద భారతి-1 ఆచార్యస్థానం వహించి 1663వరకు నలభై సంవత్సరాలు పీఠాధిపతిగా ఉన్నారు. వీరి కాలంలో మలహానికరేశ్వరస్వామి ఆలయంలో భవాని అమ్మవారి ప్రతిష్ఠ చేశారు. మఠాభివృద్ధి కొరకు నీటిపారుదల ఏర్పాట్లు, ఆనకట్టలు కట్టించడం, వ్యవసాయాన్ని అభివృద్ధి పరచడం జరిగింది. ఇక్కేరి రాజపాలకుడైన వీరభద్ర నాయకుడు 1630 ప్రాంతమున శృంగేరిని దర్శించి కొన్ని గ్రామాలను సంస్థానానికి సమర్పించాడు. బీజాపూర్ సుల్తాను రణ్దౌలత్ఖాన్ ఇక్కేరి రాజ్యాన్ని ఆక్రమించుకొన్న అనంతరం శృంగేరి మఠాధీన గ్రామాలు అన్యాక్రాంతం కావడంతో గురువులు సుల్తానుకు శ్రీముఖం పంపారు. దానికి సమాధానంగా అన్యాక్రాంతమైన గ్రామాలను మఠానికి స్వాధీనపరచవలసిందిగా ఆజ్ఞాపించానని, తన ఉద్యోగులు జగద్గురువుల ఆజ్ఞ శిరసావహిస్తారని, అవసరమైన అన్నివిధములుగా సహాయం చేస్తానని విన్నవిస్తు జవాబు పంపాడు.

వీరి అనంతరం జగద్గురు పరంపరలో 26వ వారు ఐదవ నృసింహభారతి స్వామివారు. వీరి కాలంలో పీఠానికి కొన్ని భూములు వచ్చిచేరాయి. యలహంక పాలకుడు దొడ్డ వీరప్పగౌడ అనేవాడు సిగెకుప్ప గ్రామాన్ని దానం చేసినట్లు తెలుస్తున్నది. ఒకసారి ఆ ప్రాంతంలో కరువు ఏర్పడితే జగద్గురువులు శృంగేరి పీఠనిధులను వెచ్చించి ఆదుకున్నారు. వీరు క్రీ.శ. 1706 వరకు పీఠపాలన సాగించారు.

సచ్చిదానందభారతి-2 అనేవారు 27వ పీఠాధిపతిగా క్రీ.శ. 1706లో శారదా పీఠాన్ని అలంకరించారు. వీరి హయాంలో దందూరు, హేమపుర అనే రెండుగ్రామాలు మఠానికి సమర్పించబడ్డాయి. మైసూరు ప్రభువు కృష్ణరాజవడయార్-2 ఏనుగులను, పట్టువస్త్రములను పంపాడు. ఆనాటి రాజులకు, సామంతులకు, మొగలాయి అధికారులకు, మహారాష్ట్ర పాలకులకు జగద్గురువులపట్ల అత్యంత భక్తిప్రపత్తులుండేవి. మత, సాంఘిక విషయాలలో శృంగేరి ఆచార్యుల ఆజ్ఞలను పాటించేవారని తెలుస్తున్నది. వీరు క్రీ.శ. 1741లో సిద్ధిపొందగా, వీరి శిష్యులైన అభినవ సచ్చిదానంద భారతిస్వామి-1 వారు పీఠాన్ని అలంకరించి 26 సంవత్సరములపాటు (1767వరకు) పీఠాధిపత్యము నిర్వర్తించారు. బిదనూరు రాణి, మైసూరు పాలకుడు కృష్ణరాజవడయారు, కూర్గు పాలకుడు మొదలైనవారు వారి వారి పరగణాలలోని కొన్ని గ్రామాలని శృంగేరి సంస్థానానికి సమర్పించినట్లు తెలుస్తున్నది. మైసూరురాజు హైదరాలీ జగద్గురువులపై గౌరవాన్ని, భక్తిని ప్రకటించి ఏనుగులు, గుర్రాలు, ఒంటెలను, ఒక బంగారు పల్లకి, పట్టు శాలువలను పంపినట్లు చరిత్రలో ఉన్నది. వీరు తమ దిగ్విజయయాత్రలో భాగంగా నాసిక్‌ను దర్శించి అక్కడే విదేహముక్తి పొందారు.

క్రీ.శ. 1767లో శారదా పీఠాన్ని అధిష్ఠించిన 29వ గురువర్యులు ఆరవ నృసింహభారతీస్వామి వారు. వీరు మూడు సంవత్సరాల కాలమే ఆ స్థానములో ఉండి 1770లో నాసిక్‌లో విదేహముక్తి పొందారు.

క్రీ.శ. 1770 నుండి 1814 వరకు పీఠాధిపతిగా ఉన్నవారు సచ్చిదానంద భారతీ స్వామి-3 వారు. వీరు శ్రీవిద్యోపాసకులు, తర్క వేదాంతాలలో నిష్ణాతులు. వీరి కాలములో టిప్పుసుల్తాన్ మైసూరు రాజ్యాన్ని పాలిస్తుండేవాడు. టిప్పుసుల్తాన్ మిగతా విషయాలలో ఎలాఉన్నప్పటికి శృంగేరీపీఠంపైన, జగద్గురువులపైన అత్యంత భక్తి ప్రపత్తుతో ఉండేవాడు (బహుశా గురువుల తపోబలం గురించి బాగా తెలుసుకొని ఉండటం వల్లకావచ్చు). గురువుల ఆశీర్వచన శక్తితో అనేక యుద్ధాలలో విజయంసాధించి చేజారిన సంస్థానాలను

తిరిగి పొందాడు. అన్యాక్రాంతమయిన శృంగేరిమఠ భూములను తిరిగి మఠానికి ఇప్పించాడు. 1791నుండి 1798లోగా శృంగేరి సంస్థానానికి 29లేఖలు వ్రాశాడు టిప్పుసుల్తాన్. అన్నింటిలోనూ గురువులపట్ల భక్తి, గౌరవాలను ప్రకటించాడు. ఇదేప్రకారంగా హైదరాబాదు నిజాం, మహారాష్ట్ర పాలకులు, ఈస్టిండియా కంపెనీవారు జగద్గురువులపై తమభక్తి ప్రపత్తులు ప్రకటించారు.

టిప్పుసుల్తాన్ మరణానంతరం మూడవ కృష్ణరాజ వడయారు రాజ్యాన్ని పాలిస్తున్నాడు. వయసులో చిన్నవాడవటం, పాలనాపరమైన విషయాలు తెలియకపోవడంతో రాజ్యపాలన వ్యవహారమంతా పూర్ణయ్య అనే రాజప్రతినిధి నిర్వహింస్తుండేవాడు. అప్పుడు ఆశ్చర్యకరమైన ఒక సంఘటన జరిగింది. పూర్ణయ్య మధ్వబ్రాహ్మణుడు. ద్వైత మతాన్ని అనుసరించేవాడు. అద్వైతద్వేషి. ఒక సమయంలో శృంగేరి జగద్గురువులవారు శ్రీరంగపట్టణములో విడిది చేశారు. జగద్గురువులను పరిక్షించి పరాభవించేందుకు ఇదే మంచిసమయం అనుకున్నాడు పూర్ణయ్య. జగద్గురువులకు-ఆస్థానపండితులతో శాస్త్ర విషయాలపై వాక్యార్థ సభ ఏర్పాటు చేయించాడు. గురువులకు వాక్యార్థానికి అభ్యంతరమేమీ లేదు. కాని పీఠాధిపత్యాన్ని వహించి జగద్గురువుల స్థానంలో ఉన్నవారు వేరొకరితో సాధారణ వ్యక్తిలా వ్యవహరించుట యుక్తంకాదు. కాబట్టి తమకు పండితులకు మధ్య తెర కట్టి వాక్యార్థం చేద్దామని చెప్పారు. శాస్త్రచర్చలు ప్రారంభమై నెమ్మదిగా తారస్థాయికి చేరుకుంది. చర్చను శ్రద్ధగా గమనిస్తున్న పూర్ణయ్యకు ఒకసమయంలో జగద్గురువుల కంఠధ్వని స్త్రీ కంఠంలాగా వినిపించగా తెర తొలగించి చూశాడు. జగద్గురువుల స్థానంలో సాక్షాత్తు శారదాంబయే ఉండటం చూసి సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యాడు. మరుక్షణంలో శారదాంబ అదృశ్యమయింది. భయాశ్చర్యాలతో పూర్ణయ్య అమాంతంగా ఆచార్యులవారి పాదాలపైబడి జరిగిన అపచారానికి క్షమించమని ప్రార్థించాడు. తదనంతరం పూర్ణయ్య జగద్గురువుల పాదసేవకుడై భక్తిశ్రద్ధలతో ఉండేవాడు. వీరు 1814 వరకు శారదా పీఠమున ప్రకాశించినారు. తరువాత మూడు సంవత్సరములు ద్వితీయ అభినవ సచ్చిదానందభారతీ స్వామి వారు పీఠాధిపతులై 1817లో సిద్ధి పొందారు.

వీరు సిద్ధి పొందేందుకు 6రోజులముందు శృంగేరి నివాసియైన ఒక బాలుని పీఠాధిపత్యమునకు అర్హుడని గుర్తించి సన్యాసమిచ్చి పీఠాధిపతిగా నియమించారు. వారే



అష్టమ నృసింహభారతీస్వామి.

వీరు చిన్నతనంలోనే కాలినడకతో కాశీయాత్ర చేసి అక్కడ శాస్త్రాధ్యయనం చేశారు. వీరు చాలాకాలం తపో యోగ, అభ్యాసాలను చేసి అనేక సిద్ధులను సాధించారు. వీరు నృసింహోపాసకులు. ప్రతిరోజు జప,తప,అర్చనాది కార్యాలలోనే ఇరవై గంటలు గడిపెడివారట. వీరు సంస్కృతాంధ్ర, కన్నడ, భాషలలోనే కాక తమిళ, మరాఠీ, గుజరాతీ, హిందూస్తానీ మొదలైన భాషలలో కూడా అనర్గళముగా ఉపన్యసించేవారని ప్రతీతి. శారదా పీఠానికి 32వ ఆచార్యులైన వీరి పీఠాధిపత్య కాలం క్రీ.శ. 1817 మొదలు 1879 వరకు. ఈ అరవైరెండు సంవత్సరాల పీఠాధిపత్య కాలంలో నలభై సంవత్సరాలు భారతదేశ సంచారం లోనే గడిపారని తెలుస్తున్నది. వీరి కాలంలోగూడ కొన్ని గ్రామాలు మైసూరు మహారాజుద్వారా మఠానికి సమర్పించబడ్డాయి. ఇండోర్, గ్వాలియర్, అక్కలకోట్ మొదలైన సంస్థానాలనుండి శృంగేరిలో జరిగే ఉత్సవాలకు కానుకలు పంపబడుతుండేవి. హైదరాబాద్ నవాబు జగద్గురువులకు నవరత్నఖచిత స్వర్ణ కిరీటాన్ని సమర్పించి తమ భక్తి ప్రపత్తులు చాటుకున్నాడు.

వీరు ఒకసారి మైసూరు యాత్రలో ఉన్నప్పుడు శివస్వామి అనే ఎనమిది సంవత్సరాల బ్రహ్మచారిని చేరదీసి శారదాదేవి కృపా విశేషంతో లభించిన శిష్యునిగా తెలుసుకొని, ఆ బాలునికి సన్యాసదీక్ష ఇచ్చి సచ్చిదానంద



శివాభినవ నృసింహభారతి అనే యోగపట్ట నామము అనుగ్రహించారు. ఈ బాలస్వామి పన్నెండు సంవత్సరాలు తమ గురువులతో సంచారము చేసి 1878లో శృంగేరి చేరుకొన్నారు. శృంగేరి చేరిన తరువాత కొంతకాలానికి అంటే 1879లో గురువులు నరసింహభారతి స్వామివారు విదేహకైవల్యం పొందారు. అనంతరం సచ్చిదానంద శివాభినవ నృసింహభారతి స్వామివారు 33వ పీఠాధిపతిగా వ్యాఖ్యానసింహాసనాన్ని అలంకరించారు.

**శ్రీసచ్చిదానంద శివాభినవ నృసింహభారతీ స్వామి**

వీరు అపారమైన గురుభక్తి కలవారు. తర్క, వేదాంతాది శాస్త్ర నిష్ణాతులు. వీరు 1886లో శివమొగ్గ, గోకర్ణం, ధార్వాడ, మీరజ్, సాంగ్లి, కొల్లాపురం మొదలైన ప్రదేశాలలో సంచరించి అఖండ సత్కారాలను పొందారు. తర్వాత షోలాపూర్, బీజాపూర్, బళ్ళారి మీదుగా శృంగేరి చేరుకున్నారు. తరువాత మూడు సంవత్సరాలకు అంటే 1892లో మైసూరు మహారాజైన చామరాజవడయార్ ఆహ్వానంపై మైసూరు వెళ్ళి అక్కడే చాతుర్మాస్యాన్ని చేశారు. ప్రసిద్ధ విద్వాంసులను పిలిపించి గణపతి వాక్యార్థ సభలు నిర్వహించారు. అదేవిధంగా శృంగేరిలో కూడా గణపతి నవరాత్రి ఉత్సవాలలో వాక్యార్థసభలు జరుపే సంప్రదాయాన్ని ప్రారంభించింది వీరే. చాతుర్మాస్య అనంతరం నంజనగూడు, చామరాజనగర్, కరూర్, మధుర, రామేశ్వరం మొదలైన ప్రదేశాలు దర్శించి 1895లో శృంగేరి చేరుకొన్నారు. ఈ దేశ సంచారం చేసే సమయంలో వారు దేశంలో వైదికవిద్య నిర్లక్ష్యం చేయబడుతున్నదని గమనించి వేద,శాస్త్ర అధ్యయనాలను తిరిగి ఉద్ధరించాలని సంకల్పించి 1895లో మన్మథనామ సంవత్సర శ్రావణశుక్ల షష్ఠి నాడు సద్విద్యా సంజీవని అని ఒక పాఠశాలను శృంగేరిలో ప్రారంభించారు.

1897లో తుంగానదికి దక్షిణం వైపున్న అడవిని బాగుచేయించి అందులో ఒక ఆశ్రమాన్ని నిర్మించారు. దాంట్లో వారు ఏకాంతంగా ఉంటుండేవారు. దీనికి తమ గురువులకు గుర్తుగా "నరసింహవనం" అని పేరుపెట్టారు. యోగసాధనలో అనేక సిద్ధులు పొంది ఎందరికో రోగాలను, గ్రహపీడలను తొలగించి అద్భుతాలు చేశారు.

వీరి జ్ఞాపకశక్తి, తపశ్శక్తిని బట్టి వీరు సాక్షాత్తు అవతార పురుషులే అని చెప్పవచ్చు. కాని వీరు అదంతా గురువుల అనుగ్రహమని చెప్పేవారు. ఏ పనిని చేసినా శారదాంబకు, వారి గురువులకు విన్నవించకుండా చేసేవారుకాదు. "యద్యత్ కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనం" అన్నట్లు ఏ కార్యాన్ని చేసినా గురువులకే అర్పించేవారు. శ్రీ శంకరభగవత్పాదుల పట్ల మనం చూపుతున్న కృతజ్ఞత అతి స్వల్పమని భావించి, ఈ విషయమై బాగా ఆలోచించి శ్రీశంకరజయంతి మహోత్సవాలను ప్రతిసంవత్సరం వైశాఖ శుద్ధ పంచమి నాడు జరిగేట్టుగా ఏర్పాటు చేశారు. శ్రీవారి సంకల్పానుసారం ఆనాటినుండి ఈనాటి వరకు శ్రీశంకర జయంతి మహోత్సవాలు అవిచ్ఛిన్నంగా జరుగుతున్నాయి.

వీరికాలంలో శృంగేరి మఠాలు లౌకికంగా కూడ చాలా అభివృద్ధి చెందాయి. విద్యార్థులకు పాఠశాలలు, యాత్రికులకు ధర్మశాలలు నిర్మించబడ్డాయి. రాబడి పెరిగింది. శారదాలయాన్ని మరింత శోభాయమానంగా చేసేందుకు రాతితో నిర్మించాలని సంకల్పించి శంకుస్థాపన చేశారు జగద్గురువులు. శ్రీ శంకర భగవత్పాదుల జన్మస్థలమైన కాలడిలో వారికొక ఆలయాన్ని కట్టించాలని సంకల్పించి వారి జన్మస్థలాన్ని గుర్తించారు. తిరువనంతపురం మహారాజు మూలం తిరునాళ్ రామవర్మగారు ఆ స్థలాన్ని శృంగేరి మఠానికి సమర్పించారు. 1910 ఫిబ్రవరి21తేది సోమవారం నాడు (సౌమ్య సంవత్సర మాఘ శుద్ధ ద్వాదశి) శ్రీశారదాంబ అమ్మవారి ప్రతిష్ఠ, శ్రీశంకరుల ప్రతిష్ఠ-కుంభాభిషేక మహోత్సవాలు అతి వైభవంగా జరిగాయి.

ముస్లిములు, క్రైస్తవులు, ఆంగ్లేయులు మొదలైన

విదేశిమతాలవారు సైతం వీరిని జగద్గురువులుగా, దివ్యపురుషునిగా గౌరవించేవారు. వీరు రచించిన దేవతా స్తోత్రములు "భక్తిసుధా తరంగిణి" పేరుతో ప్రచురించబడ్డాయి. వీరు శ్రీశంకర భగవత్పాదుల సాహిత్యమంతటిని 'శంకర గ్రంథావళి' పేరుతో ప్రప్రథమంగా వెలుగులోకి తీసుకువచ్చిన మహనీయులు.

పండిత సత్కారాలు, విద్యార్థిపోషణ, విద్యాలయములు, ఆలయ, మఠ నిర్మాణాలు ఎన్నో నిర్వహించిన ఈ అపరశంకరులు చివరకు లౌకికమైన పనులను విడిచిపెట్టి ఆత్మనిష్ఠలోనే కాలంగడిపేందుకు నిశ్చయించుకొన్నారు. శృంగేరి వాస్తవ్యులైన గోపాలశాస్త్రి-లక్ష్మమ్మ అనే పుణ్యదంపతులకు ఏకైక పుత్రుడైన నరసింహశాస్త్రిని శారదాపీఠమునకు ఉత్తరాధికారిగా నిర్ణయించి 1912 మార్చి 20వ తేదిన (పరీధావి సంవత్సర చైత్ర శుద్ధ విదియ) స్నానాది అనుష్ఠానాలన్నింటిని ముగించుకొని పద్మాసనంలో సమాధిస్థితిలో ఉండి అట్లే విదేహకైవల్యం పొందారు.

**శ్రీ చంద్రశేఖరభారతీస్వామి**

***సంతునమాంసిసహస్రం శ్రీమద్భ్యశ్చంద్రశేఖర గురుభ్యః***
***యేషాం హృదయే వదనే నామ్ని పూతేచ భారతీలసతి***

1912 ఏప్రిల్ 7వ తేదీన పరీధావినామ సంవత్సర చైత్ర బహుళ షష్ఠి ఆదివారం నరసింహశాస్త్రి గారు విధిప్రకారంగా సన్యాసదీక్ష స్వీకరించి చంద్రశేఖరభారతి అనే యోగపట్ట నామంతో శారదాపీఠ వ్యాఖ్యాన సింహాసనానికి జగద్గురువులుగా పట్టాభిషిక్తులయ్యారు. వీరు చిన్నతనంలో శృంగేరిలోని మాధ్యమిక పాఠశాలలో విద్యాభ్యాసం చేస్తున్నప్పుడు జగద్గురువులు వారిని గుర్తించి సద్విద్యా సంజీవని పాఠశాలకు మార్చి సంస్కృత, తర్క, సాహిత్యాది విషయములలో విద్యాభ్యాసాన్ని చేయించారు. తరువాత బెంగళూరులోని శంకరమఠ పాఠశాలలో మీమాంసాధ్యయనం చేశారు. సన్యాసాశ్రమ స్వీకరణానంతరం వీరి గురుదేవులైన శ్రీసచ్చిదానంద శివాభినవ నృసింహభారతీ స్వాములవారిచే ఆరంభించబడి అసంపూర్ణంగా మిగిలిపోయిన శారదా మందిర నిర్మాణాన్ని పూర్తిచేశారు. అట్లే గురుదేవుల సమాధి స్థలంలో ఒక సుందరమైన ఆలయాన్ని నిర్మించి, ఆ రెండు ఆలయాలకు 1916లో (నలనామ సంవత్సర వైశాఖ బహుళ ప్రతిపద గురువారము) కుంభాభిషేకాలు అత్యంత వైభవంగా నిర్వహించారు. మైసూరు మహారాజు కృష్ణరాజ ఒడయారు వచ్చి ఈ ఉత్సవ వైభవాలలో పాల్గొన్నారు. మైసూరు మహారాణుల విన్నపాన్ని అంగీకరించి 1924లో మైసూరు యాత్రచేసి అక్కడినుండి తిరుచురాపల్లి, ఈరోడ్, మధుర,



తిరునల్వేలి, రామేశ్వరం, కన్యాకుమారి మొదలైన ప్రాంతాలలో విజయయాత్ర చేసి 1927 నాటికి కాలడి చేరుకున్నారు. అచట శంకర జయంతి ఉత్సవాలను నిర్వహించి ఇంకొక వేదాంత పాఠశాల నెలకొల్పి 1928 నాటికి శృంగేరి చేరుకున్నారు.

సహజంగానే వీరు ఏకాంత వాసాన్ని ఇష్టపడేవారు. దక్షిణదేశ యాత్రానంతరం ఎక్కువగా తపశ్చర్యలోను, ఆత్మనిష్ఠలోను కాలం గడుపుతుండడంతో మఠానికి సంబంధించిన లౌకిక కార్యకలాపాలకు ఆటంకం ఏర్పడకూడదని ఆలోచించి 1931లో శ్రీనివాసుడు అనే పద్నాలుగు సంవత్సరాల యువకుడికి సన్యాసమిచ్చి అభినవ విద్యాతీర్థ అనే యోగపట్టా నామాన్ని అనుగ్రహించారు.

1938లో బెంగళూరు యాత్ర చేసి శంకర మఠములో ఇంతకుముందటి ఆచార్యులు ఏర్పాటు చేసిన శంకరభగవత్పాదుల ఆలయానికి ఎదురుగా ఒక దేవాలయాన్ని కట్టించి అచట శ్రీ శారదాదేవి మూర్తిని ప్రతిష్ఠించి కుంభాభిషేకము జరిపించారు. అక్కడినుండి కాలడికి వెళ్ళి 10నెలలపాటు ఉండి 1940లో శృంగేరి చేరుకొన్నారు. 1952లో శిష్యబృందమంతా కలిసి జగద్గురువుల షష్టిపూర్తి మహోత్సవాన్ని పురస్కరించుకుని లోకక్షేమానికై చండీయాగం తదితర కార్యక్రమాలు చేయ



సంకల్పించారు. ఆ కార్యక్రమాలు చాలా వైభవంగా జరిగాయి. గురుదేవులు మాత్రం నిర్లిప్తంగానే ఉండిపోయారు. 1954లో రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్‌గారు, జగద్గురువులను దర్శించుకుని ఆశీస్సులు పొందారు.

1954వసంవత్సరం సెప్టెంబర్ 24 (శ్రీ జయనామ సంవత్సర భాద్రపద బహుళ అమావాస్య). అది బ్రాహ్మీముహూర్తవేళ. స్నానంకోసం గురువర్యులు తుంగానది వైపు బయలుదేరారు. అది వర్షాకాలం. మహోత్తుంగ తరంగయై తుంగానది పొంగి పొరలుతున్నది. నదిలో ప్రవాహసంగతిని సేవకుడు గుర్తుచేయగా, తెలుసునంటు గురువులు నీటిలో దిగారు. స్నానసంకల్పంచేసి ఒకమునక వేసి లేచిన గురువులు రెండవమునక వేశారు. ఇకపైకిలేవలేదు. కాసేపటికి జగద్గురువుల భౌతిక శరీరం నీటిలో కొట్టుకపోవడంచూసిన సేవకుడు మహాబలభట్టు, మరికొతమంది కలిసి శరీరాన్ని ఒడ్డుకు చేర్చారు. ఆశ్చర్యం! జగద్గురువుల శరీరం పద్మాసనంలో ఉన్నది. రెండు చేతులు ధ్యానముద్రలో ఉన్నాయి. నీటిలో ఉక్కిరిబిక్కిరి అయిన గుర్తులుగాని, మృతిచెందిన గుర్తులుగాని కనపడలేదు. నదీతీరానికి వచ్చిన మఠపండితులు,శిష్యులు,వైద్యులు మున్నగువారు ఆశ్చర్యచకితులయ్యారు. శ్రీ గురుదేవుల భౌతికకాయానికి మఠ సంప్రదాయాలననుసరించి జరగవలసిన సంస్కారాలు యథావిధిగా నిర్వహించారు. శ్రీవారికి అత్యంత పూజనీయులైన వారి గురుదేవులు శ్రీ సచ్చిదానంద శివాభినవ నృసింహభారతీ స్వామివారి సమీపంలోనే శ్రీ చంద్రశేఖర భారతీస్వాముల దివ్యసమాధి ఏర్పాటు చేయబడింది.

శ్రీవారి దివ్యానుభవాలు, పాండితీ ప్రజ్ఞ, సచ్చరిత్ర, శిష్యులపై చూపించిన వాత్సల్యం మొదలైన వాటిగురించి కథలు కథలుగా చెప్పుకొంటు దేశమంతటా సంతాప సభలు జరిగాయి. జాతి, మత భేదమనేది లేకుండా క్రైస్తవులు, ముస్లిములు కూడా శ్రద్ధాంజలి సమర్పించడం గమనించవలసిన విషయం. ఈ సందర్భంగా శ్రీవారు ఒక శిష్యునికి చెప్పిన వివరణ గుర్తుచేసుకోవడం సందర్భోచితం.

"ఈ దేహమునే గురువని నీవు భావించుచున్నచో నా ఉపదేశమంతయు వ్యర్థమే కదా. నేడుండి రేపు పోవు ఈ దేహముకాదు నీ గురువు. శక్తిస్వరూపియై చేతన స్వరూపియై నీ గురువు నీయందే ఉన్నాడు."

యన్నామకీర్తన మిహ ప్రవదంతి సంతః<br>
సంసార భేషజ మనుత్తమ మేవ నిత్యమ్<br>
యద్దర్శనం పరమ తత్వద దర్శనమ్<br>
తం,శ్రీచంద్రశేఖర యతీశ్వర మానతోస్మి!

**శ్రీమదభినవ విద్యాతీర్థమహాస్వామి**

వీరి అనంతరం దక్షిణామ్నాయ శృంగేరి శారదా పీఠమందు విరాజిల్లిన మహాతపస్వుల పరంపరలో శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామివారు 35వ జగద్గురువులు. పూర్వాశ్రమంలో వీరు శ్రీనివాస నామధేయులు. బెంగళూరు వాసులైన రామశాస్త్రి, వెంకటలక్ష్మమ్మల పెద్దకుమారులు. 1917వ సంవత్సరం నవంబర్ 13వతేదిన (పింగళ సంవత్సర ఆశ్వయుజ బహుళ చతుర్దశి) జన్మించారు.బెంగళూరులో మాధ్యమిక పాఠశాలలో చదువుకొంటున్న వీరు జగద్గురువులు శ్రీ చంద్రశేఖర భారతీస్వామివారి ఆజ్ఞతో శృంగేరి వచ్చారు. అక్కడే వీరికి ఉపనయనం జరిగింది. 1931వ సంవత్సరం మేనెల 22వ తేదీనాడు శ్రీ చంద్రశేఖరభారతీస్వామివారు సన్యాసదీక్షనిచ్చి శ్రీమదభినవ విద్యాతీర్థ అనే యోగపట్టాన్నిచ్చి శిష్యునిగా స్వీకరించారు. జగద్గురువుల దివ్య సన్నిధిలో వారి మార్గదర్శనం, ఉపదేశాలను 23 సంవత్సరాల పాటు నిరంతరముగా పొందిన భాగ్యశాలి శ్రీ విద్యాతీర్థులు. తమ గురువులు విదేహముక్తి పొందిన పిదప జయనామ సంవత్సర ఆశ్వయుజ బహుళ పంచమి (16.10.1954) నాడు శారదాపీఠమునకు 35వ అధిపతులుగా పట్టాభిషిక్తులయ్యారు.

శిష్యకోటి కోరికపై 1956లో దక్షిణదేశ సంచారానికి బయలుదేరారు. కొల్లూరు, ధర్మస్థల, మంగుళూరు



మొదలగు ప్రాంతములు దర్శించి కాలడి చేరుకొని వ్యాసపూజ చాతుర్మాస్య సంకల్పములను అక్కడే చేశారు. తరువాత ఒక సంవత్సరంపాటు మధురై, కోయంబత్తూరు, తిరువనంతపురం, కన్యాకుమారి వంటి నగరములందు విజయయాత్ర చేశి 1957లో కుర్తాళం చేరుకొని చాతుర్మాస్యాన్ని నిర్వహించారు. తదుపరి వారి విజయయాత్ర రెండు సంవత్సరాలపాటు నాగపట్టణం, చిదంబరం, కుంభకోణం, తంజావూరు, శ్రీరంగం మొదలైన ప్రదేశాలలో కొనసాగించి 1959 నాటికి శ్రీరామసముద్రం అనే గ్రామానికి చేరుకొని చాతుర్మాస్య దీక్షచేసి అక్కడ అఖిల భారత శంకర సేవాసమితి అనే ధార్మిక సంస్థను ఏర్పాటు చేశారు.

అక్కడినుండి శ్రీశైలం మీదుగా హైదరాబాదు చేరుకొని రాజా వెంకటరావు లింబేకర్ గారు నిర్మించి సమర్పించిన శంకరమఠంలో శ్రీ శారదాంబ, శంకర భగవత్పాద ఆలయ ప్రతిష్ఠలు, శంకర జయంతి ఉత్సవాలను వైభవంగా జరిపించారు. భద్రాచలం, వరంగల్లు, రాజమండ్రి, కాకినాడ, మద్రాసును దర్శించి, 1961కి గుంటూరు చేరుకొని శంకరమఠంలో శంకర భగవత్పాద ప్రతిష్ఠ చేసి 1961లో తెనాలిలో తెలుగులో "శంకరకృప" మాసపత్రికను ప్రారంభించారు. 1962లో శృంగేరి చేరుకున్నారు. ఆవిధంగా ప్రథమయాత్ర ఆరుసంవత్సరాల పాటు సాగింది. మరలా ద్వితీయయాత్ర 1964లో ప్రారంభించారు. 1965లో వీరికి కనకాభిషేకం జరుపగా, ఆ స్వర్ణ నాణాలకు మరికొంత ధనాన్ని కలిపి జాతీయ రక్షణనిధికి అందజేసారు. అనంతరం ఉజ్జయిని, గ్వాలియర్, ఢిల్లీ, అయోధ్యల మీదుగా నేపాల వెళ్ళి దర్శించి అక్కడ పశుపతినాథ్ మందిరంలో శివరాత్రినాడు శతరుద్రాభిషేకం చేశారు. కేదారనాథ్, బద్రీనాథ్, జమ్ము కాశ్మీర్‌లను దర్శించారు. 1968లో శృంగేరికి చేరుకున్నారు. ఈ విధంగా ద్వితీయ విజయయాత్ర నాలుగుసంవత్సరాల పాటు జరిగింది. ఆదిశంకరుల తరువాత నేపాల్ దర్శించిన జగద్గురువులు వీరే. వీరి విజయయాత్రలో అనేక ప్రదేశాలలో శంకర మఠాలు, యాత్రికుల వసతి గృహ నిర్మాణాలు, వేదపాఠశాలల ఏర్పాటు, జీర్ణ దేవాలయాల పునరుద్ధరణ, దేవతా ప్రతిష్ఠ, కుంభాభిషేకాలు జరిపించడం వంటి ధార్మిక కార్యాలు లెక్కకు మిక్కిలిగా చేశారు. "శంభోర్మూర్తిః చరతి భువనే శంకరాచార్య రూపా" అన్నట్లు భారతదేశమంతా మూడుసార్లు సంచరించి ధర్మప్రచారం చేసిన అపర ఆదిశంకరులు వీరు.

వీరు తెలుగు. కన్నడ, సంస్కృతం, తమిళం, హిందీ, భాషలలో ధారాళంగా ఉపన్యసించేవారు. తమ దివ్యోపదేశములతో సనాతన ధర్మ ప్రచారంచేస్తూ భక్తకోటిలో శ్రద్ధా విశ్వాసాలను పాదుకొల్పారు. శంకరజయంతి, వినాయక చతుర్థి వంటి పండుగలలో జరిగే వాక్యార్థ సభలలో శ్రీవారి శాస్త్రపాండిత్య పటిమ, సర్వజ్ఞత్వము వ్యక్తమవుతుండేది. వీరు శిష్యవాత్సల్యపూరితులు. సర్వజన సులభులు. దయామయులు.వీరి ప్రసంగాలు,సంభాషణలు,శంకరకృప వంటి అనేక పత్రికలలో ఆంధ్ర తమిళ కన్నడ భాషలలో ప్రకటించబడ్డాయి.

ఉజ్జయినిలలో శ్రీవారు చాతుర్మాస్యానుష్ఠానము ఉన్నపుడు తమను దర్శించుకొని శాస్త్రాధ్యయనం చేయాలన్న కోరికను నివేదించుకొన్న సీతారామాంజనేయులు అనే బ్రహ్మచారిని ఎనిమిది సంవత్సరాలు తమవద్దనే ఉంచుకుని శాస్త్రాధ్యయనం చేయించి శ్రీశారదాదేవి ప్రేరణతో 1974వ సంవత్సరం నవంబర్ 11వతేదీనాడు (ఆనందనామ సంవత్సర ఆశ్వీయుజ బహుళ ద్వాదశి) సన్యాసదీక్ష ఇచ్చి భారతీతీర్థ అనే యోగపట్టాన్ని అనుగ్రహించి తమ ఉత్తరాధికారిగా ప్రకటించారు. 1979లో శంకర జయంతి ఉత్సవాలకు పూరి, ద్వారక, బదరీ పీఠాధిపతులను శృంగేరికి ఆహ్వానించి చతురామ్నాయ పీఠాధిపతుల సమ్మేళనాన్ని అతి వైభవంగా, అపూర్వంగా నిర్వహించారు. 1979 అక్టోబరులో జగద్గురువుల పట్టాభిషేక రజతోత్సవం వైభవోపేతంగా జరుపబడింది. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని శ్రీ శారదాధన్వంతరీ ఆసుపత్రిని ప్రారంభించారు. శ్రీ శారద ఆలయ ప్రాంగణంనుండి నరసింహవనానికి పోయేందుకు అప్పటివరకున్న వెదురు వంతెన స్థానంలో చక్కని సిమెంటు వంతెన కట్టించేందుకు సంకల్పించి 1987 ఫిబ్రవరి నెలలో శంకుస్థాపన చేశారు. గామన్ ఇండియా అనే ప్రముఖ నిర్మాణ సంస్థవారు శ్రద్ధతో పనిపూర్తిచేశారు. శ్రీ విద్యాతీర్థులు సంకల్పించిన మహత్కార్యాలలో ఇదే చివరిదిగా మిగిలిపోయింది. వీరి కాలమున ఎన్నో శంకరమఠాలు, ధార్మిక సంస్థలు ఏర్పడి పీఠ చరిత్రలో ఒక స్వర్ణయుగ మారంభమయిందని చెప్పవచ్చు. వివేక వైరాగ్య సంపన్నులు బ్రహ్మవేత్త అయిన జగద్గురువులవారు 1989వ సంవత్సరం సెప్టెంబర్‌నెల 21వతేదిన (శుక్ల సంవత్సర భాద్రపద బహుళ సప్తమి నాడు) విదేహముక్తులైనారు.

ఆ సమయంలో భారతీతీర్థులు పూనాలో యాత్ర చేస్తున్నారు. ఈ వార్త తెలియగానే మిక్కిలి దుఃఖంతో ప్రత్యేక విమానంలో పూనానుండి మంగుళూర్ వచ్చి అక్కడినుండి కారులో శృంగేరి చేరుకొన్నారు. ఈ విషాద వార్త క్షణాలలో దేశమంతా వ్యాపించింది. వేలాది భక్తులు శృంగేరికివచ్చి మహాసన్నిధానంవారి పార్థివ శరీరానికి అంతిమ దర్శనం చేసుకుని నివాళులు అర్పించారు.

## శ్రీ భారతీతీర్థ మహాస్వామివారు

శ్రీ శారదాంబ దివ్యసాన్నిధ్యంతో పునీతమైన ఆధ్యాత్మిక నిలయం, ఆర్షధర్మ ప్రచార కేంద్రం అయినటువంటి శ్రీ శారదా పీఠమును తేజోభరితం చేస్తున్న వర్తమాన యతివరేణ్యులు శ్రీ భారతీతీర్థ మహాస్వామివారు.



పూర్వ ఆశ్రమంలో వీరు తంగిరాల వేంకటేశ్వరావధాని, అనంతలక్ష్మమ్మ అనే పుణ్యదంపతులకు జ్యేష్ఠకుమారుడు. పేరు సీతారామాంజనేయులు. 1951వసంవత్సరం ఏప్రిల్‌మాసం11వ తేదీన (ఖరనామ సంవత్సర చైత్ర శుద్ధ షష్ఠినాడు) బందరులో జన్మించారు. బాల్యమంతా నర్సరావుపేటలో గడిచినది. అచట ప్రతాపగిరి శివరామశాస్త్రి అను సంస్కృత పండితుని వద్ద సంస్కృతము, తండ్రిగారి వద్ద వేదస్మార్తములును, మునిసిపల్ ఉన్నత పాఠశాలలో పదకొండవ తరగతి వరకు విద్యాభ్యాసము చేశారు. వీరు వారు సంవత్సరాలకే సంస్కృత భాషలో మాట్లాడగలిగిన నేర్పు సంపాదించారు. 1961లో శ్రీ అభినవ విద్యాతీర్థులు ఆంధ్రప్రాంతంలో సంచరిస్తూ నరసరావుపేటకు రాగా సీతారామాంజనేయులు శ్రీవారిని దర్శించి వినమ్రతతో మృదుమధురంగా సంస్కృతములో మాట్లాడి వారి అనుగ్రహాన్ని పొందారు. కొంతకాలం తరువాత 1966లో ఉజ్జయినిలో చాతుర్మాస్య దీక్ష చేస్తున్న జగద్గురువులను దర్శించి తమ చరణసన్నిధిలో శాస్త్రాధ్యయనం చేయాలనే కోరికను వెలుబుచ్చగా జగద్గురువులు అందుకు అంగీకరించారు.



శ్రీచరణులు తర్కసంగ్రహము పాఠం చెప్పడంతో ఆరంభమైన వారి శాస్త్రాభ్యాసం "విద్యాతురాణాం నసుఖం ననిద్రా" అన్నట్లు సాగింది. సీతారామాంజనేయులుకి చదువుపట్ల గల శ్రద్ధ గమనించి, శిష్యుడు ఆశ్చర్యకరమైన విద్యాభివృద్ధిని చూసి ఆచార్యులు అమితానందము పొందుచుండెడివారు.

1974లో శృంగేరిలో నవరాత్రి ఉత్సవాల చివరిరోజున ఏకాదశి నాడు శ్రీచరణులు శారదాదేవి ఆలయ గర్భగృహంలో ప్రవేశించి ధ్యానంలో నిమగ్నులయ్యారు. కొంతసేపటికి బయటకు వచ్చి, శారదాదేవి ఆజ్ఞానుసారం సీతారామాంజనేయులును శృంగేరిపీఠ ఉత్తరాధికారిగా నిర్ణయించామని, 1974వ సంవత్సరం నవంబర్ 11వ తేదిన (ఆనందనామ సంవత్సర ఆశ్వయుజ బహుళ ద్వాదశి) వారికి సన్యాసదీక్ష ఇచ్చేందుకు నిర్ణయించామని ప్రకటించారు.

**సన్యాసాశ్రమ స్వీకారం**

1974 సంవత్సరం నవంబర్ 10నాడు (ఆశ్వయుజ బహుళ ఏకాదశి) సన్యాస స్వీకారానికి ముందుగా చేయాల్సిన విధులు ప్రారంభమయ్యాయి. శిష్యస్వామి గురువులకు సాష్టాంగ ప్రణామంచేసి శ్రీ శారదా, భగవత్పాద దేవాలయాలను దర్శించి, గణపతి హోమం, పూర్ణాహుతి వీక్షించి మఠ ప్రాంగణంలో ఉన్న సమస్త దేవాలయాలను దర్శించి, పూర్వఆచార్యుల అధిష్ఠానాలలో ప్రణామాలర్పించి సన్యాసాశ్రమ స్వీకార పూర్వం చేయవలసిన పూర్వరంగ కార్యకలాపాలను పూర్తిచేశారు. మరునాడు ఉదయమే సంధ్యావందనాదికాలు పూర్తిచేసుకుని పురుషసూక్తహోమము, విరజాహోమము ఆచరించి, తుంగానదిలో స్నానంచేసి, నీటిలో నిలబడి మొలత్రాడు, యజ్ఞోపవీత, వస్త్రాది ఆచ్ఛాదనాలు త్యజించి ప్రేషోచ్చారణ మంత్రాలను పఠించారు. గురువులిచ్చిన కాషాయ వస్త్రములను ధరించి దండ కమండలాలను స్వీకరించారు.

నాదస్వర మంగళ వాద్యములొకవైపు, మరోవైపు వేదఘోషతో మారుమ్రోగుతుండగా గురు శిష్యులిద్దరు శ్రీ చంద్రశేఖర భారతీస్వామి అధిష్ఠానం వద్దకు చేరుకొన్నారు. అక్కడ శ్రీ మహాసన్నిధానంవారు శిష్యస్వామికి ప్రణవోపదేశము, మహావాక్యోపదేశం చేసి శ్రీ "భారతీతీర్థ" అనే యోగ పట్ట నామాన్ని అనుగ్రహించారు. అనంతరం శ్రీ శారదాలయానికి వెళ్ళి, అక్కడి వ్యాఖ్యాన సింహాసనంపై శిష్య స్వామిని ఆసీనులను చేశారు. వారి శిరస్సుపై సాలగ్రామముంచి దానికి పూజచేసి మంగళహారతి ఇచ్చారు. అనంతరం మహాసన్నిధానం వారు సింహాసనంపై ఆసీనులు కాగా, శ్రీభారతీతీర్థులు గురు వర్యులపాదములకు పూజ చేశారు. తరువాత ఇరువురు కలిసి శ్రీ శారదాంబను దర్శించుకొని శంకర భగవత్పాద, తోరణగణపతులకు నమస్కరించి, ప్రాంగణంలోని సమస్త ఆలయాలను దర్శించి నరసింహవనానికి తిరిగి రావడంతో సన్యాసాశ్రమ స్వీకారోత్సవం ముగిసింది.

శ్రీ భారతీతీర్థుల వారు తమగురువులతో పాటు భారతదేశమంతా సంచరించారు. శ్రీ మహాసన్నిధానంవారు తమ గురువులైన శ్రీ చంద్రశేఖర భారతిస్వామితో 23 సంవత్సరములు కలిసి ఉండి శాస్త్రాధ్యయనం, మఠ నిర్వహణాది విషయాలన్నింటిలో సుశిక్షితులైనారు. శ్రీ భారతీతీర్థులు గూడ ఎనిమిది సంవత్సరాలు బ్రహ్మచారిగా, సన్యాసాశ్రమాన్ని స్వీకరించిన తరువాత 15సంవత్సరాలు శిష్యునిగా గురువులను సేవించుకొనే భాగ్యం పొందారు. వీరుకూడా గురువులా

## జగద్గురు శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థ మహాస్వామివారి జీవన రేఖలు



| | | | |
|---|---|---|---|
| 1. | పూర్వాశ్రమ నామం | : | తంగిరాల సీతారామాంజనేయులు |
| 2. | జననం | : | 11.04.1951 (చైత్ర శుద్ధ షష్ఠి) |
| 3. | జననీజనకులు | : | వేంకటేశ్వరావధాని, అనంత లక్ష్మమ్మ |
| 4. | జన్మ స్థలం | : | మచిలీపట్నం (బందరు), కృష్ణా జిల్లా, ఆంధ్రప్రదేశ్ |
| 5. | విద్యా గురువులు | : | ప్రతాపగిరి శివరామశాస్త్రి వద్ద సంస్కృతం, తండ్రిగారి వద్ద - వేదస్మార్తములు విద్యాతీర్థుల వద్ద తర్క సంగ్రహంతో ప్రారంభం. నర్సారావుపేట మునిసిపల్ ఉన్నత పాఠశాలలో 11వ తరగతి వరకు |
| 6. | తురీయాశ్రమ స్వీకారం | : | 10.11.1974 (ఆశ్వయుజ బహుళ ఏకాదశి) |
| 7. | పీఠాధిపత్యం | : | 19.10.1989 శుక్లనామ సంవత్సరం ఆశ్వయుజ బహుళ పంచమి |

**ప్రత్యేక ఘట్టాలు :**

| | | | |
|---|---|---|---|
| 8. | షష్ట్యబ్ధి పూర్తి | : | 09.04.2011 (4 - 16 ఉత్సవములు) |
| 9. | శ్రీ శంకరాచార్య దేవాలయ పునర్నిర్మాణం | : | 16.01.2011 వికృతి మాఘ శుద్ధ త్రయోదశి) |
| 10. | తోరణ గణపతి ఆలయ పునర్నిర్మాణం | : | 08.0.2014 |
| 11. | రాజగోపురం ఉద్ఘాటన | : | 08.06.2014 (జయ నామ సం. జ్యేష్ఠ శు. దశమి) 01.06.2014న లక్ష మోదక గణపతి హోమంతో ప్రారంభం) శిష్య స్వీకారం : 22/23.01.2015 విధుశేఖర భారతీస్వామి - పూర్వాశ్రమ నామం కుప్పా వెంకటేశ్వర ప్రసాద శర్మ |

శాస్త్ర పాండిత్యం, తపఃశక్తి, ఆధ్యాత్మికశక్తి మొదలైన వాటిలోనేగాక మఠ నిర్వహణాది లౌకిక కార్యకలాపాలలో ప్రజ్ఞావంతులై పేరు గడించారు.

మహాసన్నిధానంవారి ఆదేశానుసారం 1983 నుండి స్వతంత్రంగా విజయ యాత్రలు చేయటం ప్రారంభించారు. కొల్లూరు, బెంగళూరు, మైసూరు నగరాలలో సంచారంచేసిన తరువాత శ్రీవారు ఆంధ్ర దేశమునకు దయచేసి హిందూపురం, లేపాక్షి, అనంతపురం, మహానంది, కర్నూలు పట్టణాల మీదుగా శ్రీశైలం, త్రిపురాంతకం, నాగార్జునసాగర్, నరసరావుపేట, గుంటూరు, డోర్నకల్లు, భద్రాచలం సందర్శించి, అక్కడినుండి రాజమండ్రి, కాకినాడ, ద్రాక్షారామం, కోనసీమలో సంచారాన్ని కొనసాగించి హైదరాబాద్ చేరుకున్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఘనస్వాగతం పలికింది. శంకర మఠంలో శ్రీక్రోధన నామ సంవత్సరం 1985లో చాతుర్మాస్య దీక్ష చేశారు. ఆ సమయంలో శతావధానం, సంస్కృతంలో అష్టావధానం, ఆదిశంకరులపై ఒక సదస్సు, వాక్యార్థ సభలు, హరికథలు, పురాణ ప్రవచనాలు మొదలైన ఎన్నో కార్యక్రమాలు ఆనందంగా జరిపించారు. 1989లో మహారాష్ట్రలో సంచరిస్తున్నప్పుడు మహాసన్నిధానంవారు విదేహముక్తులైన వార్త తెలిసింది. వెంటనే శృంగేరీ వచ్చి గురువులకు చేయవలసిన విధిని పూర్తిచేసి పట్టాభిషిక్తులై సంపూర్ణంగా మఠ నిర్వహణ బాధ్యతలు చేపట్టారు.



శ్రీ భారతీతీర్థ స్వామి వారి బాల్యం



వటువుగా శ్రీ చరణులు



బ్రహ్మచారిగా శ్రీ చరణులు

## శ్రీ చరణుల జీవితంలో ఒకరోజు

4.30 గురువర్యులు నిద్రలేచుట.
5.00 స్నానాది కార్యక్రమములు
5.15 ఉదయానుష్టాన, జపధ్యానాదులు
7.30 గురుపాదపూజ
8.00 విద్యార్థులకు శాస్త్రపాఠ బోధన
9.00 గ్రంథ పఠనము
9.30 భక్తులకు దర్శనము, తీర్థప్రసాదాది అనుగ్రహము, భక్తుల సంఖ్యనుబట్టి మధ్యాహ్నం 12.30 వరకు ఉండవచ్చును. ఈ వేళలో ప్రతి శుక్రవారము శారదాంబ ఆలయ సందర్శన ఉండును.
12.30 మధ్యాహ్నిక స్నాన జప, అనుష్టానాదులు.
1.30 గురువుల అధిష్టానములు దర్శించి భోజనమునకు వెడలుట, విశ్రాంతి.
3.00 విద్వాంసుల, పండితులకు బోధన, శాస్త్ర చర్చ.
4.15 మఠ సంబంధ ఉత్తర ప్రత్యుత్తరముల నవలోకించుట.
5.00 భక్తులకు దర్శనమిచ్చుట.
6.30 మఠ అధికారులతో చర్చలు.
7.30 సాయంకాల స్నాన, జప, అనుష్టానాదులు.
8.-15 ఆదిశంకరుల కాలమునుండీ అనూచానముగా చేయబడుచున్న చంద్రమౌళీశ్వర పూజ.
10.00 నివాసమునకు వెడలుట, గ్రంథపఠనాదులు.
11.00 విశ్రాంతి, నిద్రకుపక్రమించుట.

స్థూలముగా స్వామివారి దినచర్య యిది. దేశకాల, ధర్మముల ననుసరించి స్వల్ప మార్పులుండవచ్చును.

# కాలే స్థలే జలే



ప్రాతఃకాలిక సౌఖ్య శాయనిక వాగారంభవ జల్పతాం
అంబాయాః ముఖమంటపే ప్రచలతాం ఘంటారవాణాం
సఖా వాయుర్మాం స్పృశతి ప్రతిక్షణ
నవోన్మీలత్పుళ్ళపాదకః
మాతుర్భక్తగణాః పరస్పర మిదం సౌహార్ద మాచిన్వతే ॥

మానవ జీవనంలో అధ్యాత్మ ప్రస్థానం అభిలషణీయమైనది, అనివార్యమైనది. కేవలం పుట్టి, మెట్టి, గిట్టె విషయం జీవరాసులది. పుట్టినందుకు ఆచార, వ్యవహార, విహారాదులను సమన్వయం చేసుకుని, జీవితాన్ని పదార్థ భావన నుండి యథార్థ స్థితికి చేర్చుకుని, జీవన్ముక్త స్థాయిలో సంచారం చేయవలసిన విధి, మానవుడు మాత్రమే సాధించుకోవలసిన ధర్మానుష్ఠానం! ఇది భారతీయ ఆత్మ! జవము, జీవమూ, చైతన్యము ఒక్కటై ప్రవహించే కర్మానుష్ఠాన త్రివేణి. ఈ మహానుభవాన్ని సాధించుకున్నది.

ఆసేతు శీతాచల పర్యంతమూ పరచుకున్న అఖండ భారతావని! ధర్మగ్లాని సంభవించినప్పుడు, భగవంతుడు భారతదేశంలో ప్రభవించి, ధర్మరక్షణ చేయడం, పునః పునః జరిగింది. అధర్మం ప్రబలి, ప్రజ నిరీశ్వరవాదాన్ని ఆశ్రయించి, జాతి తన అస్తిత్వాన్ని కోల్పోతున్న దుర్భర, దుస్తర పరిణామకాలంలో అవతరించిన వారు, 'శంభోర్మూర్తిః చరతి భువనే శంకరాచార్య రూపా!' అని సర్వజన హృదయోల్లాస పుంభితముగా ఆరాధించ బడిన, శుద్ధాద్వైతమూర్తి శ్రీ శంకర భగవత్పాదులు.

అంతేకాదు 'చతుర్భిః సహ శిష్యైస్తు శంకరోవార్త కిస్యతి' అంటే 'పరమేశ్వరుడు గురుస్వరూపంగా నలుగురు శిష్యులతో వస్తాడు' అంటుంది వాయుపురాణం.

"వ్యాకుర్వాన్ వ్యాస సూత్రార్థమే శృతేరర్థమ్, యతో చివేన్ శృతేర్న్యాయః స పివర్తతః శంకర సవితావనీ"

అంటే శంకర భగవత్పాదులు జ్ఞానాదిత్యులే!

పంచరాత్ర, పాశు పత, శాక్త, జైన, బౌద్ధుల అఖండ భారతాన్ని ఆవరించి, ఆవహించి, వైదిక జీవన ధర్మాలు వెనుబడుతున్న వేళ, ధర్మ శూన్యత ఏర్పడిన వేళ, ఆగమించిన అవతార స్ఫూర్తి, 'శంకరభగవత్పాదులు!'

కేవలం 32 సంవత్సరాల శంకరుల అవనీ సంచారం, ఎన్నాళ్ళున్నామని కాదని, ఎట్లా ఉన్నామని, ఏమి చేశామని ప్రశ్నించుకోమంటుంది.

అద్వైత జీవన విధానాన్ని జాతికి వరదానం చేసిన వేదమూర్తి శ్రీ భగవత్పాదులు!

ఇదే సన్మంగళ కాలం! అవతార కార్యక్రమ ఆరంభవేళలు సంకల్పత్మకాలు. ఆ పవిత్ర సిద్ధ, శుద్ధ కాలమే భగవత్పాదులను స్వధర్మ, స్వకర్మోన్ముఖం చేసింది... -

ధర్మ ప్రబోధము, ప్రచారము, ప్రసారము ముప్పేటగా సాగి, ప్రథమంగా శృంగేరి చేరుకుని, తుంగానదీ తీరంలో తమ కంటపడిన ఒక పరమాద్భుత సన్నివేశం అంతశ్చేతనను ప్రేరేపించగా ఒక అద్వైత పీఠస్థాపనను సంకల్పించారు. పరస్పర విరుద్ధ జీవప్రవృత్తులు గల కప్ప-పాము సమన్వయ స్థితిలో నిలకడ చెందిన దృశ్యం, శంకరుల అంతర్దృష్టికి స్థల మాహాత్మ్యాన్ని



సాక్షాత్కరింపజేసింది. శ్రీచక్ర నిర్మాణం, జగదంబను 'శారద' నామంతో ప్రతిష్ఠించడం ఏకకాలంలో భగవత్పాదులు జరిపి, శ్రీ సురేశ్వరాచార్యులను ప్రథమ పీఠాధిపతిగా నియమించారు.

ప్రప్రథమ ఆమ్నాయ పీఠంగా శృంగేరి, సనాతన ధర్మ ప్రసార భూమికగా, జగదీశ్వరి శారద, జ్ఞాన వరదాయినిగా సుప్రతిష్ఠయై జాతిని ధర్మమార్గంలో నడిపిస్తూనే ఉన్నది.

బ్రహ్మవేత్తలు, అర్షధర్మస్వరూపులు, మహనీయులు, తేజోమూర్తులైన మహా చైత్యపురుషులు పీఠాధిరోహణం చేసి, ఆర్షమైన భారతీయ సనాతన ధర్మాన్ని ఆచరణీయ జీవన విధానంగా లోకాన్ని ధర్మ మార్గవలంబిగా తీర్చిదిద్దిన 35 మంది పూర్వ ఆచార్య పరంపరలో ఈనాటి జగద్గురు శ్రీ భారతీతీర్థ మహాస్వామివారు 36వ వారు.

పూర్వాశ్రమమున "సీతారామాంజనేయులు' వారి నామధేయం. శ్రీ తంగిరాల వేంకటేశ్వరావధాని, శ్రీమతి అనంతలక్ష్మమ్మగారలు వారి తల్లిదండ్రులు, పుణ్యదంపతులు. ఏప్రిల్ 11, 1951న జన్మించిన శ్రీవారు 'సప్తతి'ని పూర్తి చేసుకుని నిండునూరు శరత్తుల వైపు వేస్తున్న ఈ తొలి అడుగు, భరతజాతిని భద్రజాతిగా తీర్చిదిద్దే ఇంతటి దివ్య చరితములో మరొక పవిత్ర

**వరగర్వితుడైన హిరణ్యకశిపుడు లోకకంటకుడై అందరినీ బాధించసాగాడు. దేవతలను జయించాడు. ఇంద్ర సింహాసనాన్ని ఆక్రమించాడు. పంచభూతాలను నిర్బంధించాడు. తపస్సులను భంగపరిచాడు. సాధువులను హింసించసాగాడు.**

ఘట్టము, జనవరి 4, 2015న శ్రీ శృంగేరి మహాసంస్థానమున శ్రీ విధుశేఖర భారతీస్వామివారు, నిఖిల జగతికి శ్రేయోమార్గ విధాతగా ఆగమించటం, అధివసించటం!

శ్రీ భారతీతీర్థ మహాస్వామి తపోసంపన్నులు.

లౌకిక, పారలౌకిక, ఆధ్యాత్మిక ప్రజ్ఞానిధులు.

గురుశ్రీ చరణులు శ్రీమదభినవ విద్యాతీర్థమహాస్వామి యందలి భక్తి, అచంచలము, అనుపమానము.

శ్రీ భారతీతీర్థ స్వామివారికి, గురువాక్యము శిరోధార్యము.

గుర్వాజ్ఞ శాసనము, అనుసరణీయము, ఆచరణీయము. అనుల్లంఘనీయము.

వారి ఆదేశమే ఉపదేశము.

పరిపూర్ణ మానవతావాదము, విశుద్ధమాధవీయము, స్వధర్మనిధానము శ్రీ చరణుల తాత్త్విక విభూతి! శ్రీ చరణులు వాఙ్మయస్వరూపులు.

శ్రీగణేశ, కార్తికేయ, చంద్రమౌళీశ్వర, శ్రీ శారదాంబా దేవతల పై సుశ్లోకాలను, గురువులు శ్రీ అభినవ విద్యాతీర్థులపై అక్షరమాలా స్తోత్రాన్ని, పరమ గురువులు శ్రీ చంద్రశేఖరభారతీస్వామి వారిపై అష్టకమును రచించిన విజ్ఞాన శేముషి. గురుభక్తితో పాటు శిష్య వాత్సల్యం చెలువుదీరిన అవ్యాజకరుణామూర్తి.

పవిత్ర భారతదేశం ఆహ్వానించుకున్న వైదిక స్ఫూర్తి!

శ్రీవారి అవతరణ, అధ్యాత్మ సాధకులకు సంచారణ, విచారణ, తారణాది విషయాలకు మార్గోపదేశిని!

ఉమాజానిః ప్రదద్యాన్నో గురూభ్యాం, చిరజీవితం!

యతః కైంకర్యభాగ్యం చ సిద్ధ్యేన పరమం సుఖమ్!

ఇదే ప్రార్థన! ఇదే అభ్యర్థన!!

అవును!

కాలే, శాంకరీయమ్

స్థలే, శ్రీ శృంగేరీ

జలే, తుంగాతరంగం... మూడు స్థితులు, స్థిరమైన శ్రీ శారదాంబ సన్నిధానం!

ఇది జాతి పుణ్యఫలము!

**- వల్లూరు శ్రీరామచంద్రమూర్తి,**
ఆధ్యాత్మిక శాస్త్రవేత్త

# భారతీతీర్థమాశ్రయే

**యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత**
**అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం**

అని గీతాచార్యుని వచనం. ధర్మానికి హాని కలిగి అధర్మం వృద్ధి చెందే సమయంలో పరమాత్మ తనను తాను సృష్టించు కుంటాడు.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దృష్కృతాం**
**ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే**

సాధుజనులను రక్షించి, దుష్టులను సంహరించడానికై, ధర్మాన్ని స్థాపించే నిమిత్తమై ప్రతి యుగంలో ఆ పరమాత్మ పుడుతూనే ఉన్నాడు. కృత, త్రేతా, ద్వాపర యుగాల్లో మత్స్య, కూర్మ, రామకృష్ణాద్యవతారాలనెత్తి దుష్టులను రాక్షసులను సంహరించి ధర్మాన్ని స్థాపించాడు. కలి ప్రవేశించిన తరువాత ఈ యుగంలో చార్వాక, బౌద్ధ, జైన్యాది వైదిక మతాలు ప్రబలి జగత్తంతా అల్లకల్లోలమవుతూ నిజమైన ధర్మమేదో తెలియక సతమతమవుతూ అధర్మభూయిష్టమైన జగత్తులో దేవతలందరి ప్రార్థన విని సాక్షాత్తూ కైలాసాధీశుడైన పరమేశ్వరుడే భారతావనిలో అవతరించాడు.



కేరళ రాష్ట్రంలోని పూర్ణానదీ తీరంలో విరాజిల్లే కాలడి అగ్రహారంలో శ్రీ ఆర్యాంబా శివగురువులకు పుత్రునిగా జన్మించి చిన్నతనంలోనే వైరాగ్యభావాన్ని పొందాడు. సన్యాసదీక్షను గ్రహించి తన గురువైన శ్రీ గోవిందభగవత్పాదుల ఆదేశాన్ని స్వీకరించి అవైదిక మతాలను ఖండించి సనాతనమైన అద్వైత మతాన్ని పునః స్థాపించి అద్వైతాచార్యులయ్యారు. రామకృష్ణా ద్యవతారాలు ఎత్తిన సమయంలో రావణ కంసాదులను ఆయు ధాలతో సంహరించి దుష్టశిక్షణ, శిష్టజన పరిపాలన చేశాడు ఆ పరమాత్మ. కానీ ఈ కలియుగంలో అవైదిక మతాలను ఖండించడానికి జ్ఞానమనే ఖడ్గాన్ని ధరించి అందిరినీ దండించి జయించి, విశ్వమంతటా వ్యాపించియున్న ఆందోళనను తొలగించి విశ్వశాంతిని స్థాపించారు.

అక్కడితో ఆగక భారతదేశాన మళ్ళీ అవైదిక మతాలు చిగు రించకుండా ఉండేలా నిరంతర ప్రచార ప్రసారాలతో జనాన్ని ఉద్ధరించే నిమిత్తం భారతదేశాన్ని నాలుగు భాగాలుగా చేసి పూర్వామ్నాయ, దక్షిణామ్నాయ, పశ్చిమామ్నాయ, ఉత్తరా మ్నాయాలనే నాలుగు ఆమ్నాయ పీఠాలను నలుదిక్కులలోనూ స్థాపించారు. యోగ్యులైన తన శిష్యులకు జగద్గురు స్థానాన్ని ఇచ్చి, పరంపరగా అద్వైత సిద్ధాంతాన్ని బోధించమని ఆదేశించారు. తమిళనాడు, కేరళ, ఆంధ్ర, తెలంగాణ, మహారాష్ట్ర, కర్ణాటక రాష్ట్రాల ప్రజలకు ధర్మబోధ చేయమని పరమపావనమైన భారతదేశంలోని కర్ణాటక రాష్ట్రంలో తుంగానదీ తీరంలో శ్రీ శారదాదేవిని ప్రతిష్ఠించి, తన శిష్యులలో ప్రముఖుడైన శ్రీ సురేశ్వరాచార్యులను నియమించి ధర్మాన్ని ఆయా రాష్ట్రాల వారికి బోధించమని ఆదేశించారు. ఆ ఆదేశాన్ని పొందిన సురేశ్వరుల నుండి నేటి అనంతశ్రీ విభూషిత జగద్గురు సార్వభౌములైన శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారి వరకూ అవిచ్ఛిన్న గురుపరంపర కొనసాగుతోంది. ఈ మఠంలో ఉన్న విశేషం అదే. మనందరి సౌభాగ్య విశేషమేమంటే ఈ పరంపరలో విద్యారణ్యుల నుండి నేటి శ్రీ సన్నిధానం విధుశేఖరభారతీ స్వామి వరకూ అందరూ తెలుగువారే

రావడం ఎంతో ఆనందదాయకం. ఈ గురుపరంపరలో శ్రీ భారతీతీర్థ మహాస్వామివారు 36వ వారు. శ్రీచరణుల గూర్చి తెలుసుకొని మన జీవితాలను ధన్యం గావించుకొందాం. శ్రీచరణుల 71వ వర్ధంతి సందర్భంగా వారికి సమర్పించే వాక్సుమమాల ఇది.

**మానవ జన్మ సార్థక్యం**

అన్ని జన్మలలోకీ మానవ జన్మ చాలా శ్రేష్ఠమైనది. 'జన్తూనాం నరజన్మ దుర్లభం' అని వివేక చూడామణిలో శ్రీ జగద్గురు శంకరభగవత్పాదులు ఈ మానవ జన్మను సార్థకం చేసుకునే మార్గాన్ని సూచించారు. ప్రతివారూ ముక్తికొరకు ప్రయత్నించాలి. "యః స్వాత్మముక్త్యైనయతేత మూఢధీః స ఆత్మహా" ఎవడు తన ముక్తి కోసం ప్రయత్నించడో వాడు మూఢుడు. అంతేకాదు ఆత్మఘాతకుడు అన్నారు. కాబట్టి శంకరుల ఉపదేశాన్ని పాటించి మనమంతా ముక్తికొరకు ప్రయత్నించాలి. దాన్ని సాధించినప్పుడే మానవజన్మ సార్థకమవుతుంది. ఈ ప్రయత్నం చేయకపోతే "పశ్వాదిభిశ్చావిశేషాత్" అని శంకరులే వారి భాష్యంలో 'పశువులకన్నా వీనిలో ఏమీ విశేషము లేదు' అని చెప్పారు.

**ముక్తి ఎలా సాధ్యమౌతుంది**

ముక్తిని పొందాలంటే చేయాల్సిందేమిటి? ఏ సాధన ద్వారా ముక్తిని పొందగలుగుతాం అనే ప్రశ్నకు శంకరులే భాష్యాల్లో సమాధానం చెప్పారు. సోమయాగం చేయడం వల్ల స్వర్గలోకం వచ్చినట్టుగా ఏదో ఒక కర్మనాచరించడం వల్ల వచ్చేది కాదు ముక్తి. మరి ఎలా అంటే - "జ్ఞానాదైవతు కైవల్యం" జ్ఞానం వల్ల మాత్రమే కైవల్య రూప ముక్తి వస్తుంది అని శంకరుల అభిప్రాయం. ఆ కైవల్య రూప ముక్తికి సాధనమైన జ్ఞానం కూడా ఎలా లభిస్తుంది అని ప్రశ్న వేసుకుంటే ఉపనిషద్వాక్య చింతనతో వస్తుంది అని చెప్పారు. కాని ఉపనిషత్తులు గంభీరంగా తాత్పర్యాన్ని చెపుతాయి. వాటి గాంభీర్యం, ప్రసన్నత మనకర్థమవ్వాలంటే వాటినన్నిటినీ మధించి, శోధించి అనుభవానికి తెచ్చుకున్న ఒక జ్ఞాని మనకు గురువుగా లభించాలి. అటువంటి గురువును 'తద్విద్ధి ప్రణిపాతేన' అనే నియమాలతో ఆశ్రయించి ఈ సంసార సాగరం నుండి రక్షించమని అడగాలి. బంధమంటే ఏమిటి? ఇది ఎలా వచ్చింది? దీని విముక్తి ఎలా? అనాత్మ అంటే ఎవరు? ఆత్మ అంటే ఎవరు అని ప్రశ్నించి వారి ప్రసన్నగంభీరమైన వాక్కులను విని వారి కృపాదృష్టిని మనపై పడేట్టుగా చేసుకున్నామంటే, జ్ఞానమంటే ఏమిటో తెలుస్తుంది. జ్ఞానాన్ని పొందినవాడు ముక్తిని పొందగలడు.

**జ్ఞానబోధకులెవరు?**

జ్ఞానాన్ని బోధించేవాడు, తాను జ్ఞాని అయివుండాలి. రోగాన్ని తొలగించేవాడు (వైద్యుడు) ఆరోగ్యవంతుడై ఉండాలి. అప్పుడే రోగికి సంబంధించిన అనారోగ్యాన్ని తొలగించగలడు. అదేవిధంగా సంసారం నుండి బయటపడి జ్ఞాని అయినవాడు అజ్ఞాని అయినవాని అజ్ఞానాన్ని తొలగించగలుగుతాడు. ఈ లోకంలో జ్ఞాని అయిన గురువులు చాలా దుర్లభులు. కాని మనందరి అదృష్టం వల్ల జ్ఞానియై 'స్వయంతీర్త్వాపరాంస్తారయంతి' అన్నట్లు తాను తరించి, ఇతరులను తరింపజేసే గురువర్యుడు జగద్గురువులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారు. వారి నాశ్రయిస్తే వారు సందేహ రహితమైన జ్ఞానాన్ని బోధించగలరు. దానికి అనుబంధంగా వచ్చే అనేక ప్రశ్నలు జీవుడంటే ఎవరు? పరమాత్మ ఎవరు? వీరికుండే సంబంధమేమిటి? ఇద్దరూ ఒకరేనా, భిన్నులా?

## కరుణామూర్తి

శ్రీ అభినవ విద్యాతీర్థస్వామివారికి తీవ్రమైన గుండె జబ్బు రావడంతో వైద్యులు శ్రీస్వామివారిని మాట్లాడడం, నడవడం వంటివి చేయకుండా విశ్రమించవలసిందిగా కోరారు. అయినా శ్రీస్వామివారు భక్తులకు తమ దర్శనాన్నీ, ఆశీర్వాదాలనూ అనుగ్రహిస్తూ ఉండేవారు. ఒకనాడు శ్రీమహాసన్నిధానం - కూర్చుని ఉన్నచోటికి భక్తులెవరో వెళ్లారు. అక్కడ అప్పటికే ఒక వృద్ధుడూ ఆయన భార్యా ఉన్నారు. వృద్ధుడు బాగా వంగిపోయి ఉన్నాడు. ఆ వృద్ధమహిళ శ్రీమహాసన్నిధానంవారి దగ్గరకు వెళ్లి తన భర్త ఏయే రుగ్మతలతో బాధపడుతున్నదీ తాను ఎంతకష్టపడి సపర్యలు చేస్తున్నదీ వివరించింది. ఆమె చెప్పినదంతా విని "ఈయనకు ఈ సమస్యలన్నీ ఉన్నాయా? ఇటువంటి బాధలు పడడం కష్టమే. ఈ మంత్రాక్షతలు తీసుకోండి. దిగులు పడవద్దు. అంతా మేలే జరుగుతుంది!" అని ఆశీర్వదించారు శ్రీమహాసన్నిధానంవారు. ఆమె ప్రసాదం తీసుకొని కొంతదూరంలో కూర్చుంది. మళ్లీలేచి శ్రీమహాసన్నిధానంవారి దగ్గరికి పోయి తిరిగి తన గోడు వినిపించింది. శ్రీస్వామివారు ఆమె చెప్పిందంతా ఓపికగా విని ఆమెను అనునయించి మంత్రాక్షతలు ప్రసాదించారు. ఆమె తిరిగి శ్రీస్వామివారి దగ్గరికి వచ్చి తన వ్యథనంతా వినిపించింది. శ్రీస్వామివారు ఆమెతో అనుగ్రహపూర్వకంగా మాట్లాడి మంత్రాక్షతలు ప్రసాదించారు. ఆ వృద్ధమహిళ తమ దగ్గరికి ఐదారుసార్లు వచ్చి చెప్పిందే తిరిగి చెబుతున్నా శ్రీమహాసన్నిధానంవారు అసహిష్ణుతకానీ, కోపంగానీ, అలసత్వంగానీ చూపకుండా ఎంతో ప్రసన్నంగా ఓర్పుతో, దయతో అనుకంపతో ఆమె చెప్పిన విషయాలను విన్నారు. అటువంటి కరుణామూర్తులు ఆ జగద్గురువు!

- పి.ఎస్. గోపాలకృష్ణ

ఒకరైతే ఏకత్వం ఎలా పొసగుతుంది? జగత్తంటే ఏమిటి? జగత్కర్త ఎవడు? వాడు సగుణుడా? నిర్గుణుడా? నిర్గుణుడైతే జగత్కర్తృత్వం ఎలా పొసగుతుంది. శరీరం లేనివాడు సృష్టి చేయగలడా? మాయ అంటే ఏమిటి? మనకూ మాయకూ ఏమిటి సంబంధం... మొదలైన ఎన్నో ప్రశ్నలు ఉదయిస్తాయి.

వీటన్నిటికీ శాస్త్రీయమైన సమాధానాలు తెలుసుకోవాలంటే అన్ని శాస్త్రాల్లో నిష్ణాతులై, అద్వైత వేదాంతాన్ని ఆకళింపు చేసుకుని, అనుభవంలో కూడా అద్వైతత్వాన్ని 'నేను బ్రహ్మనే' అనే భావాన్ని పొంది ఉన్న గురువు మనకు కావాలి. అటువంటి గురువు మన జగద్గురువులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి వారు. వేరెవ్వరిలోనూ ఈ లక్షణం కానరాదు. వేదాలలో పాండిత్యం, శిక్షాకల్పం మొదలైన వేదాంగాలలో పట్టు, మీమాంసా వేదాంతము, సాంఖ్యము మొదలైన ద్వాదశ దర్శనములయందు సమాన పాండిత్యం... విచిత్రమేమంటే అద్వైత వేదాంతం స్వమతం. పర మతములకు సంబంధించిన ఏ అంశాన్నయినా ఆక్షేపణ చేయవలసి వచ్చి పూర్వపక్షం చేసినట్లయితే, అది విన్న మనకు ఈ పూర్వపక్షమే సరియైనదేమో అనిపిస్తుంది. సిద్ధాంతం విన్న తరువాత గాని, పూర్వపక్షంలోని దోషమేమిటో వారు చూపెడితేగాని తెలియదు. అంతటి మేధావి, ప్రతిభాశాలి మన జగద్గురువులు. ఇటువంటి వారిని ఆశ్రయిస్తే నిజమైన జ్ఞానబోధ లభిస్తుంది. నేటికీ ఎంతో మంది శ్రీచరణుల నాశ్రయించి, వారి చెంతనే ఉండి జ్ఞానాన్ని పొంది సంసార సాగరం నుండి గట్టెక్కిన వారున్నారు.



**నిజమైన యతివర్యులు**

"బ్రహ్మ సత్యం జగన్మిథ్య జీవో బ్రహ్మైవనాపరః' అనే ఈ సిద్ధాంతాన్ని నిరంతరం అనుభవిస్తూ తన వద్దకు వచ్చిన వారికి దీని సారాంశాన్ని చెప్పేవాడే నిజమైన సన్యాసి. 'సన్యసేదకృతో ద్వాహః బ్రాహ్మణాబ్రహ్మచర్యవాన్' అని వ్యాసులు అన్నారు. 'వివాహం చేసుకోకుండా బ్రహ్మచారిగానే సన్యసించాలి' అని. అదేవిధంగా సంసారాన్ని నిస్సారమైనదిగా చూసి సారమైన దానిని చూసేందుకు వివాహం చేసుకోకుండానే వైరాగ్యాన్ని ఆశ్రయిస్తారు మహాత్ములు అన్నారు వ్యాసులు. 'సంసారమేవ నిస్సారం దృష్ట్వా సారజిష్పృక్షతః ప్రవ్రజన్త్యకృతోద్వాహాః పరం వైరాగ్య మాశ్రితాః' అని క్రతువు అనే ఋషివర్యుడు 'యస్మిన్ క్షాన్తిశ్శమశ్శౌచం సత్యం సంతోష ఆర్జవం। ఆకించన్యం ఆడంభశ్చ సకైవల్యమాశ్రయేత్ ॥' అన్నారు. ఓర్పు, ఇంద్రియ నిగ్రహం, శుచి, సత్యం, సంతోషం, ఋజువర్తన, దైన్యరాహిత్యం, నిరాడంబరత ఎవనియందుండునో వాడు ముక్తిని పొందగలడు (వాడు జ్ఞాని), కామక్రోధా దర్పమోహ లోభాది దోషాలను వదిలి పరివ్రాట్ (సన్యాసి) మమతారహితుడు కావాలి అని పరాశరుడన్నాడు. "ఆత్మయందే రతి కలిగి నిత్యతృప్తుడై ఉండి మహామతియైనవాడు భిక్షు అని కూర్మపురాణం; 'మనస్సున విష్ణువును భావించి పరమాత్మ ఈశ్వరుడు చిన్మయుడు, పరమానందుడు ఆ విష్ణువును భావించి అతనే బ్రహ్మ, ఆ బ్రహ్మను నేనే అనే భావన సన్యాసి చేయాలి అని అగ్నిపురాణం తెలియజేస్తుంది. ఇలా ఎన్ని శృతి, స్మృతి పురాణాలలోని వాక్యాలు సన్యాసి ధర్మాలను బోధిస్తున్నాయో అవన్నీ సమన్వయమవుతాయి మన గురువ రేణ్యులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి వారు యందు. అందుకని ఆయన నిజమైన యతివర్యులు. ఆ ఆశ్రమానికి సంబంధించిన ధర్మాలను తూ.చ. తప్పకుండా పాటించే మహానుభావులు.

ఆత్మజ్ఞుడు యతివరేణ్యుని ఎందుకు ఆశ్రయించాలి?

**"యం యం లోకం మనసాసంవిభాతి ।**
**విశుద్ధ సత్వః కామయతే యాంశ్చకామాన్ ।**
**తం తం లోకం జయతె తాంశ్చకామాన్ ।**
**తస్మాదాత్మజ్ఞం హ్యర్చయోద్భూతికాయః ॥"**



అని ముండకోపనిషత్తు చెప్పింది. సర్వవ్యాపియైన పరమాత్మను ఆత్మరూపాన సాక్షాత్కరించుకొన్న బ్రహ్మవేత్తకు సమస్త కోరికలు సిద్ధిస్తాయి. ఆ నిర్మలాంతఃకరణుడు ఏయే లోకాలను ఏయే భాగాలను తనకు గాని, తన భక్తులకు గాని కోరుచున్నాడో అవి అన్నీ పొందుతాడు. కాబట్టి ఏయే కోరికలు పొందగోరువారయినా ఆత్మజ్ఞానంతో శుద్ధాంతఃకరణుడైన ఆత్మజ్ఞుడైన యతిని పాదప్రక్షాళన, శుశ్రూషల ద్వారా పూజించాలి. తద్వారా వారి కోరికలన్నీ తీరుతాయి. 'ఉపాసతే పురుషం యోహ్యకామాః' అని ఈ ఉపనిషత్తే బ్రహ్మము స్వయంప్రకాశం దానిని తెలుసుకున్న పురుషుడిని (ఆత్మజ్ఞుడిని) నిష్కామ భావనతో పూజిస్తే జన్మరాహిత్యమవుతుంది అని తెలియజేస్తోంది. బ్రహ్మను తెలుసుకున్నవాడు బ్రహ్మమే కావున (బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి) బ్రహ్మోపాసన వలన కలిగే ఫలం బ్రహ్మవిదుపాసన వలన కలుగుతుంది. కావున ఆత్మజ్ఞుడైన యతివరేణ్యుని ఆశ్రయించాలి. అటువంటి యతివరేణ్యులు మన శ్రీచరణులు. వారినాశ్రయించిన వారికి ఈ లోకంలోని కోరికలు ఈడేరుతాయి. ఈనాటి వరకూ ఈడేరుతూనే ఉన్నాయి. సర్వవ్యాప్తమైన పరమాత్మ సాక్షాత్కారం కలుగుతుంది. ఇలా ఎన్నో ప్రయోజనాలున్నాయి శ్రీచరణుల సందర్శన, పూజా ఉపాసనల వల్ల.

### శ్రీచరణుల ఆవిర్భావం

మన ఆంధ్రదేశంలో ఎందరో వేదశాస్త్ర పండితులున్నారు. వీరిలో గొప్ప ఖ్యాతి వహించిన మహామహితాత్ముడు శ్రీ తంగిరాల వేంకటేశ్వరరావుగారు కుత్సస గోత్రీకులు, సనాతన ధర్మాచరణ నిరతులు, నిరాడంబర జీవి. వీరు మహాసాధ్వీమణి అయిన అనంతలక్ష్మమ్మను వివాహమాడి గుంటూరు జిల్లాలోని 'అలుగుమల్లెపాడు' గ్రామంలో నివశిస్తుండేవారు. వీరికి నలుగురు కూతుర్లు జన్మించినా పుత్ర ప్రాప్తికై గ్రామంలోని భవానీశంకర దేవాలయంలో ఈశ్వరోపాసన చేశారు. తరువాత మచిలీపట్నానికి మకాం మార్చారు. శ్రీరామ నవరాత్రోత్సవం జరిపి కొడుకు పుడితే నీ పేరే పెట్టుకుంటానని అవధానిగారు మొక్కుకున్నారు. అనంతలక్ష్మమ్మ ఆంజనేయుణ్ణి ఉపాసించి పుత్రోదయమైతే నీ పేరే పెట్టుకుంటానని మొక్కుకున్నది. ఆంజనేయుడు

## అమ్మాయి పెళ్ళి జరుగుతుంది

ఒకనాడు కరీంనగర్‌కు విజయయాత్ర చేసే సమయాన వచ్చినప్పుడు నా కళ్ళారా చూసిన ఒక సంఘటన వివరిస్తాను. శ్రీవారి దర్శనార్థం ఎంతోమంది భక్తులు లైన్లో ఉన్నారు. వారి సాధక బాధకాలు చెప్పుకుంటున్నారు. ఒక గృహస్థు తనకు పుట్టిన అమ్మాయికి ఎంతకూ వివాహం కావడం లేదు. కానీ శ్రీవారి ముందు ఈ విషయాన్ని ఎలా చెప్పాలి. ఈ గృహస్థు పేద బ్రాహ్మణుడు, విద్వాంసుడు. శ్రీచరణులను ఈ లౌకిక విషయాన్నడిగి వారిని ఇబ్బంది పెట్టకూడదని లోలోపల అనుకుంటూ శ్రీవారిని దర్శించి వారిచ్చే తీర్థాన్ని స్వీకరించాడు. శ్రీచరణులు ఆ పండితుని చూచి నాయనా నీ అమ్మాయి వివాహం ఈ నెలలో కుదురుతుంది అన్నారు. ఆ పండితుని ఆశ్చర్యానికి అవధులు లేవు. ఆయన అంతరంగాన్ని పసిగట్టి ఇలాంటి వరాన్నిచ్చారని ఆయన కళ్ల వెంట ఆనందాశ్రువులు రాలగా ఈశ్వర సదృశులైన శ్రీచరణులను దర్శించి కంఠము గద్గదమవడం వల్ల మాట్లాడలేక అక్కడినుండి శ్రీవారికి నమస్కరించి వెళ్ళారాయన. సరిగ్గా నెలలోపు ఆ అమ్మాయి వివాహం జరిగింది. ఇలా ఎన్నో సంఘటనలు జరిగాయి. నేను శ్రీమఠంలో అధ్యయనం చేసేటప్పుడు అనుభవమైన వారు ఆ సంఘటనల గురించి చెప్పేవారు. శ్రీవారు సర్వజ్ఞులు.

స్వప్న సాక్షాత్కారమై మూడు ఫలాలనిచ్చి అంతర్ధానమైనాడు. స్వప్నం ఫలించింది. ఉపాసనా ఫలించింది. ఖర నామ సంవత్సర చైత్ర శుద్ధ పంచమి నాడు షష్ఠీ ఘడియలలో (11-4-1951) ఆ పరమేశ్వరుడే అవధాని దంపతులకు అవతరించాడు. పిల్లవానికి సీతారామాంజనేయ అని నామకరణం చేశారు. ఒక సంవత్సరం కాగానే నరసరావుపేటకు మకాం మార్చారు. బాల్యంలో ఎన్నో వింత ఘటనలను తల్లిదండ్రులు అనుభవించారు. వీడు ఏదో ఒక అద్భుత శక్తిగా పరిణమించబోతున్నాడనుకున్నారు. సకాలానికి ఉపనయనం చేసి, పిల్లవానిని వేదాధ్యాపనం చేశారు. కృష్ణ యజుర్వేదాన్ని అనతికాలంలోనే నేర్చుకుని, అక్కయ్య చక్కని సంస్కృతాన్ని మాట్లాడడాన్ని గమనించి పోటీగా తాను కూడా సంస్కృతం మాట్లాడడం నేర్చుకుని సుందర పదబంధాలతో ఆనాటి పండిత పామరులను తన భాషాపటిమతో అబ్బురపరుస్తుండేవారు.

**శృంగేరీ పీఠాధిపతులను ఆకట్టుకున్న సంభాషణ**

దక్షిణామ్నాయ శృంగేరీ శారదాపీఠాధిపతుల్లో 35వ వారు శ్రీశ్రీశ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామివారు. ఆంధ్రదేశంలో సంచరించే సమయంలో విజయవాడలో సీతారామాంజనేయులు చక్కగా సంస్కృతంలో మాట్లాడగలరని కవితా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు చెప్పారు. పది సంవత్సరాలు పిల్లవాడు సంస్కృతంలో మాట్లాడుతున్నాడని తెలుసుకొని ఆశ్చర్య చకితులయ్యారు. ఆ పిల్లవాడు మాట్లాడిన సంస్కృత సంభాషణ శ్రీవారిని ఆకట్టుకుంది. మొట్టమొదటి ఈ సమావేశంలో సీతారామాంజనేయులు హృదయంలో గురువుగారిపైన గట్టి గౌరవభావమేర్పడింది. తండ్రి వద్ద వేదాధ్యయనం చేస్తున్న సమయంలోనే శాస్త్రాధ్యయనం కూడా చేయాలనే కోరిక ఆ పిల్లవానికి కలిగి, తండ్రికి విన్నవించుకున్నాడు. 1966లో జగద్గురువులు నరసరావుపేటకు వచ్చారు. ఐదేళ్ల తరువాత మళ్లీ గురువుగారితో సంస్కృత సంభాషణ చేసి మురిపించాడు. శ్రీవారు ఉజ్జయినిలో చాతుర్మాస్యం చేస్తున్నారని తెలుసుకుని ఎవరికీ చెప్పకుండా ఉజ్జయినీ క్షేత్రానికి వెళ్ళి అభినవ విద్యాతీర్థ మహాస్వామివారిని దర్శించి, ఈ సంసార సముద్రం నుండి దాటించమని ప్రార్థించారు. శాస్త్రాధ్యయనం పట్ల తీవ్ర ఇచ్ఛ గల వీరి కోరికను దృష్టిలో ఉంచుకొని మొట్టమొదట 'తర్క సంగ్రహం' ప్రారంభించారు. శ్రీ చరణుల వద్ద విద్యనారంభించి శంకరుల ప్రస్థానత్రయ భాష్యాలు, వ్యాకరణ భాష్యాలు, న్యాయశాస్త్రం, ఒకటేమిటి అన్ని శాస్త్రాలను అధ్యయనం చేసి వాటి స్వరూపాన్నే పొందారు. మా శక్తి అంతా గురువుల అనుగ్రహమే అంటారు. వారే శక్తిపాతం చేశారు.

**సన్యాసదీక్ష - పీఠాధిపత్యం**

ఎనిమిది సంవత్సరాలు శృంగేరిలో వివిధ శాస్త్ర పండితుల వద్ద శాస్త్రాధ్యయనం చేసి ఎంతోమంది పండితుల మెప్పు పొంది గణేశ నవరాత్రులలో ప్రసంగాలను విని నిరంతరం శాస్త్ర చింతన, దైవచింతన తప్ప లోక చింతన లేని శ్రీవారి పరిస్థితిని గమనించి శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామివారు 1974లో అవధాని గారిని పిలిపించి "శ్రీ శారదాదేవి అనుగ్రహం వల్ల, ఆమె ఆజ్ఞ ప్రకారంగా మేము సీతారామాంజనేయులుకు సన్యాసదీక్ష, పీఠాధిపత్యం ఇవ్వదలిచాము" అని చెప్పారు. మీ చిన్న కుమారుడు దక్షిణామూర్తి ప్రేమగా మిమ్ములను చూసుకుంటాడని చెప్పిన మాటలు విని తబ్బిబ్బై శ్రీవారికి నమస్కరించి కృతజ్ఞతలు తెలిపి వెళ్ళిపోయారు. ఆ తరువాత భారతదేశంలోని నలుమూలల నుండి వచ్చిన భక్తసందోహం, పండిత సందోహం ఆనందమగ్నులై వీక్షిస్తుండగా 1974 నవంబర్ 11వ తేదీన శిష్యగ్రహణం,

పీఠాధిపత్య ప్రదానం మహోత్సవంగా జరిగింది. ఉభయ స్వాములూ ఉన్నప్పుడు పెద్దవారిని మహాసన్నిధానం, చిన్నవారిని సన్నిధానం అనడం సంప్రదాయం. అటువంటి ఉభయస్వాముల సాన్నిధ్యంలో ఈ వ్యాసాన్ని రాసే భాగ్యం నాకు కలిగింది. మహాసన్నిధానం శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి వారిని సుమారు పది సంవత్సరాలు దర్శించుకునే, వారితో సంభాషించే భాగ్యం నాకు కలగడం నా జీవితంలో గొప్ప విషయం.

**ఉభయస్వాముల దర్శనం**

శిష్యస్వీకారానంతరం సన్నిధానంతో మహాసన్నిధానం విజయ యాత్రకు బయలుదేరి తెలుగు ప్రాంతానికి చేరుకున్నారు. ఆ సమయంలో మేము శివంపేటలోని శ్రీ విశ్వనాథశాస్త్రిగారి నిర్వహణలోని వేదశాస్త్ర పాఠశాలలో శాస్త్రాధ్యయనం, బ్రహ్మశ్రీ మాణిక్య సోమయాజుల వారి వద్ద వేదాధ్యయనం చేస్తున్నాం. స్వయంభూ క్షేత్రమైన, ఒకే పానవట్టంపై రెండు శివలింగాలున్న శ్రీ కాళేశ్వర ముక్తేశ్వర క్షేత్రాన్ని చొక్కరావు అభివృద్ధి చేయాలని సంకల్పించారు. అయితే ఈ లింగాలలో ఒకటి భిన్నమై ఉండడం చూచి పండితుల ద్వారా ఈ విషయాన్ని శ్రీచరణుల దృష్టికి తీసుకువెళ్ళారు. అప్పుడు వారు మీ ప్రాంతం (తెలంగాణ)లో మహాపండితులు శ్రీ శాస్త్రుల విశ్వనాథ శాస్త్రిగారున్నారు వారి పర్యవేక్షణలో కాశీ నుంచి శివలింగాన్ని తెప్పించి ప్రతిష్ఠ గావించండి. మేము కుంభాభిషేకానికి వస్తాం అన్నారు. తెలంగాణలో వేదశాస్త్రాల్లో మునిగితేలుతూ అధీతి బోధాచరణలు చేసే విశ్వనాథశాస్త్రిగారిని ఆశ్రయించి ఈ బృహత్తర కార్యక్రమాన్ని చేయించారు. సుమారు 45 ఏళ్ల క్రితం ఎటువంటి సౌకర్యాలు లేని ఆ ప్రాంతానికి ఉభయ స్వాములూ వేంచేయడం, వారితో పాటు అధికారులు, అనధికారులు, పండితులు, పామరులు, భక్తులు, కవులు, గాయకులు, అవధానులు మొదలైన వారితో క్రిక్కిరిసిపోయింది శ్రీ కాళేశ్వర క్షేత్రం. ఆనాటి అనుభవం ఒక అపూర్వ ఘట్టం. అన్ని లోకాల్లోని సభలలోకెల్లా కైలాససభ మహాసభ అని వేదవ్యాసుడు అన్నట్టు పురాణాల్లో ఉంది. శ్రీయుతులు శాస్త్రుల విశ్వనాథశాస్త్రిగారు, పట్లూరి మాణిక్య సోమయాజిగారు, మల్లోఝుల రాజలింగన్నశాస్త్రిగారు, మధు సాంబన్నగారు, భాష్యం విజయసారథిగారు ఇలా ఎంతోమంది పండితులతో సభలు జరుగుతూ ఉంటే వీటన్నిటిలో శ్రీ సన్నిధానం (భారతీతీర్థ) స్వామివారు ఉపస్థితులై శ్రీవారి ఆదేశాన్ని స్వీకరించి పెద్ద పెద్ద శిఖరాలు, గోపురాలు అధిరోహించి అలసట చెందక నవ్వుతూ కుంభాభిషేక మహోత్సవాలు చేస్తూ, ఎంతగా విహరించారో అదొక



అద్భుతఘట్టం. ప్రతిచోటా ఉదయం నుండి రాత్రి వరకూ క్షణం తీరిక లేకుండా కార్యక్రమాల్లో పాల్గొంటూ మందహాసంతో కూడుకొని విసుగు లేకుండా సంచరించెడి శ్రీచరణులు నేటికీ మా హృదయాల్లో ఆడుతూనే ఉన్నారు. పండితులను ప్రశ్నించి, కవులను అబ్బురపరిచే కవితలను చెబుతూ ఎన్నో భాషలలోని ప్రావీణ్యాన్ని చూపుతూ ఉంటే సరస్వతీదేవి పుంరూపంలో వీణనే దండంగా ధరించి సంచరిస్తున్నదా అనిపించింది. మహాసన్నిధానం అనుష్ఠానంలో నిరతులై ఉంటూ సన్నిధానంను ఆదేశిస్తూ సూచనలనిస్తూ, సంప్రదాయాలను ప్రవర్తింపజేసిన ఘటనలన్నీ ఇప్పుడు మళ్లీ జ్ఞాపకం వస్తున్నాయి.

ఈనాడు కూడా ఉభయస్వాములు మఠాన విరాజిల్లుతూ ఉండడం ఆనాటి ఆ జ్ఞాపకాలు పునరావృతమవుతున్నాయి. ఆచార వ్యవహారాల్లో ఏమాత్రం తూ.చ. తప్పకుండా అన్ని నియమాలనూ పాటిస్తూ అహరహం ధర్మస్థాపనకై ఆరాటపడుతున్నవారు శ్రీ శృంగేరీ శారదాపీఠాధీశ్వరులు. ఎన్ని ఏళ్ళ క్రింద వారిని కలిసినా మరిచిపోకుండా ఆనాడు చెప్పిన మన పేరును జ్ఞాపకముంచుకొని ఇంటిపేరుతో సహా పలకరించడం వారి అద్భుత మేధాశక్తికి తార్కాణం. శ్రీచరణుల సన్నిధానానికి వెడితే అదొక మైమరపు, విచిత్ర పరిణామం. వారి ముందు నుండి పక్కకు రావాలన్నా రాలేకపోతాం. ఒక సుధాకుంభాన్ని పొంది వదిలిపెడుతున్నామే అనే అనుభూతి కలుగుతుంది. భారతదేశంలోని నలుమూలలా

## పుస్తక ప్రదానం

ఒకరోజు శృంగేరికి వెళ్ళి శ్రీవారిని దర్శించుకుని రెండు రోజులుండి పాదపూజ చేసుకుని శ్రీవారు అనుగ్రహించిన మంత్రాక్షతలు తీసుకొని నమస్కరించి వస్తున్న సమయంలో నా హృదయంలో ఒక కోరిక ఉంది. శ్రీవారి చేతులమీదుగా ఒక పుస్తకాన్ని స్వీకరించాలి అని. కానీ ఎలా అడిగేది. మౌనంగా నమస్కరించి వస్తుండగా, చాలా మంది భక్తులననుగ్రహించవలసిన శ్రీవారు. చప్పట్లు కొట్టి ఒరేయ్ పురాణం అని పిలిచారు. భయంతో, భక్తితో సమీపానికి వెళ్ళాను. ఎందుకో పిలిచారు, ఏమడుగుతారో అనుకుం టూండగా, 'నీకు ఈ పుస్తకం ఇవ్వాలనుకున్నానురా' అని పక్కనున్న 'యోగవాసిష్ఠాన్ని' నాకు ఇచ్చారు. మందహాసం చేసి ఆశీర్వదించారు. నా ఆశ్చర్యానికి అవధులు లేవు. నేను నా హృదయంలో అనుకొన్నది ఎలా గ్రహించగలిగారు. గ్రహించే ఈ గ్రంథాన్ని ఇచ్చారా? అలా అయితే పుస్తకం అక్కడ ఎందుకు సిద్ధంగా ఉంది? ఈ ప్రశ్నలకు సమాధానం లేదు. ఒకవేళ ఏదయినా సమాధానం చెప్పాలనుకుంటే శ్రీవారు సర్వజ్ఞులు. వారికి తెలియని విషయమంటూ ఉండదు. ఇదే నా సమాధానం. కుచేలుడు కృష్ణుని సమీపానికి ధనాన్ని యాచించేందుకు వెళ్ళాడు. ద్వారకాధీశుని వైభవాన్ని చూసి, వచ్చిన విషయాన్ని ప్రస్తావించలేదు. తిరుగు ప్రయాణమయ్యాడు. నేను వెళ్ళినదే ధనాన్ని యాచించేందుకు కదా అడగనేలేదే. అయినా అతనికి నేనుందుకు వచ్చానో తెలియదా? అని ఇంటికి చేరుకున్నాడు. తాను అడగని సంపద ఇంటికి చేరుకున్నది. కుచేలుడు ఆశ్చర్యపడ్డాడు. ఈ కథ భాగవతంలో చెప్పినప్పుడల్లా శ్రీవారి కథ నాకు జ్ఞాపకం వస్తుంటుంది. శ్రీవారు సర్వజ్ఞులైన పరమాత్మ.

విజయయాత్ర చేసి, లక్షల మందిలో చైతన్యాన్ని తీసుకువచ్చిన అపరశంకరులు శ్రీచరణులు. మేము అధ్యయనం చేసిన సమయాన ప్రతి నెల జరుగుతున్న పాఠాలేమిటి ఇంకా ఏవిధంగా చదవాలి, చదివించాలి అని చెబుతూ ఎప్పుడయినా విజయయాత్రకు వచ్చినప్పుడు బెంగుళూరులోని శంకరమఠంలోని మా పాఠశాలలో పాఠమయ్యే సమయాన వచ్చి కూర్చునేవారు. మా గురువర్యుల పాఠశైలిని మెచ్చుకునేవారు. ప్రతి వార్షిక పరీక్షలలో ప్రశ్నపత్రాలు వారి నుండే వచ్చేవి. దిద్దిన తరువాత ఉత్తర పత్రాలను కూడా పరిశీలించేవారు శ్రీవారు.

ఎన్నో సందర్భాలలో వారి సమక్షానికి వెళ్లిన సందర్భంలో స్వయంగా తీర్థాన్ని ఇచ్చే సమయంలో మమ్మల్ని పక్కకు రమ్మని మౌఖికంగా పరీక్ష చేసేవారు. తీర్థానికి వెళ్ళామంటే శ్రీవారు ఈరోజు ఏ ప్రశ్న వేస్తారో అని ఆందోళనగా ఉండేది. ఒకవేళ వారిని చూసి తడబడుతూ సమాధానం చెప్పలేని సమయంలో వారే మాతో సమాధానాన్ని చెప్పించేవారు. భయాన్ని వదిలి ధైర్యంగా సమాధానం చెప్పాలని ప్రోత్సహించేవారు.

నేను తర్కసంగ్రహం చదువుతున్న రోజులవి. శ్రీవారి సమీపానికి తీర్థానికై వెళ్లగానే ఒరేయ్ పురాణం పాఠమే మవుతుంది అనడిగితే తర్కసంగ్రహమండీ స్వామివారు అని నేనంటే గురుత్వ లక్షణం చెప్పు అనడిగారు. ఆద్యపతనా సమవాయి కారణం గురుత్వం అన్నాను. సంతోషించి మళ్ళీ ప్రశ్న వేశారు- పతనే ఆద్యత్వంచ? దానికి తడుముకుంటున్న నన్ను చూసి శ్రీవారే ఆ లక్షణాన్ని వివరించి మళ్ళీ నాతో చెప్పించారు. ఇలా చాలా సందర్భాల్లో వారు పరీక్షస్తుండేవారు. విద్యా వ్యాసంగం చేసేవారంటే వారికి పరమ ప్రీతి. శాస్త్ర విషయాన్ని గురించి అడిగితే గంటల తరబడి మాట్లాడేవారు. లౌకిక విషయమేదయినా వస్తే మౌనంగా ఉంటారు. ప్రేమ, ఔదార్యం, వాత్సల్యం మొదలైన ఎన్ని పదాలున్నాయో అవన్నీ శ్రీచరణుల విషయంలో సార్థకమౌతాయి. శ్రీవారిని వర్ణించడానికి పదాలే చాలవు.

**సంధ్యావందనం**

బెంగళూరులో ఉభయస్వాములు అనేకమార్లు వచ్చారు. విజయయాత్రలో భాగంగా అటుపై నుండే వెళ్ళేవారు. అనేక సభల్లో శ్రీ మహాసన్నిధానం అభినవ విద్యాతీర్థగారు సంధ్యా వందనాన్ని గూర్చి చెప్పేవారు. ఒకనాడు సన్నిధానం భారతీతీర్థ స్వామివారు గురువుగారిని అయ్యా తమరి అన్ని ఉపన్యాసాల్లో సంధ్యావందనం గురించి చెపుతారెందుకు అని అడిగారు. అప్పుడు మహాసన్నిధానం వారు "నేను ఉపనయనం చేసుకోగానే సన్యాసదీక్ష తీసుకున్నాను. సంధ్యావందనం చేయలేకపోయాను. అందుకే నాకు సంధ్యావందనమంటే ఇష్టం" అన్నారు. ఎంతో గొప్ప విషయమిది. అనేక శాస్త్రాల్లో నిష్ణాతులైన శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామివారు అంత చిన్న వయసులో సన్యాసదీక్ష తీసుకుని అనేక చాతుర్మాస్యాలను చేశారు. సన్యాసులలో ఎవరు అనేక చాతుర్మాస్యాలు చేస్తారో వారే గొప్పవారు అనే సంప్రదాయం ఉంది. అటువంటి మహాసన్నిధానం వారి అనుగ్రహపాత్రులైన శ్రీభారతీతీర్థ స్వామివారు గురువుగారి ఆచరణనీ ఈనాటికీ జవదాటరు. అంతటి గురుభక్తి. గురువుగారి ఆదేశాన్ని స్వీకరించి ఉత్తరయాత్ర చేస్తున్న సమయంలో మహాసన్నిధానం బ్రహ్మీభూతులయినారు. విషయం తెలుసుకుని వచ్చి వారి



పార్థివదేహాన్ని చూచి విలపించిన తీరు నేటికీ నాకు కళ్ళకు కట్టినట్టు కనిపిస్తుంది. కొన్నాళ్ళవరకూ వారు తేరుకోలేదు. జగద్గురు స్థానాన్ని అలంకరించి భారతదేశాన్ని సంచరిస్తూ పన్నెండేళ్లు శృంగేరిని విడిచి మహాసన్నిధానం వారు విజయయాత్ర చేసి అద్వైత ప్రచారం చేసి, శృంగేరి వైభవాన్ని చాటితే. శ్రీచరణులు శృంగేరి విడవక 25 సంవత్సరాలు ఇక్కడే ఉండి శారదా చంద్రమౌళీశ్వర ఉపాసనా తపస్సునాచరించి, శృంగేరి వైభవాన్ని, గురుపరంపరను, వైదిక ధర్మనిష్ఠను చాటారు.

**అద్భుత కార్యాలు**

శ్రీచరణులకు జగద్గురు శంకరాచార్యులపైన అమితమై భక్తి, ప్రేమ, గౌరవం. శంకరుల రచనలు చదివి, జీర్ణించుకుని భారతదేశంలోనే ఎక్కడా లేని రీతిలో అతి సుందర మందిరాన్ని నిర్మించి, సుందరమైన శ్రీశంకరుల విగ్రహాన్ని ప్రతిష్ఠింపజేసిన ఘనత శ్రీచరణులకే దక్కింది. ఆ ప్రతిష్ఠా సమయంలో శ్రీవారి ఆదేశంతో శంకరభాష్యపారాయణం చేసే భాగ్యం లభించింది. మరో అద్భుతకార్యం రాజగోపుర నిర్మాణం. ఈ కాలంలో ఎవరూ నిర్మించలేని రీతిలో, చరిత్రలో నిలిచిపోయేలా సుందరమైన రాతికట్టడం. శ్రీజ్ఞానప్రదాత్రి శారదాదేవి ఆలయ గోపురానికి స్వర్ణంతో తాపడం చేయించి కృతజ్ఞతను చాటుకున్నారు. శృంగేరికి వచ్చే భక్తులకై నిత్యాన్నదాన నిమిత్తమై ఎంతో విశాలమైన భోజనశాలలు నిర్మించి నిరతాన్నదాత అయ్యారు. శ్రీ శారదాధన్వంతరి అనే ఆస్పత్రిని నెలకొల్పి ఎన్నో ప్రాంతాల్లో ఉచిత వైద్యసేవలు చేయిస్తూ ధన్వంతరి అవతారమెత్తారు. శృంగేరి చుట్టుపక్కల ఉండే పాఠశాలలకు మధ్యాహ్న సమయంలో భోజనాన్ని పంపుతారు. ఎందరో శ్రీ శారదాదేవి ప్రసాదాన్ని స్వీకరించి విజ్ఞులయ్యారు. వికలాంగులకు రిక్షాలను ఇవ్వడం, కుట్టుమిషన్లు ఇచ్చి స్త్రీలను ప్రోత్సహించడం, విద్యార్థులకు ప్రోత్సాహకాలందించడం మొదలైన సామాజిక సేవలు ఎన్నో చేస్తున్నారు. 700 శ్లోకాలుగల భగవద్గీతను కంఠస్థం చేసిన వారికి 25 వేల రూపాయల పారితోషికాన్నిస్తూ ఆధ్యాత్మికంగా ప్రోత్సహిస్తున్నారు. వేదాన్ని చదువుకొని వృద్ధులైన పండితులకు వృద్ధాప్య పింఛను, వేదశాస్త్రాలను చెప్పే పాఠశాలలకు సరిపడే ద్రవ్య సహాయం, గోశాలల నిర్మాణం... ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో రకాల ప్రణాళికలు వేసి దేశంలోని ప్రజల్ని ఆదు కుంటున్నారో చెప్పలేం.

కలియుగంలో మనందరి ముందు 'నడిచే దేవుడు'. ఇటువంటి ఈ గురువులో ఏ కోణంలో చూచినా అన్నీ కనబడతాయి. కవితాశక్తి అమోఘం. త్యాగరాజు, శ్యామశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితుల రచనలతో సమానమైన కీర్తనలు, కాళిదాసాది మహాకవుల రచనలతో సమానమైన

## అష్టదేవాః వసతః

ఉభయ గురువులు కాలడిలో చాతుర్మాస్యాన్ని చేస్తున్న రోజులవి. ఆ సమయంలో ఇక్కడ వేదాధ్యయానాన్ని ముగించుకుని శాస్త్రాన్ని చదవాలని కాలడీకి వెళ్ళి ఉభయ గురువులకు విన్నవించుకున్నాను. అప్పుడే కాలడీలో శాస్త్ర పాఠశాలను నెలకొల్పారు. శ్రీ శంకరశాస్త్రిగారు అధ్యాపకులుగా నియుక్తులయ్యారు. శ్రీవిద్యోపాసకులు, యోగనిష్ణాతులు, సదాచార సంపన్నులు మీమాంస వేదాన్త శాస్త్రాలలో నిపుణులు వారిని స్వామివారు పిలిచి వేదాంత శాస్త్రాన్ని అధ్యయనం చేయాలని తెలంగాణ నుంచి వచ్చారు. వారిని పరీక్షించండి. మీ పరీక్షలో నెగ్గితే శాస్త్ర పాఠశాలలో వీరినుంచుకుందామన్నారు. వారు కావ్య నాటకాల్లో పరీక్షించారు. స్వామివారికి విషయం చెప్పారు. శాస్త్ర అధ్యయన యోగ్యులే అని చెప్పగా శాస్త్ర పాఠశాలలో అధ్యయన నిమిత్తం నియుక్తులమయ్యాం. ఆ సమయంలో శంకర శాస్త్రిగారిని స్వామివారు ఒక ప్రశ్నవేశారు. శాస్త్రిగారు మీకెందరు సంతానం? అని. అప్పుడు శాస్త్రిగారు 'అష్టాదేవా వసవస్స్వామ్యసః చతుస్రో దేవీః' అనే మంత్రాన్ని చదివారు. ఈ మంత్రంలో దేవాః అనే బహువచనమైన పుంలింగ పదాన్ని తెలిపి ఎనమండుగురిని తెలిపింది కాబట్టి ఎనిమిది మంది కొడుకులు అని. దేవీః అనే స్త్రీ వాచక పద సమీపాన ఉన్న సంఖ్యాపదం చతస్రః- అంటే నలుగురిని తెలుపుతుంది. కాబట్టి నలుగురు కుమార్తెలు అని శాస్త్రిగారు మంత్రం ద్వారా చెప్పారు. ఇదివిన్న శ్రీవారు మందహాసం చేసి చమత్కారంగా 'అయ్యా శాస్త్రిగారూ! వేదంలో మంత్రమిలా ఉందని వేదానికి ప్రామాణ్యత సమకూర్చడానికై ఇలా సంతానాన్ని కన్నారా?' అనగానే అక్కడి పండితులంతా నవ్వారు.

దివ్య కమనీయ శ్లోకాలు. ఏ క్షేత్రానికి వెడితే, ఆ క్షేత్రంలో ఆశువుగా కవిత్వం చెప్పడం వల్ల కొన్ని వందల శ్లోకాలు ఎన్నో ఛందస్సులలో వారి గళం నుండి జాలువారాయి. వారి రచనలు చూసిన వారికి భాష యందు ఎంత ప్రౌఢపటిమ ఉంటుందో తెలుస్తుంది. వారి రచనలలోని "గరుడగమన తవ చరణకమలమిహ మనసిల సతుమమనిత్యం" అనే గీతం కొన్ని లక్షల మంది గానం చేస్తున్నారు. ప్రాణశక్తి వారి కవితల్లో కనబడుతుంది. ఒక మహామేధావిని, వీతరాగిని, నిరంతర శాస్త్ర చింతనాసక్తుని కనుగొని శ్రీ శారదాదేవి ప్రేరణతో శ్రీవిధుశేఖర భారతీస్వామిని పీఠాధిపతిగా చేసిన వారి శోధన పరమాద్భుతం. శ్రీచరణులు శక్తిపాతం చేశారా అన్నట్టు శ్రీజగద్గురు విధుశేఖరభారతీ స్వామివారు ఎంతటి ప్రజ్ఞాపాటవాలు గలవారో చెప్పనలవిగాదు. శ్రీవారి ప్రతిరూపం అన్నట్టుగా, ప్రతి కదలికలో మనం చూడగలం. ఇంతటి ప్రతిభాశాలిని గుర్తించి పీఠాధిపత్యాన్ని ఇచ్చిన మన గురువర్యులు సదా వందనీయులే. అనేక సందర్భాల్లో శ్రీవారి ఉపన్యాసంలో ఈ శ్లోకం వ్యాఖ్యానించబడింది.

**"నానామ్నాయ పరిశ్రమం కలయతాం నాస్త్యేవ శాస్త్రేషుధీః**
**సత్యేరవ్యనయోర్ద్వయోర్నసులభా సాహిక్షితౌ సాహితీ**
**అప్యేతాసు సతీషు నాస్తి వినయో నాచార భక్తిక్షమా**
**చాతుర్యః సచసాచసాచసచతాశ్చాలంబ్య ఖెలన్త్యముం"**

అనేకామ్నాయాలలో పరిశ్రమ చేసేవారికి శాస్త్రాలయందు బుద్ధి ఉండదు. అవి రెండూ ఉన్నాయనుకున్నా వినయం ఉండదు. ఆచారం, భక్తి, క్షమ, చాతురీ అనేవి ఉండవు. అదీ అదీ అదీ అవీ ఈ మహాత్ముని ఆలంబనగా చేసుకొని ఆడుకుంటున్నాయి. ఈ శ్లోకంలో చెప్పిన తొమ్మిది లక్షణాలు సమగ్రంగా కూడుకొని ఆడుకొంటున్నాయి. ఆవిధంగా శ్రీ శంకరులు జగద్గురువులు అవుతున్నారు. శ్రీ శంకరులు జగద్ధిత బుద్ధితో ప్రవర్తింపజేసిన శ్రీ శారదాద్యామ్నాయ పీఠాల అధిపతులందరూ అటువంటి దివ్యతేజస్సుతో మానవజాతిని సముద్ధరిస్తున్నారు. ఇందులో ఏమాత్రం సందేహం లేదు. ఈ గుణాలన్నీ మన గురువరేణ్యులు శ్రీ భారతీతీర్థ మహాస్వామి శ్రీమత్తుంగానదీ తీర విలసచ్ఛ్రీశారదాదేవీ నిరంతరోపాసనాజనిత (ప్రాప్త) శ్రీ శారదారూపులు. స్వాశ్రితజనభక్త అజ్ఞానతమో దూరీకరణ చలత్ప్రచండభాస్కరులు. నిరంతరానేక శాస్త్రాటవీవిహరణ పంచాననులు. చార్వాకాద్యన్యావైదిక మతోరగనాశక సమర్థగరుడులు. సర్వశాస్త్ర నిష్ణాతులు, నిరంతర శాస్త్రగోష్ఠీప్రియులు. గోరక్షణ బద్ధ కంకణులు, వేదశాస్త్ర ప్రచార ప్రసారదీక్షా నిరతులు అయిన శ్రీశ్రీశ్రీ అనంతశ్రీ విభూషితులు. జగద్గురు సార్వభౌములు భారతీతీర్థ మహాస్వాములనే ఆశ్రయిస్తాను. నా జీవనాన్ని సాఫల్యం చేసుకుంటాను.

**"భారతీకరుణాపాత్రం భారతీపదభూషణం**
**భారతీపదమారూఢం భారతీతీర్థమాశ్రయే"**

71 సంవత్సరాల జన్మదిత్సవ సందర్భంగా వారికిదే వాక్కుసుమస్రక్సమర్పణం. సర్వం జగద్గురుచరణారవిందార్పణమస్తు.

- జగద్గురు శ్రీచరణధూళి రేణువు

**పురాణం మహేశ్వరశర్మ**

*వ్యాసకర్త : విఖ్యాత వేదశాస్త్ర సంస్కృత పండితులు, పౌరాణికులు*

# ప్రజ్ఞానిధి.. అపర దక్షిణామూర్తి

శ్రీ శృంగేరీ దక్షిణామ్నాయ శారదాపీఠ వ్యాఖ్యాన సింహాసనాధిష్ఠితులైన జగద్గురువులందరూ దక్షిణా మూర్తులే. శ్రీశ్రీశ్రీ జగద్గురు భారతీతీర్థ మహాసన్నిధానం వారిలో మనం దక్షిణామూర్తి తత్త్వాన్ని దర్శించుకోవచ్చు. సుప్రసిద్ధంగా, దక్షిణామూర్తి వటతరువు మూలంలో నిషణ్ణులై ఉంటారు. యువగా తెలియవస్తూ ఉంటారు. వృద్ధులైన శిష్యులు వారిని పరివారించి శాంతములైన మనస్సులతో కొలుస్తూ ఉంటారు. శ్రీవారిది మౌనవ్యాఖ్య. శిష్యులందరూ ఛిన్నసంశయులై బ్రహ్మానందాధి రాజ్యపట్టభద్రులై ప్రకాశిస్తూ ఉంటారు. ఇదంతా పరమవిచిత్రమైన సంభావన.

ఇందులో వైచిత్రి ఏమిటంటే వటవృక్షం ఒక విచిత్రమైన స్ఫూర్తినిస్తుంది. సాధారణంగా ఉద్భిజ్జజాతికి చెందిన వృక్షాలు బీజరూపంలో ఉండగా నేలలోపలికి పోయి నేలను చీల్చుకొని పైకి ఊర్ధ్వాభిముఖంగా పెరుగుతూ పోతాయి. సృష్టిలోని 84 లక్షల జీవరాశులలో ఇలా పైకి ప్రసరిస్తూ పోయే జాతులు రెండే. ఒకటి మానవజాతి. రెండవది వృక్షజాతి (అపవాదాలు ఉండవచ్చు.) తక్కినవానిలో అత్యధికంగా కనిపించేది తిర్యగ్జాతి. వానినే పశువులు, పక్షులు ఇత్యాదిగా వ్యవహరిస్తూ ఉంటాం.

కనుక ఊర్ధ్వముఖంగా పెరుగుతూ పోవటం ఒక విశిష్టత. ఎందుకంటే అడ్డంగా ప్రవర్తించటమంటే ఎంత తిరిగినా భూపరిధిలో మాత్రమేకదా. నిలువుగా అంటే భూపరిధిని, తక్కిన భూతాలపరిధినీ, ఆకాశపరిధినీ అన్వేషిస్తూ పోవటమన్నమాట. ఆ విధంగా మనుష్యులు, చెట్లు విశిష్టజాతిగా పరిగణనకు వస్తాయి.

అందులోను వటవృక్షం ఇంకా విచిత్రమైనది. అది విత్తనం నుండి వ్యక్తస్థితి పొంది పైకి అన్నివైపులకు అంటే ఎనిమిది దిక్కులకూ వ్యాపించి మరల ఊడల రూపంలో నేలలోనికి ప్రవేశిస్తుంది. అంటే దానివ్యాప్తి పది దిక్కులకు సంబంధించిన దన్నమాట. మరొకవిధంగా చెప్పాలంటే సర్వదిగ్వ్యాపకమైన ఒక ప్రాణి అన్నమాట. ఈవిధంగా ఈ వటవృక్షానికి దిశాపరిచ్ఛిన్నత తొలగిపోతున్నది.

ఇంక వటబీజం సృష్ట్యాదినుండి ఉన్నది. వృక్షరూపంలో కొంతకాలం దృశ్యమానమవుతూ ఉంటుంది. మళ్ళీ బీజరూపం లోనికి వెళ్ళి 'ఉంటుంది'. ఈవిధంగా దానికి త్రికాలసత్త తెలియవస్తున్నది. కాలానవచ్ఛిన్నత దీనివలన తెలుస్తున్నది.




వటవృక్షం పరమాత్మ లక్షణమైన చిన్మాత్రతత్త్వాన్ని మనకు స్ఫురింపజేస్తూ ఉంటుంది. సత్యం, జ్ఞానం, అనంతమూ అయిన దానినే బ్రహ్మము అని ఉప నిషత్తులు చెప్తున్నాయి. త్రికాలాబాధ్య త్వం, జ్ఞానం, అనంత స్ఫోరకమైన ఆనందం మనకు వటవృక్షంలో గోచరిస్తూ ఉంటాయి. ఏర్పడటం, ఉండటం, మళ్ళీ అవ్యక్తస్థితికి చేరుకోవటం అనే ప్రాకృతిక లక్షణాలు మూడూ మనకు వటవృక్షంలో తక్కిన తావులకంటె విలక్షణంగా, గోచరిస్తూ ఉంటాయి. "వటతి మూలైః స్వస్థానం వేష్టయతి" అని వట శబ్దానికి నిరుక్తిని నిఘంటువులు తెలియజేస్తున్నాయి. ఎంత అందమైన అర్థం! మనం పైన సంభావించిన 'ప్రకృతి' ధర్మాల నన్నింటినీ ఈ నిర్వచనంలో గమనించవచ్చు. వ్రేళ్ళతో - ఊడలతో తన స్థానాన్ని చుట్టుకొంటూ ఉండేది వటము. ఇంత విస్పష్టంగా తక్కిన వృక్షాలలో ప్రకృతి లక్షణాలు కానరావు. అందువలన "వటవృక్షము" చిత్రమైనది.

వట'తరు'వులో తరు శబ్దార్థాన్ని కూడ మనం

## జనావళికి జగద్గురు సాహిత్య ప్రసాదం

*గరుడగమన తవ చరణకమలమిహ*
*మనసి లసతు మమ నిత్యం*
*మనసి లసతు మమ నిత్యమ్ ॥*
*మమ తాపమపాకురు దేవ*
*మమ పాపమపాకురు దేవ ॥*

*జలజనయన విధినముచిహరణముఖ*
*విబుధవినుత పదపద్మ*
*విబుధవినుత పదపద్మ ॥*
*మమ తాపమపాకురు దేవ*
*మమ పాపమపాకురు దేవ ॥* 1

*భుజగశయన భవ మదనజనక మమ*
*జననమరణ భయహారీ*
*జననమరణ భయహారీ ॥*
*మమ తాపమపాకురు దేవ*
*మమ పాపమపాకురు దేవ ॥* 2

*శంఖచక్రధర దుష్టదైత్యహర*
*సర్వలోక శరణ*
*సర్వలోక శరణ ॥*
*మమ తాపమపాకురు దేవ*
*మమ పాపమపాకురు దేవ ॥* 3

*అగణిత గుణగణ అశరణశరణద*
*విదళితసురరిపుజాల*
*విదళితసురరిపుజాల ॥*
*మమ తాపమపాకురు దేవ*
*మమ పాపమపాకురు దేవ ॥* 4

*భక్తవర్యమిహ భూరికరుణయా*
*పాహి భారతీతీర్థం*
*పాహి భారతీతీర్థమ్ ॥*
*మమ తాపమపాకురు దేవ*
*మమ పాపమపాకురు దేవ ॥* 5

*గరుడగమన తవ చరణకమలమిహ*
*మనసి లసతు మమ నిత్యం*
*మనసి లసతు మమ నిత్యమ్ ॥*
*మమ తాపమపాకురు దేవ*
*మమ పాపమపాకురు దేవ ॥*

*స్వామీ! గరుడగమనా! నీ పాదపద్మము ఈనా మనస్సునందు నిత్యము విలసిల్లుగాక! దేవా! నా తాపమును తొలగించివేయుము. దేవా! నా పాపమును రూపుమాపుము.*

*1. ఓ వనజాక్షా! బ్రహ్మ ఇంద్రుడు మొదలైన దివ్యపురుషులు కొలిచెడు పాదపద్మములుగల స్వామీ!*
*దేవా! నా తాపమును రూపుమాపుము. దేవా! నా పాపమును తొలగించి వేయుము.*

*2. భుజగశయనా! మదనజనకా! నీవు నా జనన మరణభయమును హరించివేయువాడవగుము. జననమరణ భయహారివగుము.*
*దేవా! నా తాపమును పోగొట్టుము. దేవా! నా పాపమును తొలగించివేయుము.*

*3. శంఖచక్రధరా! దుష్టదైత్యహరా! సర్వలోక శరణా! సర్వలోకశరణా! దేవా! నా తాపమును అపాకరింపుము. దేవా! నా పాపము నపాకరింపుము.*

*4. గణింపనలవికాని గుణగణములుగలస్వామీ! దిక్కులేనివారికి దిక్కైన స్వామీ! దేవతల శత్రువుల మూకలను ముక్కలుముక్కలుచేసిన దేవా! ముక్కలు చేసిన దేవా! నా తాపమును సర్వనాశనము చేయుము. నా పాపమును సమూలముగా పెకలించివేయుము.*

*5. దేవా! మహాకరుణతో భక్తవర్యుడగు భారతీతీర్థుని పాలింపుము. భారతీతీర్థుని పాలింపుము.*

*స్వామీ! గరుడగమనా! నీ పాదపద్మము ఈనా మనస్సునందు నిత్యము విలసిల్లుగాక! దేవా! నా తాపమును తొలగించివేయుము. దేవా! నా పాపమును రూపుమాపుము.*

మెలకువతో సమన్వయించుకోవాలి. తరన్త్యాతపమనేనేతి తరుః - దీనిచేత ఆతపము - ఎండ - నుండి లోకులు తరింతురు. తాత్త్వికంగా ఎండ అంటే తాపం కలిగించేది తాపత్రయంలోని తాపం. ప్రకృత మైన వట తరువు, ప్రకృతి లక్షణాలను స్ఫురింపజేయటమే కాకుండా తాపత్రయాన్ని రూపుమాపుతుంది. అందువలన కూడా వటతరువు 'చిత్రము' అంటే విస్మయకరమని అర్థం. వటతరువులో ఆశ్చర్యాన్ని కలిగించే అనేక విషయాలను మనం గమనించాం.

అట్టి వటతరువు మూలంలో మరొక చిత్రమైన విషయం "వృద్ధాః శిష్యాః" వృద్ధులు శిష్యులు. సాధార ణంగా బాల్య, కౌమార, యౌవనదశలు దాటిన వృద్ధులలో 'జిజ్ఞాస' ఉండదు. జ్ఞానేచ్ఛ ప్రాథమిక వయస్సులోనే అంకురి స్తుంది. తరువాతి దశలలో క్రమక్రమంగా ఫలదశకు

వస్తుంది. కాగా వృద్ధులైన జిజ్ఞాసువులైన వారిలో అంకురదశలో ఉండ టం 'చిత్రం'. అట్టివాడొకడో ఇద్దరో అయితే అంతగా ఆశ్చర్య పొనక్కరలేదు. "వృద్ధాః" వారు పెద్దసంఖ్యలో ఉన్నారు. ఇది చిత్రమైన విషయం. శిష్యశబ్ద సాహచర్యం చేత వీరందరూ జిజ్ఞాస నిలువెల్లా నిండివున్నవారనే అర్థం ప్రతీయమానం అవు తుంది. సూక్ష్మంగా ఆలోచిస్తే ఈ వృద్ధులందరూ భగవద్గీతలో పేర్కొనబడిన ఆర్తులు, జిజ్ఞాసువులు, అర్థార్థులు, జ్ఞానులు అయినవారు. అట్టి నాలుగు విధాలైనవారు వటతరువు మూలం లోనికి చేరుకొన్నారు. ఎందుకు అంటే, ఎక్కడకు చేరుకొంటే తమ ఆర్తి, జిజ్ఞాస, అర్థాపేక్ష, రూపుమాసిపోయి జ్ఞానం అనుభవా నికి వస్తుందో ఆ స్థానం అది అని 'తపస్సు' ద్వారా తెలుసు కొన్నవారు కనుక.

ఆ వృద్ధులందరూ ఆ వటతరుమూలమును చక్కగా ఆసనబంధధీరులై అధివసించి ఉన్నారు. శ్లోకార్థ సంభావన చేస్తున్న విద్యార్థికి మొట్టమొదటగా దర్శనాన్ని అనుగ్రహిం చినవారు 'శిష్యులు'. అంటే ఆ జిజ్ఞాసువు తన సహృదయులను - సమాన హృదయులను - గుర్తించే ప్రయత్నంలో ఉన్నాడన్న మాట. తరువాత పరకాయించి చూస్తే అక్కడ ఒక జ్ఞానమూర్తి దర్శనం అయింది. ఇంకా అటుశిష్యులనూ, ఇటు ఆచార్య స్థానంలో ఉన్న జ్ఞానమూర్తిని మార్చి మార్చి చూస్తున్నాడు. విద్యార్థి. అతని హృదయంలో ఆనందాశ్చర్యాలు పొంగుకొంటూ వస్తున్నాయి. ఇదేమిటి? ఇంత పెద్దవారు వివిదిషకలవారై శిష్యస్థానంలో కూర్చున్నారు. సాధారణంగా గురువు అంత కంటే వృద్ధుడై ఉండాలే. అక్కడ 'ఒక యువ' గోచరిస్తున్నాడు. ఏమిటి ఆశ్చర్యం! విద్యార్థి ఒకపట్టాన సమాధానపడలేక పోతున్నాడు. విచారధార ఒక ఒడ్డుకు చేరిన సమయంలో ఓహో! ఈయన 'గురుమూర్తి'యా అనే సంశయ దశనుండి 'గురుమూర్తియే' అనే నిశ్చయదశకు చేరుకొన్నాడు. అయినా ఆశ్చర్యమే "చిత్రమ్" అనుకొంటున్నాడు.

కొంచెం తేరుకొన్న తరువాత ఈ గురుమూర్తి అయిన యువ ఆ వృద్ధులైన శిష్యులకు ఏ పాఠం బోధిస్తున్నారో తెలుసు కుందాం అనుకొన్నాడు. అక్కడ వాగ్వ్యవహారం ఏమీ తెలియబడటం లేదు. ఇంకా 'చిత్రమ్' - ఆశ్చర్యం. గురుమూర్తి అరమోడ్పు కనులతో, తెరవని వదనంతో, నిశ్చలమైన సుఖాసనంలో, సుస్థితిలో ఉన్నాడు. ఆ మొత్తానికి ఏదో ఒక వ్యవహారపదం కావాలనుకొంటే దానిని 'మౌనం' అంటారు. అది వట్టి మౌనం కాదు. మౌనరూప వ్యాఖ్యానం. విశేషంగా, సంపూర్ణంగా తెలియజెప్ప టానికి వ్యాఖ్యానం అని వ్యవహారం. అది అక్కడ నిశ్శబ్దంగా తాండవిస్తున్నది. ఈ తాండవం అకాండ తాండవం కాదు. శివతాండవం. అంటే చైతన్యస్ఫురణా త్మకమైన తాండవం. విద్యార్థి దానిని తెలుసుకున్నాడు. మనోయవనికపైన చిత్రించుకొంటున్నాడు. కొంతసేపైన తరువాత శిష్యుల అనుభూతి ఎలా ఉన్నదో తెలుసుకోవాలనిపించింది. ఇటుచూడగా అందరి ముఖాలలో సంశయాలన్నీ పటాపంచలయిన స్థితిలో అనుభూతికి వచ్చే శాంతసౌమనస్యం తాండవిస్తున్నది. ఏ ఒక్కనిని



గమనించినా అతడు అటు గురుమూర్తి "శాంతం, శివమ్, అద్వైతమ్" అన్న వేదవాక్యానికి సమన్వయభూమిగా ఎలా కానవస్తున్నాడో. అటువంటి స్థితిలో ఉన్నారు. తనకూ, వారికీ మధ్య నిరోధకంగా ఉన్నది కాబోలు గురుమూర్తీ, వృద్ధశిష్యులూ అనే స్వరూపాలు గోచరిస్తున్నాయి. ఆ దర్శనాన్ని మరింత పండించుకోవాలంటే ఈ విద్యార్థి మరింత తపస్సు చేయాలి. అప్పుడు 'ఏకత్వానుదర్శనం' లభిస్తుంది. అతనికి తెలుసు. అది 'అద్వైతమ్'. తన్నుగూడ తనలోనికి తీసుకొం టుంది. ఆ ఫలదశకు రావాలంటే ఈ హృదయఫలాన్ని మాగ వేయాలి. మరొక విధంగా మనస్సును లేకుండా చేసివేయాలి. దానినే, ఎప్పుడో, ఎక్కడో విన్నాడు 'అమనస్కయోగం' అంటారని. తనకు గుర్వనుగ్రహం వలన అది తప్పక లభిస్తుంది.

శ్రీశ్రీశ్రీ జగద్గురు భారతీతీర్థ మహాస్వాముల వారిలో ఈ

దక్షిణామూర్తి దర్శనం మనకు లభిస్తుంది. అదేమయ్యా! వారు మౌనమూర్తులు. వీరు మనందరిలో చక్కగా చల్లగా మాట్లాడుతూ ఉంటారు. వారు వటవిటపి సమీపంలో భూమిభాగంలో నిషణ్ణులయి ఉన్నారు. వీరు శృంగేరీ దివ్యధామంలో సంచరిస్తూ ఉంటారు. వారు యువ. వీరు సప్తతిపూర్తి అయినవారు. ఇంకా ఎన్నో తేడాలు కనిపిస్తుంటే వారు వీరే అనటం ఎలాగా? అని కొందరికి సందేహం. దీనికి సమాధానం, ఆక్షేపణలన్నింటినీ తుక్కుదూగరగా కొట్టివేసే సమాధానం, సుమారు అయిదువందల ఏండ్లకు పూర్వమే శ్రీమాధవవిద్యారణ్యులు పరమరమణీయమైన శ్లోకంలో చెప్పి ఉన్నారు. ముందుగా మనం ఒక విషయాన్ని గమనించాలి.

ఆ దక్షిణామూర్తినుండి జ్ఞానం అందుకొన్నవారు వృద్ధులైన శిష్యులు. అంటే తపస్సంపన్నులై, జగదనిత్యత్వ భావనను పండించుకొన్నవారు. అంటే మింటి దారిని అధివసించి ఉన్న వారు. పరమపదసోపానపటంలో నిచ్చెన లెక్కుతూ, పాముల నోట్లో పడుతూ సాగుతున్నవారివంటివారు ఇంకా పెద్ద సంఖ్యలో ఉన్నారు. జగత్తులన్నింటికీ గురువైనవారు ఇట్టివారందరినీ కూడా ఉద్ధరించాలి. అందువలన దక్షిణామూర్తి మరల అవతరించారు. అవతార స్వరూపాన్ని శ్రీ విద్యారణ్యులవారు పరమరమణీయంగా అభివర్ణించారు.

**"అజ్ఞానాన్తర్గహనపతితా నాత్మవిద్యోపదేశై**
**స్త్రాతుం లోకాన్ భవదవశిఖాతాపపాపచ్యమానాన్,**
**ముక్త్వా మౌనం వటవిటపినో మూలతో నిష్పతన్తీ**
**శంభోర్మూర్తి శ్చరతి భువనే శఙ్కరాచార్యరూపా."**

- శ్రీ విద్యారణ శంకరవిజయం-4.60

ఆ దక్షిణామూర్తి పరమ కరుణావరుణాలయులు. మౌనవ్యాఖ్యానంతో వృద్ధశిష్యులను ఉద్ధరించి, కొంచెం కన్ను తెరచి చూడగా ఆయనకు కనిపిస్తున్నవారి స్థితి పరమఘోరంగా కనబడింది. వారందరూ పరమ దుఃఖంతో కుళ్ళికుళ్ళి ఏడు స్తున్నారు. దిక్కుతోచని మహారణ్యంలో తిరుగాడుతున్నారు. తామెవరో, తాము దేనిని పొందాలో కూడా తెలియని దశలో ఉన్నారు. పరమాత్మయే అయిన దక్షిణామూర్తివారికి ఆ దృశ్యం గోచరించింది. వారిని రక్షించాలనే నిశ్చయభావన కూడా కలి గింది. అట్టి వారిని రక్షించాలంటే 'మౌనం' పనికిరాదు. వట తరువు దగ్గరకు అలా పరమభయంకరమైన తాపంతో ఉడికి పోతున్న ఆ అజ్ఞానులు రాలేరు. తామే వారిదగ్గరకు పోవాలి. అందుకోసం వటవిటపిని కూడా వదలిపెట్టినారు. మెల్లగా ఆ మూర్తి శంకరాచార్యరూపమై శంభుమూర్తియై జాలువారు కొంటూ భూమిమీదికి వచ్చింది. నిజానికి దానికి



దేశకాలాలకు సంబంధించిన హద్దులు లేవు. దానిని తెలియజేయటానికే శ్రీ విద్యారణ్యుల వారు, 'నిష్పతన్తీ', 'చరతి' అన్నారు. అవి రెండూ తాచ్ఛీల్యార్థానికి సంబంధించిన క్రియాతత్త్వాన్ని తెలియజేసేపదాలు. అంటే అలా జాలువారుకొంటూరావటం, తిరుగుతూ ఉండటం అనేది ఆ జ్ఞానమూర్తి శీలం. ఆ పనికి ఆరంభ, మధ్య, అంతస్థితులు ఉండవు.

కనుక మనం ఇప్పుడు దర్శించుకొంటున్న ఆ శంభు మూర్తియే, ఆ శంకరాచార్యరూపమూర్తియే, ఆ వటతరు మూలస్థితి సంభావితమూర్తియే, ఆ వృద్ధశిష్యోద్ధరణచణ మూర్తియే, ఇప్పటికి అవిచ్ఛిన్న గురుపరంపరా మూర్తియై నేలపై నడయాడుచున్నది. ఇకపైన కూడ నడయాడు చుండును. ఆ దక్షిణామూర్తియే మనమిప్పుడు కను గొనుచున్న, మాటాడుచున్న అను గ్రహము పొందుచున్న, ఆనందమును భవించుచున్న జగద్గురు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థమహాసన్నిధానము. శ్రీశ్రీశ్రీ విధుశేఖరభారతీ సన్నిధానము.

**- ప్రాచార్య శలాక రఘునాథశర్మ**

# భారత ధర్మరక్షకులు-భారతీతీర్థులు



ఎంతటి కలికాలమైనా, తపన కలిగిన యోగ్యులకోసం భగవానుని అనుగ్రహం ఈ పుణ్యభారతావనికి అందుతూనే ఉంటుంది. అలాంటి ఈశ్వరానుగ్రహ స్వరూపమే శృంగేరిలో జగద్గురుతేజంగా విరాజిల్లుతోంది.

దక్షిణామూర్తి స్వరూపులైన ఆదిశంకరులనుండి నేటి దనుక అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్న శృంగేరీ శారదాపీఠంలో పూర్వా చార్య పరంపరంలోని విశిష్టతనంతటినీ మూర్తిమంతం చేసుకున్న ఆచార్యులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి.

ఆదిశంకరజ్యోతి తాను ప్రతిష్ఠించిన నాలుగు పీఠాలలోనూ నిరంతరాయంగా ఈ దేశాన్నీ, ధర్మాన్నీ కాచుకుంటోందని ఆ పీఠ గురుపరంపర ఋజువు చేస్తూనే ఉంది. నాటికీ, ఏనాటికీ సనాతన హైందవ ధర్మానికీ, దేశక్షేమానికీ శంకరులే శ్రీరామరక్ష అనడంలో సందేహంలేదు. ఈ దేశపు గురుపీఠం శృంగేరీ - అన్నమాట కూడా నిశిత పరిశీలకులకు అతిశయోక్తికాదు.

అన్నివిధాలా తాత్త్విక ధోరణులను సమన్వయిస్తూ విభిన్న ధర్మముల పరామర్శను సానుభూతిగా స్వీకరిస్తూ, పరమ సత్యశోధనలో సాధనలో అన్ని సిద్ధాంతాలూ ఉపకరిస్తాయని ప్రతిపాదిస్తూ, చరమ సిద్ధాంతంగా ఔపనిషద బ్రహ్మజ్ఞానాన్ని అద్వైతంగా ఆవిష్కరిస్తూ బ్రహ్మవిద్యా సంప్రదాయాన్ని అవిచ్ఛి న్నంగా ప్రతిష్ఠించారు శ్రీ ఆదిశంకరులు. ఆ పరంపరలోనే మళ్ళీ తానే అవతరించారా అన్నట్లుగా భాసించిన మరో మహాను భావులు శ్రీవిద్యారణ్యస్వామి. వేదాంతభాష్యాన్ని అనుగ్రహించిన ఆదిశంకరులు, వేదభాష్యాన్ని అందించిన శ్రీ విద్యారణ్యులు. ఉభయుల విజ్ఞానదీధితుల సమైక్య స్వరూపమే శ్రీ భారతీతీర్థులు.

ఈ బ్రహ్మజ్ఞులు, మహాతపస్సులు, అపార కారుణ్యమూర్తి ఈ పీఠం ద్వారా సనాతన ధర్మానికి అందిస్తున్న ధైర్యం, అభయం అనన్య సామాన్యం. ధర్మపరిరక్షణ కార్యక్రమాలే కాకుండా, వేదాది ఆర్షవిద్యలను పటిష్టపరుస్తున్న సత్కార్యాలెన్నో వారి చలువచేతి శాసనంలో పీఠం పక్షాన జరుగుతున్నాయి.

శాస్త్రసభలు, వేదసభలు, విద్వత్సభలు... బహుసంఖ్యాకంగా నిర్వహిస్తున్న వీరి ఏలుబడిలోని, పావన తుంగాతీర శంకర పీఠమంతా తపోమయంగా, ఆర్షతేజస్సుతో బ్రహ్మలోకాన్ని తలపిస్తుంది. అక్కడున్న శారదాంబ బ్రహ్మవిద్యాధిదేవత. ఆ బ్రహ్మవిద్యయే పురుషాకృతి ధరించినట్లుగా యతీశ్వరులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థులవారు ఎందరినో అనుగ్రహిస్తున్నారు.

వారి దర్శనం, స్మరణ సద్యః స్ఫూర్తితో చిత్తాన్ని తేటపరచి జ్ఞానప్రకాశాన్ని నింపుతాయి. అలాంటి శాంత్యనుభవా లను వారి సన్నిధిలో పొందిన భాగ్యశాలిని నేను. శృంగేరీ ఆధ్వర్యంలో ప్రాచీనవిద్యల పరిరక్షణ, ఆయుర్వేద విద్యాలయాలు, పేదలకు ఆసరాలు, ఉపాధికల్పనలు... వంటి సామాజిక సాంస్కృతిక సేవా కార్యక్రమాలు ఎన్నో నిర్వహించ బడుతున్నాయి. జగద్గురువుల ద్వారా సమగ్రంగా దేశానికి అందుతున్న మహోపకారం గణనీయమైనది. క్రియలలో కారుణ్యం, భావనలో అద్వైతం, భాషణలో జ్ఞానవిజ్ఞాన ప్రభ



శ్రీభారతీతీర్థుల ప్రసరణాలు. అంతర్ముఖులై నిరంతరం బ్రహ్మనిష్ఠులై ఉన్నా, ధర్మరక్షణార్థం పీఠాధిపత్యాన్ని నిస్సంగంగా నిర్వహిస్తున్న వీరు - బ్రహ్మజ్ఞులు ఎలా ఉంటారన్న ప్రశ్నకు నిలువెత్తు సమాధానం. ఆంధ్రులై వారు జన్మించడం తెలుగు వారి భాగ్యం. కానీ సమగ్ర శారదామూర్తులైన వారు ప్రతిభాషనీ మాతృభాషవలె భాషించగల విద్యన్మణులు. 'భాషారూపా బృహత్సేనా' అన్నట్లుగా జగదంబ వారి పలుకుల్లో భాసిస్తుంది.

అపారమైన మేధాసంపద, నిత్యానుష్ఠాననిష్ఠ, తపశ్శక్తి, బ్రహ్మజ్ఞానం... వారు నిలుచున్నా, కూర్చున్నా స్ఫుటంగా పుంజీవభూతమై ఒక మహాజ్యోతిగా సాక్షాత్కరిస్తూనే ఉంటాయి.

ఇటీవల 'హైందవ మహాపురుషుని'గా వారిని ప్రస్తావిస్తూ, అమెరికాలోని హవాయి ద్వీపానికి చెందిన కువాయిలోని హిమాలయన్ అకాడమీ వారు తమ 'హిందూయిజం టుడే' అనే పత్రికలో విశిష్ట రచనను అందించారు. జగద్గురువుల దివ్య ప్రభావం, సంస్కృతిపై, ధర్మంపై వారి అనుగ్రహ ప్రసారం అశేష విశేషాలతో వారు అంతర్జాతీయ స్థాయిలో విస్తృతంగా విశదపరచారు. ఆ వాస్తవాలన్నీ పరిశీలిస్తే - భారతీయ హైందవదీప్తి, ప్రధాన గురుపీఠం శృంగేరీ, దైవీయమైన పటిష్టాధారం శ్రీమహాస్వామి... అని స్పష్టమౌతుంది. ఇటువంటి ఆచార్య మూర్తిని కలిగిన మన దేశం భాగ్యసీమ - అని భావించాలి.

శృంగేరినుండి మనకోసం నడచివచ్చిన బ్రహ్మవిద్యా మూర్తుల దివ్యచరణాలకు ప్రాంజలిస్తూ....

('శ్రీశంకరకృప' సౌజన్యంతో స్వర్ణోత్సవ సంచిక నుండి)

**- సామవేదం షణ్ముఖ శర్మ**



# జ్ఞాన సూర్యులు జగద్గురువులు

యస్య ప్రసాదాదహమేవ విష్ణుర్మయ్యేవ
సర్వం పరికల్పితఇచ్చ ।
ఇత్థం విజానామి సదాత్మ రూపం తస్యాంఘ్రి
యుగ్మం ప్రణతోస్మి నిత్యమ్ ॥

ఆదిశంకరుల కాలానికి ప్రయాణం చేయాలి, వారు 32సంవత్సరాల వయస్సులోనే చేసిన అద్భుతాలను చూడాలని, వారి మహాత్మ్యలను ప్రత్యక్షంగా చూసి అనుభవించాలని, ఆస్వాదించాలని, వారిని దర్శించి తరించాలనే కోరిక అందరికీ ఉంటుంది. కానీ, కాలాన్ని మనం శాసించలేము గదా! ఆ సమయంలో ఈ జీవుడు అక్కడే ఉండి ఉన్నా అజ్ఞానమనే పొరలు కమ్మిన మనం గుర్తించలేం. అందుకని ఆ లోటు నాశిష్యులకు ఉంటుందేమో, అది ఉండకూడదు అని అపార కరుణామూర్తులయిన ఆదిశంకరులు చతురామ్నాయ పీఠ వ్యవస్థ చేసి (అస్మత్పీఠే సమారూఢః పరివ్రాడుక్త లక్షణః అహమేవేతి విజ్ఞేయో 'యస్యదేవ' ఇతి శ్రుతేః) అని చెప్పి చతురామ్నాయ పీఠ రచన గావించి, ఆ పీఠములందు స్థితులయిన వారిని ఆయన స్వరూపంగానే భావించి పూజించమని శాసనం చేశారు. అందుకే మనం "శ్రుతి స్మృతి పురాణానాం ఆలయం కరుణాలయం నమామి భగవత్పాద శంకరం లోక శంకరం" అని ప్రార్థన చేస్తాం అది మొదలు ధర్మానికి ఎప్పుడు అవరోధం ఏర్పడితే అప్పుడు జగద్గురువులు ఈ జగత్తుని, భారతావనిని కాపాడుతూ వస్తున్నారు. నేను నా ఇరవై ఒకటవ ఏట ఆది శంకర జయంతి ఉత్సవాలను నిర్వహించడం ఆరంభించాను అంతే శంకరుల అనుగ్రహంవల్ల శృంగేరీలో శృంగేరి జగద్గురు మహా సంస్థాన పీఠాధీశ్వరులు అనంతశ్రీవిభూషితులు అయిన శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి చరణుల దివ్య పాదాలవద్దకు చేరాను. అది భాద్రపదమాసం. అప్పుడు శాస్త్రార్థ సభలు జరుగుతున్న సందర్భంలో నేను నా జన్మాంతర సుకృతం వల్ల వారిని వ్యాఖ్యాన సింహాసన పీఠాధీశ్వరులుగా దర్శించాను.

ఆదిశంకరుల స్వరూపులు, శంకరుల వలెనే శృతులయందు, స్మృతులయందు, పురాణములయందు విశేషమైన ప్రజ్ఞ కలిగి ఉండటమే కాకుండా ఆదిశంకరుల ప్రత్యేకత అయిన కరుణ, తద్వారా సకలజీవ ఉద్ధరణ అనే లక్షణాలని పుణికి పుచ్చుకున్న పరమహంసలు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి చరణులు. వారి దర్శన మాత్రముతోనే హృదయంలో ఒక్కసారిగా ఒక తెలియని ప్రశాంతత చేకూరి మనస్సు తన అన్వేషణ ఆపి స్వామి వారి పదపద్మాలయందు లగ్నమైంది. కాషాయ వస్త్రంలో స్వామి వారిని చూస్తే మనస్సులో ఒక భావం చవిచూసింది. సూర్యోదయ

సూర్యాస్తమయ సంధి కాలంలో సూర్యనారాయణమూర్తి లాగా అజ్ఞానం, జ్ఞానం మధ్య కొట్టుమిట్టాడే వాడికి అదే కాషాయంలో ప్రకాశించే జ్ఞాన సూర్యుడి లాగా శ్రీచరణలు గోచరించారు. అది మొదలు తిరిగి హైదరాబాదు చేరిన తరువాత కూడా నా హృదయం వారి పద పద్మాల దగ్గరే స్థిరమైనట్లు అనిపించి నాలో ఒక భావన కలిగింది. సూర్యుడు ఎంత దూరంగా ఉన్నా ప్రొద్దు తిరుగుడు పువ్వు ఆయన వైపే తిరిగినట్లు నా హృదయం శృంగేరి జగద్గురువుల పాదపద్మాలపైనే లగ్నమవుతోందని, సన్నిహితంగా స్వామివారిని చూస్తే వారు పలికే ప్రతి అక్షరం తక్కెడలో వేసి కొలిచినట్లు సమతూకంగా శాస్త్రబద్ధంగా సూత్రీకరించినట్లుగా ఉంటుంది.

అది మొదలు 14సం॥లు ఆగకుండా శంకరజయంతి నిర్వహిస్తున్న నాకు, ఒక ఆనందదాయకమైన వార్త మా గురువుగారు బ్రహ్మశ్రీ ముదిగొండ శంకరశర్మ గారి వల్ల తెలిసింది. జగద్గురువులు విజయయాత్ర తెలుగునాట చేయబూనినారు అని. అంతే భరతుడు పద్నాలుగు సంవత్సరాలు పాదుకలను పూజించినందుకు శ్రీరామచంద్రమూర్తి భరతుడు ఉన్న ప్రదేశానికే వచ్చినట్లు జగద్గురు పదపద్మాలను అర్చించినందుకు వారు మా కార్యస్థలంలో అడుగిడుతారు అని ఆనందం కలిగింది. వెంటనే మా గురువుగారితో ఆహ్వానించటానికి శృంగేరికి వెళ్ళాను. శ్రీ చరణులు అభయాన్ని ఇచ్చారు. మా కార్యక్రమం స్వామి వారి కార్యక్రమ జాబితాలో చేర్చబడలేదు. కారణం ఒకే కాలనీలో రెండు చోట్ల జగద్గురువులు రావటం కష్టం మా కాలనీలో ఉన్న శృంగేరి శంకరమఠంలో జగద్గురువుల రాక నిర్ణమమైంది కనుక. కానీ స్వామి వారిని ఘనంగా స్వాగతించుకోవాలని అది 2012సం॥ కావడంతో మా ఇంటి దగ్గర ఉన్న వి.డి. ప్రసాదరావ్ మెమోరియల్ - లోటస్ ల్యాప్ స్కూల్స్ యజమాన్యంతో మాట్లాడి 2012 అడుగుల జాతీయ జండాని ఒక కిలోమీటరు పొడుగున ప్రదర్శన గావిస్తూ మా సంస్థ పక్షాన ఆహ్వానించుకున్నాం. కానీ కార్యస్థలంలో జగద్గురువులు రావట్లేదు అనే బాధ నాలో మిగిలిపోయింది అప్పుడు జగద్గురువులు అటుగా వెళ్లేటప్పుడు ఉన్నట్టుండి అక్కడికి వచ్చి వారిని వేడుకోగానే దిగి వచ్చి మా వేదికని అనుగ్రహించి మా సంస్థలో ఆదిశంకర జయంతులు ఘనంగా నిర్వహించమని ఆశీర్వదించారు, ఆ సమయంలో జగద్గురువులు శబరిని ఇతర దీనులని అనుగ్రహించిన శ్రీరామచంద్రమూర్తిలా తోచారు. అది మొదలు మా ఆదిశంకరాచార్య భక్త సమాజం శ్రీవారి ఆశీర్వచన బలంతో దినాదినాభివృద్ధి చెంది ఒకేసారి దేశంలో ఇరవైచోట్ల శంకర జయంతి నిర్వహించే స్థాయికి ఎదిగింది.

నేను టి.వి ఛానాళ్ళలో నాస్తికులు, అవైదికులు ఇతర


శ్రీ వారి చరణారవిందాలు

మతాలవారు మన ధర్మాన్ని ఖండించేటప్పుడు బాధ కలిగి జగద్గురువులని తలచుకుని మాట్లాడే వాడిని. వెంటనే నా మాటలో ఒక తెలియని చురుకుదనం వచ్చి వారిని నిర్ద్వంద్వంగా ఖండించేవాడిని. ఆ సందర్భంలో ఒక క్రైస్తవుడితో వాదించవలసి వచ్చి చిన్న జీయర్ స్వామివారు నన్ను అడిగినప్పుడు నేను భారతీతీర్థస్వామి వారు అనుగ్రహిస్తే మాట్లాడుతాను అని వారికి తెలియపరిచాను. వారు కూడా ఔదార్యంతో అవును అడగండి తద్వారా మీకు కూడా బలం చేకూరుతుంది అని ఆశీర్వదించారు. అంతే జగద్గురువుల వద్దకు రెక్కలు కట్టుకుని వాలిపోయి వారిని అనుమతి కోరగా మా మనస్సులో ఉన్నదే మీరు అడిగారు, తప్పక మాట్లాడాలి అని వారి ఆంతరంగిక శిష్యులు శ్రీకృష్ణమూర్తి శాస్త్రిగారిని పిలిచి శృంగేరి ముద్రతో ఉన్న పండిత శాలువా తెప్పించారు. అది కప్పించి మీరు కాదు మీలో ఉండి శారద మాట్లాడుతుంది అని అనుగ్రహించారు. అంతే నాలో ఒక తెలియని శక్తి ఆవహించి ఆ వాదనలో బలం, విజయం అనుగ్రహించింది. అదే జగద్గురువుల కరుణ, శక్తి. ఆ శాలువాని కొందరు వైరి వర్గంలో వారు మాయం చేస్తే, మళ్ళీ అలాంటి శాలువానే నాకు వారు అనుగ్రహించారు.

ఇలా శ్రీవారితో నాకున్న అనుభవాలు అనేకం కొన్ని మనస్సుకి వాక్కుకి అవ్వల ఉన్నాయి వారి సప్తతి వర్ధంతి సందర్భంగా ఈ వ్యాసాన్ని రాయాలని నన్ను మరుమాములు వెంకటరమణశర్మ (దర్శనం శర్మ) గారు అడిగినప్పుడు కొంత ఆలస్యం చేసినా సోదర ప్రేమతో వారికున్న చనువుతో మందలించి ఈ వ్యాసం పూర్తి చేయించారు. వారికి నా నమస్కారాలు తెలుపుతూ అనంతశ్రీ విభూషితులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ స్వామివారు విద్యారణ్యుల వారివలె ఆశ్రిత భక్తజన మందారంలా మనందరిని అనుగ్రహించాలని ఆ ఆదిశంకరులని శారదా అమ్మవారిని చంద్రమౌళీశ్వరుణ్ణి ప్రార్థిస్తూ నా శిరస్సుని సదా స్వామివారి పాద పద్మాల వద్దనే ఉండేలా అనుగ్రహించమని వారినే ప్రార్థిస్తూ...

జగద్గురువుల శిష్య పరమాణువు
**పశర్లపాటి శ్రీనివాస బంగారయ్య శర్మ**



# జ్ఞాన గంగా - కరుణాంతరంగా

హిమాలయాలలో పుట్టిన గంగ తన ప్రవాహంతో భక్తుల పాపాలను తుడిచిపెడుతుంటే, శృంగేరీనుండి ప్రపంచమంతటికీ అనుగ్రహ అమృతాన్ని ప్రవహింపజేస్తూ ఆబాలగోపాలాన్ని ఉద్ధరించే జ్ఞానగంగ 'జగద్గురువులు శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థ మహాస్వామివారు'. కలిపురుషుని విజృంభణతో సనాతన ధర్మానికి ప్రమాణమైన వేద ప్రామాణ్యం సన్నగిల్లి అనేక వాదనలు ప్రబలుతున్న సందర్భంలో శివుడే సాక్షాత్తూ శంకరాచార్యులుగా అవతరించగా ఆ పరంపరలో వచ్చిన శ్రీ శృంగేరి పీఠాధీశ్వరులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారు.

మననం చేసేవారికి వారి అనుగ్రహభాషణలే మంత్రాలు. వారి వచనాలు జ్ఞాన-ధర్మాలకు నిలయాలు. 'సాక్షాత్తుగా బ్రహ్మ విద్యలకు అధిదేవతే మాతృవాత్సల్యంతో పలుకరించిందా' అన్నట్లు అందరిపై వర్షించే వారి దివ్య కరుణ పున్నమినాటి వెన్నెలవలే ఆనందాన్ని కలుగజేస్తుంది. అపర ఆదిశంకరులుగా వారు చేసే ఉపదేశం ప్రతిఒక్కరి హృదయాలను తాకి జీవన వెలుగులను ప్రసరింపజేస్తుంది.

లౌకికి విషయాలపట్ల విముఖులై ఉన్నప్పటికీ, ఆమ్నాయ పీఠాధిపతులుగా పీఠనిర్వహణా సామర్థ్యం ఆచార్య పరంపరలో అందరికీ సహజసిద్ధంగానే లభించే గుణం. వీరుకూడా దానిని పుణికిపుచ్చుకుని పూర్వాచార్యుల ఆశీస్సులతో ధార్మిక ప్రచారాన్ని పరుగులు పెట్టించారు. దాంతో ప్రపంచవ్యాప్తంగా ఈనాడు దక్షిణామ్నాయ శృంగేరీపీఠ ప్రభ మహావైభవాన్ని అందుకుంది.

ఒకవైపు తమతమ ఆధ్యాత్మిక జీవ నానికి దిక్సూచి కొరకు దేశం నాలుగు మూలలనుండి వచ్చే శిష్యులు, అనేక సందేహాల నివృత్తి కోసం ఆయా దేవాయాల పాలకవర్గ సభ్యులు మరోవైపు, అంతేకాదు.... క్షణకాలంపాటు జగద్గురువుల దృష్టిలో పడితే చాలు! జన్మతరిస్తుందని భావించే పండితప్రకాండుల నిరీక్షణం. ఇలా వీరి దర్శనం కోసమో, మార్గదర్శనం కోసమో ఎల్లప్పుడూ వారి చుట్టు జనసమూహమే. "అహమేవ మతో మహిపతేరితి సర్వః ప్రకృతిష్వచింతయత్" అని కాళిదాస మహాకవి అజమహారాజు గురించి చెబుతూ అంటాడు. ప్రజలో ప్రతి ఒక్కరూ 'తానే రాజుకు ఇష్టుడను' అని అనుకునేవారట. జగద్గురువులను దర్శించే వారందరూ వారి అనుగ్రహ దీవెనలు పుష్కలంగా పొందిన పిదప అలానే భావిస్తారు. తాము జగద్గురువులకు

సన్నిహితమయ్యామనే భావన కలుగుతుంది. ఇంతటి కార్యభారంలోనూ వీరు తామరాకుపై నీటిబొట్టులా ఏకాంతంగా అంతర్ముఖులై ధ్యాననిమగ్నులవుతుంటారు.

"మాకు గ్రంథావలోకనం- శాస్త్రచింతన అత్యంత ఇష్టమైన కార్యాలు" అంటూ ఎప్పుడు చెబుతుండే శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి వారు శారదాంబ, గణేశ, సుబ్రహ్మణ్య, చంద్ర మౌళీశ్వర తదితర దేవతల స్తోత్రాలను, శంకర భగవత్పాదుపై అనేక భక్తిశ్లోకాలను వ్రాశారు. తమ గురువులు అభినవ విద్యాతీర్థ అక్షరమాలా స్తోత్రం, గురు ధ్యానాన్ని, పరమ గురువులైన చంద్రశేఖర భారతులపై నవరత్న మాలికను, పరమేష్ఠి గురువులను స్తుతిస్తూ ఒక అష్టకాన్ని రచించారు. ఇవేగాక అభినవ విద్యాతీర్థ మహాస్వామిపై అష్టోత్తర శత నామావళిని రచించారు. ఈ శతనామావళితోనే ప్రస్తుతం గురుపాద పూజ జరుపబడుతోంది. వీరి రచనలన్నీ భక్తి జ్ఞాన ప్రబోధకాలే.

సంకల్ప సిద్ధులైన జగద్గురువుల వాక్సిద్ధి అమోఘమైనది. వీరి వేద శాస్త్రాభిమానం, ఆర్ష సంస్కృతీ పరిరక్షణాభినివేశము, సంస్కృత భాషోద్ధరణపై అనురక్తి, సాహిత్యాభిలాష, శిష్యవాత్సల్యం వివరించేందుకు మాటలకందనివి. ప్రతి సంవత్సరం అనేకమంది పండితులకు గౌరవభృతిని కల్పిస్తు సంస్కృత భాషా ప్రచారం కొరకు విద్యాతీర్థులు ప్రారంభించిన సురభారతి సభను వీరు అభివృద్ధి పరచారు. వేద, వేదాంత, వాక్యార్థ సభలను నిర్వహిస్తూ దేశంలోని నలుమూలలనుండి పండితులను శృంగేరికి రప్పించి యథోచితంగా వారిని సత్కరించడమన్నది జగద్గురవుల ప్రాధాన్యతలలో ఒకటి.

శృంగేరి పరిసర గ్రామ విద్యార్థులకు మధ్యాహ్న భోజన పథకం, ఉన్నత పాఠశాలలకు సాఫ్ట్‌వేర్ కిట్స్ అందించడం, భూకంపాలు, వరదలు మొదలైన ప్రకృతి వైపరీత్య సమయాలలో, అవాంతర పరిస్థితులలో విరాళాలు అందిస్తూ సామా జిక సేవాకార్యక్రమాలు ఇతోధికంగా నిర్వహిస్తున్నారు. ఉన్నత మైన బాటలు వేస్తూ, శిష్యకోటికి మార్గనిర్దేశనం చేస్తున్నారు.

**తత్త్వవిచారసారం-మానవతావాదం**

ఆచార్యుడు ఆయాగ్రంథాలలో ఉన్నవిద్యలను శిష్యులకు బోధించి వారిని విద్యావంతులుగా తీర్చిదిద్దడం ఎంత ముఖ్యమో- వారిని మంచి సంస్కారవంతులుగా, లోకానికి హితంచేకూర్చేవారుగా తీర్చిదిద్దడం అంతకంటే ముఖ్యమైనది. ఈ విధమైన సన్మార్గాన్ని చూపిన గురవునే ఆచార్యుడని అంటారు. ఈవిషయంలో గురువుల బాధ్యత మహత్తరమైనది.

జగద్గురువుల విచారధార ఎప్పుడూ మానవ వికాసం చుట్టూనే సాగుతుంది. అది ఆధ్యాత్మికం అవ్వవచ్చు, సామాజికం అవ్వవచ్చు. అలా తపస్సులో తాము దర్శించిన విషయాలను శిష్యులకు బోధిస్తుంటారు. అవి వారి ఉపదేశామృతాలుగా శిష్యులు పిలుచుకుంటారు.

"తన ఫలాలను వృక్షం తానే భక్షించదు. ఇతరులకు అందిస్తుంది. గోవు తన క్షీరాన్ని తానే త్రాగదు. ఇతరులకే ఇస్తుంది. ఇతరుకు సహాయం, సేవ చేయటంలోనే నిజమైన ఆనందం ఉంది. మనం మనకోసమే జీవించటం వ్యర్థం. ఆకలి అలమటించేవారు కొందరైతే ఆధ్యాత్మిక పేదరికంతో బాధపడే వారు మరికొందరు. ఈ రెండు రకాల పేదరికాలను మనం నిర్మూలించాలి. అప్పుడే ప్రపంచం సుఖశాంతులతో నిండి స్వర్గతుల్యమవుతుంది".

"ఈ ప్రపంచంలో మనచుట్టూ కనిపించే హింస, ఆందోళన, అశాంతి వాస్తవానికి సమస్యలే కావు. అసలు సమస్య మనలోనే ఉంది. మన మనస్సులు కలుషితమయ్యాయి. మనలోపలి భగవంతునితో మనం

## యతీశ్వరులకు విగ్రహారాధన ఎందుకు?

నిర్గుణమైన బ్రహ్మోపాసన చేయవలసిన యతీశ్వరులు శ్రీచక్రోపాసన, చంద్రమౌళీశ్వర పూజలవంటి విగ్రహా రాధనలు ఎందుకు చేయాలి? సామాన్య మానవుల లాగా కర్మానుష్ఠానమును చేయడమెందుకు?

జ్ఞానులైన గురుపరంపరలోని ఆచార్యులు ఆత్మోద్ధరణ మాత్రమే లక్ష్యంగా కలవారు కాదు. సమాజోద్ధరణకు అత్యంత ప్రాధాన్యమిస్తారు. తాము కర్మబంధాలలో చిక్కకుండా ఇతరుల కొరకు కర్మలను ఆచరిస్తారు. సమాజం వారిని అనుకరిస్తుంది. ఆత్మవేత్తలైన గురువులకు పూజాదికాలు నిమిత్తం కాకున్నప్పటికీ, వాటియందు వారు చూపే భక్తిశ్రద్ధలు గణనీయం. లౌకికంగా పెద్దల మాటలు, చేతలు, అలవాట్లు, ఆచార వ్యవహారాలను బిడ్డలు అనుసరించడం తెలిసినదే కదా. అదేవిధంగా ఆచార్య పురుషుల ఆచరణలు లోకానికి ఆదర్శమవుతాయి.

**యద్యదా చరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః।**
**స యత్ ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే॥**

అన్నట్లు జగద్గురువులంతటి మహనీయులే కర్మను ఆచరించడం చూసి సామాన్యులుకూడా స్ఫూర్తి పొంది కర్మాచరణలో శ్రద్ధావంతులవుతారని దీని అంతరార్థం.



సంబంధాన్ని కోల్పోతున్నాం. ఆధ్యాత్మికత మాత్రమే ఈ ప్రపంచాన్ని సేదదీర్చగలదు".

భారతీయ సంస్కృతిని, సనాతన ధర్మాన్నీ ప్రచారం చేసి ప్రజకు వాటిపై శ్రద్ధాసక్తులను కలిగించటానికి కారణజన్ములే అప్పుడప్పుడూ గురురూపంలో అవతరిస్తూ ఉంటారు. ఏపనిని సాధించాలన్నా సాధనం గురువు. జగత్తులో అన్నింటికన్నా శ్రేష్ఠమైనది గురుతత్త్వం. లోకమంతా గురుమయమే. మన పాపాలను దూరం చేయగలిగినవాడు గురువు ఒక్కడే. పరోపకార భావన, జపాదుల ఆచరణ, శాంతస్వభావం, వేదవేదాంగాలలో నైపుణ్యం, ఆశ్రయించివచ్చిన శిష్యులకు తనకు తెలిసిన విద్యను బోధించడం మొదలైన లక్షణాలను కలిగి ఉన్నవాడే పరిపూర్ణుడైన గురువు. చెట్లు తమను ఆశ్రయించినవారికి నిలువనీడనిచ్చి తియ్యని పండ్లనిస్తాయి. ప్రాణానికి ఆధారమైన వాయువును అందిస్తాయి. అలాగే గురవు తనను ఆశ్రయించి వచ్చినవాడు సామాన్యుడైనా సరే! మహావృక్షంగా తీర్చిదిద్దుతాడు. అయితే గురవులందిచే విజ్ఞానాన్ని పొందడమనేది శిష్యుడిపైనే ఆధారపడి ఉన్నది. గురువునేర్పే విద్యలను శ్రద్ధాభక్తులతో అభ్యసించినవాడు లోకంలో కీర్తి, ప్రతిష్ఠలను సంపాదిస్తాడు.

అటువంటి ఉత్తమ గురుపరంపరలో శ్రీభారతీతీర్థ శ్రీచరణులొకరు. వారిని దర్శించే భాగ్యాన్ని, సాంగత్యాన్ని పొందగలగటం జన్మాంతర సుకృతంచేత మాత్రమే లభిస్తాయనడం నిస్సందేహం.

శ్లో॥ వయం ధన్యా యతో అస్మాకం సర్వదా శారదాస్వయం।
భారతీతీర్థ రూపేణ హ్యవతీర్ణా విరాజతే॥

తా॥ సకల శుభాలూ సమకూర్చే శారదదేవియే సాక్షాత్తుగా అరుదెంచి శ్రీ భారతీతీర్థ స్వామివారి రూపంలో ప్రకాశించడంతో మనమంతా ధన్యులమయ్యాము.

**అప్పాల శ్యామప్రణీత్ శర్మ అవధాని, వేదపండితులు**

# గురుపరంపర వైభవం

ప్రకాశరూపం శివమాదినాథం
పరాంబికాం శంకరమాదిదేవం
నారాయణ పద్మభువం వసిష్టం
శక్తించ తత్పుత్ర పరాశరంచ
వ్యాసంశుకం గౌడపదం మహాంతం
గోవింద యోగీంద్రమథాస్య శిష్యం
శ్రీ శంకరాచార్య మథాస్య
పద్మపాదంచ, హస్తామలకంచ శిష్యం
తం తోటకం వార్తికకార
మన్యానస్మద్గురూన్ సంతతమానతోస్మి.

అనాది కాలంగా వస్తున్న గురుపరంపరను దివ్యౌఘము, సిద్ధౌఘము, మానవౌఘము అనే మూడువిధాలుగా ఉన్నదని పెద్దలు చెబుతారు.

**దివ్యౌఘము**

మొదటగా పరమేశ్వరునివద్ద నారాయణుడు ఆత్మజ్ఞాన సిద్ధిని పొందాడు. నారాయణుని నుండి బ్రహ్మదేవుడు దీన్నిపొందాడు. ఈ పరంపరనే దివ్యౌఘము అంటారు.

**సిద్ధౌఘము**

బ్రహ్మనుండి వసిష్ఠ మహర్షి, వసిష్ఠుని నుండి శక్తి మహర్షి, శక్తినుండి పరాశర మహర్షి, పరాశరుని నుండి వేదవ్యాసుడు, వ్యాసభగవానుని వద్ద ఆయన కుమారుడు శుకమహర్షి పొందినారు. ఈవిధంగా వేదాంత జ్ఞానము వంశపారంపర్య క్రమములో సంక్రమిస్తు వచ్చింది. శుకమహర్షి అనంతరం ఈ గురుపరంపర వంశపారంపర్య క్రమములోగాక, గురుశిష్య పరంపరాగతంగా సాగింది. శుకమహర్షి-గౌడపాదాచార్యులకు, గౌడపాదులు- గోవింద భగవత్పాదులకు ఈ విద్యను ప్రసాదించారు. వీరు సాక్షాత్తు పతంజలి అవతారమని అంటారు. ఈ మహానుభావులకే శంకరులవారు శిష్యులై విరాజిల్లారు. ఈ పరంపరను సిద్ధౌఘమని అంటారు.

**మానవౌఘము**

శ్రీశంకర భగవత్పాదుల శిష్య చతుష్టయం అనబడే పద్మపాద, సురేశ్వర, హస్తామలక, తోటకాచార్యులతో మానవౌఘము ప్రారంభమై నేటివరకు అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్నది.



# విశ్వవంద్యుడైన శిష్యచూడామణి

గురుభక్తి అంటే ఏమిటి? గురుభక్తి రూపుకట్టి మానవాకృతి దాలిస్తే ఎట్లుండును? గురుస్సాక్షాత్ పరబ్రహ్మ అన్న ఆర్షవాక్కు సాకారమైతే ఇట్టి ప్రశ్నలన్నింటికీ జవాబు - శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థమహాస్వామివారు.

ఆర్షధర్మంలో గురువునకున్న ప్రాముఖ్యం అత్యున్నతం. గురు-శిష్య సంప్రదాయం అతి విశిష్టమైనది. తల్లి, తండ్రి, గురువు ఈ ముగ్గురుని శ్రేష్ఠగురువులుగా సంభావించటం మన సంప్రదాయం. మాతృభక్తివలన ఇహలోక సుఖము, పితృభక్తివలన పరలోకశాంతి, గురుభక్తివలన బ్రహ్మలోకప్రాప్తి లభిస్తుందని శాస్త్రవచనం. కో గురుః ఎవరు గురువు? దీనికి - అధిగత తత్త్వః శిష్యహితాయోద్యతః సతతమ్ అని భగవత్పాదులవారే సమాధానం చెప్పారు.

**ధన్యా మాతా పితా ధన్యో గోత్రం ధన్యం కులోద్భవః ।**
**ధన్యా చ వసుధా దేవి యత్రస్యాద్గురు భక్తితా ॥**

ఎవనియందు గురుభక్తి వుండునో అతని తలిదండ్రులు, వారి గోత్రము ధన్యము. అట్టివారి వంశములో జన్మించుటయు ధన్యమే, అతని జన్మభూమి ధన్యత చెందుతుంది అన్న ఆర్యోక్తికి నిదర్శనంగా నిలచినవారు భారతీతీర్థ మహాస్వామివారు.

అటులనే ఆదర్శ శిష్యునికుండవలసిన లక్షణములనూ పలుశాస్త్రములలో వివరించారు మన పెద్దలు. వివేకినో విరక్తస్య శమాది గుణశాలినః, ముముక్షురేవ హి బ్రహ్మజిజ్ఞాసా యోగ్యతా మతః ॥ అని వివేకవంతుడు, విరక్తుడు, శమాది గుణములు గలవాడు, మోక్షమందిచ్ఛగలవాడు, తెలుసుకోవాలన్న కోరిక (జిజ్ఞాస) శిష్యుని కుండవలసిన లక్షణములని సంప్రదాయజ్ఞులు చెప్పినమాట.

శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో నుడివినట్లు 'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా.... అన్నట్లుగా అటు గురుపాదులు తత్త్వము తెలిసిన జ్ఞాని, ఇటు శిష్యులు భక్తిశ్రద్ధలతో మసలుకొనుచు, గురువుల మనోభావములను గుర్తెరిగి వారికి ఆమోద సమ్మోదమగు రీతిని సేవించుటలో మనసు లగ్నముచేసినవారు, పర్యవసాన మేమనగా దూడను చూచిన గోమాత వాత్సల్యముతో పాలను వర్షించినట్లు, బిడ్డను గాంచిన మాతృమూర్తికి స్తన్యధార ఉబికినట్లు - అంతటి సహజముగా గురుదేవుల అంతరంగము సంసిద్ధమైనది శిష్యోద్ధరణకు.

**తమారాధ్య గురుం భక్త్యాప్రహ్వప్రశ్రయ సేవనైః ।**
**ప్రసన్నం తమనుప్రాశ్య పృచ్ఛేజ్ఞాతవ్య మాత్మనః ॥**

గురువుని భక్తితో అర్చించి, వినయ, విశ్వాస, సేవలతో

ప్రసన్నుని గావించుకొని ఆత్మతత్త్వాన్ని తెలుసు కోవాలని శ్రీభగవత్పాదుల వివరణ.

శ్రీచరణులు తమ గురుదేవులు శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వామి నామము (తీర్థ)ను, పరమగురువులు శ్రీచంద్రశేఖర భారతీ మహాస్వామివారి నామమును (భారతి) రెండిటినీ ధరించిన యతిశ్రేష్ఠులు. స్వామి పద్మపాదుని భక్తి మార్గమును, తోటకాచార్యుని గురుసేవా తత్పరతను, హస్తామలకుని శాస్త్రానుభవమును, సురేశ్వరుల పీఠ నిర్వహణ కౌశలమును ఆదర్శముగా గొకొని ఈ నలుగురు మహాచార్యుల అంశలు ఆత్మగతమై విలసిల్లుచున్న ఆచార్యోత్తములు.

"సద్గురువు జ్ఞానదానం చేసి శిష్యుని తనవంటి వానిగా తనతో సమానంగా రూపొందించటానికై బ్రహ్మజ్ఞానాన్ని శిష్యునికి అందిస్తాడు. అందువల్ల సద్గురువుకి సమ ఉజ్జీ లేరు" అని చంద్రశేఖర భారతీస్వామి వారన్నమాట అక్షరశః అనుసరించిన వారు శ్రీవిద్యాతీర్థులు. గరువు ఈశ్వరుడు పరబ్రహ్మ వేరని భావించరాదు అని గురువుపట్ల భారతీతీర్థుల దృక్పథం. గురువులపట్ల సంపూర్ణ పూజ్యభావము గలవారు, నిరంతర గురుసేవా నిమగ్నులు, అధ్యయనంలో అమితశ్రద్ధ గలవారు, తమ గురువు వద్ద అధ్యయనం చెయ్యగల అదృష్టం తనకు లభించిందని ఎల్లపుడూ భావించేవారు వీరు. 'శాస్త్రస్య గురువాక్యస్య సత్యబుధ్యవధారణమ్ సా శ్రద్ధా కథితా.... అన్నట్లు శ్రద్ధాభక్తులతో సాగినది గురువులవద్ద వీరి శాస్త్రాభ్యాసం. ఇతరులకు ఏ విషయం గురించి అయినా బోధించేముందు ఆ బోధనలను తాము ఆచరణలో పెట్టి తరువాత బోధనలకు ఉపక్రమించాలనెడి సూత్రాన్ని పాటించారని తమ గురువర్యులు శ్రీవిద్యాతీర్థుల గురించి చెబుతూ అంటారు. ఆ బోధనలను అక్షరాలా ఆచరిస్తున్నవారు ఈ శిష్యులు. గుర్వాజ్ఞా పరిపాలనకు వారు సతత సంసిద్ధులు. గురువచనమే శిరోధార్యము. వేరు ఆలోచన లేదు. ముందువెనుకలాలోచించుట అన్నది లేదు. సర్వకాల సర్వావస్థలలోను సంసిద్ధతయే వారి నైజము.

అసలీ గురు-శిష్యుల సమాగమం శృంగేరి పీఠ దేవతల నిర్ణయమే కావలెను అంటారు బ్రహ్మశ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు(1) ఒక సందర్భంలో వైరాగ్యభావము తీవ్రమైనపుడు ఇల్లు విడచి పోవచ్చును. ఒక గురువునో బ్రహ్మవేత్తనో ఆశ్రయింప వచ్చును. కాని బహు దూరప్రదేశమైన ఉజ్జయినిలో నున్న మహాసన్నిధానం వారినే వెదకికొనుచు ఏల పోవలయును? 15 యేళ్ల యువ బ్రహ్మచారికి అట్టి ఆంతరంగిక ఉద్బోధ ఎట్లు కలిగినది? ఈ సందేహమును శ్రీ తుమ్మలపల్లివారే శ్రీచరణులు



బ్రహ్మచారిగా నున్నపుడే అడిగినారట. సంక్షిప్తముగా వారి సమాధానమిట్లున్నది;

"నేను చాలా చిన్నతనమునే జగద్గురువుల దర్శనము చేసికొనుట సంభవించినది. మా ఉపాధ్యాయులు బాలుడనగు నన్ను విజయవాడ తీసుకువెళ్ళి నా సంస్కృత భాషా పరిజ్ఞానమును శ్రీ వారి సన్నిధిని ప్రదర్శింపచేసిరి. శ్రీచరణుల ప్రశంసలందుకొను భాగ్యము కలిగినది. తదాది శ్రీచరణులే నాకు గురువులని, నన్నుద్ధరించు మహనీయులని ముద్ర పడినది. వారి తేజఃపూర్ణ వదనము నుండి వెలువడిన మందస్మితమొక సందేశమిచ్చినట్లుయినది. ఆ సందేశమిట్టిదని చెప్పుట నాకు తెలియదు. ఏదో ఆత్మీయత, దేశకాలాతీత అనుగ్రహము, నాకేదియో అభయము లభించినట్లు అనుభూతి. ఆ ప్రసన్నగంభీర వదనము నా కన్నుల యెదుట శాశ్వతముగా నిలచిపోయినది. మనోవాగతీతమైనదా దర్శనానుభవము వారిని నిత్యము స్మరణము చేయుచు మనసునందు ఆ దివ్యమూర్తిని నిలుపుకొనుచు చాలాకాలము గడిపితిని. వారు నన్ను కాపాడుచున్నట్లు, చేయుపుచ్చుకొని నడిపించినట్లు, సందిగ్ధ సమయములలో మార్గదర్శనము చేయుచున్నట్లు



అనుభవము పొందుచుండెడి వాడను, ఆ దివ్యమూర్తి సన్నిధికి పోయి తచ్చరణ సేవకుడను కావలెనన్న 'తపన' కాలముతో పాటు పెరిగి పెరిగి చివరకు నన్ను శ్రీచరణుల సన్నిధికి లాగుకొనిపోయినది".

శ్రీచరణులు యేది చెప్పినా తన మేలుకొరకే అని, వారి ఆజ్ఞప్రకారం నడవడం ఒకటే తన కర్తవ్యమని 15 సంవత్సరముల వయసులో ఉజ్జయినిలో చేసికొన్న నిశ్చయం నేటికీ చెక్కుచెదరక కొనసాగుతూనే ఉన్నది. శ్రీభారతీతీర్థులు అనేక సందర్భాలలో అనుగ్రహభాషణాలలో పదేపదే చెపుతూ ఉంటారు ధర్మాచరణ గురించి, శిష్యలక్షణాల గురించి. ఒక ఆదర్శ శిష్యునిగా తాము ప్రవర్తించి, ఆచరించి, తాను ఆచరించినదే యితరులకు చెప్పటం అన్నది గమనార్హం. శిష్యలక్షణాలు ఎందరో ఎన్నోవిధాలుగా చెపుతారు కాని, సత్ప్రవర్తనగల శిష్యుని జ్ఞానం ప్రకాశవంతంగా ఉంటుంది. అట్టి శిష్యునివలన గురువుకు కీర్తి కలుగుతుంది. సమాజానికి దేశానికి మేలు జరుగుతుంది. అతని జీవితం పరిశుద్ధమైనదిగా భావించబడుతుంది. కాబట్టి మంచి శిష్యులుగా మనం తయారవుదాం అని గురుపీఠమధిష్ఠించిన మూడు దశాబ్దాల తరువాత కూడా చెబుతున్నారంటే వారి గురుభక్తి ఎట్టిదో తెలియుచున్నది. తానింకా ఆ గురుపరంపరకు శిష్యుడనే, వారు భౌతికంగా లేకపోయినా వారి మార్గదర్శనం లభిస్తూ ఉన్నది. వారి ఆదేశ పాలనయే నా జీవిత కర్తవ్యం అని భావిస్తూ ఉంటారు. ఎన్నో విద్యాసంస్థలు, ఆసుపత్రులు, వేదపాఠశాలలు, పండితపోషణ, ఆలయ పరిరక్షణ ఇలా ఎన్నో లోకహిత కార్యక్రమాలు దిగ్విజయముగా నిర్వహించు సంకల్పసిద్ధులు శ్రీచరణులు. ఇంతాచేసి నాదేమీ లేదు అంతా గురుదేవుల ఆశీర్వాదమే, శారదాంబ కృపయే అనెడి నిరాడంబరులు, కర్మఫలభోగాసక్తి రహితులు. ఒకానొక సందర్భంలో మహాసన్నిధానం శ్రీవిద్యాతీర్థులు "నేను మీకందరికీ మార్గదర్శనం చెయ్యటానికి అన్నివిధాలా సమర్థుడైన గురువును మీకిచ్చాను. ఆయన చాలా గొప్పవారు" అని అన్నారు. గురువాక్యమును లేశము కూడా వృధాపోనివ్వక గురుభక్తికి, కార్యదీక్షకు, ధర్మాచరణ ధర్మప్రచారాలకు నిలువెత్తు నిదర్శనంగా భాసించుచున్నారు శ్రీభారతీతీర్థులు.

విద్యాతీర్థ గురువులు బ్రాహ్మీభూతులైనపుడు నాటి ప్రధానమంత్రి రాజీవ్‌గాంధీ శృంగేరి దర్శించారు. అపుడు "మీమీద పెద్ద బాధ్యత ఉంచబడినది కదా" అని అంటే శ్రీచరణుల జవాబు - 'శ్రీ గురుచరణుల అనుగ్రహంతో శిష్యుల సహకారంతో మేము మా బాధ్యతలను చక్కగా నిర్వహించగలమని భావిస్తున్నాం" అని.

గురువులిద్దరూ విజయయాత్రలు చేస్తూ సంచారంలో ఉన్న సమయంలో అపుడపుడూ లేఖలు రాసుకునేవారట. అవి గురువుల వాత్సల్యమును, శిష్యుల గురుభక్తిని తెలియచేస్తూ పరమ ఆత్మీయంగా ఉండేవట. "శ్రీశంకరభగవత్పాదులు చెప్పిన సద్గుణాలన్నీ మా పూజ్యగురుపాదులు శ్రీమదభినవ విద్యాతీర్థుల వారికి ఉన్నాయి. వారి పవిత్ర శీలసంపద గురించిగాని, జితేంద్రియత గురించిగాని పాండిత్యం గురించిగాని మాట్లాడగల సామర్థ్యం మాకులేదు. వారు చేసిన ప్రతిపనీ వారి దూరదృష్టికి దయార్ద్ర హృదయానికి ఉదాహరణ. ఇరవై మూడు సంవత్సరాలు వారితో గడిపే భాగ్యం మాకు లభించటం మా అదృష్టం. మేము బ్రహ్మచారిగా ఉన్నపుడు కూడా వారికి మామీద ఎంతో వాత్సల్యం. మా గురుపాదులు మహాసమాధి గతులైనపుడు మా దుఃఖాన్ని

ఆపుకోలేకపోయాము. మాకు యే ప్రదేశంలో దండక మండలాలు ఇచ్చి సన్న్యాసదీక్షను అనుగ్రహించారో అదే ప్రదేశంలో వారి పార్థివ దేహానికి అభిషేకం చేయవలసి వచ్చిపుడు మా దుఃఖాన్ని ఆపుకోలేకపోయాం. అయినా శ్రమపడి మమ్మల్ని మేము సంబాళించుకున్నాం..." ఇలా ఎంతో ఆర్ద్రంగా చెప్పుకున్నారు 1989 అక్టోబరు 4వ తేదీనాటి వారి గురువుల ఆరాధనా కార్యక్రమంలో.

మా గురుపాదులు ఆదర్శమైన సన్న్యాస జీవితం గడిపారు. మాకు ఆదర్శం అదే. వారు నెలకొల్పిన పద్ధతులను, మార్గాన్ని అనుసరిస్తూ వారు ఆదేశించిన రీతిగా కర్తవ్యనిర్వహణను కొనసాగిస్తూ శ్రీ శారదాపరమేశ్వరిని ఆరాధించి ఆమె అనుగ్రహానికి పాత్రులమగుటయే మా దృఢసంకల్పం" అని తాము పట్టాభిషిక్తులైన నాటి అనుగ్రహ భాషణంలో అన్నారు.

శ్రీచరణుల షష్ట్యబ్దిపూర్తి మహోత్సవం అత్యంత వైభవంగా న భూతో న భవిష్యతి అన్న రీతిలో జరిగినది. అపుడు వారి సందేశంలో : "ఈ అంతటికీ మా గురువులైన శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వామివారి కృపయే కారణం. వారి అనుగ్రహమే యిదంతా. వారు మాకు మంత్రోపదేశం చేసి ఒక మాట చెప్పారు. "మీ కాలంలో మఠం చాలా బాగుంటుంది" అని ఆ మాటయే వీటన్నిటినీ నడిపిస్తున్నది. గురువుల మాట ప్రభావమేమిటో మాకు అనుభవ వేద్యమయింది.

ఒకనాడొక భక్తుడు తమ జీవితంలో మిక్కిలి ప్రధానమైన సంఘటన యేదని ప్రశ్నింప - "నన్ను అనుగ్రహించి శిష్యునిగా మా గురుచరణులు స్వీకరించటమే నా జీవితంలో గొప్ప సంఘటన. వారే నా తండ్రి, నా గురువు, నా దేవుడు" అని చెప్పారు.

ఈవిధంగా శ్రీచరణులు అనుక్షణం, అహరహం గురుధ్యాన తత్పరులై క్రమశిక్షణ, సమయపాలన, కార్యదక్షత, మౌనం, ఆత్మనిగ్రహం, సత్యసంధత వంటి సుగుణాలు అలవరచుకుని నిజజీవితంలో ఆచరించి చూపుతున్న ఆచరణాత్మక వేదాంతి.

తమ గురుభక్తికి పరాకాష్ఠ అన్నట్లుగా గురుధ్యానం, శ్రీఅభినవ విద్యాతీర్థ అక్షరమాలా స్తోత్రం, జగద్గురవేనమః, విద్యాతీర్థ మహాస్వామి అష్టోత్తర శతనామావళి అత్యంత హృద్యంగా రచించారు. పరమగురువులపై శ్రీచంద్రశేఖరభారతీ నవరత్నమాలికను, పరమేష్ఠి గురువులగు శ్రీ సచ్చిదానంద శివాభినృసింహ భారతులపై ఒక అష్టకమును రచించినారు. ఇవన్నియు భక్తిజ్ఞాన ప్రబోధకములగు ఉత్తమస్తోత్రములు.



ఒక గొప్ప ఆదర్శ శిష్యునిగా తన్నుతాను మలచుకొని, అచంచల గురుభక్తికి నిలువెత్తు నిదర్శనంగా నిలచి జగద్గురువులుగా సమున్నత స్థానాన్ని అలంకరించారు. అందుకే శ్రీచరణులు "విశ్వవంద్యుడైన శిష్యచూడామణి"!

నావంటి అల్పుడు జగద్గురువుల గురించి, అందునా వారి గురుభక్తి వంటి విషయముపై వ్రాయుట ఎట్టిదనిన, వారే ఒకానొక అనుగ్రహభాషణమున నుడివినట్లు :

మహిమ్నః పారంతే పరమ విదుషో యద్యసదృశీ ।
స్తుతిర్బ్రహ్మ దీనామపి తదవసన్నాస్త్వయి గిరః ॥
అథావాచ్య సర్వః స్వమతి పరిణామావధి గృహన్ ।
మమాప్యేష స్తోత్రే హర నిరపరాధః పరికరః ॥

ఈశ్వరా! నిన్ను సంపూర్ణంగా తెలుసుకున్నవారు మాత్రమే నిన్ను స్తుతింపగలరని నిబంధన పెడితే బ్రహ్మాదులు కూడా స్తుతించలేరు. ఆ నిబంధన మార్చి ఎవరి ధీశక్తినిబట్టి వారు నిన్ను స్తుతించవచ్చు అని చెప్పాలి. అప్పుడు నిన్ను స్తుతించటానికి నాకు కూడా అర్హత లభిస్తుంది.

- ప్రసాదవర్మ కామఋషి

# గురుపరంపరా స్తోత్రమ్

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుర్గురుదేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమం ॥ 1
శుద్ధస్ఫటిక సంకాశం శుద్ధ విద్యాప్రదాయకం ।
శుద్ధం పూర్ణం చిదానందం సదాశివమహంభజే ॥ 2
సీమాతీత మనాద్యంతం నామోచ్చారణ భేషజం ।
కామితా శేషఫలదం శ్రీమద్విష్ణు మహం శ్రయే ॥ 3
యోగిహృత్పద్మనిలయం నతజీవహితేరతం ।
శ్రుతీనాం జన్మభూమిం త్వాం చతుర్ముఖ మహంశ్రయే॥4
ప్రసమాహిత మత్యంతం ప్రథమామిత తేజసం ।
వశీకృత పరానందం వశిష్ఠం గురుమాశ్రయే ॥ 5
శుక్తౌరూప్యమివాభాతి యద్రూపం మయికల్పితం ।
శక్త్యా పరిహృతం యేన శక్తిం తరం గురుమాశ్రయే ॥ 6
కరుణాతీత చిద్రూపం పరిపూర్ణం పరాయణం ।
పరమానంద సంతుష్టం పరాశర మహం శ్రయే ॥ 7
వేదవ్యాసం స్వాత్మరూపం సత్యసంధం పరాయణం ।
శాంతం జితేంద్రియక్రోధం నశిష్యం ప్రణమామ్యహం ॥8
త్రికాలాతీత చిన్మాత్ర ప్రశాంతస్వాంత సంయుతం ।
వికారాద్యై రసం స్పృష్టం శుకం గురుమహంశ్రయే ॥ 9
గూఢమాయా యస్యవాక్యైర్వ్రీడితా విలయంగతా ।
క్రీడంతం విద్యయాసార్థం గౌడపాదం తమాశ్రయే ॥ 10
జీవేశ భేదరహితం నావికం భవవారిధేః ।
భావాభావ విదూరస్థం గోవిందం గురుమాశ్రయే ॥ 11
శంకారూపేణ మచ్చిత్తం పంకీకృత మభూద్యయా ।
కింకరీయస్య సామాయా శంకరాచార్య మాశ్రయే ॥ 12
విశ్వం మాయామయత్వేన రూపితం యత్ప్రబోధతః ।
విశంచ యత్స్వరూపం తం వార్తికాచార్యమాశ్రయే ॥ 13
అనాద్యవిద్యా ముత్సార్య ప్రజ్ఞాన ఘనరూపతాం ।
యోబోధయతి సచ్ఛిష్యాన్ తం బోధఘనమాశ్రయే ॥ 14
సితాఘనాది దృష్టాంతైర్యత్స్వరూపం శ్రుతిర్జగౌ ।
ప్రజ్ఞానఘన ఏవేతి తం జ్ఞానఘనమాశ్రయే ॥ 15
జ్ఞానానాముత్తమం జ్ఞానం జ్ఞానినాముత్తమోమతః ।
జ్ఞానోత్తమ ఇతి ఖ్యాతం గురుం తమహమాశ్రయే ॥ 16
దుర్వాది దుష్టమాతంగా విదారణ పటీయసే ।
నమఃశ్రీ సింహగిరయే గురవే దివ్యచక్షుషే ॥ 17
ఈప్సితార్థ ప్రదోనిత్యం ప్రణతానాంచ దేహినాం ।



యతిరీశ్వర తీర్థాఖ్యః తం నమామి గురుం శివం ॥ 18
శ్రుతి మస్తక కూటస్థమజ్ఞాన ద్విపభేదినం ।
శ్రీమంత్రరాజమూర్తిం తం నృసింహం గురుమాశ్రయే ॥ 19
అవిద్యాచ్ఛన్న భావానాం నృణాం విద్యోపదేశతః ।
ప్రకాశయతి యస్తత్త్వం తం విద్యాతీర్థమాశ్రయే ॥ 20
అజ్ఞానాం జాహ్నవీతీర్థం విద్యాతీర్థం వివేకినాం ।
సర్వేషాం సుఖదం తీర్థ భారతీతీర్థమాశ్రయే ॥ 21
అవిద్యారణ్యకాంతారే భ్రమతాం ప్రాణినాం సదా ।
విద్యామార్గోపదేష్టారం విద్యారణ్య గురుం శ్రయే ॥ 22
విద్యావిద్య వివేకేన పారం సంసార వారిధేః ।
ప్రాపయత్యనిశం భక్తాన్ తం విద్యారణ్యమాశ్రయే ॥ 23
అవిద్యారణ్య సంక్లేశ కృశాను భృశతాపితః ।
సంశ్రయే సతతం భూత్యై చంద్రశేఖర చంద్రికాం ॥ 24
అవిద్యాఖ్య ద్విద్వైదీభావే దక్షం సమాశ్రయే ।



నృసింహభారతీశాఖ్య హరిం శ్రుతి గుహాశ్రయం ॥ 25
పురషోత్తమతాం యాంతి యమాశ్రిత్య జనాః శ్రయే ।
క్షరాక్షరావతీతం తం పురుషోత్తమ యోగినం ॥ 26
కింకీకృత భూపాలం పంకేరుహ సమాననం ।
తం కారుణ్యపయోరాశిం శంకరాఖ్యం గురుంశ్రయే ॥ 27
చంద్రికా ధవళోదార సాంద్రకీర్తి చ్ఛటాధరం ।
ఇంద్రియైర్దుర్జయం నౌమి చంద్రశేఖర భారతీం ॥ 28
ప్రసిద్ధ విద్యానిలయం అసమాన గుణోత్కటం ।
బిసజాక్షార్చకం భక్త్యా నృసింహ తీర్థమాశ్రయే ॥ 29
పురుహూతాది దేవౌఘ పౌరుషేయ గుణోత్కటం ।
పురుషార్థప్రదం నౌమి పురుషోత్తమ యోగినం ॥ 30
కామద్విరద పంచాస్య రామణీయకమందిరం ।
సోమోపమాననం శ్రీమద్రామచంద్రం గురుం భజే ॥ 31
సురసింధు లసత్కీర్తిం స్మరసింధుం ఘటోద్భవం।
నారసింహార్చకం శ్రీమన్నారసింహయతిం భజే ॥ 32
సారాసార వివేకజ్ఞం మారకాననకుంజరం ।
శూరం దానేచ నిరతం నారసింహయతిం భజే ॥ 33
నృసింహతాం ప్రయత్యాశు యమాశ్రిత్య జనాభువి ।
నృసింహ భారతీం వందే ద్విగుణో పపదం సదా ॥ 34
తం సర్వభూతాభయదం విభవైనరన్వితం పరం ।
నారసింహగురుంచాపి నవం జ్ఞానార్ణవం భజే ॥ 35
సత్యస్వరూపం పద్ జ్ఞాననిష్ఠం సాక్షాచ్ఛివం పరం ।
సదాధ్యానరతం శాంతం సచ్చిదానందమాశ్రయే ॥ 36
మహామేరు సమం ధైర్యే మాధుర్యేప్యమృతోపమం ।
ఉహాపోహార్థనిష్ణాతం నారసింహం గురుంభజే ॥ 37
సచ్చిత్తాంబుజ మిత్రాయ సచ్చరిత్రయుజే నమః ।
సచ్చిదానంద భారత్యై సచ్చిదానందమూర్తయే ॥ 38
సచ్చిదానంద భారత్యై నవ్యాయాస్తు నమోనిశం ।
భవ్యాత్మజ్ఞాన నిర్ధూతౌ విద్యాకర్యోపలబ్ధయే ॥ 39
మారమాతంగా పంచాస్యం మదసర్పద్విజర్షభం ।
నృసింహభారతీం వందే జితాక్షం తురగం సదా ॥ 40
తత్త్వమస్యాది వేదాంత వాక్యార్థ జ్ఞానవారిధేః ।
పూర్ణచంద్రసమం వందే సచ్చిదానంద యోగినం ॥ 41
అభినవ పదపూర్వాన్ సచ్చిదానంద సంజ్ఞాన్ ।
నిగమశిఖర వేద్యాన్ నిత్యకళ్యాణ రూపాన్ ॥ 42
త్రిభువన జనవంద్యాన్ సర్వలోకైక హృద్యాన్ ।
హృదయకమల మధ్యే భావయామ్యంబుజాస్యాన్ ॥ 43
ప్రహ్లాద వరదో దేవోయోనృసింహ పరోహరిః ।
నృసింహోపాసకం నిత్యం తం నృసింహ గురుం భజే ॥ 44
శ్రీ సచ్చిదానంద శివాభినవ నృసింహభారత్యభిధాన్ యతీంద్రాన్ ।
విద్యానిధీన్ మంత్రనిధీన్ సదాత్మనిష్ఠాన్
భజే మానవ శంభురూపాన్॥45
సదాత్మధ్మాన నిరతం విషయేభ్యః పరాఙ్ముఖం ।
నౌమి శాస్త్రేషు నిష్ణాతం చంద్రశేఖరభారతీం ॥ 46
విద్యాతీర్థాభిధాచార్యో హృద్యాభినవపూర్వకః ।
శృంగేరీ శారదాపీఠే విరాజతి జగద్గురుః ॥ 47
భారతీ కరుణాపాత్రం భారతీ పదభూషణం ।
భారతీ పదమారూఢం భారతీ తీర్థమాశ్రయే ॥ 48
విద్యావినయ సంపన్నం వీతరాగం వివేకినాం ।
వన్దేవేదాన్త తత్త్వజ్ఞం విధుశేఖర భారతీం ॥ 49
శ్రీ గురుపరంపరా స్తోత్రమ్ సమాప్తమ్ ॥

# అపర ఆదిశంకరులు శ్రీభారతీతీర్థులు



'మరో జన్మంటూ ఉంటే ఆదిశంకరులే నా గురువు కావాలి' విజ్ఞుల ఆకాంక్ష. కానీ ఆదిశంకరులను గురువుగా ఉపాసించిన వారికి మరో జన్మంటూ ఉంటుందా?

శంకరులు నేటికీ మన కళ్ళముందు కనబడుతూ ఉంటే ఆ గురుమూర్తిని దర్శించి, ధ్యానించి, స్మరించి, తరించితే! తపన ఉన్న వారు నిరాశచెందనక్కరలేకుండా, ఎప్పటికప్పుడు శంకరులు ప్రత్యక్షంగానే ఉన్నారు. సేవించే భాగ్యమున్నవారికి చేరువ చింతామణిగా! ఈ సత్యం జగద్గురు భారతీతీర్థ మహాస్వామివారి సందర్శనంతో నాకు వ్యక్తిగతంగా అనుభూతికి వచ్చింది.

ఆదిశంకరులు ప్రతిష్ఠించిన నాలుగు పీఠాలే కాక శంకరులను ఆరాధిస్తూ, తత్సంప్రదాయాన్ని వ్యాప్తిచేస్తున్న మహానుభావులను, యతీశ్వరులను, తపస్వులను, సిద్ధి పురుషులను శంకర స్వరూపంగా సంభావించే సంస్కారం జననాంతర పుణ్యాలచే బాల్యంనుండే హృదయంలో స్పష్టంగా వ్యక్తమయ్యేది. శృంగేరీ శారదాంబ, ఆ ఆదిమహాపీఠ పరంపరను, చరిత్ర, మహిమ ఇత్యాదులనుంచి పెద్దలవల్ల, గ్రంథాల వల్ల తెలుసుకున్నాక ఆ పీఠంపై, జగద్గురువులపై విశేష భక్తి క్రమాభివృద్ధి పొందింది. కానీ దర్శించే భాగ్యం 2003లో జరిగింది.

గంభీరమైన పరిపూర్ణ జ్ఞానం, మృదువైన కరుణాంతరంగం, కృపాద్యుతులను వెలువరించే కటాక్షలహరి, పద్మసదృశ చరణద్వయం, సాక్షాద్బ్రహ్మ విద్యాధిదేవత మాతృవాత్సల్యంతో పలుకరించిన వాఙ్మయ మధురిమ... ఇవన్నీ మూర్తీభవించిన శ్రీశ్రీశ్రీ జగద్గురు భారతీతీర్థ మహాస్వామి వారి సాక్షాత్కారం లభించిన ఆ

క్షణం 'ఈ జీవుని సుస్థిర గురుపీఠమిదే...శాశ్వత గురువు మీరే' అనే ప్రగాఢభావం ఉవ్వెత్తున ఎగసింది.

తదాది నిత్యస్మరణగా వారి నామం, చరణధ్యానం సాధనంగా మారింది. తరచూ ప్రత్యక్షంగా దరిచేరే భాగ్యం లేకున్నా స్మరణ ద్వారానే వారి కరుణను అందుకున్న అనుభూతులు ఎన్నెన్నో! బాహిరపరచనవసరం లేని దివ్య భావరత్నాలవి.

వారి గురించి వచ్చిన ప్రతి రచనలో తెలుగు, సంస్కృత, హిందీ ఆంగ్లాలలో లిఖించినవన్నీ - శ్రద్ధగా చదవడం, ఇంటా - వాహనాల్లో శారదామూర్తితో పాటు వారి మూర్తిని నెలకొల్పి దర్శిస్తూ స్మరించడం జీవితంలో ప్రధానాంశాలయ్యాయి.

ఆదిశంకరుల స్వరూపమే కనుక - అధికారభేదాన్ని అనుసరించి ప్రతివారికీ వారి ఉపదేశం హృదయాన్ని తాకి జీవితాలను జ్యోతిర్మయం చేస్తున్నది.

బ్రహ్మజ్ఞులు, జీవన్ముక్తులు విషయపరాఙ్ముఖులై ఉన్నప్పటికీ, పీఠాధీశ్వరునిగా, నిర్వహణ సామర్థ్యాన్ని చూపించడం సామాన్యాంశం కాదు. అది ఆదిశంకరులకు సాధ్యమయింది అవతారమూర్తి కనుక. ఆ సమర్థత, వారి విభూతితో ఆవిర్భవించిన పీఠాచార్య పరంపరలో అందరిలో అనుస్యూతంగా ఉంది. కానీ జగద్గురు భారతీతీర్థస్వామివారి ఏలుబడిలో, ఇది సువ్యక్తమై దేశవిదేశాలలో శృంగేరీ పీఠ ప్రభ వ్యాప్తమై ప్రస్ఫుటమై మహావైభవాన్ని అందుకుంది. వారి చలువ వలన వర్ధిల్లుతున్న వేదవిద్యా సంప్రదాయం, ధర్మచైతన్యం వారి నిర్వహణ సామర్థ్యాన్ని ప్రపంచానికి చాటుతున్నప్పటికీ, పద్మపత్రగత బిందువు వలె' నిర్లేప నిరంజన జ్ఞాన ప్రకాశం వారి నుండి స్పష్టంగా ప్రత్యక్షమౌతూ ఉంటుంది.

ఏ భాషలోనైనా తేటగా, సూటిగా, ప్రభావశీలంగా సాగే వారి అనుగ్రహభాషణలు మంత్రాలు - మననం చేసేవారిని రక్షించే స్వరూపాలు. సనాతన ధర్మానికి మూలకందాలైన వెడలు ధర్మ జ్ఞానాలకు నిలయాలు. మార్గనిర్దేశకం చేసే ధర్మం - విచారణను విస్ఫార్చే జ్ఞానం వారి వచనాలలో వెలుగులీనుతూ - ఆదిశంకరుల అవతార ప్రయోజనాన్ని నెరవేర్చుతున్నాయి.

బ్రహ్మలోకమునకు అనుప్రాసమైన శృంగగిరియందు ఆది శంకరుల నుండి నేటిదనుక సాగిన అవిచ్ఛిన్న పరంపరలోని తపోవిద్యాశక్తులన్నీ రాశీభూతమై ఏక స్వరూపంగా గోచరిస్తే అదే శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి దివ్యమూర్తి.

ఒకవైపు సనాతన ధర్మ పరివ్యాప్తి, పరిరక్షణ, మరొకవైపు దీనజనోద్ధరణ, దేశహితమైన విద్య, వైద్యకేంద్రాల ఏర్పాటు,



ఎందరో మేధావులను ప్రభావితం చేసి వారి ద్వారా ప్రయోజనకరమైన ఎన్నో మహాకార్యాలను నిర్వహింపజేయడం ఇలా జగద్గురువుల ద్వారా భరతవర్షానికి లభిస్తున్న అభ్యుదయం అపారం.

వారి ఆశీస్సులే మాబోంట్లను పలికిస్తున్నాయన్నది సత్యం. ప్రవచనాలు ప్రారంభించిన తొలిదశలో 'శంకరవిజయం' ప్రవచనాన్ని నరసరావుపేట శంకరమఠంలో ప్రారంభించి, వరుసగా గుంటూరు, విజయవాడ, విశాఖపట్టణాలలోని మఠాలలో అనేకాంశాలపై ప్రసంగించే భాగ్యం లభించింది. దేశవిదేశాల్లో వివిధ శృంగేరీ మఠాలలో శారదాంబా వైభవం, జగద్గురు పరంపర, ప్రశస్తి, శంకర వాఙ్మయం వంటి విషయాలపై విస్తృత స్థాయిలో మాట్లాడగలిగానంటే - జగద్గురువుల కృపాపాంగలీలా వైభవమే.

ప్రస్థానత్రయాలతో పాటు ఇతిహాస పురాణకావ్య వాఙ్మయాలపై ప్రసంగించే సందర్భాలో కూడా జగద్గురు చరణస్మరణయే ఆలంబన.

ఆహ్లాదినీ దృష్టితో ఆబాలగోపాలాన్నీ కటాక్షించే వారి కారుణ్యం శృంగగిరి నుండి ప్రపంచమంతా ప్రవహిస్తున్న జ్ఞానానంద మందాకినీ.

కవి ప్రభావాలు, సమాజంలో పెరుగుతున్న వికృత ధోరణులు చూసి మనస్సు విచలితమైనప్పుడు - 'శృంగేరీ జగద్గురువుల' ఉనికి గుర్తుకు వచ్చి ఊరట కలుగుతుంది.

'కలికల్మషనాశిని'యైన వారి అనుగ్రహబలం చేత సనాతన ధర్మంతో కూడిన భారతదేశం అన్నివిధాల అభ్యుదయాన్ని సాధించగలదు. భారత భారతికి భారతీతీర్థుల భవ్యకృప దివ్యరక్ష. వారి శ్రీచరణాలకు ప్రణామసహస్రి.

**- సామవేదం షణ్ముఖ శర్మ**

# శ్రీభారతీతీర్థగురుప్రార్థన ద్విసప్తకమ్



ఆద్యావిద్యకసంసృతేరభిహతాః ద్వన్ద్వైర్ముహుర్వ్యాపృతాః.
పద్యాభ్రంశసకంటకాః హతధియః శ్రద్ధావిహీనాః పునః
వైక్లవ్యేన నిపీడితాః పునరమీ మృత్యుప్రహారార్థితాః
విద్యాతీర్థగురుప్రసాద దిశ నః శ్రీభారతీతీర్థ శమ్... 1

అజ్ఞానామభిమానినాం భవరుజాం యద్గాఙ్గతీర్థౌషధం
విజ్ఞానాం సువివేకినాం కృతధియాం విద్యాత్మతీర్థం చ యత్
సర్వేషాం సుఖదం హి పాపహరణం దృష్టే శ్రుతేస్త్వాం నుమః
విద్యాతీర్థగురుప్రసాద దిశ నః శ్రీభారతీతీర్థ శమ్... 2

బుద్ధ్యా లుప్తమిదం మదీయమఖిలం కార్యం త్వకార్యం ధృతం
వక్తవ్యం న విచిన్తితం శిశుదశామారభ్య దుర్భాషితమ్
కర్తవ్యం న కృతం న కథఞ్చిదకృతం నాకార్యమేవానిశం
విద్యాతీర్థగురుప్రసాద దిశ మే శ్రీభారతీతీర్థ శమ్... 3

విశ్వాసో న హి జాయతే హృది మమ శ్రద్ధా న వోత్పద్యతే
శ్రుత్యన్తశ్రుతిశాస్త్రకావ్యసుపురాణైతిహ్యవిద్యాచయే
తత్పుణ్యం న కృతం పురా యదధునా త్వద్దర్శనాల్లభ్యతే
విద్యాతీర్థగురుప్రసాద దిశ మే శ్రీభారతీతీర్థ శమ్.... 4

అశ్రావ్యం పరుషం తదస్ఫుటమహోదౌర్భాగ్యమస్త్వన్వయం
చాశ్లీలం పరనిన్దనం పరవశం సంస్కారహీనం వచో
వైదేశ్యం ప్రశృణోతి సూచక ఇవ శ్రోత్రం మమ క్షమ్యతాం
విద్యాతీర్థగురుప్రసాద దిశ మే శ్రీభారతీతీర్థ శమ్... 5

అస్పృశ్యం పరగాత్రమద్భుతమివ శ్రోణీస్తనాద్యఙ్గకం
తల్పం తూలమయోపధానమతులం మత్వా ధనాద్యం స్థిరమ్
క్షేత్రం గేహమనస్మదీయమపి మే త్వక్ కాఙ్క్షతి క్షమ్యతాం
విద్యాతీర్థగురుప్రసాద దిశ మే శ్రీభారతీతీర్థ శమ్... 6

అద్రష్టవ్యమపుణ్యగృధ్రవదిదం యోషాన్తరాఙ్గాదికం
రూపం సున్దరవస్తుజాతమితరశ్రీభూమిభూషామ్బరమ్
ప్రేయః కేవలమీక్షతే మమ పునశ్చక్షుర్ భృశం క్షమ్యతాం
విద్యాతీర్థగురుప్రసాద దిశ మే శ్రీభారతీతీర్థ శమ్... 7

అస్వాద్యం సునిషిద్ధమస్తరసమశ్రీకం తథోచ్ఛిష్టకం
దుష్టం పర్యుషితం సహామిషమసచ్చామేధ్యపూత్యాకులమ్
భక్ష్యాభక్ష్యమిహేహతే హి రసనా మే ధ్వాఙ్క్షవత్ క్షమ్యతాం
విద్యాతీర్థగరుప్రసాద దిశ మే శ్రీభారతీతీర్థ శమ్... 8

అఘ్రేయం మలపూర్ణహేయమశుభం స్వచ్ఛేతరద్దుస్సహం
కాలుష్యాభరితం విషౌషధిమయం దుష్కీటవద్ దుష్కృమి
శ్రేయోహానికరం ప్రజిఘ్రతి మహుర్ఘ్రాణం హి మే క్షమ్యతాం
విద్యాతీర్థగరుప్రసాద దిశ మే శ్రీభారతీతీర్థ శమ్... 9

కామః క్రోధ ఇవైష లోభవదయం మోహో మదో ?సౌ యథా
మాత్సర్యం చ ముహుర్యదీయ విషయాః యన్న స్థిరం క్వాపి తత్
స్వాన్తం మే కపివత్ పిశాచవదిహ భ్రామ్యచ్చరత్ క్షమ్యతాం
విద్యాతీర్థగురుప్రసాద దిశ మే శ్రీభారతీతీర్థ శమ్... 10

శ్రావ్యం నైవ శృణోమి న శ్రవణయోగ్యాశం శృణోమ్యద్భుతం
గమ్యం యామి న యామ్యగమ్యమపి చ్ఛుద్ధాక్షమాసంభృతః
కర్తవ్యం న కరోమి తచ్చ కరవై చాకార్యమిచ్ఛాబలాత్
విద్యాతీర్థగరుప్రసాద దిశ మే శ్రీభారతీతీర్థ శమ్... 11



నైర్మల్యం హృదయే దయా ?ఖిలతనౌ ప్రేమ ప్రకృత్యాం సదా
భూతేష్వాశ్రయభావనా గురుజనే భక్తిః ప్రపత్తిర్ధ రౌ
నిష్ఠా కర్మణి సాధుతా చ మహతీ తే స్వామినో దర్శనాత్
విద్యాతీర్థగురుప్రసాద దిశ మే శ్రీభారతీతీర్థ శమ్.... 12

విద్యాచార సుసంపదో నియమినో విజ్ఞానమూర్తేర్మహా
ప్రాజ్ఞత్వాభినిరస్తదుర్మతతతేః సమ్యక్పరీక్షాదృతేః
ఆద్యాచ్ఛంకరతో జగద్ధితగురోర్ భిన్నాన్నమన్యామహే
విద్యాతీర్థగురుప్రసాదత ఇతః శ్రీభారతీతీర్థతః... 13

శాస్త్రాణాం పరిరక్షణార్థమసకృచ్ఛాస్త్రార్థతత్త్వార్థ
మత్యన్తం ధర్మవిసారణార్థమభయశ్రీసాధనార్థం తథా
శ్రేయస్కారిసుకర్మభక్తివిరతిజ్ఞానోదయార్థం కృతా
విద్యాతీర్థగురుప్రసాద ఇహ శ్రీభారతీతీర్థభూః ...14

ద్విసప్తకమిదం స్తోత్రం భారతీతీర్థసద్గురోః
యః పఠేచ్ఛ్రద్ధయా భక్త్యా స గురోః కరుణాం భజేత్.

## శ్రీభారతీతీర్థగురుప్రార్థనద్విసప్తకార్థవివరణము

1. శ్రీవిద్యాతీర్థగురుదేవుల అనుగ్రహరూపులైన ఓ భారతీతీర్థ గురుదేవా! మేము మూలావిద్య కారణముగా సంసారమున పడినాం. ద్వన్ద్వములచే చుట్టబడినాం. మార్గం నుండి తొలగు టచే కంటకములచే పీడింపబడుతున్నాం. మాకు బుద్ధి పోయినది. శ్రద్ధ లేదు. వ్యాకులతతో ఉన్నాం. మృత్యువు దెబ్బచే బాధపడుతున్నాం. మీరు మాకు శాంతిని ప్రసాదించండి.
2. ఓ గురుదేవా! మీ పట్ల అభిమానం గల అజ్ఞానులమైన సంసారమను రోగం గల మాకు మీరు ఔషధమైన గంగా జలము, విజ్ఞానము, వివేకము, సద్బుద్ధి కలిగిన వారికి ఆత్మజ్ఞానరూపమైన సరస్సు మీరు. అందరికీ నామ శ్రవణం వలననే, దర్శనం వలననే పాపమును తొలగించి సుఖమునిచ్చు వారు. గురుదేవా! విద్యాతీర్థగురుదేవుల అనుగ్రహరూపమైన అట్టి మీరు మాకు శాంతిని ప్రసాదించండి.
3. ఇప్పుడు నా పనులన్నీ బుద్ధిలేక జరుగుచున్నవి. అకార్య మునే ఆశ్రయించితిని. ఏమి చెప్పాలో ఆలోచించుటలేదు. శిశుదశ నుంచి చెడుమాటలనే మాట్లాడితిని. చేయకూడనిది కాదని, చేయదగిన దానిని దైవికముగా కూడా చేయలేదు. గురుదేవా! విద్యాతీర్థగురుదేవుల అనుగ్రహరూపమైన మీరు నాకు శాంతిని ప్రసాదించండి.
4. నాకు విశ్వాసము కలగటం లేదు, శ్రద్ధ పుట్టటంలేదు, వేదవేదాన్తశాస్త్ర, పురాణ, ఇతిహాస ఆది విద్యలపై ప్రామాణికత ఏర్పడలేదు. అట్టి పుణ్యాన్ని పూర్వం చేసికొనలేదు. ఇప్పుడిప్పుడే మీ దర్శనం వలన అది కలుగుచున్నది. విద్యాతీర్థ గురుదేవుల ప్రసాదరూపులైన ఓ గురుదేవా! నాకు శాంతిని ప్రసాదించండి.
5. వినకూడని కఠినమైన, అస్పష్టమైన, దౌర్భాగ్యకరమైన, అసంబద్ధమైన, అశ్లీలమైన, పరనిందామయమైన, పరవశమైన, సంస్కారహీనమైన, వైదేశికమైన వాక్కులను చాడీలు చెప్పువాడివలె నా చెవి ఎప్పుడూ వింటూనే ఉంది. విద్యాతీర్థ గురుప్రసాదరూపమైన గురుదేవా! దానిని క్షమించండి. నాకు శాంతిని ప్రసాదించండి.
6. తాకకూడని, చూస్తూనే ఉన్నప్పటికీ ఎప్పుడు చూడనట్లున్న పర స్త్రీ స్తన- శ్రోణీ భాగములను హంసతూలికల వంటి పరుపు-దిండ్లను, ధనాదులను,

గృహ-క్షేత్రములను, మనది కాదని తెలిసీ, నా త్వగింద్రియము కోరుకొనుచున్నది. దానిని క్షమించండి. శ్రీవిద్యాతీర్థగురుప్రసాదరూపమైన ఓ గురుదేవా! నాకు శాంతిని ప్రసాదించండి.

7. ఎప్పుడూ చూడకూడనిది అగు పర స్త్రీ అవయవాది కమును, పరులరూపాన్ని, సుందరములైన పరుల వస్తువులను, ఇతరుల సంపదను, భూమిని, ఆభరణాలను, వస్త్రాలను కేవలం తాత్కాలిక ప్రీతిని కలిగించు పదార్థాలను నా కన్ను మిక్కిలి చూచుచున్నది. దానిని క్షమించండి. శ్రీవిద్యాతీర్థ గురుస్వరూప గురుదేవా! నాకు శాంతిని ప్రసాదించండి.

8. రుచిచూడదగని, నిషిద్ధమైన, రసములేని, అమంగళ కరమైన, ఎంగిలి అయిన, కేశాది దోష దుష్టమైన, పాచిదైన మాంసాది రూపమైన, అపవిత్రమైన, దుర్గంధ భూయిష్ఠమైన, చెడు ఆహారాన్నే తినదగినది-తినకూడనిది అను వివేకం లేకుండా నా నాలుక కాకి వలె కోరుచున్నది. అది మీచే క్షమింపబడుగాక. శ్రీవిద్యాతీర్థగురుప్రసాద స్వరూప గరుదేవా! నాకు శాంతిని ప్రసాదించండి.

9. వాసన చూడదగనిది, మలంతో నిండినది, పారవేయదగి నది, అమంగళమైనది, అస్వచ్ఛమైనది, సహించరానిది, కాలుష్య భరితమైనది, విషపు ఓషధులతో నిండినది, కృమి పూరితమైనది, ఆరోగ్యానికి భంగకరమైనదైన దుర్గంధ పదార్థాన్నే మలమునం దుండు పురుగు వలె నా ముక్కు కోరుచున్నది. క్షమించండి. శ్రీవిద్యాతీర్థగురుప్రసాదస్వరూపా శ్రీగురుదేవా! నాకు శాంతిని ప్రసాదించండి.

10. కామము క్రోధము వలె, క్రోధము లోభము వలె, అది మోహము వలె, అది మదము వలె, అది మాత్సర్యము వలె, అది కామము వలె నిండివుండు దుర్విషయములు కలది నా మనస్సు. ఒకచోట ఎప్పుడూ స్థిరంగా ఉండదు. అది కోతిలాగ, పిశాచం లాగ తిరుగుతూనే, కదలుతూనే ఉన్నది. అట్టి నా మనస్సును క్షమించండి. గురుదేవా! శ్రీవిద్యాతీర్థగురు ప్రసాదమా! మాకు శాంతిని ప్రసాదించండి.

11. వినదగిన మాటను వినను. వినకూడని మాటను ఆశ్చ ర్యంగా విందును. చేరదగిన చోటుకి చేరను, చేరకూడని చోటుకి శ్రద్ధతో, ఓపికతో కూడి చేరుదును. చేయదగిన దానిని చేయను, చేయకూడని దానిని తప్పక ఇచ్ఛతో చేస్తాను. క్షమించండి. శ్రీవిద్యాతీర్థగురుప్రసాదరూపమైన గురుదేవా! మాకు శాంతిని ప్రసాదించండి.



12. స్వామీ! మీ దర్శనం వలన హృదయమున నిర్మలత, అన్ని శరీరముల పట్ల దయ, పంచభూతముల యందు ఆశ్రయ ములను భావన, మాతా-పితృ-గురువుల యందు భక్తి, హరి యందు ప్రపన్నత, కర్మలయందు తత్పరత, గొప్పసాధు భావము కలుగును. అట్టి విద్యాతీర్థగురుప్రసాదరూప గురుదేవా! నాకు శాంతిని ప్రసాదించండి.

13. విద్యాచార సంపద, నియమాలు, విజ్ఞానాకారము, ప్రాజ్ఞత్వము, దుర్మత నివారణం, పరీక్షాదరణం, సాక్షాత్తు ఆదిశంకరుల రూపులైన జగద్ధితమును ప్రసాదించు విద్యాతీర్థ గురుప్రసాదమైన శ్రీభారతీతీర్థగురుదేవుల కన్న వేరు వారిని హృదయమున మేము చింతించము.

14. శాస్త్రాలను పరిరక్షించుటకు మరల-మరల శాస్త్రార్థచింత నల ద్వారా తత్త్వాన్ని తెలిసికొనుటకు, ధర్మాన్ని మిక్కిలిగా వ్యాప్తి చేయడానికి, అభయం, విద్య మొదలగు సాధనాలను సాధించు కొనుటకు, శ్రేయస్సుకు కారణమైన మంచి కర్మ, భక్తి, విరాగం, ఆత్మజ్ఞానం ఉదయించుటకు శ్రీవిద్యాతీర్థగురువుల ప్రసాదంగా శ్రీభారతీతీర్థులు అనుచోటు మాకిచట ఉన్నది. మాకు భయం లేదు.

భారతీతీర్థ సద్గురుదేవుల ఈ ద్విసప్తకస్తోత్రాన్ని శ్రద్ధతో పఠించువారు శ్రీగురుదేవుల దయకు పాత్రులగుదురు.

-దోర్బల ప్రభాకరశర్మ

### భారతీతీర్థ వృత్తమ్

# భారతీం సాక్షాత్ కృతాం భారతీతీర్థాన్ సద్గురూన్ సమ్భావయామః

శఙ్కరాచార్యార్య శీలాన్ ముహుఃస్వాన్తే చిన్తయామః
శృఙ్గగిర్యుత్తుఙ్గశృఙ్గే సదావాసానా నమామః
శారదా పీఠాభిపాలన్ ముదా భక్త్యా సంశ్రయామః
భారతీతీర్థాననూనాన్ గూరూన్ నః సమ్భావయామః

1. అద్య విశ్వే పణ్డితానాం కులే నిత్యం చిన్త్యమానాన్
అద్య లోకే సంయమీన్ద్రావలౌ మధ్యే రత్నభూతాన్
అద్య పీఠాధీశ్వరాణాం ధురిశ్రీగీర్భిః సుమాన్యాన్
అద్య సత్కర్మాభిరక్షాకృతావగ్రే సక్తయుక్తీన్ శారదా-భారతీ

2. సర్వవిద్యాతీర్థ సుస్నానపుణ్యాచ్ఛాత్మావభాసాన్
సర్వవిద్యాతీర్థ సిష్ణసు శిష్యోత్సాహావలోకాన్
సర్వవిద్యాతీర్థ విద్యాసుతీర్థ శ్రీగుర్వభీష్టాన్
సర్వవిద్యాతీర్థ భూతా22త్మతీర్థా2భిష్ణాత మూర్తీన్ శారదా-భారతీ

3. భారతీ దేవ్యాః కృపాయా(ః) మహత్యాః సత్పాత్రత్గార్వా న్
భారతీ భూమేర్జనన్యాః సువాత్సల్యైకాభిలక్ష్యాన్
భారతీయా సంస్కృతిర్యా, ప్రసుప్తె తత్సంప్రబోధాన్
భారతీయా జ్ఞానితాయా, శ్రియై తస్యాఃస్మారణోత్కాన్ శారదా-భారతీ

4. వేదగోష్ఠీ భాగి విద్వన్మణి ప్రీతివ్యాహృతీడ్యాన్
శాస్త్రగోష్ఠీ భాగ్విపశ్చిద్వరశ్రేయస్సాధకాగ్ర్యాన్
కావ్యగోష్ఠీ భోల్లసత్ సత్కవీనామానన్ద దాతౄన్
గీతగోష్ఠీ గాయకానాం సుగానైః సన్తుష్టి(ష్ట) హృష్టాన్ శారదా-భారతీ

5. తుఙ్గ తుఙ్గౌ స్వచ్ఛపాథః సమానాన్తర్మానసశ్రీన్
శృఙ్గ తుఙ్గౌ సత్తరఙ్గాగ్ర గఙ్గావాక్ సత్ప్రసఙ్గాన్
స్వాదు తుఙ్గా నీరపానాద్భుతాపూత బ్రహ్మచర్యాన్
భవ్య తుఙ్గా తీరవాస స్వయంవ్యక్త బ్రహ్మభావాన్ శారదా-భారతీ

6. శారదాకారాభిరామ శ్రుతి శ్రుత్యన్తాఙ్గ సఙ్గాన్
శారదాకారాతి హృద్య స్వవాదాధార ప్రమాణాన్
శారదాకారేతి హాసామృతత్కావ్య శ్రీపురాణాన్
శారదాకారాచ్ఛ సున్యాయ సాహిత్యోల్లాసి భాషాన్ శారదా-భారతీ

7. చన్ద్రమౌలీశాభిషేకే సునిష్ఠా గోక్షీరసారాన్
చన్ద్రమౌలీశార్చనార్థే నితాన్త శ్రద్ధా సుపుష్పాన్
చన్ద్రమౌలీశాత్మతత్త్వావలోకావిష్కార ధుర్యాన్
చన్ద్రమౌలీశ స్వరూపస్వభావాభేదానుభావాన్ శారదా-భారతీ



8. ధర్మకామార్థానుకూల ప్రవృత్త్యేకాన్తాభిలాషాన్
ధర్మరక్షాకార్య నిత్య స్వకృత్యేకవ్యగ్ర చిత్తాన్
ధర్మదీక్షా బద్ధనైక స్వకీయాన్తేవాసిముఖ్యాన్
ధర్మభూమే ర్గౌరవార్థ ప్రసక్త్యాప్తానేకకృత్యాన్ శారదా-భారతీ

9. జాగరూకాన్ స్వీయధర్మే జగద్రక్షాబద్ధ దీక్షాన్
జన్మకర్మాతీతలోకాన్ జగద్గుర్వగ్ర్యాధిపత్యాన్
జాగ్రతః సత్కర్మబోధాన్ జగత్క్షేమ స్వీయకార్యాన్
జాగృతి శ్రీకరాలాపాన్ జగత్కల్యాణైక భావాన్ శారదా-భారతీ

10. శేఖర శ్రీ భారతీ దేవ్యధిష్ఠానాత్మా2ద్వయా22భాన్
శేఖర శ్రీ సద్గురుశ్రీపదాభూషా మఙ్గలాఙ్గాన్
శేఖర శ్రీ విధ్వలఙ్కార భారత్యారాధ్యపాదాన్
శేఖర జ్ఞాన ప్రకాశాన్ శిఖాభూతాత్మైక విద్యాన్ శారదా-భారతీ

11. బ్రహ్మసత్యం విశ్వమేతత్ నసత్, నాసత్ న ద్వయంతత్
బ్రహ్మజీవో జీవ ఏష స్వయంబ్రహ్మ బ్రహ్మసర్వమ్
ఏవమేతత్(చ్) చిన్తయానాన్ సమస్తేహాః కామయానాన్
లోకముద్ధర్తుం సమీహాః శ్రితాః స్వీకృత్యాప్తకామాన్ శారదా-భారతీ

12. శఙ్కరాచార్యాది సద్గుర్వభిప్రాయప్రేష్ఠ నిష్ఠా-(న్)
దక్షిణామ్నాయా22ది పీఠ ప్రతిష్ఠాయై హేతుభూతాన్
ప్రోల్లసద్విజ్ఞాన మేధాపటుత్వార్థ త్వాద్యనూనాన్
భారతీం సాక్షాత్కృతాం భారతీతీర్థాన్ స్వామిపాదాన్

శఙ్కరాచార్యార్య శీలాన్ ముహుఃస్వాన్తే చిన్తయామః
శృఙ్గగిర్యుత్తుఙ్గశృఙ్గే సదావాసానా నమామః
శారదా పీఠాభిపాలన్ ముదా భక్త్యా సంశ్రయామః(మో)
భారతీతీర్థాననూనాన్ గూరూన్ నః సమ్భావయామః

# యతిలోక ధృవతార శ్రీ భారతీతీర్థ మహాస్వామి

మన దేశాన ఒక మహారాజుకి, ఒక చక్రవర్తికి లేని గౌరవమన్ననలు సర్వసంగ పరిత్యాగి అయిన సన్యాసికి, కాషాయాంబర ధారికి ఉన్నాయి. మన సమాజ సంస్కృతీ సంప్రదాయాలలోని విశిష్టత అది. వారి ధర్మ నిర్దేశాన్ని, మార్గదర్శనాన్ని సమాజం యావత్తు శిరోధార్యంగా ధరిస్తుంది. అట్టి మహత్వానికి కారకులు శంకరభగవత్పా దుల వంటి మహనీయులు. మన దేశం చేసుకున్న పుణ్యం వల్ల, అదృష్టభాగ్యం చేత అటువంటి మహనీయుల పరంపర నేటికీ కొనసాగుతున్నది. ఆ విధంగా కొనసాగటానికి ప్రధాన కారణం చతురామ్నాయ వ్యవస్థ. ఆ వ్యవస్థా నిర్మాత శ్రీశంకరులే. ఆయనకొక నిర్దిష్ట లక్ష్యమున్నది. దాన్ని సాధించటానికి ఆమ్నాయ వ్యవస్థ సుస్థిరంగా ఉండునట్లు తీర్చిదిద్ది నలుగురు మహనీయులను ప్రథమ ఆచార్యులుగా నియమించి, ఆ గురు పరంపర అవిచ్ఛిన్నంగా కొనసాగు నట్లు శాసనం చేశారు. మామూలు యతులు సన్యాసులు తపోధ్యాన సాధన చేస్తూ ఆత్మావలోకనం లో లీనమై ఉండవచ్చు కాని ఈ పీఠాధిపతులు మాత్రం నిరంతర సంచారం చేస్తూ ధర్మ ప్రచారం చెయ్యాలి, (మఠేతు నియతో వాసో ఆచార్యస్య న యుజ్యతే) తపస్సుద్వారా నిష్కళంక వ్యక్తిత్వం ద్వారా బోధనలద్వారా సమాజాన్ని ప్రభావితం చెయ్యాలి అని అనుశాసనం చేశారు.

నాలుగు పీఠములలో శృంగేరి పీఠము జగద్గురు స్థానమై ప్రధాన పీఠం గా విలసిల్లుతోంది. దీనికి ప్రప్రథమ ఆచార్యులు బ్రహ్మాంశ సంభూతులైన శ్రీసురేశ్వరాచార్యులు. తదాది ఈ గురు పరంపర బహుశాస్త్ర నిష్ణాతులు, బ్రహ్మ వేత్తలు అగు మహనీయులతో అవిచ్ఛిన్నం గా కొనసాగుతున్నది. అట్టి గురు పరంపరలో 36వ ఆచార్యులు, పీఠాధిపతులు శ్రీ భారతీతీర్థ మహాస్వామి వారు.

**తమారాధ్య గురుం భక్త్యాప్రహ్వప్రశ్రయ సేవనైః**

ప్రసన్నం తమనుప్రాశ్య పృచ్ఛేజ్జ్ఞాతవ్య మాత్మః - గురువుని భక్తితో అర్చించి వినయ విశ్వాస సేవలతో ప్రసన్నుని గావించుకొని ఆత్మ తత్వాన్ని తెలుసు కోవాలని శ్రీశంకరుల వివరణకు ప్రతి రూపులై నిలచినవారు. గురు వాక్యమును త్రికరణ శుద్ధిగా అనుసరించుచు గురుభక్తికి కార్యదీక్షకు ధర్మాచరణకు నిలువెత్తు నిదర్శనముగా నిలచినవారు శ్రీ భారతీ తీర్థులు. వారి గురుదేవులు శ్రీ విద్యాతీర్థుల గురించి చెపుతూ : నేను చాలా చిన్నతనముననే

జగద్గురువుల దర్శనము చేసికొనుట సంభవించినది. మా ఉపాధ్యాయులు నన్ను విజయవాడ తీసుకువెళ్ళినా సంస్కృతభాషా పరిజ్ఞానమును శ్రీచరణుల సన్నిధిని ప్రదర్శింపచేశారు. గురువుల ప్రశంశలందుకొను భాగ్యము



కలిగినది. తదాది శ్రీచరణులే నాకు గురువులని నన్నుద్ధరించు మహనీయులని ముద్రపడినది. ఏదో ఆత్మీయత దేశకాలాతీత అనుగ్రహము నాకేదియో అభయము లభించినట్లు అనుభూతి. మనోవాగతీతమైనదా దర్శనానుభవము " అంటారు. అసలీ గురు శిష్యుల సమాగమము దైవనిర్ణయమేమో అనిపించును.

అతి పిన్న వయసులోనే న్యాయ తర్క మీమాంసాది శాస్త్రాలను అధ్యయనం చేశారు. సంస్కృత కావ్యనాటకాదులను పూర్తి చేసి పండితులనిపించుకున్నారు. వేదవేదాంగాది సర్వ దర్శనములను అధ్యయనం చేశారు. ఏకసంత తోనే యజుర్వేదం పూర్తి చేశారని చెపుతారు. స్వయంకృషి తో తమిళ కన్నడ మళయాళ హిందీ భాషలను నేర్చుకున్నారు. మాతృభాష అయిన తెలుగు కన్నా ధారాళంగా సంస్కృతంలో మాట్లాడగల పరిజ్ఞానమబ్బినది చిన్నతనమందే.

బహుకార్య మగ్నులై ఉంటూ కూడా అనుగ్రహ భాషణల ద్వారా, స్తోత్ర వాఙ్మయాన్ని, ఆధ్యాత్మిక సాహిత్యాన్ని సుసంపన్నం చేస్తూ శిష్యకోటికి మార్గదర్శనం చేస్తున్నారు. " దృష్టిం జ్ఞానమయం కృత్వా పశ్యేత్ బ్రహ్మమయం జగత్" అన్న ఆర్ష వాక్కుకు అనుగుణంగా శిష్యకోటి సాధన చెయ్యాలని ఆచరణలోకి తేవటానికి వీరి కృషి మరువరానిది. " గురు దేవుల జీవితమే వారి సందేశం" అన్నట్టు భాసిస్తుంది.

గురుభక్తి, అర్చన సంప్రదాయానురక్తి, తపఃశక్తి, త్రివేణీ సంగమమువలె పరిఢవిల్లిన వ్యక్తిత్వం శ్రీచరణులది. చైతన్య మూర్తి, జ్ఞానప్రబోధ స్ఫూర్తి అయిన శ్రీచరణులు శిష్యవాత్సల్యానురక్తితోవేలాదిగాచేసిన అనుగ్రహ భాషణములలో నుడివినట్లు స్వధర్మాచరణ యెడల శ్రద్ధాసక్తులతో మన జీవితాలను తీర్చిదిద్దుకొని ముందుకు సాగుటయే గురుదేవులకు మనమివ్వ గలిగిన జన్మదిన ఉపాయనము.

- ప్రసాదవర్మ కామఋషి

# భూలోక శ్రీ శారదాచంద్రమౌళీశ్వరులు



జగద్గురువులు ఆ పేరు వినగానే మాటలు రాని మూగవారు కూడా మాటలు పలకడం ప్రారంభిస్తారు. అంతటి మహాత్మ్యం దాన్లో ఉంది. అసలు శృంగేరి అనగానే దేవలోకం, దేవతా స్వరూపాలు కళ్లముందు కన్పిస్తాయి. అలాంటి శృంగేరిలో తపశ్చక్రవర్తి, సకల నిగమాగమసార హృదయులు, రాజగురులు, భూమండలాచార్యులు, శ్రీ దక్షిణామ్నాయ శృంగేరి శారదాపీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారు దేవతా స్వరూపంలో - అత్యంత తేజోమూర్తులుగా ఒక్కసారి చూస్తేనే జన్మజన్మల పాపాలు అదృశ్యమయ్యేలా మనకు దర్శనమిస్తారు. పీఠాధిపతులంటే ఇలా ఉంటారా? అనుకునేంత నిరాడంబరులుగా కన్పిస్తారు. దర్శనానికి వచ్చిన ప్రతి ఒక్క భక్తుని భాషాభేదం లేకుండా ఆప్యాయంగా ఆశీర్వదిస్తారు. సమస్యల్ని వింటారు. బాధల్ని మనోనేత్రంతో చూస్తారు. దీవిస్తారు. వారి నుంచి దీవన తీసుకోగానే మనలో తెలియని ధైర్యం, సంతోషం, ఆనందం అన్నీ కలిసి వెయ్యి ఏనుగుల బలం వస్తుంది. నిజంగా ఆయన ఈ కలియుగంలో కనిపించే భగవత్ స్వరూపం. అందుకే స్వామివారు కొన్ని కోట్ల మంది చేత పూజింపబడుతున్నారు.

శ్రీ జగద్గురు శంకరాచార్య మహాసంస్థానం- దక్షిణామ్నాయ శ్రీ శారదాపీఠం శృంగేరి. సాక్షాత్తూ ఆదిశంకరుల పాదస్పర్శతో, జగన్మాత శ్రీ శారదాంబ గజ్జెల సవ్వడితో ఇక్కడి అణువణువూ దేవతా స్వరూపంగా మారిపోయింది. ఆ పేరు వింటేనే ఏదో మహిమగల శక్తి మన శరీరంలోకి ప్రవేశిస్తుంది. అలాంటి పుణ్యస్థలంలో ఆదిశంకరులవారు ప్రప్రథమ ఆమ్నాయపీఠంగా యజుర్వేద పీఠాన్ని దక్షిణామ్నాయ శ్రీ శారదాపీఠంగా స్థాపించారు. (విభాండక మహర్షి కుమారుడు ఋష్యశృంగుడు తపస్సు గావించిన పుణ్యదేశం శృంగగిరి కాలక్రమేణా శృంగేరిగా మారింది.) మరి అలాంటి పుణ్యప్రదేశానికి వెళ్లటం మనందరి పూర్వజన్మ సుకృతంగా భావించాలి.

త్రిమూర్తి స్వరూపం మొదటి పరంపరగా కొనసాగగా తర్వాత ఆదిశంకరులవారు కొనసాగించి విదేహముక్తి పొందే ముందు శ్రీ సురేశ్వరాచార్యుల వారికి పీఠ నిర్వహణ అప్పచెప్పారు. అక్కడి నుంచి వారి శిష్యుల పరంపర అవిచ్ఛిన్నంగా కొనసాగుతూ నేటికి 36వ పీఠాధిపతిగా పీఠాధిరోహణం గావించిన శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారిచే పీఠాధిపత్యం కొనసాగుతున్న ఈ పీఠానికి

37వ పీఠాధిపతిగా జగద్గురువులు శ్రీశ్రీశ్రీ విధుశేఖర భారతీస్వామి వారిని మహాసన్నిధానం వారు నియమించారు.

అలాంటి ఈ మహిమాన్వితమైన పీఠంలో ఉన్న మహాసన్నిధానం వారి చల్లని దీవెనలతో నాకు జరిగిన కొన్ని మహిమలను పాఠకులకు ఈ సందర్భంగా తెలియజేయటం నా బాధ్యతగా భావిస్తున్నాను.

**నా అనుభవాలు**

అది 2002 సంవత్సరం. అప్పటి శృంగేరీ పీఠ ఆంధ్రప్రదేశ్ ప్రతినిధి ఆకెళ్ల సత్యనారాయణమూర్తి గారితో ప్రప్రథమంగా జగద్గురువుల దర్శనానికి బయలుదేరాను. ఒక పక్క తెలియని భయం, మరో పక్క ప్రపంచంలోనే అతిపెద్ద పీఠాధిపతిని చూడబోతున్నాననే ఆనందం. జగన్మాత, జగద్గురువుల దర్శనం అయింది. పరిచయాలు అయ్యాక, పాదపూజ భిక్షావందనం చేసుకున్నాం.

"ఎప్పుడు వెళ్తున్నారు" అన్నారు స్వామివారు.

"ఈరోజు సాయంత్రం గురువుగారు" అన్నాను.

"ఈరోజు ఉండండి గురువుగారు చెప్తున్నారు" అన్నారు.

నేను మా సభ్యుల వంక చూసి...

"శెలవు రేపటి వరకే స్వామీ... మీరు మంత్రాక్షతలు ఇస్తే వెళ్తాం" అన్నాను.

మళ్ళీ గురువుగారు కాస్తంత ప్రేమతో "గురువుగారు చెప్తున్నారు. రేపు సాయంత్రం వెళ్ళండి" అన్నారు.

మేం ఒకరి మొహాలు ఒకరం చూసుకున్నాం. మమ్మల్ని మళ్ళీ పిలిచి, గురువుగారు -

"టిక్కెట్ల గురించి ఆలోచించక, వాటిని ఆపేసి తిరిగి తీసుకోండి" అన్నారు.

స్వామివారు అన్నిసార్లు చెప్పాక ఎందుకులెమ్మని ఆగాం. మర్నాడు పొద్దున పేపర్లు చూస్తే నిన్న మేం వెళ్ళాల్సిన రైలు పట్టాలు తప్పింది. మేం ఎక్కవలసిన బోగీ, పక్క బోగీ రెండూ దెబ్బతిన్నాయి. 30 మందికి గాయాలయ్యాయి. వెంటనే ఒక్కసారి ఒళ్ళు గగుర్పొడిచింది.

ఉదయం గురువుగార్ని కలిసాం. మా వైపు చూస్తూ చిరునవ్వుతో మంత్రాక్షతలు ఇస్తూ...

"ప్రతి నెలా గురువుగారి దర్శనానికి వస్తుండండి. అంతా మంచి జరుగుతుంది" అన్నారు. ఆ రోజు నుండి ఇప్పటి వరకు సంవత్సరానికి సుమారు 10 సార్లు క్రమం తప్పకుండా వెళ్తుంటాము.

**శ్రీమతి అనారోగ్యం... చిటికెలో మాయం**

2010 సంవత్సరం ఏప్రిల్ 25న జరిగిన ఆరోగ్య పరీక్షలలో నా భార్య శారదకు ఎడినో కార్సినోమా అని (ముక్కు లోపల క్యాన్సర్) అని డాక్టర్లు చెప్పారు. జీవితం



చీకటి. అంతా అయోమయం. ఈ సమస్య నుంచి నా భార్యను ఎలా కాపాడుకోవాలో అని ఆలోచిస్తూ నిద్ర రాకపోయినా అలాగే పడుకున్నా. కలలో జగద్గురువులు నా భార్యకు పూర్తి ఆరోగ్యం చేకూరుతుందని ఆశీర్వదిస్తున్నారు. అదాటున ఒక్కసారిగా లేచా. అప్పుడు అనుకున్నా తెల్లవారగానే శృంగేరికి బయలుదేరాలని. వెంటనే జగద్గురువుల దర్శనానికి వెళ్ళా (అప్పటికే జగద్గురువులు సైనిక్‌పురి శృంగేరి శంకర మఠానికి నన్ను ధర్మాధికారిగా నియమించారు) నన్ను దూరం నుంచి చూడగానే జగద్గురువులు కనిపెట్టేశారు. దగ్గరికి వెళ్ళా.

"బాగున్నారా?" అని ఆప్యాయంగా పలకరించారు గురువుగారు.

"స్వామీ! నా భార్యకు సమస్య వచ్చింది. అనారోగ్యం. తను అలా బాధపడుతుంటే నేను మఠనిర్వహణ సరిగా చేయలేను. తను ఆరోగ్యంగా ఉండేలా చేయండి. ఈ మందులు తెచ్చాను. తమరు ఆశీరనుగ్రహం అందించి వ్యాధి నయం అయ్యేలా చేయండి. ఇదే నా కోరిక" అన్నాను.

వెంటనే స్వామివారు ఆ మందుల్ని తీసుకుని వాటిమీద తీర్థం చల్లి, "మీకు పరిపూర్ణంగా ఆశీస్సులు ఇస్తున్నాం. ఆ శారదాచంద్రమౌళీశ్వరులు, శ్రీ శారదాంబ చల్లగా చూస్తారు" అని మందులు అందించారు.(ఈ సన్నివేశం రాస్తుంటే నాకు తెలియకుండానే కన్నీళ్ళు వస్తున్నాయి... తన్మయత్వంతో ఆశ్చర్యం కలుగుతున్నది.)

అంతే- వెంటనే గురునివాస్‌లో ఆ మందులు వాడడం ప్రారంభించింది. కొన్ని రోజులకు పరీక్ష చేయించా. అంతా



నార్మల్ ఇప్పటికీ తను బాగా ఉంది. మరి వారు భగవత్ స్వరూపం కాక ఇంకేమిటి?

**జగద్గురువుల వాక్కు.. దైవవాక్కు**

నా సహ పాత్రికేయుడు జగన్ ఆర్థికంగా పర్లేదు. ఒక్కడే అబ్బాయి. చదువులో బెస్ట్. తనకూ ఎప్పట్నుంచో జగద్గురువులను చూడాలని. అవకాశం, అవసరం రెండూ వచ్చాయి. ఒకరోజు నేను చెప్పా "జగన్! శృంగేరి గురువుగారి దర్శనానికి వెళ్తున్నా, వస్తావా?" అని. ముందు కాస్త ఆలోచించారు. తరువాత సరే అన్నాడు. ప్రయాణానికి సిద్ధం అయ్యాం. వాళ్ళబ్బాయిది ఎంసెట్ పరీక్షల హాల్ టిక్కెట్ తీసుకుని వస్తున్నా అని నాతో చెప్పాడు. గురువుగారి దీవెనలు కావాలన్నాడు. శృంగేరి వెళ్ళాం. జగద్గురువుల దర్శనం లభించింది. జగన్‌ని స్వామివారికి పరిచయం చేశా.

"స్వామీ! నా సహచర ఉద్యోగి. వాళ్ళబ్బాయి ఎంసెట్ పరీక్ష హాల్ టిక్కెట్. మంచి ర్యాంక్ రావాలి. ఉచిత సీటు రావాలి. అన్ని ఇబ్బందులు పోయే విధంగా ఇంజనీరింగ్ చదివి మంచి ఉద్యోగం వచ్చేలా దీవించండి" అని ప్రాధేయపడ్డా గురువుగార్ని.

స్వామివారు చేతిలో హాల్ టిక్కెట్ పెట్టుకుని-

"గురువుగారు పరిపూర్ణంగా ఆశీర్వదిస్తున్నారు. అన్నీ మీరనుకున్నట్టుగానే జరుగుతాయి" అంటూ మంత్రాక్షతలు, హాల్‌టిక్కెట్ జగన్ చేతిలో పెట్టారు. పరీక్షలయిపోయాయి. గురువుగారి దీవెనలు ఫలించాయి. రెండు వేల లోపు ర్యాంక్ వచ్చింది. వాళ్ళింటి దగ్గర జె.ఎన్.టి.యు.లో ఎం.టెక్ (మెకానికల్) బెస్ట్ ర్యాంక్‌తో పూర్తి చేశాడు. గురువుగారు చెప్పినట్టే 'ఒరాకిల్'లో ఉద్యోగం. విచిత్రమేమంటే, ఆ ఉద్యోగం కూడా వాళ్ళింటికి కాస్తంత దూరంలో. అందుకే గురువుగారి వాక్కు దైవ వాక్కు. జగద్గురువులకి వారి మహిమలకి నమస్కారాలు.

+++

2013 డిసెంబర్ 30. సైనిక్‌పురి శృంగేరి శంకరమఠానికి జగద్గురువులు మహాసన్నిధానం వారి రాక. వేల సంఖ్యలో జనం... స్వామివారి పరివారం. మఠం ప్రాంగణం లోపలే శ్రీ శారదాంబ సన్నిధానం ఎదురుగా జగద్గురువులు ఆశీనులయ్యారు. ఫ్యాన్లు తిరుగుతున్నాయి. ఎయిర్‌కూలర్లు పనిచేస్తున్నాయి. స్వామివారి పక్కన నిలబడ్డ మాకు స్వామివారి పరివారానికి చెమటలు కక్కుతున్నాయి. బట్టలు తడిసిపోతున్నాయి. తుడుచుకుంటున్నాము. నుదుట భస్మం కరిగిపోయింది. జనప్రవాహం. స్వామివారి దర్శనానికి వస్తున్న వేలకొలది భక్తుల్ని ఆశీర్వదిస్తూ ప్రసాద వితరణ చేస్తున్నారు. అయినా స్వామివారికి మాత్రం కాస్తంత కూడా చెమట పట్టలేదు. వస్త్రాలు తడవలేదు. ముఖాన, శరీరం మీద భస్మపు పుండరీకాలు కాస్తంత కూడా కనుమరుగు కాలేదు. అలా చిరునవ్వుతోనే భక్తులకు సమాధానం చెబుతున్నారు. మనం పురాణాల్లో చదువుకున్నాం. దేవతాస్వరూపులకు చెమట పట్టదని, ఇప్పుడు ప్రత్యక్షంగా చూశాం. స్వామివారు అంగీకరించకపోతే ఒక్క ఫోటో కూడా రాదు. అప్పుడప్పుడు నా మనస్సు బాగోలేనప్పుడు అప్పటి ఆ వీడియో చూస్తూ, స్వామివారికి దణ్ణం పెట్టుకుంటూ ఉంటాను. వారే నా శ్వాస- నా ప్రాణం - నా జీవితం. మరోసారి గురువుగారికి సాష్టాంగ ప్రణామాలతో.

**- పండరినాథ్ ధర్మాధికారి,**
శృంగేరి శంకరమఠం
సైనిక్‌పురి, సికింద్రాబాద్, సెల్ 79818 98489

# పారహంస్యచ్ఛవి



- శ్రీపరివ్రాజకాచార్య వర్యోత్తమానాం
- పదాద్వైత వాక్య ప్రమాణాబ్ధి పారంగతానాం
- లసచ్ఛబ్దశాస్త్ర ప్రకాండ త్రయీధర్మ మైమాంసశాస్త్ర ప్రమాణాధ్వ సర్వోచ్ఛ సన్న్యాయశాస్త్ర త్రికాంభోధి శమ్యాత్రయీరమ్య సమ్యఙ్మణిద్వీప సంచారి దీపశ్రియా
- సద్యమాద్యష్టయోగ ప్రయోగ ప్రభావోపపన్న స్వరూప శ్రియాం
- యంత్ర్యసంయత్రణం సంనియంత్ర్యాను సంయంత్రణం సౌఖ్యకార్యాసనం ప్రాణసన్ధారణం చాహృతిర్ధారణంధ్యాన మేకం సమాధాన మిత్యష్టరూప క్రియాయుక్తయోగాత్మ విద్యావిధి జ్ఞాన నిష్ఠాగరిష్ఠప్రతిష్ఠాత్మనాం
- సాధువార్తా సమాఖ్యాన సింహాసనాసీన చిద్రూప విభ్రాజినా
- వేదవేదాన్త సిద్ధాన్త సద్గ్రన్థ సంవ్యాఖ్యికాఖ్యాత సింహాసనాసీన చిన్మూర్తి విభ్రాజితానాం
- తపశ్చక్రవర్త్యాది సన్నామ కీర్త్యా సుపసంభ్రాజితానాం
- శ్రుతతర్త్రార్థదానవ్రతార్తిక్షతి, క్షేమశీల క్రియా సత్యసంభాషితా యజ్ఞకర్మాది వైవిధ్యయుక్శ్రీతపశ్చక్ర నిత్యప్రవృత్తి ప్రసన్నాననానాం
- సదావేదధర్మైహినాం, చారునిర్మోహ వేదోక్త సత్కర్మశర్మైకదృగ్ధర్మ మర్మ ప్రకాశైక కార్యోత్తరాణాం
- చక్తత్తుఙ్గభఙ్గోచ్ఛతుఙ్గానదీతీర సంవాసభాజాం
- లసతుఙ్గశృఙ్గాద్రిపాదప్రసేకాయ సమ్యగ్వహత్తుఙ్గ భఙ్గోల్ల సన్నీరరఙ్గాన్తఙ్గాగ్రనృత్యద్విహారోచ్ఛలచ్చారు మీనవ్రజాంచత్ తటప్రాంత భేక ప్రసూతిశ్రమ స్వేద నిర్వాపి జృమ్భత్ఫణాభాసి సర్పప్రవృత్తి స్ఫుటక్షేమశాన్తి స్థలీహారి తుఙ్గానదీతీర సంవాసినామ్
- ఋష్యశృఙ్గాద్రిదర్యన్తరావాస విశ్వార్తి నాశ్రవతానాం

తపోబ్రహ్మచర్యవ్రత ప్రీతి నిర్మాయతాసర్వ విశ్వాస తేజోవిభాండాత్మజాతర్ష్య శృఙ్గాశ్రయాద్రీశశాన్త్యేక ధామ స్వధామ్నాం

- లసచ్ఛారదాపీఠమాతిష్ఠతాం
- వేదవేదాంగషడ్దర్శనశ్రౌతసుస్మార్త విద్యాపురాణేతిహాస వ్రజశ్రవ్యదృశ్య ప్రబంధావలీకావ్య సద్ధర్మశాస్త్రత్రయీ దండనీతి ప్రియాన్వీక్షికీభవ్య వార్తా ద్యనేకాత్మవిజ్ఞాన సధ్వాఙ్మయశ్రీ స్వరూపోల్లసత్కచ్ఛపీవల్లకీచారు వాక్కీర భద్రాక్ష మాలాస్ఫురత్పుస్త కామ్భోజపాణిప్రభా శుభ్రధీప్రేరణోదార సంగీత సాహిత్య సుస్తన్యదానవ్రత స్నేహ భూదక్షణామ్నాయ సర్వం సహా శారదాపీఠమాస్థాయ బోధం ప్రబోధం సదా కుర్వతాం, సర్వవిద్యాస్వరుక్ఛంకరాచార్య సుశ్రీపదాబ్జాత పూజాపరాణాం
- జగచ్ఛోక మోహది దుర్దోషహర్తుః, సదాద్వైతమోహ ప్రహర్తుః శుభాద్వైత తత్త్వోపదేష్టుః
- ప్రమోహాస్తదృష్ట్యా భిదాదోషయుక్త్యా భృశం శోకసక్త్యా
- సమస్యా, మహత్యా, జగత్యా, గురోః శంకరాచార్యవర్యస్య
- పారమ్పరీప్రాప్త మేతత్పదం ధర్మశస్తం
- శివజ్ఞానశుద్ధం తథా సంప్రదాయం సదాచార పూర్ణం సుసంస్కారభవ్యం పరాం సంస్కృతిం సంప్రయచ్ఛన్తమ వ్యాజమారక్షతాం షణ్మతస్థాపకానాం మహాశక్తిధృక్
- సర్వషాడ్గుణ్య సంభూషణానాం, సుషడ్దర్శనోద్దేశ సందేశికానాం
- వశీభూత తంత్రావలీ సర్వమంత్రావలీ
- సర్వయంత్రావలీ కత్వ సంపాదితాలభ్యసమ్యక్స్వతంత్రత్వ కానాం నితాన్తా గమోధ్యాన కేలీ సముత్సాహవిద్యోతినాం
- సర్వదా-ద్వైత వేదాంత విద్యా రసాస్వాదినాం
- తన్మరందానుభూతి ప్రకాశస్వరూపాత్మనాం
- సర్వథానవ్యతా పూర్వవిద్యా పదశ్రీ మహాతీర్థ సత్స్వామి సత్పాని పద్మోద్భవానామనంత శ్రియాం “భారతీతీర్థ” సుశ్రీగురూణాం పదాబ్జాత సత్సన్నిధానే పరశ్రీనిధానావనౌ భాగ్య పుర్యా, బృహచ్ఛ్రీనగర్యా, మహోద్యానరమ్య ప్రదేశే సులాలిత్యలావణ్య సౌందర్యలీలా సుహేలా
- కలాతోరణప్రాంగణే
- ధర్మకామార్థ కామ ప్రసక్తైర్ముదాభక్తియుక్తైః ప్రమోహేద్ధ పాశ్చాత్య దుర్వాసనాస్థావిరక్తైర్, భవత్పాదపద్మ

ప్రసేవానురక్తైః పురాపుణ్య
పూర్ణైర్మనోవాక్తనుప్రేరణై స్పందిదృక్షా-
భిపూరైః

- శుభ శ్రీప్రవాహాగ్రపూరైరివాత్రాగతైః
  సాదరైరేభిరేతైర్జనైః
- భక్తిధర్మస్వనుష్ఠాన
  విద్యావ్రతశ్రేష్ఠయాగవ్రతస్నేహదాన
  ప్రచారం ప్రవృత్తాచ్చవాక్ఛక్తి
  సంప్రేరకజ్ఞాన సంపత్తి సందర్శకాదర్శ
  సద్దర్శనాఖ్యా సువిఖ్యాతమాః
  పత్రికానేతృకైరర్ప్యమాణం
- సుసంస్కార సఙ్కల్ప సద్వాసనం
  మానసం
- చారు వైదర్భికారీతి సద్భారతీ వృత్తి
  శయ్యాప్రసాదాది సమ్యగ్గుణారోచకం భావ గంభీర
  సాంద్రార్థ శుద్ధస్వభాభావ నాలోచకం స్వామి
  సమ్యక్కృపాగీర్భలాసాదితం దండకచ్ఛంద సారంజితం
  నైవ సంసాచికం వాచకం
- హృచ్ఛిరోదృఙ్మనోవాక్కరాఙ్ఘ్రశ్రుతి శ్రీసదష్టాఙ్గయుక్తం శ్రుతి
  స్మృత్యుదీర్ణం పరందండ వద్భాజితం కాయికం
- పాణిషు స్థాపితైర్ ఉచ్చకైః స్వామిపాదార్పితైః, బిల్వకైః
  పల్లవైరఙ్కురై రక్షిచ్ఛైర్గన్ధితైర్మల్లికామాలతీ, పాటలీ,
  నాగవల్ల్యుత్పలీ, చమ్పకాశోకకదమ్బ
  బృన్దామ్బుజాతాదిభిః సుప్రసూనైః కృత స్వాగతం
- భక్తిభావ ప్రణమ్రోత్తమాఙ్గం, సమోత్సాహసఙ్గం
- పురాసంప్రదాయోన్నతి స్థాపనోద్దేశ సంజ్ఞాపనం
- జాతి వర్ణాశ్రమోదారధర్మాశ్రితై ర్భారతీయై రభేదప్రవృత్తైః
  సమేకత్వ భావ ప్రపన్నైః కృతం
- చార్విదం
- గౌరవం వన్దనమ్భోభోః శిశుత్వే-పి బాల్యే-పి
  సద్బ్రహ్మచర్యవ్రతేనాప్త సద్గుర్వనుగ్రాహ్యసంన్యాసదీక్షాః
  సదీక్షాః
- న కర్మ ప్రజావిత్తహేత్వేతదభ్యర్థ్యమత్రామృతత్వమ్
- న చాకర్మణానిర్ధనేనాప్రజేనాపి సమ్ప్రాద్య మేద్ధ్రువంతత్
- న తారుణ్యనేతృత్వ రాజత్వ ముఖ్యాదికార్త్వైర్నితాన్తం
- పరంప్రాప్యతే కేవలం త్యాగతోధర్మ సంన్యాసతో నిశ్చితమ్
- స్వర్గతసూత్తరం భ్రాజమానం హృదిబ్రహ్మతత్త్వం
  పరంయాన్తిహిన్యానినో
- వేదవేదాన్త విజ్ఞాన నిర్ణీత సత్యార్థ సంశు
  ద్ధసత్త్వావిధీజ్ఞాయతన్తే చతే
- బ్రహ్మలోకే-న్తకాలే పరంజ్యోతిరేతద్ విదిత్వా-థ సంప్రా
  ప్నువన్త్యేవతద్



- సత్యమేవాత్మతత్త్వం హృదిస్థం పరం
  పుండరీకే మహాదభ్రభాగాన్తరం సాక్షి
- తత్రాపిదభ్రం వియత్, శోక హీనం చ
  యచ్చాభ్యుపాస్యం చ సావిత్ర రూపం చ
- వేదాన్త విద్యాసునిత్యం ప్రబోధ్యం
  ప్రబోధ్యం తదోంకారరూపం చ భాస్వచ్చ
- తస్య ప్రకృత్యాం పరోయః పరేశశ్చ
  పరివ్రాజధర్మాః పరంబ్రహ్మ రూపాః
  సదావన్దనీయాః ఖలు
- శ్రీమదాచార్యవర్యాః పరాః శంకరా
  ధర్మరక్షార్థ మత్రా--
  త్మవిద్యార్థమప్యాశ్రయం వోవ్యధుః,
  తద్భుశంభోర్ధ్రువం వో-త్రవన్దామహే
  ప్రేరయన్తు స్వధర్మే భవన్తః సదే త్యే
  వసంప్రార్థయామశ్చ
- భోభోగురూత్తం సవర్యాః సదా బ్రహ్మసందర్శనాః
  ఆత్మసందర్శనాః సాధువిశ్వాత్మసందర్శనాః
  స్వాత్మనాన్యాః
- ఇయం పత్రికా దర్శనాఖ్యామనుష్యస్య చాంద్రస్య,
  సత్సాధక స్యాధికారాధనీయా పి సుజ్ఞాన
  వైరాగ్యయోగాన్వితా సాధుహృత్క్షేత్ర భూమౌ సదా
  భక్తివల్లీ సమారోపికా! కర్మమార్గాను యాత్రాశ్రితానాం
  ముహూర్మార్గ సందర్శికా,
  వేదధర్మోదయాశారుణత్విట్ఛటా -
  యజ్ఞయాగవ్రతానుష్ఠితి ప్రేరణా భూమికా,
  దూరసందర్శకానేకవాహప్రవన్తీషు దుష్కల్మషక్షాల
  నోద్యత్ప్రయత్నస్వయం స్థాపిత స్వచ్ఛతాకా,
  తపస్సిద్ధసాధుప్రకాశాయ సందీక్షితా
  శోకమోహప్రవృత్తాన్యధర్మాశ్రితాత్మ స్వధర్మాజ్ఞ పార్థ
  ప్రబోధాత్మధర్మోపదేశైక గీతార్థకా, ద్రోహ దుర్వ్యాపృతి
  శ్రీహృతిస్వావినీతి ప్రవృత్త్యాది దోషాన్ధతా సంచరద్దీపికా
- రామణీ సా-ద్యనః సద్గురు ప్రేరణావర్ధితా, శం, జనానాం
  సదా కర్తు మత్యన్తయోగ్యా-స్త్వితి ప్రార్థయామః
- అయిశ్రీపదాః! శ్రీనిధానా! అనన్యాః!
- ఇమే సర్వ ఏవ ప్రియం శ్రీభవద్దర్శనం ప్రాప్య సమ్యక్
  కృతార్థాః సుయోగ్యాశ్చ కాలత్రయే-ప్యద్యజాతాః
  భవద్భద్రవాగ్భిః నిదేశ్యా భవద్భావికాశీర్భిరుత్తేజనీయాః,
  భవద్దృక్ ప్రసారైరరోగాః శుభాయుస్సుసంపద్యుతోఃస్యుః
  భవద్వాక్కృతేః సంస్కృతాః సర్వ ఏతేవయం
  సాధువందామహే, భో, నమోవో నమోవో నమోవో నమః

**- దోర్బల ప్రభాకరశర్మ**

# జగద్గురు మహావిభూతి



జగద్గురు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థమహాస్వామివారి శ్రీచరణములకు ప్రణామాంజలి. ప్రతి మానవుడు తప్పనిసరిగా ఒక గురువును త్రికరణశుద్ధిగా ఆరాధించుకోవలయును. అది ఆత్మోద్ధరణకు మాత్రమే. అనగా ఆరాధన ఫలము అందుకొనేవాడు ఆరాధకుడు మాత్రమే. కాగా అది ఆశించిన మహా ఫలాన్ని అందించాలంటే ఎన్నికలో ఏ విధమైన ప్రమాదమూ ఉండరాదు. అందు వలన ముందుగా గురుతత్త్వాన్ని గురించి విశేషంగా కృషిచేసి నిర్ణయించుకోవాలి.

జగద్గురువులు శ్రీ భారతీతీర్థ మహాస్వామివారు సుమారు మూడు దశాబ్ద ములకు పూర్వమే గురుతత్త్వమును ధ్వన్యాత్మకముగా ప్రకటించి యున్నారు. ముందుగా లోకసామాన్యమైన విద్వల్లక్షణములను పేర్కొని, ఉండవలసిన వానిలో ఏవో కొన్ని ఉండటము క్రమక్రమముగా పరిపూర్ణతకు సంబం ధించిన విషయము కాదని చమత్కారముగా చెప్పుచూ పరిపూర్ణత్వము అనగా ఏమిటో, అది ఏ విధముగా ఉండవలయునో అన్వయముఖ ముగా ప్రతిపాదించిరి. క్రమముగా వానిని పరిశీలించుకొనగా, ఇక్కడ ప్రస్తావనకు వచ్చినవి ఎనిమిది విషయములు.

1. ఆమ్నాయపరిశ్రమ : వేదాలు ఋగ్యజుస్సామాథర్వణ నామాలతో నాలుగు. ఒక్కొక్కవేదంలో సంహిత, బ్రాహ్మణము, ఆరణ్యకము, ఉపనిషత్తు అని నాలుగు విభాగాలు. అట్టిపదునారువిభాగాలలో అత్యంత పరిశ్రమచేసిన వేదవిద్వరేణ్యులు కొందరు.

2. శాస్త్రాభిజ్ఞత : వ్యాకరణము, తర్కము, మీమాంస, వేదాంతము మొదలైన శాస్త్రములను అధ్యయనము చేసి బోధ, ఆచరణ, ప్రచారణముల ద్వారా వానికి సుస్థితిని కల్పించిన మహానుభావులు కూడ కొందరు.

3. సాహితీ సమారాధనము : ఋషులు, ఋషికల్పులు మొదలైనవారు రూపొందించిన కావ్యనాటకాది వాఙ్మయము సాహితి. అందు విశేషకృషిచేసి ప్రఖ్యాతి కన్నవారు సాహిత్యపండితులు. అట్టివారు కొందరు.

4. వినయము : పై మూడు విభాగములలో ఏ ఒక్కదానిలోనైన కొంత కృషిచేసిన వానికి నేనంతవాడను, ఇంతవాడను అని ప్రకటనముచేసి లోకమున సంమానాదికము పొందవలయుననే దురహంకారము ఉండును. అది సహజముగా ఉండవలసిన వినయమును తొలగించివేయును. దాని స్థానమున గర్వమును నింపి ఉంచును. అది పతనమునకు కారణమగును.

5. ఆచారము : అభ్యసించిన వేదశాస్త్రములను ఆచరణలో పెట్టుట ఆచారము. చాలమంది తెలిసిన ఆగమార్థములను మాటలతో ప్రకటించు చుందురు గాని అనుష్ఠింపరు. అనుష్ఠించినపుడే దానికి ధర్మస్థితి కలుగును. కనుక ఆచారము అనునది గురుపదవాచ్యునకు అతిముఖ్యముగా నుండ వలసిన స్థితి.

6. భక్తి : శ్రీశంకరులు భక్తిని మోక్షసాధనసామగ్రిలో గరీయసిగా అభివర్ణించిరి. భగవంతుని నిరంతరము తనుహృద్భాషణాదులతో సేవించు చుండుటను భక్తియందురు. అట్టిసేవయొక్క మరియొక స్వరూపమే 'స్వస్వరూ పాను సంధానము'. ఆత్మస్వరూపమును నిరంతరముగా, నిరంతరా య ముగా మనస్సునుండి చెదరిపోకుండ పట్టియుంచుటయే భక్తి.

7. క్షమ : సహనము. ఎట్టి యిష్టమునైనను, అనిష్టమునైనను సహింపగలుగుట. అనగా ఇష్టము కలిగినపుడు పొంగకుండుట, అనిష్టము కలిగినపుడు ఉద్విగ్నత పొందకుండుట. ఒక విధముగా నిర్వికార చిత్త

వృత్తిత్వమే క్షమ.

8. చాతురి : మనస్సులో ఏదైన ఒకదానిని భావించుటలో, మాటాడు టలో, ఆచరించుటలో ఉండవలసిన నేర్పు. పనితనము, గొప్పప్రజ్ఞ అను దానికి చాతురి అని వ్యవహారము.

పైని పేర్కొన్న ఎనిమిది లక్షణములు, పరిపూర్ణముగా, సముదాయ రూపముగా నున్నవాడు మాత్రమే. 'గురు' పదమునకు లక్ష్యప్రాయుడగును. మరొకవిధముగా వీనియందేఒక్కటి కానరాకున్నను అట్టివానిని 'గురువు'గా భావింపరాదని భావము.

దీనికి సంబంధించి జగద్గురువులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థమహాస్వామి వారి క్రింది శ్లోకమును ప్రకటించియున్నారు.

"నానామ్నాయ పరిశ్రమం కలయతాం నాస్త్యేవ శాస్త్రేషు ధీః
సత్యేऽరప్యనయోర్ద్వయో ర్న సులభా సా హి క్షితౌ సాహితీ,
అప్యేతాసు సతీషు నాస్తి వినయో నాచారభక్తి క్షమా
చాతుర్యః స చ సా చ సా చ స చ తాశ్చాలమ్బ్యా ఖేలన్త్యముమ్."

అనేక వేదములలో పరిశ్రమము చేసికొన్నవారికి శాస్త్రములయందు బుద్ధి ఉండదు. ఆమ్నాయపరిశ్రమము చేసి, శాస్త్రములయందు బుద్ధిని పెంపొందించుకొన్నవారికి ఆ సాహితి సులభ కాదు. ఈ మూడును ఉన్నను వినయము ఉండదు. ఆచారము, భక్తి, క్షమ, చాతురి అనునవి యుండవు. అదియు, అదియు, అదియు, అదియు, అవియును ఈతనిని అవలంబించి ఆడుకొనుచున్నవి.

ఇది శ్లోకతాత్పర్యము. దీనిని మరికొంత సంభావించి చూచుకొన వలయును. నిజమునకు ఇక్కడ ఒక సర్వనామము ఉన్నది. "అముమ్" - ఇతనిని. సర్వనామము సాధారణముగా ఒక వ్యక్తినో, ఒక వస్తువునో తెలియ జేయవలయును. ఆ వ్యక్తి ఎవరు? ఈ విషయము శ్లోకమున వాచ్యముగా లేదు. అనుమానప్రమాణమునుబట్టి దానిని అనుమేయముగా భావింప వలయును. సందర్భమునుబట్టి ఆ వ్యక్తి జగద్గురువై యుండును. అట్టి జగద్గురు పదవాచ్యు లనేకులు ఉండవచ్చును. అందులో ఎవరు? అను ఆకాంక్షకు మనకు ప్రత్యక్షముగా గోచరించుచున్న శ్రీ శృంగేరీ శారదా మ్నాయ పీఠమహాస్వాములు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థులే యని సమాధానము. ఇతరులేల కారాదు? అనుప్రశ్నకు సమాధానము కూడ మనము సాధించు కొనవలయును.

పైని చెప్పిన లక్షణములన్నింటికి సమన్వయభూమిని మెలకువతో పరిశీలించినచో మనకు సరియైన సమాధానము లభించును.

1. ఆమ్నాయపరిశ్రమ : శ్రీవారు పూర్వాశ్రమమున తంగిరాల సీతారామాంజనేయ నామాంకితులు. వారి పితృపాదులు వేదవిద్యయందు విశేషమైన కృషి చేసినవారు. అనేకులను వేదవిద్యాపారంగతులను చేసిన వారు. ఆ అనేకులలో ప్రథమగణ్యులు శ్రీ సీతారామాంజనేయులుగారు.

2. శాస్త్రాధిగమము : శ్రీవారు శ్రీశృంగేరీదక్షిణామ్నాయ పీఠాధీశ్వరులు శ్రీఅభినవ విద్యాతీర్థమహాస్వాముల వారి శిష్యత్వమున అనేక శాస్త్రములను సంప్రదాయపద్ధతిలో అభ్యసించినవారు. అనేకులకు అధ్యాపనము చేసిన వారును. అట్టివారిలో మరల ప్రప్రథమగణనీయులు ఇప్పటి





సన్నిధానము వారు శ్రీశ్రీశ్రీ విధుశేఖర భారతీస్వామివారు.

3. సాహితి : శ్రీవారు సంస్కృతాంధ్రాంగ్లహిందీసాహిత్యములను సమగ్రముగా అనుశీలించినవారు. అట్లే తమిళకర్ణాటకాది దేశభాషల సాహిత్య మును కూడ చక్కగా వశముచేసికొన్నవారు. అంతమాత్రమే కాదు స్వయముగా సాహిత్య సృష్టికర్తలును అయి విరాజిల్లుచున్నవారు.

"గరుడగమన తవచరణ కమల మిహ
లసతు మమ హృది నిత్యమ్" అన్న గేయము ఒక్కటిచాలును, వారి సాహితీసార్వభౌమత్వమును నిరూపించుటకు (ఈ గేయమును ఈ వ్యాసము చివర శక్తికొలది వ్యాఖ్యానింతును).

4. వినయము : శ్రీవారు ఈ విషయమున సర్వాశ్రితకోటికిని ఆదర్శ ప్రాయులై వర్తిల్లుచున్నారు. స్మితపూర్వాభిభాషిత్వము, దర్శనార్థము వచ్చు వారిని, శ్రీరామచంద్రునివలె, యోగక్షేమములను గూర్చి విచారించుట, ఎవ్వరిని నొప్పింపకుండుట, అందరకును అభిగమ్యులై యుండు శీలము మొదలగునవి శ్రీవారి వినయగరిమను అభివ్యక్తము చేయుచుండును. ఈ విషయమున రఘువంశమున కాళిదాసుచెప్పిన ఈ శ్లోకము స్మృతిలో మెదలు చుండును.

"భీమకాన్తైర్నృపగుణైః స బభూవోపజీవినామ్,
అధృష్యశ్చాభిగమ్య శ్చ యాదోరత్నైరివార్ణవః."

ఆ దిలీపమహారాజు మహాసాగరము వంటివాడు. తన్నాశ్రయించి బ్రదుకు వారికి అధృష్యుడు, అభిగమ్యుడును అయిఉండువాడు. సముద్రమునందు జలజంతువులు వెరపుగొలుపుచుండును. రత్నములు ఆకర్షించుచుండును. ఆ విధముగా అతనియందలి భీమగుణములు సులభగమ్యతకు అడ్డుగా నిలుచును. కాంతగుణములు ఆప్యాయతతో రమ్మురమ్ము అనుచుండును. శ్రీవారి వ్యక్తిత్వము కూడ అట్టిదియే.

ఈ సందర్భమున నొకవిషయము నా హృదయములో నిరంతరము కదలాడుచుండును. ఒక సందర్భమున శ్రీవారు నన్ను అత్యంతవాత్సల్య ముతో సంబోధించుచు "శర్మగారూ! మనము ఎవ్వరినీ నొప్పించగూడ దండీ!" అన్నారు. ఆ స్వభావము వారిని దర్శించు సర్వసమయములలో నాకు నిరూపణకు వచ్చును. నా పాలిట అది ఒక మహామంత్రోపదేశము. ఆ వాక్యములో నాకనేక వేదాంతరహస్యములు స్ఫురించుచుండును. అట్టి ప్రవృత్తిని అలవరచుకొనవలయునను అభిలాష నిరంతరము కలుగు చుండును.

5. ఆచారము : శ్రీస్వామివారు సదా బ్రహ్మైకనిష్ఠులయి ఉండియు సదాచారవిషయమున అత్యంతనిష్ఠ కలిగి యుండుటను మనము గమ నించుచునే యుందుము.

"యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే" అను గీతా వాక్యార్థమును సమన్వయాత్మకముగా మనము శ్రీవారియందు గమనింపవచ్చును. జగ ద్గురువు వాసుదేవశ్రీకృష్ణునిప్రవృత్తి వంటిది యిప్పటి యీ జగద్గురువుల ఆచార ప్రవృత్తి.

6. భక్తి : 'స్వస్వరూపానుసంధానమే భక్తి' అని శ్రీ శంకర భగ వత్పాదుల సత్యభావన. స్వముయొక్క స్వరూపమును అవిచ్ఛిన్నముగా కలుపు కొనుచు ఉండుట భక్తిలక్షణము "స్వ" శబ్ద మాత్మ వాచకము. ఇక్కడ పరమాత్మ వాచకము. దాని తత్త్వముతో అనుసంధానము - 'లంకె' నిరంతరముగా ఉంచుకొనుట అని ఈ వాక్యమునకు అర్థము. ఆత్మ పరమాత్మల ఐక్యమును నిరంతరముగా నిలుపుకోవటమన్నమాట. దానికి మరొక వ్యవహారము అద్వైతము.

కాగా భక్తిలో భక్తుడు, భజనీయము, భజన అనెడి త్రిపుటి ఉండును కదా! దీనిని అద్వైతమనుట యెట్లు? అను శంక కలుగును. వ్యవహారదృష్టితో ఇచట నానాత్వమున్నను పరమార్థదశలో ఆ మూడింటికి ఏకత్వమే సాధింప వలయును. అది శాస్త్రీయమైన విషయమే. ఆ సాధనమార్గమును శ్రీ భగ వత్పాదులు



శ్రీశారదాచంద్రమౌళీశ్వరార్చన సమయమున స్వయముగా ఉపస్థితులై అనుష్ఠానరూపముగా అనుభవమునకు తెచ్చుచుందురు. ఆ సమయమున అద్వైతమార్గమున పరిణతి సాధించినవారికి అచట 'ఏకత్వమే' అను భవమునకు వచ్చుచుండును. శ్రీ స్వామివారి 'భక్తి' అటువంటిది. మరియొక విధముగా, అచట ప్రపంచజ్ఞానము ఉపశమించుట జరుగును. శ్రీ స్వామి వారి విషయమున 'భక్తి' అంశమునకు అర్థమయ్యదియే.

7. క్షమ : సంస్కృతమున స్త్రీలింగమైన 'క్షమా' శబ్దమునకు భూమి, ఓరిమి అని రెండర్థములు. క్షమతే, క్షాన్తిశ్చ క్షమా అని లింగాభట్టు. దేని నైనను, ఎంతభారమునైనను సహించుటకు 'క్షమ' అని వ్యవహారము.

మన జగద్గురువులలో ఈ లక్షణము అతివేలముగా దృశ్యమాన మగును. ఒక చిన్ని సంఘటన. నేను నాపరివారముతో దర్శనపంక్తిలో శ్రీస్వామివారి సంనిధానమున నిలిచియుంటిని. మా తరువాత ఒకవ్యక్తి ఇంచుమించు ఉన్మత్తునివలె నున్నవాడొకడు వచ్చెను. నేను గమనించు చుంటిని. అతనిని చూచునప్పుడును శ్రీగురుదేవుల ముఖమున దరహాసము చెరుగలేదు. అందరకువలె ఆతని చేతిలో ఒక ఫలమును ప్రసాదముగా అందించిరి. కానీ అతడు, నాకిది వద్దు, అది కావలయునని మరొకఫలమును నిర్దేశించి అడిగెను. చూచుచున్నమావంటివారికే అది అనుచితవ్యవహార మనిపించెను. కానీ స్వామివారు అతనితో అయితే అది అక్కడుంచు, ఇదిగో నీకు కావలసినది తీసుకో అని ముఖమున ఎట్టి వికారరేఖయు లేకుండ పలికి ప్రసాదించిరి. ఆ సన్నివేశమును గమనించుచున్ననాకు శ్రీమద్రామా యణమునందలి శ్రీరామచంద్రమూర్తి వైఖరి మదిలో కదలాడినది. పట్టాభి షేకవార్తను, అరణ్యగమనవార్తను ఆ మహాత్ముడు ఒకే విధముగా స్వీకరించెను. ఆ సందర్భములో వాల్మీకి ప్రసాదించిన శ్లోకములివి.

"న వనం గన్తుకామస్య త్యజతశ్చ వసుంధరామ్,
సర్వలోకాతిగస్యేవ లక్ష్యతే చిత్తవిక్రియా. అయోధ్య 19.33

"సర్వో-ప్యభిజనః శ్రీమాన్ శ్రీమతః సత్యవాదినః,
నాలక్షయత రామస్య కంచి దాకార మాననే." అయోధ్య 19.36

అడవికి పోవగోరుచున్న, వసుంధరను త్యజించుచున్న ఆ సర్వ లోకాతి గునివలె నున్న ఆ శ్రీరామచంద్రునియందు ఏ మాత్రము చిత్తవిక్రియ కానరాలేదు.

శ్రీమంతుడు, సత్యవాది అయిన రామచంద్రునిమోమున శ్రీమంత మైన అభిజనమునకు ఏవిధమైన వికారమును కానరాలేదు. ఇట్టి స్థితినే స్థితప్రజ్ఞత అందురు. దానికి సంబంధించిన ముడివస్తువులలో ఒకటి 'క్షమ'.

8. చాతుర్యము : ఒక భావనయందు గానీ, ఒకమాటయందుగానీ, ఒక చేష్టయందు గానీ మహాత్ములైన వారి తీరు విలక్షణముగానుండును. గతానుగతికముగా ఉండదు. స్థూలముగా నట్టి విలక్షణతను 'చాతుర్యము'గా నా వంటివారు సంభావింతురు. గురువైనవ్యక్తికి ఇది తప్పనిసరిగా



ఉండ వలసిన లక్షణము. చాతుర్యము జనులహృదయమును ఆకర్షించి కట్టిపడ వేయును. అట్టివారి హృదయములందు గురూపదేశము చెదరకుండ నిలిచి యుండును. ఇట్టి చాతుర్యము శ్రీవారిలో సర్వవిషయములందును పరిదృశ్య మానమగుచుండును. ఆ కారణమువలననే ప్రతిదినము వందలసంఖ్యలో ఆర్తులు, జిజ్ఞాసువులు,అర్థార్థులు, జ్ఞానులును శ్రీశృంగేరీ శారదాపీఠమునకు వచ్చుచుందురు. అట్టివారందరికిని అది మనోవిశ్రాంతినిచ్చు పవిత్ర క్షేత్రము. దానినట్టిదిగా రూపొందించుచున్న వ్యవస్థ జగద్గురువుల చాతుర్యము.

శ్రీ భారతీతీర్థమహాస్వామివారు "నానామ్నాయ" శ్లోకములో ప్రతీయ మానముగా నిక్షేపించిన జగద్గురులక్షణము లను ఇచట ఇంతవరకు సమీక్షించి సమన్వయించుకొంటిమి.

ఈ శ్లోకమున మరియునొక విశేషము కలదు. తురీయపాదమున "స చ సా చ సా చ స చ తాశ్చ' అను పద సముదాయమును జాగ్రత్తగా అనుశీలించుకొనవలయును.

"ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్"
ఆది.62.52

అను మహాభారత శ్లోకమునకు భారతభావదీపికావ్యాఖ్యానములో శ్రీ నీలకంఠులు ఒక విశేషార్థమును వక్కాణించి యున్నారు. "అత్ర ధర్మాది చతుష్టయే ఉపాదేయే, చకారచతుష్టయోక్తే అధర్మానర్థ దుఃఖ సంసారరూపే చతుష్కే హాతవ్యే చ విషయే హేయముపాదేయం చ కృత్స్నమత్రైవ నిరూ పితమ్. ఇతో-ధికం గ్రన్థాన్తరే నాస్తి కార్త్స్న్యేన సర్వేషాం శాస్త్రాణా మర్థం జ్ఞాతుకామేనై తదేవాదర్తవ్యమిత్యర్థః" (భారతభావదీపిక)

"ధర్మే చ" ఇత్యాది శ్లోకమున నాలుగు చకారములు (సముచ్చ యార్థక అవ్యయమగు 'చ' లు) కలవు. ధర్మము, అర్థము, కామము, మోక్షము అనునవి మానవులకు ఉపాదేయములు. తప్పక గ్రహింపదగినవి. వానితో పాటు నాలుగు చకారములవలన అధర్మ, అనర్థ, దుఃఖ, సంసారరూపము లగు నాలుగు వదలివేయవలసిన అంశములకు సంబంధించిన సర్వవిషయ ములును ఇందు నిబంధింపబడినవి. మొదటి నాల్గింటిని తెలిసికొని ఆద రింపవలయును. రెండవనాల్గింటిని తెలిసికొని వదలివేయవలయును. అని నీలకంఠులు రయణీయముగా వ్యాఖ్యానించి యున్నారు. అట్లే "స చ సా చ సా చ స చ, తాశ్చ" అను వాక్యభాగమునందును అయిదు చకారములు కలవు. వానివలన ఆమ్నాయ పరిశ్రమతోపాటు, ఆమ్నాయసదృశవాఙ్మయ మేదైననున్నచో దానియందలి పరిశ్రమము కూడ నిక్షేపించుకొనుట జగద్గురు కర్తవ్యమనునంశము ప్రతీయమానమగును. అట్లే 'సా' చ - అనుచోట శాస్త్రవిషయబుద్ధియు, లౌకిక ప్రాపంచిక శాస్త్ర విషయజ్ఞానమును, సా చ అను మూడవచోటి చ కారమువలన సంస్కృతేతరభాషా సాహిత్యాది జ్ఞానమును, 'స చ' అనుచోటి చ కారమువలన వినయసహృాదరములగు ఇతర విషయములును, "తాశ్చ" అనుచోటి చ కారమువలన ఇంకను మిగిలియున్న మహాత్మలక్షణములును సముచ్చయము చేసికొనవలయును. అనగా ఒక్కమాటలో "సర్వజ్ఞత" అనునది సిద్ధమగును. అట్టివారు "జగద్గురు" పదవాచ్యులగుదురు. అట్టివారు ఆదిశంకరభగవత్పాదులు. ఆ వృష్యశృంగకేశౌకృత్యవతార ప్రతిష్ఠిత శారదాపీఠమునకు అధ్యక్షత వహించు చున్న గురుపరంపర యంతయు నట్టివారే. ప్రకృతము మనకు అటువంటి మహావిభూతితో దర్శనమొసగుచున్న శ్రీశ్రీశ్రీ భారతీతీర్థమహాసన్నిధానము వారును, శ్రీశ్రీశ్రీ విధుశేఖరభారతీ సన్నిధానమువారును పైని వివరించు కొన్న జగద్గురుమహావిభూతికి వ్యక్తిత్వారోపరూపములైనవారు. విగ్రహవ త్సర్వజ్ఞమూర్తులు.

ఇప్పుడు ఇక్కడ మనము చెప్పుకొన్న లక్షణసమాహార మంతయు ఆ జ్ఞానమూర్తులందు ఊరకే ఉండుట కాదు. ఆడుకొనుచున్నవట. అనగా ఆ అధిష్ఠానమందు మాకు స్థితి లభించినదని అవి యన్నియు పరమానంద సాంద్రస్థితిలో ఉన్నవని భావము.

- ప్రాచార్య శలాక రఘునాథశర్మ

# శ్రీ శృంగేరి దివ్య దీధితి




జగద్గురువులు శ్రీశ్రీశ్రీ శంకర భగవత్పాదులవారు మానవ సమాజం మీద ఎనలేని ప్రేమ వాత్సల్యాలు కలవారు. భారతీయ పరతత్త్వాన్ని అన్ని అంతరాల వారికి, అన్ని తరాల వారికీ అందించటానికి వారు చేసిన కృషి విలువ కట్టరానిది. జ ్ఞాన భాస్కరునికి దివ్యదీధితులను కల్పించి విశ్వమంతా జ్యోతిర్మయం చేసిన పరమాత్మ స్వరూపులు. ఒకనాడు శ్రీవేదవ్యాసులు తలపెట్టిన "సర్వమానవోద్ధరణ"అన్న పునాది మీద ఏర్పడిన కార్యక్రమానికి నిండుదనం కూర్చిన వారు శ్రీ శంకరులు. అందుకే "శంకరః శంకరః సాక్షాద్, వ్యాసో నారాయణో హరిః" అన్న విశ్వాసం ఆస్తికుల హృదయాలలో పీఠం పెట్టుకొని కూర్చున్నది.

సాధారణంగా మానవులకు జగత్తు అంటేనే ఏమో సరిగా తెలియదు. జగదీశ్వరుడు ఎవరో అంతకన్నా తెలియదు. ఈ రెంటి సంబంధం తెలిసికొనటం మరింత కష్టసాధ్యమైన విషయం. కనుకనే మేధావులు ఈ విషయంలో తర్కబలంతో విజృంభించి తత్త్వ నిర్ణయాలు చేస్తూ ఉంటారు. మేధావుల సంఖ్య పెరిగిన కొలదీ అభిప్రాయాల సంఖ్య పెరుగుతూఉంటుంది. వారివారి పాటవాన్ని బట్టి, సాధారణ జనుల రుచిభేదాలనుబట్టి అనుయాయుల సంఖ్య కూడా పెరుగుతూనే ఉంటుంది. ఈ విధంగా మానవ సమాజంలో అనంత మతాలు ఏర్పడ్డాయి. కానీ సత్యం ఒక్కటే. అదే మానవులందరికీ ఎప్పుడైనా, ఎక్కడైనా గమ్యం. జ్ఞానగంగలైన ఉపనిషత్తులు ఆసత్యదర్శనం కోసమే ప్రవర్తించాయి. శ్రీ వేదవ్యాసాది సత్యతత్త్వజ్ఞులు తమ జీవితాలను, కేవలం లోకానుగ్రహకాంక్షతో, దానిని దేశకాల పాత్ర విభాగం లేకుండా అందరికీ తెలియ జెప్పటానికే అవతరించారు. వారి కార్యక్రమం నిరంతరమైనది. అందుకే వారు మానవజాతి సముద్ధరణకోసం విశ్వజనీన భావంతో కృషి చేశారు. శ్రీ వేదవ్యాసుల భారత భాగవత బ్రహ్మసూత్రాది గ్రంథ రచన ఆ కార్యక్రమంలోని ప్రధాన భాగం. శ్రీ శంకరుల ఆమ్నాయ పీఠస్థాపన కూడా ఆ తాత్పర్యంతో జరిగిదనే. ఈ విధంగా వారు అనంత దేశకాలాలలో భౌతికంగా కానక పోయినా వారి నిత్యమైన అస్తిత్వాన్ని ఆస్తిక సమాజం అనుభవానికి తెచ్చుకుంటూనే ఉంటుంది. అనాదిగా అవిచ్ఛిన్నంగా సాగుతున్న గురుపరంపరలో వారిని దర్శిస్తూనే ఉంటుంది.

శ్రీ శంకరులు ప్రచారం చేసినది అద్వైతతత్త్వం. ఇది ఒకరి సృష్టికాదు. పరమాత్మ ప్రసాదించినది. ఒకరి సృష్టి అయితే ఎలా పుట్టిందో అలాగే ప్రళయాన్ని కూడా పొంది ఉండేది. అలా కాకుండా మహాప్రళయాలను సాక్షి మాత్రంగా చూస్తూ నిలిచింది. కనుకనే పరమాత్మ వలె నిత్యసత్యమై ప్రకాశిస్తూ

ఉన్నది. అయితే శ్రీవేదవ్యాస శంకరభగవత్పాదాదులు చేసినది ఏమిటీ అంటే మానవుల హృదయాలలోని గాఢమైన అజ్ఞానమనే చీకటిని తొలగించి ఈ అమృతజ్యోతిని అందులో నిక్షేపం చేయటం. ఈ పని నిరంతరంగా నిరంతరాయంగా సాగటానికి వారిద్దరూ వేసుకున్న ప్రణాళికలను గూర్చి ముందే సంభావించాం. ఆ ప్రణాళిక ఫలితాలే భారతదేశపు నాలుగు చెరగులలో వెలసి దినదినమూ కాంతిపుంజాలను మరింతగా పుంజుకుంటూ విరాజిల్లుతున్న చతురామ్నాయ పీఠాలు. పూరీ క్షేత్రంలో మహాసముద్రం తీర్థంగా, ఋక్కు వేదంగా, "ప్రజ్ఞానం బ్రహ్మ" అనేది మహావాక్యంగా శ్రీ హస్తామలకులు మొదటి పీఠాధిపతులుగా, జగన్నాథుడు క్షేత్రదైవంగా ఉన్న జగన్నాథగోవర్ధన మఠం తూర్పు దిక్కును పరిరక్షిస్తున్నది. బదరికా క్షేత్రంలో అలకనంద తీర్థంగా, అథర్వణం వేదంగా "అయమాత్మా బ్రహ్మ"అనే మహావాక్యంతో శ్రీ తోటకాచార్యులు ఆదిపీఠాధిపతులుగా, నారాయణుడు క్షేత్రాదినాథుడుగా ఉన్న జ్యోతిర్మఠం ఉత్తర దిక్కును కాపుకాస్తున్నది. ద్వారకస్థావరంగా గోమతి తీర్థంగా, సామవేదనాదంతో మధురమై, "తత్త్వమసి"అనే మహా వాక్యశోభితమై శ్రీ పద్మపాదుల ప్రథమాచార్యకత్వంతో, సిద్ధేశ్వర క్షేత్రస్వామికంగా కాళికామఠం పడమటి దిక్కును పట్టి నిలుపుతున్నది. పరమ పవిత్రమైన శృంగేరీ క్షేత్రంలో, తుంగభద్ర తీర్థమై, యజుస్సు వేదమై "అహం బ్రహ్మాస్మి" అనే మహావాక్యంతో, శ్రీ సురేశ్వరాచార్యుల ఆద్య పీఠాధిపతిత్వంతో, శ్రీమలహానికరేశ్వరుడు దైవంగా శ్రీ శారదామఠం దక్షిణ దిక్కునకు రక్షణగా నిలిచినది. క్రమంగా ఈ పీఠాలకు శక్తి మూర్తులు వృషల, పూర్ణగిరి, భద్రకాళి, శారదలు. పీఠ భేదాన్ని బట్టి నామభేదాలు ఏర్పడ్డా దైవమూ, శక్తీ ఏక తత్వాలే అని మనం గుర్తించాలి. అంతేకాదు ఈ మఠాలకు స్థూలంగా దిగ్విభాగమే కానీ సూక్ష్మంగా భావిస్తే అన్నింటికీ అంతటా అస్తిత్వం ఉందనే విషయం కూడా మరచి పోకూడదు.

ప్రస్తుతం మనం - అంటే ఆంధ్ర, కర్ణాటక, తమిళ, మలయాళ భాషల వాళ్లం - శ్రీ శృంగేరీ శారదా మఠ పరిరక్షణ పరిధిలో ఉన్నాం. కనుక దీనిని గురించి మరింత తెలుసుకోవటం అవసరం.

శ్రీ శృంగేరి మొదటిపేరు శృంగగిరి. శ్రీ మద్రామాయణ కాలం నాటి రోమపాద చక్రవర్తి దేశంలో అనావృష్టి పీడితులైన జనానికి వర్షంతో హర్షం కూర్చినవాడూ, అనపత్యతాదోషంతో అలమటిస్తున్న దశరథ మహారాజునకు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే పుత్రుడుగా సాధించి పెట్టిన మహనీయుడు శ్రీ ఋశ్యశృంగ మహర్షి తపస్సు చేసుకొన్న పరమ పవిత్ర స్థలం శృంగేరి. ఋశ్యశృంగగిరి క్రమంగా



సంక్షిప్తంగా శృంగేరి అయింది. ఆ మహాత్ముడు తన భౌతిక కాయాన్ని విడిచి పెట్టే సమయంలో ఒక దివ్యజ్యోతి అతని దేహంనుండి వెలువడి తానర్చించేలింగంలో లీనమైనది. శృంగేరికి సుమారు ఆమడ దూరంలో ఉన్న కిగ్గగ్రామంలో ఆ ఆలయం ఇప్పటికీ ఉన్నది. అంతే కాదు ఋశ్యశృంగ జ్యోతి విలీనం చేసుకున్న దాని గుర్తుగా ఆ లింగం పై ఒక కొమ్ము కూడా కానవస్తుంది.

శృంగేరి దివ్యక్షేత్రం రూపుదిద్దుకొన్న ఈ పరమ పవిత్రస్థలం పచ్చని చెట్లతో, పరమస్వాదు జలాలతో చూచినంత మాత్రానే కడుపునింపే పంట పొలాలతో, ఆకాశానికి ఆధారస్తంభంగా భగవంతుడు నిలిపాడా అన్నట్లుండే పడమటి కనుమలన్న వ్యవహారనామంగల పర్వత పంక్తులలో అలరారుతున్నది. కనబోతున్న కప్పకు వాడిగా వేడిగా ఉన్న ఆదిత్య కిరణాలసోకు కాకుండా పడగవిప్పి కాపాడిన సర్పాన్ని చూచి శ్రీ శంకరులు స్థలమహిమను భావించి నిలయానికి స్థల నిర్ణయం చేశారట. తుంగభద్రా జలాలిచ్చే తుష్టి పుష్టులు దానికి మరింత పావనత్వం చేకూర్చాయి. ఇలా పరమ మనోజ్ఞంగా ఉన్న ఆదివ్యభూమిలో శ్రీ ఆచార్యపాదుల వారు ప్రథమమూ, ప్రధానమూ అయిన పీఠాన్ని నెలకొల్పి శ్రీ సురేశ్వరాచార్యుల వారిని పీఠాధిపతిగా నియమించారు.

అవైదిక భావాలతో అతలాకుతలం అవుతున్న

మనుష్యుల మనోవృత్తులను ఒకదారికి తెచ్చి ముందు కర్మనిష్ఠ కలవారై నిర్మల జీవితం సాగిస్తే అది క్రమంగా పాకానికి వచ్చి వారి హృదయాలు ఆత్మనిష్ఠకు ఆలవాలాలవుతాయన్న భావంతో పరమేష్ఠి ఆపనికిగాను అవతరించాడని భావింపదగిన శ్రీమండన మిశ్రులు, అన్ని విధాల తనకు, తన ధర్మ కార్య ప్రణాళికకూ తగిన విధంగా తోడ్పడటానికి వచ్చిన భారతి ఉభయ భారతి నామంతో అర్ధాంగి కాగా మగధ దేశంలో మాహిష్మతీపురంలో ఉండగా శ్రీ శంకరులు వారిద్దరినీ "కనిపట్టి" వశం చేసుకున్నారు. శ్రీమండన మిశ్రులే తురీయాశ్రమంలో శ్రీసురేశ్వరులు. అమ్మ ఉభయ భారతియే శ్రీ శారదా నామంతో పీఠశక్తిగా రూపొందినది. ఎంత మహత్త్వ పూర్ణమైన ఘటన! సంకల్పశక్తి, స్థలశక్తి, ఆచార్యశక్తి, పీఠశక్తిశక్తి వీనిలో ఏ ఒక్కటి సుదృఢంగా ఉన్నా సిద్ధిపూర్ణశాతంతో ఉంటుందని భావింపదగిన స్థితిలో అన్నీ అనితర సాధ్యప్రమాణంలో సమకూడితే ఆ సౌభాగ్యం అప్రమేయదశలో ఉంటుందనటం స్వభావోక్తియే కదా! వీనికి తోడు పీఠానికి అలంబనమైన యజుర్వేదం, మహావాక్యమైన "అహం బ్రహ్మాస్మి" అనేవి మరింత ప్రాధాన్యాన్ని సంతరించాయి. వేదమాత మనోమయుడనే పురుషునికి యజుస్సు శిరమనీ, ఋక్కు దక్షిణ పక్షమనీ, సామం ఉత్తర పక్షమనీ అభిర్ణించింది. 'సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్" మొత్తం దేహానికి శిరస్సు ప్రధానము అనిగదా సూక్తి. అంతేకాక శ్రీ శంకరులు ఆ వేదవాక్యానికి భాష్యం చెబుతూ "తస్య శిరస్త్వం ప్రాధాన్యాత్. ప్రాధాన్యం చ యాగాదౌ సంనిపత్యోపకారకత్వాత్, యజుషా హి హవిర్దీయతే స్వాహాకారాదినా" అన్నారు. యజుస్సు శిరస్సు ఎలా అయిందంటే ప్రాధాన్యాన్ని బట్టి, ప్రాధాన్యం ఎలాగు అంటే యజ్ఞాదులలో అది సూటిగా ఉపయోగపడుతున్నది. యజ్ఞంలో యజుర్మంత్రాలతోనే స్వాహాకారం కలిపి హవిస్సు లిస్తారు అని పై వాక్యాలకు అర్థం. అలాగే మహా వాక్యాల క్రమ పరిణామంలో చివరి మెట్టులో నిలబడేది "అహం బ్రహ్మాస్మి". పీఠం దక్షిణ దిక్కున ఉండటం కూడా ఒక విశేష విషయమే. సర్వజ్ఞులు దక్షిణామూర్తి రూపంలో చిన్ముద్రతో మౌన భాషతో జ్ఞానబోధ చేశారన్న మాటను ఇక్కడ అనుసంధించుకొంటే దక్షిణ దిక్కు మహిమ అవగతమవుతుంది. ఈ విధంగా ఏ కోణంనుండి చూచినా ఏ లోపమూ లేని మహోన్నతస్థితి కలది శ్రీ శృంగేరీ దక్షిణామ్నాయ మహాపీఠం.

ఇక శ్రీసురేశ్వరుల అనంతరం పీఠాధిపతులైన మహానుభావులందరూ కూడా మహాతపస్సంపన్నులు, దివ్యతేజో విరాజితులు, అపారకృపా పరమేశ్వరులు. పరమవైరాగ్య



పరిశోభితులు. ఒక్క చూపు, ఒక్క వాక్కు, ఒక్క భావన చాలు ఆర్తీ, జ్ఞానదాహం కలవారికి ఆనంద సాంద్రస్థితి కూర్చటాని కన్నంత జ్ఞాన భాస్కరులు. అవధులు లేని వాత్సల్యంలో వారు స్వయంగా సీమ సీమలలో అవిశ్రాంత సంచారాలు చేస్తూ ప్రజలను జ్ఞానమార్గం లోనికి ఆకర్షిస్తున్నారు. క్షణం తీరికలేని దినచర్యలో మునిగి ఉండి కూడా, క్రమంతప్పని అనుష్ఠాన పూజా కార్యక్రమాల చట్రంలో బద్ధులై ఉండి కూడా, ఆర్తులకు అవసరాలకు అనుగుణంగా అమృతపు జల్లులు కురిపిస్తూనే ఉంటారు. సంప్రదాయ పరిరక్షణలో శాస్త్రమర్యాదలను కాపాడటంలో, సన్యాసిధర్మ నిర్వహణలో సర్దుబాటులు దిద్దుబాటులు ఎఱుగని నడవడి వారిది. కాషాయాంబర పరిశోభితులై, కాషాయ పతాకాసమలంకృతదండం చేతబూని, మధురస్మితం ముఖమండలానికి అనితర సాధారణ దీప్తిని కల్గిస్తూ ఉండగా వ్యాఖ్యాన సింహాసనం అధిష్ఠించి వారు అనుగ్రహ భాషణం చేస్తూంటే విన్న వారి భాగ్యమే భాగ్యం. పీఠంలోని శ్రీ శారదా చంద్రమౌళీశ్వరులకు, తదితర అర్చామూర్తులకు వారు నియమ నిష్ఠలతో వేదనాదాలతో, నిర్మల జలాలతో, పులకించి పోతున్న పుష్పాదులతో పూజలు చేస్తుంటే కన్నవారి పుణ్యమే పుణ్యం. ఆ మధురానుభూతి అనుభవదశలో స్వల్ప కాలికమే అయినా మృదయపేటికలో స్మరణ రూపంలో శాశ్వతంగా నిలిచిపోతుంది.

శ్రీ శంకరుల స్థాపనతో, శ్రీ సురేశ్వరుల పాలనతో పరమ



పవిత్రతను సంతరించుకొన్న శ్రీ శృంగేరీ దక్షిణామ్నాయ మహాపీఠం శ్రీ విద్యారణ్యుల కాలంలో మరింత మహావైభవాన్ని సంతరించుకొన్నది. శ్రీ విద్యారణ్యులు ఐహిక మహా సామ్రాజ్య స్థాపనకు ఆధ్యాత్మ మహా సామ్రాజ్య పరిరక్షణకు చేసిన కృషి నాన్యతోదర్శనీయమైనది. శ్రీవారి విజయనగర సామ్రాజ్యస్థాపన ఒకయెత్తు. వేదాంతపంచదశిరచన మరొక యెత్తు. విజయనగరసామ్రాజ్య స్థాపకులు హరిహర బుక్కరాయలుల దాన శాసనంలో వ్రాసుచ్చిన ఈ క్రింది విషయం ఒక్కటి చాలు శ్రీవారి మహామహిమను గుర్తించటానికి.

"శ్రీవారిని బ్రహ్మ అందామా? నాలుగు ముఖాలు లేవే! విష్ణువందామా? నాలుగు చేతులేవీ? పోనీ కైలాసవాసి శంకరు డందామా? అంటే మూడవ కన్ను లేదు గదా! కనుక వారు సాక్షాత్తు పరబ్రహ్మమే."

వారు వ్రాసిన వేదాంత గ్రంథాలు జ్ఞానదాహం కలవారికి చక్కని చల్లని చలివేంద్రాలు. ముఖ్యంగా వారి శంకర విజయ గ్రంథం మహోదాత్త రచన. శ్రీ శంకర భక్తులు దానినే పరమ ప్రమాణంగా స్వీకరిస్తారు.

అలాగే శ్రీ శృంగేరీ పీఠం ఒక మతాతీత వ్యవస్థగా కూడా విరాజిల్లింది. పీఠపు మహాచార్యులు అనాదిగా దర్శించి ప్రచారం చేసిన పరమతత్త్వం అద్వైతం విశ్వజనీనమైనది. దీనికి నిదర్శనాలు కొల్లలు. ఉదాహరణకు ముప్పదవ ఆచార్య స్వాములు శ్రీ సచ్చిదానంద భారతీ స్వాముల వారి కాలంలో మైసూరు సింహాసనాన్ని అధిష్ఠించిన టిప్పు సుల్తాన్ శృంగేరీ పీఠానికి వ్రాసిన ఉత్తరాలను పరికిస్తే అతనికి శ్రీ స్వాములవారియందూ, పీఠంమీదా ఉన్న అనంత గౌరవం అభివ్యక్త మవుతుంది. తన కష్టాలు తొలగటానికి సుల్తాన్ సహస్ర చండీయాగం చేయించవలసినదిగా శ్రీ స్వాములను చాలా భక్తితాత్పర్యాలతో ప్రార్థించాడట!

అలాగే మహాజ్ఞాన సంపన్నులు శ్రీ చంద్రశేఖర భారతీ స్వాములవారి సన్నిధికి పాశ్చాత్యులెందరో జ్ఞానదాహంతో వచ్చి తృప్తినంది వెడలిన సన్నివేశాలు ఉన్నాయి. ఇవి శ్రీ పీఠశక్తి విశ్వజనీనతకు ఒకటి రెండు మచ్చుతునుకలు.

శ్రీ శృంగేరీ పీఠం అధిపతులుగా ఉన్నవారు ఆధ్యాత్మ విద్యా ప్రవచనప్రచారాలు, ప్రజల హృదయాలలో ఆస్తిక్య భావం పెంపొందించటం, ధర్మ సూక్ష్మాలను విచేచించి పరిష్కారాలను ప్రతిపాదించటం వంటివి కర్తవ్యాలుగా భావిస్తారు. ఈ కర్తవ్య నిర్వహణలో గ్రంథరచన, ఆలయ ప్రతిష్ఠాపన, ప్రత్యేక సందర్భాలలో ఉత్సవాదులను ఉదాత్త ధోరణిలో రూపొందించి చేయించటం వగైరాలు అంగాలు. వేద ధర్మానికి తమ శక్తిమేరకు దోహదం చేస్తూ ఉంటారు. ధార్మిక విషయాలలో ప్రభుత్వం అపేక్షిస్తే సరియైన మార్గం చూపటం కూడా వారు కర్తవ్యంగా భావిస్తారు. ఒక విధంగా వారు రఘువంశానికి వసిష్ఠుల వంటివారు.

శ్రీ శృంగేరీ పీఠ ప్రాచీన ఆచార్యులు కొందరు అతిగహన మైన విషయాలమీద మహా గ్రంథాలు రచించారు. అందులో శ్రీ నిత్యానందబోధ ఘనులు వ్రాసిన సంక్షేప శారీరకం, జ్ఞానఘనులు రచించిన తత్త్వసుధ, జ్ఞానోత్తములు రచించిన విద్యాశ్రీ, శ్రీ సచ్చిదానంద శివాభినవ నరసింహ భారతీ స్వాములవారి భక్తి సుధాతరంగిణి, శ్రీ చంద్రశేఖర భారతీ స్వాముల వారి వివేక చూడామణి వ్యాఖ్యానం, మొదలైనవి వేదాంత జిజ్ఞాసువులకు కరదీపికలు.

మనకాలంలో జ్ఞాన భిక్షను దర్శన భాషణ ఉపదేశాదుల ద్వారా అందించిన మహా పుణ్యమూర్తులు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖర భారతీ స్వాములవారు. శ్రీశ్రీశ్రీ అభినవ విద్యాతీర్థస్వాముల వారు, శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ స్వాముల వారు. అవిశ్రాంత తపోనిరతికి ఒకరూ, నిర్ణిద్రమైన ధర్మకార్య నిర్వహణరతికి మరొకరూ, సుమధుర గంగా సదృశ సుభాషణ పాండితికి ఇంకొకరూ ప్రమాణ భూతులై ప్రకాశించారు. ఈ పేర్కొన్న విషయాలు ప్రాధాన్య దృష్టిలో గ్రహించవలసినవే కానీ తదితర మహోదాత్త గుణ విశేషాలెన్నో వారిలో మహోత్తాలంగా విరాజిల్లుతూ ఉన్నాయి.

ఇప్పటి మహాస్వాములు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థులు మూర్తీభవించిన జ్ఞాన స్వరూపులై ప్రాచీన మహర్షుల పవిత్ర స్ఫూర్తికి ప్రతీకలై శ్రీ శంకరులు సంభావించిన ధర్మాద్వైత స్థితి సాధనకు నిరంతరకృషి చేస్తున్నారు. శ్రీ శృంగేరీ దివ్యక్షేత్రానికి వ్యయ ప్రయాసల కోర్చిపోలేని అభాగ్యుల సముద్ధరణకోసం

శ్రీవారు తమ గురువులు చూపిన బాటలో అనేక మహానగరాలలో, నగరాలలో శ్రీ శృంగేరీ శారదా శంకర మందిరాల నిర్మాణంకోసం తమ తపశ్శక్తిని ధార పోస్తున్నారు. ఈ మందిరాలు ఇంచుమించు శృంగేరిని దర్శించినంత అనుభూతిని కలిగిస్తూ ఉండటమే కాక నిత్య ఆధ్యాత్మిక ప్రవచనాలతో, ఉత్సవాదిదినాలలో ప్రత్యేక పూజా విధానాలతోపాటు నిత్య సంప్రదాయ పూజా నిర్వహణలతో అలరారుతూ ఆస్తికులకు అమృతాన్నాన్ని అందిస్తున్నాయి.

శ్రీవారి కృపావీక్షణం, మనభాగ్యం కొద్దీ, అనంతపురం మీద కూడా ప్రసరించింది. మందిర నిర్మాణం జరుగుతున్నది. మన మనోమందిరాలలో మాన్య శారదా శంకరుల సుస్థితికి దోహదం చేస్తుంది. ఈ మహోన్నత పవిత్ర కార్యక్రమంలో తానీషా దండన పొందనవసరం లేని రామదాసులు ఎందరో! అందరూ మహానుభావులే. అందరూ అభినందనార్హులే. అందరూ నిష్కల్మష సేవా తత్పరులే.

నా మొదటిశ్లోకంలోని ప్రతిపదమూ కేవల స్తుతిపరము కాదు, సత్యకథనమే అనటానికి ఈ వ్యాసంలోని అంశాలను ఇక్కడనిక్షేపిస్తున్నాను.

**స్ఫాయద్వాగ్విభవం మహోజ్జ్వలతప శ్శ్రీపూర్ణదివ్యప్రభం**
**సుస్మేరం సువిభాసి మన్త్రమనన ప్రస్నిగ్ధగణ్డచ్ఛవి**
**కారుణ్యామృతవర్షి నేత్రయుగల ప్రస్పన్దమానత్విషా**
**పూర్ణం సద్గురురాజసుందరముఖం సేవే తమోనుత్తయే**

2

శ్రీ భారతీతీర్థమహాస్వాములవారి సుందరముఖాన్ని నాలోని తమోగుణం నశించిపోవటం కోసం సేవించుకుంటాను. ఆముఖం నిండుగా పుష్టమైన వాక్కుల వైభవం కలది.చాలా గొప్పదీ ఉజ్జ్వలమైనదీ అయిన తపస్సంబంధమైన సంపల్లక్ష్మితో నిండినదివ్యమైన కాంతులు కలది. నిరంతరమూ చిఱునగవుతో అలరారేది, చక్కగా ప్రకాశిస్తూ ఉండేది. వేదమంత్రాలను మననం చేస్తున్న కారణంగా చక్కగా నిగనిగలాడుతూ ఉండే బుగ్గలకాంతులు కలది. కారుణ్యమనే అమృతాన్ని కురిపించే కన్నుల జంటయందు కదలాడుతున్న కాంతులతో నిండినది. శ్రీవారు సద్గురువులలో మహోన్నత స్థానంకలవారు. అట్టివారి వదనాన్ని నేను సేవించుకుంటాను.

స్ఫాయత్ అంటే 'ఎప్పటికప్పుడు శక్తిసంపదను పుంజుకొంటున్న' అనే అర్థాన్ని నేను సంభావిస్తున్నాను. 'వాక్' అంటే కేవలం లౌకికమైన వాక్యాలు అని అర్థం కాదు. ఆదికవి నన్నయభట్టారకుడు "సా వాగ్యారసవృత్తిః" - రసవృత్తి కలదియే వాక్కు అన్నారు. రసం అంటే అచ్చమైన నిర్మలమైన ఆనందం. అది పరమాత్మవాచకం కూడా కనుక శ్రీవారి వదన సీమనుండి వెలువడే ప్రతివాక్కు వేదసమ్మితంగా ఉంటుంది. అటువంటి వాక్కుల వైభవం కలది శ్రీవారి వదనం.

తపస్సు అంటే గాఢ భావన. వేదం "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ" అంటున్నది. తపస్సుతో బ్రహ్మమును తెలిసికొనే





ఇచ్చ కలవాడవు కమ్ము అంటున్నది. కాబట్టి తపస్సు ఫలితం బ్రహ్మజ్ఞానం. సాధారణులకు చేయనలవికానిదీ, దివ్యకాంతులనుపైకి ప్రసరింపజేసేదీ అయిన తపస్సంపద శ్రీవారిమోమునందు నిండుకాంతులను వెలువరిస్తూ ఉంటుంది.

ఆ వదనంలో ఒకవిధమైన ఆనందరేఖ పొడసూపుతూ ఉంటుంది. అందువలన అది సుస్మేరము. ముఖంలో నిరంతరంగా ఆనందరేఖ పొడసూపటమంటే వైరాగ్య పటిమతో శ్రీవారు సంసారదుఃఖవాసన రవంతకూడా లేని మహాత్ములని భావం. నిత్యసత్యానందస్వరూపులని తాత్పర్యం.

సువిభాసి - గొప్పగా, విశేషంగా కాంతిమంతమై ఉంటుంది ఆ ముఖం.

ముఖం హృదయంలోని భావాలకదలికలకు సూచికగా ఉంటుంది. హృదయం అల్లకల్లోలంగా ఉంటే ముఖం ప్రసన్నకాంతులతో నిలకడగా ఉండటం చాలా కష్టసాధ్య మైన విషయం. కనుక ముఖం సువిభాసి అయి ఉన్నదంటే వారిత్రికరణాలూ నిర్వికారాత్మకంగా ఉండటాన్ని అభివ్యక్తం చేయటమే.

శ్రీవారు వేదమంత్రాలను వదనంలో ఆవృత్తి చేసుకుంటూ ఉంటారు. దానివలన ఆస్యంలో ఒకవిధమైన వ్యాయామం సహజంగా కలుగుతూ ఉంటుంది. దానివల్ల ఏర్పడిన శక్తివిశేషంతో కపోలమండలం నైగనిగ్యంతో విరాజిల్లుతూ ఉంటుంది. ఆ నైగనిగ్యం శిష్యకోటికి ఉపదేశాత్మకంగా ప్రకాశిస్తూ ఉంటుంది. అవకాశం దొరకినప్పుడల్లా గురూపదేశంతో పొందిన మంత్రాలను పురశ్చరణ చేయండి, నాయనలారా! అని ఆ ఉపదేశం.

శ్రీవారి కన్నుల కాంతులను సావధానంగా పట్టుకోగలిగితే వానిలో అపారమైన కారుణ్యామృతం జాలువారుతున్న స్ఫూర్తి కలుగుతుంది. ఆ అమృతంలో చైతన్యపు వెలుగులు నిండిఉంటాయి. ఆ వెలుగులను నింపుకొని ఆముఖం అలరారుతూ ఉంటుంది. అది తాత్త్విక మార్గసంచారు లకు పాథేయం వంటిది.

మానవుడు ప్రధానంగా కోరుకోవలసినది అజ్ఞానం అనేతమస్సు నామరూపాలు లేకుండా తననుండి తొలగిపోవటం. ఆ ప్రయోజనసిద్ధికోసం వివేకం కలవాడు. సాక్షాత్పరబ్రహ్మస్వరూపమైన సద్గురురాజముఖారవిందాన్ని సేవించుకోవాలి. ఇదీ ఈ శ్లోకంలో ఈ శ్లోకకర్త సంభావించిన పరమార్థం.

**సంసారార్ణవమగ్నదీనజనతా తాపాపనుత్త్యై స్వయం**
**దేహం చిన్మయ మాకలయ్య కరుణావిభ్రాజితాపాంగకమ్,**
**భూమౌ సంచరతీహ సద్గురు రసౌ శ్రీశంకరాభిఖ్యయా**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీభారతీస్వామినే 3**

శ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వాములు ఒక అవతారమూర్తి అని నా హృదయం నాకు ప్రకటిస్తూ ఉంటుంది. అవతారాలకు ప్రత్యేక ప్రయోజనాలు ఉంటాయి. అందులో మొదటిది దీనజనులతాపాపనోదనం. ఆధ్యాత్మికమూ, ఆధిభౌతికమూ, ఆధిదైవికమూ అని తాపం మూడు

విధాలుగా ఉంటుంది. దానికి మూలకారణం సంసారం. అది ఒక మహాసముద్రం. అందులో తలమున్కలుగా పడి దిక్కుతోచక దీనులైన జనసముదాయాల తాపాలను రూపుమాపటం. అనే మహాకార్యంకోసం జ్ఞానమయమైన దేహాన్ని ఏర్పరచుకొని కరుణతో విరాజిల్లే కడకంటిచూపులతో ఈ సద్గురువులు భూమిపై సంచరిస్తూ ఉన్నారు.

**శాన్తా మహాన్తో నివసన్తి సంతో వసన్తవ ల్లోకహితం చరన్తః**
**తీర్ణాః స్వయం భీమభవార్ణవం జనా నహేతునాన్యానపి తారయన్తః.**

- వివేకచూడామణి 39.

అన్న వివేకచూడామణి శ్లోకం దీనినే తెలియజేస్తున్నది. సద్గురువులది సామాన్యులది వలె కేవలం పార్థివదేహం కాదు. అది చిన్మయం. ఎలాగా అంటే అటువంటి మహాత్ముల సర్వవ్యవహారాలూ చైతన్యమయంగానే ఉంటాయి. ప్రకృతం శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థస్వాములువారు శంకరాభిఖ్యతో భూమియందు శిష్యుల ననుగ్రహించటంకోసం సంచరిస్తూ ఉన్నారు. 'శంకరాభిఖ్య' అన్నదానిలో నాభావనలో శంకరమైన అభిఖ్య. శంకరుల అభిఖ్య అని రెండర్థాలు ఉన్నాయి. శ్రీభారతీతీర్థస్వాములు అనేపేరే శంకరమైనది. 'శంకరోతీతి' అనేవ్యుత్పత్తి నాశ్రయించి పారమార్థిక శుభాన్ని కలిగించే పేరు అనీ, ఆదిశంకరులపేరు అనీ ఇక్కడ సంభావింపదగిన అర్థాలు. ఆ అభిఖ్యతో శ్రీవారు సంచరిస్తున్నారు.

అటువంటి శ్రీగురుమూర్తికి, శ్రీశ్రీశ్రీ భారతీతీర్థస్వాముల వారికి ఇదిగో నమస్కారం. నమస్కారమంటే సర్వసమర్పణ భావనను హస్తములతో సూచించే ముద్ర. అయిదు జ్ఞానేంద్రియాలను, అయిదు కర్మేంద్రియాలను మనస్సుతోపాటు తమకు అర్పణ చేసుకుంటున్నాను అని చెప్పటం నమస్కారముద్ర తాత్పర్యం.

**అధిగతతత్త్వా బాల్యే ప్రోన్మూలిత వాసనా శ్చ కౌమారే**
**సాధిత సద్గుణ కరుణా యౌవన ఏవాస్మదీయగురుదేవాః 4**

అస్మదీయగురుదేవులు శ్రీభారతీతీర్థ స్వాములవారు కారణజన్ములు, అవతార మూర్తులు అనటానికి ప్రమాణభూతవిషయాలు మూడు కానవస్తున్నాయి. బాల్యంలోనే శ్రీవారు విద్యాతత్త్వాన్ని స్వాయత్తం చేసుకొన్నారు. శ్రీశంకరులు "బాలస్తావ త్క్రీడాసక్తః" బాలుడంటేనో ఆటల యందు తగులం కలవాడు అన్నారు. అది స్వభావం - అంటే దురతిక్రమం. కానీ శ్రీవారు దానికి లోబడక చిన్నవయసులోనే తత్త్వాధిగమభూషితు లైనారు. కౌమారం అంటే బాల్యం తరువాతి వయోదశ. ఆటలయందలి ఆసక్తిని ఇంకా వదలని వాడు అని కుమార శబ్దానికి వ్యుత్పత్తిని నిఘంటువులు సూచిస్తున్నాయి. అటువంటి కౌమారదశలోనే శ్రీస్వామివారు విషయవాసనలను సమూలంగా పెల్లగించి వేశారు. సంన్యాసాశ్రమ ప్రవేశానికి ఆవిధంగా తమ్ము తాము సిద్ధం చేసుకొన్నారు. ఇది కూడా అసాధారణ విషయం. ఇంక విషయ వాంఛలు ఉక్కిరిబిక్కిరి చేసే యౌవనంలో సద్గురువుల కరుణను సాధించారు. జగద్గురు సార్వభౌమపట్టాభిషేకం



పొందారు. శ్రీ శృంగేరీ శారదామాత్రను గ్రహంతో, శ్రీశ్రీశ్రీ అభినవ విద్యాతీర్థమహాస్వాముల కరకమల సంజాతులై శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థస్వాములుగా అవతరించారు. మానవసమాజానికి మార్గదర్శనం చేయించే జగద్గురువు లైనారు. ఇటువంటి సౌభాగ్యం మహాత్ములెవరో కొందరికి మాత్రమే కలుగుతుంది.

**ఆరాధయామ సతతం గురుపాదుకాజ్ఞే**
**స్వాన్త స్తమః పటల దారణ సుప్రతీతే**
**జ్ఞానప్రదానపటుకాన్తివిరాజమానే**
**తాపత్రయార్తజనతా విధుమణ్డలే తే 5**

మేము పద్మాలవంటి గురుపాదుకలను ఎల్లవేళలలో ఆరాధించు కుంటాము. ఎందుకంటే అవి మా అంతరంగంలోని చీకట్లరాశులను చీల్చిచెండాడటంలో ప్రసిద్ధి గాంచినవి. జ్ఞానాన్ని శిష్యుల హృదయంలో సుస్థిరంగా నిలపటంలో పటువైన కాంతితో విరాజిల్లుతున్నవి. ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము అనేమూడు విధాలైన తాపాలతో అలమటించి పోయే జనసముదాయానికి చంద్రబింబాలవంటివి.

భారతీయ ఆర్ష సంప్రదాయంలో గురువు సాక్షాత్తు పరమాత్మయే. ఆయనకు సంబంధించిన భౌతికస్థితి గతులను విచారించటం ధర్మవిరుద్ధం. ఆ అధిష్ఠానంలో వెలుగొందుతున్న ఆధ్యాత్మిక చైతన్యాన్ని మాత్రమే దర్శించుకోవటానికి త్రికరణాలను సమాయత్తం చేసుకోవాలని శాస్త్రాలు చెబుతున్నాయి. అందువలన గురుపాదుకార్చన శ్రేయోదాయకం అవుతుంది. ఆదృష్టితో ఈ శ్లోకం రూపొందినది.

**శ్రీభారతీతీర్థ జగద్గురూణాం సందర్శనాభాషణ వారిబిన్దూన్**
**సంప్రాప్తుకామాశ్చ నిరీక్షమాణా ధన్యా భవామో-ద్య ఫలస్య సిద్ధేః 6**

మేము శ్రీభారతీతీర్థనామంతో విరాజిల్లుతున్న జగద్గురువుల సందర్శనం సంభాషణం అనే నీటి బిందువులను పొందాలనే కోరికతో బహుకాలం వేచిఉన్నాం. ఇప్పుడు ఫలసిద్ధి కలిగినందువలన ధన్యులమ వుతున్నాం.

జగద్గురువులను సందర్శించుకోగలగటం, వారితో కొన్ని క్షణాలయినా సంభాషణ చేయగలగటం ఒక మహాభాగ్యం. ఎందుకంటే శ్రీవారు నిరంతర తపో-నుష్ఠాననిష్ఠలో ఉంటారు. అందరినీ ఏకరూపంగా అనుగ్రహించటం సాధ్యం కాని విషయం. అయినా పరమకృపాపరతంత్రులైన శ్రీవారు లక్షలకొలదిగా ఉన్న భక్తజనులను అనుగ్రహించటం కోసం, రెండుదశాబ్దాల కాలంగడచిన తరువాత విజయయాత్రకు అనుమతిని ఇచ్చారు. వచ్చారు. దానితో అస్మదాదుల చిరకాలవాంఛ ఫలితానికి వచ్చింది. ఆవిధంగా మేము



ధన్యులమయ్యాం.

**వన్ద్యం శ్రీభారతీతీర్థజగద్గురు పదాంబుజమ్**
**యదనేక పురాజన్మ సుకృతై రాప్యతే బుధైః 7**

ఎన్నో పూర్వజన్మల పుణ్య విశేషంచేత వివేకవంతులు శ్రీ జగద్గురు భారతీ తీర్థుల పాదపద్మాలను పొందగలుగుతారు. అట్టి పదాంబుజం మాకు పూజింపదగినది.

**శారదాచన్ద్రమౌలీశ్వరార్చనే పీఠసంస్థితాన్**
**స్వామినః పరిపశ్యన్తో ధన్యాః ఖలు వయం జనాః 8**

సద్గురుసార్వభౌములు ప్రతిదినం నిర్దిష్టసమయాలలో శ్రీశారదాచంద్ర మౌళీశ్వరార్చన స్వయంగా చేస్తారు. ఆ అర్చనను చూడటం ఒక మహాభాగ్యం. మహోపదేశదాయకం.

సాధారణంగా చాలమంది దేవతార్చనను యాంత్రికంగా చేస్తూ ఉంటారు. షోడశోపచారాలను ఎప్పుడు పూర్తి అవుతాయా అన్నధోరణిలో మొక్కుబడితీరులో నిష్ఠ లేకుండా, కొన్ని సందర్భాలలో పరిసరాలలో ఉన్నవారి మెప్పుకోసం చేస్తూ ఉంటారు. కానీ శ్రీవారి శ్రీశారదాచంద్రమౌళీశ్వరార్చన చూచినకొద్దీ చూడాలనిపిస్తుంది. దాదాపు రెండుగంటల సమయం కూడా ఇట్టే గడచిపోయినట్లుంది. ఉదాత్త సంగీత జ్ఞానం కల వ్యక్తులు అతిమనోహరంగా పాటలు పాడుతారు. అంతకుముందు అక్కడకు చేరుకున్న విప్రవరేణ్యులందరూ రుద్రాధ్యాయాన్ని భక్తి పారవశ్యంతో అభిషేకకాలంలో శ్రు



తిసుభగంగా పఠిస్తూ ఉంటారు. అక్కడ కూర్చున్న నావంటివారికి ప్రమథగణాలు పరివేష్టించి ఉన్న పరమశివుని సన్నిధానంలో ఉన్న అనుభూతి కలుగుతూ ఉంటుంది. అటువంటి అనుభూతి కలిగిన సందర్భాలు గణనీయంగానే ఉన్నాయి. అందువలన మేము ధన్యుల మయ్యామన్న భావం కలుగుతున్నది.

**వేదాన్తవిజ్ఞానసునిశ్చితార్థాః సంన్యాసయోగాత్ విశుద్ధసత్త్వాః**
**శ్రీభారతీతీర్థ గురూత్తమానః సదార్ద్రచిత్తాః పరిపాలయన్తామ్**

మహానారాయణోపనిషన్మన్త్రసముదాయంలోని పన్నెండవ అనువాకానికి సంబంధించిన పదునైదవ మంత్రంలోని కొన్నిపదాలు నన్నునుగ్రహింపగా ఈ శ్లోకం ఏర్పడ్డది.

వేదాంతములు అంటే ఉపనిషత్తులు, వానినుండి ఏర్పడిన విజ్ఞానం అంటే సంసారాన్ని నివర్తింపజేసే పరమాత్మజ్ఞానం. దానిచేత సునిశ్చితమైన అర్థం కలవారు. సునిశ్చితం అంటే అభిధానాన్ని బట్టి తాత్పర్యాన్నిబట్టి మరొక అర్థం ఏమైనా ఉన్నదేమో అనే సందేహం లేకుండా ఏకరూపంగా నిర్ణయింపబడిన తాత్పర్యం. అది జీవబ్రహ్మైక్యాత్మకమైన అద్వైతం. అది కలవారు వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థులు. బ్రహ్మవేత్తలు అని తాత్పర్యము. బ్రహ్మ విద్బ్రహ్మైవభవతి అంటున్నది వేదాంతం. బ్రహ్మము నెరిగినవాడు బ్రహ్మమే. కనుక వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థులైన మన గురుదేవులు సాక్షాత్పరబ్రహ్మమే.

"సంన్యాసయోగాత్తవిశుద్ధసత్త్వాః" సంన్యాస యోగంవలన పొందిన విశుద్ధ మైన సత్త్వం కలవారు. సంన్యాసం అంటే సర్వకర్మ పరిత్యాగ లక్షణం. కేవలం బ్రహ్మము నందే నిష్ఠ కలిగిఉండటం. శాస్త్రాలు వివిదిషాసంన్యాసం, విద్వత్సంన్యాసం అని సంన్యాసం రెండు విధాలుగా ఉంటుందని చెబుతాయి. వివిదిష అంటే తెలుసుకోవాలి అనే కోరిక. దానితో చేసే సర్వకర్మపరిత్యాగం వివిదిషాసంన్యాసం. విద్వాన్ అంటే తత్త్వం సంపూర్ణంగా తెలిసి ఉన్నవాడు. అతనికి సంబంధించిన సంన్యాసం విద్వత్సన్యాసం. ఈ సందర్భంలో సంన్యాస యోగం అంటే విద్వత్సంన్యాసమే. మన గురుదేవులు విద్వత్సంన్యాసులు. సర్వకర్మఫలములను ఈశ్వరుని యందు సమర్పించి ప్రమాదము, విపర్యయము, వికల్పము, నిద్ర, స్మృతి అనే అయిదు చిత్తవృత్తులను నిరోధించటంచేత పొందిన యోగం కలవారు. విషయభోగాలనుండి మరలిన చిత్తం కలవారు. మనం శ్రీ భారతీతీర్థస్వామి వారిలో అటువంటి పరబ్రహ్మతత్త్వ దర్శనం చేసుకోవటానికి అవకాశం కల్పించిన మహాయోగులు. అణుమాత్రమైనా ఇంద్రియాది వికారాలు లేని దివ్యమైన హృదయం కలవారు.

అందువలననే వారు గురూత్తములు. గీతావాక్యస్ఫురణతో ఈ పదం ఇక్కడ కుదురుకొన్నది. "ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః". ఉత్తమ పురుషుడు ఇంకొకడు. అతనిని శాస్త్రాలు పరమాత్మ అని వక్కాణిస్తాయి. సారాంశం శ్రీ భారతీ తీర్థులనే వ్యవహారనామంతో మనముందు కదలాడుతున్న జ్ఞానజ్యోతి పరమాత్మయే. అట్టివారు నిరంతరము ఆర్ద్రచిత్తులై శిష్యులయందు పరమానురాగం కలవారై మనల నందరినీ పరిపాలింతురుగాక!

ఈ శ్లోకంలో "పరిపాలయన్తామ్" అనే పదాన్ని గురించి నాకు అంత్యంతాత్మీయులు మహామహోపాధ్యాయ విశ్వనాథ గోపాలకృష్ణగారిని శ్రీస్వామివారు ఆత్మనేపద రూపం సరియేనా అని నావైపుచూస్తూ అడిగారు. శాస్త్రిగారు "స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తామ్" అన్న శ్లోకాన్ని ఉదాహరించారు. అది అలా ఉంచండి. లౌకికంగా మనం ప్రయోగించవచ్చునా అన్నారు స్వామి. శ్లోక నిర్మాణసమయంలో నా మనస్సులో ఆ



ప్రసిద్ధశ్లోకమే ఉన్నది. తరువాత ఇంటికి వచ్చి బాలమనోరమా సహిత సిద్ధాంత కౌముదిని పరిశీలించాను 'పాలయతి' మొదలైన రూపాలు కానవస్తున్నాయి. మహావైయాకరణులు బ్రహ్మశ్రీ కొంపెల్ల సత్యనారాయణశాస్త్రిగారి ముందు ఈ విషయాన్ని పరిశీలనకు ఉంచాను. వారు వెంటనే ణిజంతం కనుక ఆత్మనేపదరూపం దుష్టంకాదు, 'ణిచశ్చ' అనే సూత్రాన్ని గమనించండి అన్నారు. శబ్దశాస్త్రాన్ననుసరించి "పరిపాలయన్తామ్" అనేది సలక్షణమే అని నిర్ణయించు కొన్నాను. ఒకవేళ కాకపోతే శ్లోకాన్ని సవరించుకోవటం పెద్దసమస్య కాదు. "పరిపాలయన్తు" అన్నా ఛందోభంగం కాదు.

ఇదంతా చెప్పటంలో ఉద్దేశం ఏమిటి అంటే శ్రీస్వామివారి మేధానైశిత్యం మనలను ఏవిధంగా సంస్కరిస్తుందో తెలియజేయటమే.

తెలుగు వ్యాకరణంలో చిన్నయసూరి "క్రియాఫలంబు కర్తృగామియగుచో కొనుధాతువను ప్రయుక్తంబగు. ఇయ్యదియ ఆత్మనేపదం బనంబడు" అని ఒక సూత్రాన్ని నిబంధించారు. వండు - వండుకొను, చదువు - చదువుకొను అనేవానిలో రెండవది ఆత్మనేపదం. వంట, చదువుల ఫలం కర్తకే చెందుతుంది. నిజానికి సంస్కృతవ్యవహారంలో ఇటువంటి వివక్ష ఉన్నట్లు నా దృష్టికి అందలేదు కానీ ఆవైపునుంచి ఆలోచిస్తే "పరిపాలయన్తామ్" సరియేనా అనే సందేహం మళ్ళీ కలిగింది. ఎందుకంటే దానివలన పరిపాలనఫలం గురూత్తములను చేరుకొనేది అయిపోతుంది. అలా కావటం సముచితమా అని మళ్ళీ ఒక ప్రశ్న నన్ను నిలువదీసింది. శిష్యపరిపాలన ద్వారా అవతార ప్రయోజనాన్ని సాధించటం అనేభావన ఉంటుంది కనుక సముచితమే అని సమాధానం చెప్పుకొన్నాను. ఏతావతా చెప్పవచ్చిన దేమిటంటే శ్రీవారు శబ్దబ్రహ్మస్వరూపులు అని.

**శాస్త్రవిచారపరీక్షా సందర్భే భాతి సద్గురో ర్ధిషణా**

**నిశ్చలతటిదివ, హృదయే నృత్యతి ఖలు శారదాంబికా-స్మాకమ్ 10**

ఒక్క వ్యాకరణశాస్త్రమే కాదు, తర్కం, మీమాంస, న్యాయం మొదలైన శాస్త్రాలలో కూడా విద్వాంసులు చేసే వాక్యార్థసభలలో స్వామివారు తెలియజేసే విషయాలు సత్యసిద్ధాంతాలే. ఆ సందర్భంలో శ్రీవారి ధిషణ నిశ్చలంగా నిలిచిన మెరుపులాగా విరాజిల్లుతుంది. ఆదర్శనం మావంటి వారి హృదయంలో శ్రీశారదాంబా నర్తనం అవుతుంది.

ఇంతకుముందు ప్రస్తావించిన అనేక విషయాలలో ఈ అంశం నిరూపితమైనది. శాస్త్రవిషయం కాదు కానీ ఈ సందర్భంలో చెప్పుకోదగిన అంశం ఒకటి ఉన్నది. నేను వేదవ్యాసులవారి మహాభారతాన్ని శ్లోక, తాత్పర్య, నీలకంఠీయవ్యాఖ్యానాలతో తెలుగులో అందించే పథకాన్ని నిర్వహిస్తున్నాను. ఈ మహాకార్యంలో ఒకరిద్దరు మహా విద్వాంసులతోడ్పాటు కూడా ఉన్నది. ఆ ప్రణాళికలో భాగంగా అనుశాసనపర్వం రెండుభాగాలుగా ముద్రితమైనది. ఆప్రతులను ఒకమారు శృంగేరి వెళ్ళినపుడు శ్రీస్వామివారికి సమర్పించు కొన్నాను. అందులో ఒకచోట భ్రాంతిమూలకంగా ఒక తప్పు పడిపోయింది. అది శ్రీవారి దృష్టికి రానేవచ్చింది. శ్రీవారి విజయయాత్రలో నన్ను చూచిన మూడునాలుగు సందర్భాలలో శర్మగారూ!

అనుశాసనపర్వంలో ఒకపెద్దభ్రాంతి చోటుచేసుకున్నదండీ' అని చాలా మృదువుగా అన్నారు. కాగా ఆ సందర్భంలో గ్రంథం దగ్గర లేనందువలన అది యేదో నాకు తెలియజేయటానికి వీలుకాలేదు. అటుపైని నాలుగైదు నెలలు కడచిన తరువాత శ్రీవారి ఆదేశం మేరకు నాకు సంబంధించిన ఒకపని మీద శృంగేరి వెళ్ళటం సంభవించింది. శ్రీవారు చంద్రమౌళీశ్వరార్చన అయిన తరువాత చాలా సన్నిహితంగా నన్ను నిలిపి పుస్తకం తెప్పించి ఒక క్రిందిగీతగల పంక్తిని నాకు చూపించారు. "అద్విషన్ గౌతమీవారీన్" అని నీలకంఠీయవ్యాఖ్యానంలోని శ్లోకం అది. 'నదీజలములను ద్వేషింపకుండుట' అని మాతాత్పర్యంలోని వాక్యభాగం కనబడింది. గుండె జల్లుమన్నది. అక్కడ నదీ లేదు. జలాలూ లేవు. "గౌతమీ ఇవ అరీన్ అద్విషన్". గౌతమి కథలోని స్త్రీవ్యక్తి. ఆమె వలె పగవారిని కూడా ద్వేషింపకపోవటం అక్కడ వక్తవ్యాంశం. కానీ అనపేక్షితమూ, దోషదూషితమూ అయిన తెలుగువాక్యం ముద్రితమైపోయింది. ఇప్పుడు, తలకొట్టుకొని ఏమి ప్రయోజనం? శ్రీవారి సూక్ష్మేక్షిక ఎటువంటిదో నిరూపించటానికి మాత్రమే ఈ సంఘటనను ఈ గ్రంథంలో ఉంచుతున్నాను.

**దృష్టే భవతి ప్రభవతి సంస్మరతి మదీయ హృదయ మనవద్యమ్**

**శ్రీవృషకేశ మీశం సద్యోజాతాభిధం శివం శాన్తమ్ 11**

శ్రీశంకభగవత్పాదుల షట్పదీ స్తోత్రంలో

**ఉద్ధృతనగ! నగభిదనుజ ! దనుజకులామిత్ర! మిత్రశశిదృష్టే**

**దృష్టే భవతి ప్రభవతి న భవతి కిం భవతిరస్కారః**

అని ఒక పరమసుందరమైన శ్లోకం ఉన్నది. దాని ముద్ర ఈ నా శ్లోకం మీద పడింది.

సర్వసమర్థులైన ప్రభువులు తమరు మాకు కనబడినంతనే నాదైనహృదయం, అనవద్యమూ, సద్యోజాతమనేవ్యవహారం కలదీ, శివమూ, శాంతమూ శ్రీవృషకేశాత్మకమూ అయిన ఈశ్వర తత్త్వాన్ని చక్కగా స్మరిస్తుంది.

పరమేశ్వరుడు అనవద్యుడు. హేయగుణాల స్పర్శ లేశమాత్రంగా నైనా లేనివాడు. సద్యోజాతనామం కలవాడు. సద్యోజాతుడంటే సర్వకాలాలలో సర్వదేశాలలో ఎప్పటికప్పుడు ఆవిర్భవించే సామర్థ్యం కలవాడు అని అర్థం. విశ్వాన్నంతా ఆక్రమించి 'ఉండు'వాడు అని తాత్పర్యం, 'సత్' అనేపదం అర్థానికి స్ఫురణను కలిగించేవాడు అని భావం. సత్, అంటే ఉండుటయే శీలమైన తత్త్వం. వేదం పరమేశ్వరుని సద్యోజాతుడని పేర్కొన్నది.

శివ శబ్దానికి లింగాభట్టు ఈ క్రింది వ్యుత్పత్తులను



చూపాడు.

1. శామ్యతి పరమానన్దరూపత్వా న్నిర్వికారో భవతి - పరమానంద రూపుడు కనుక నిర్వికారుడు.

2. శేరతే సజ్జనమనాంస్యస్మిన్నితి వా - సజ్జనుల మనస్సులు ఇతని యందు సుఖంగా ఉంటాయి.

3. శేతే సజ్జన మనస్స్వితి వా - లేదా, ఇతడు సజ్జనులమనస్సులందు ప్రవేశించి ఉంటాడు.

పై రెండర్థాలలో ధాతువు 'శీఙ్ - స్వప్నే'-

4. శివం కల్యాణం, తద్యోగా ద్వా. శివమనగా కల్యాణము. దానితో యోగము కలవాడు కనుక శివుడు.

5. శివప్రదత్వాద్వా - శుభముల నిచ్చువాడు.

ఈ అన్నిఅర్థాలనూ ఈ శ్లోకంలోని శివశబ్దానికి అన్వయించుకోవాలి.

శాన్తమ్ - ఆ ఈశ్వరతత్త్వము శాంతమైనది. శాంత మంటే ఇంద్రియాదుల ప్రవృత్తులు ఏమీ లేని తత్త్వం.

ఇట్టి భావనలతో విరాజిల్లే ఈశ్వరతత్త్వం నా హృదయంలో కదలాడుతుంది.

**దక్షిణామ్నాయపీఠస్థా నవతారవతో గురూన్**

**దక్షిణామూర్త్యభిన్నత్వే సంభావయతి నో మనః 12**

శృంగేరీ దక్షిణామ్నాయ శారదాపీఠ వ్యాఖ్యానసింహాసనం పై అధివసించియున్న అవతారం పొందిన ఈ శ్రీభారతీతీర్థ గురుదేవులను మా మనస్సు దక్షిణామూర్తికంటె వేరుకాని

మహాదేవునిగా సంభావిస్తున్నది.

శ్రీమద్దేశికేంద్రులు సాక్షాత్తు శ్రీదక్షిణామూర్తియే అని నాకనిపిస్తూ ఉంటుంది. అయితే కాలానుగుణంగా, జ్ఞానం ప్రసరించవలసిన లక్ష్యాలకు అనుగుణంగా అనివార్యంగా మౌనవ్యాఖ్యానదీక్షను కొంచెం సడలించుకున్నారు. పరబ్రహ్మతత్త్వాన్ని ప్రకటిస్తూ ఉన్నారు. వారిదేహానికి వార్ధక్యచ్ఛాయలు కానవచ్చినా వాఙ్మనః ప్రవృత్తులలో వానినీడలు ఆవంతఅయినా కానరావు కనుక వారు 'యువ'యే. వారిదగ్గరకు జ్ఞానదాహంతో వచ్చేవారు వర్షిష్ఠులైన అంతేవాసులే. వారు కూడా జ్ఞానమధుపానంకోసం తమ్ముతాము బ్రహ్మనిష్ఠులుగా రూపొందించుకొన్నవారే. శ్రీవారు ఆచార్యేంద్రులు. వెనుక శ్లోకాలలో అనేక సందర్భాలలో వారి సర్వతోముఖప్రతిభనుగూర్చీ, ఉపదేశపాటవాన్నిగూర్చీ, శిష్యవాత్సల్యాన్ని గూర్చీ చెప్పుకొన్న విషయాలు శ్రీవారి ఆచార్యేంద్రత్వాన్ని ప్రమాణీకరిస్తున్నాయి. వారు కరకలితచిన్ముద్రులు. ఆనందమూర్తులు. స్వాత్మారాములు. ముదితవదనులు. ఈవిధంగా వారు దక్షిణామూర్తులే.

ఇవి నా హృదయంనుండి వెలువడిన శ్లోక కుసుమాలు. నేను శ్రీవారి పాదపద్మాలపై సమర్పించుకొని ఆనంద తుందిలమైన హృదయంతో ఉండటానికి కారణభూతమైనవి.

శ్రీస్వామివారిని ఇటీవలి విజయయాత్రలో రాజమహేంద్రపురం తరువాత తునిలో శ్రీసచ్చిదానందసరస్వతీ స్వాములవారి ఆశ్రమంలో మరొకమారు దర్శించుకొన్నాను. ఆసందర్భంలో నేను శ్రీపాదులసమీపానికి వచ్చిన వెంటనే ఇదిగో రఘునాథశర్మగారూ! మీరు మీ గ్రంథాలపై ముద్రించు కొంటూ ఉంటారే ఆమహితాత్ములలో ఒకరు ఇక్కడ ఉన్నారు. చూడండి అని ఒక మహాత్ములను చూపించారు. వారు వెదురుపాక విజయదుర్గా పీఠాధిపతులు శ్రీగాడ్‌గారు. వారికి నాయందు విశేషమైన అనురాగం. నన్ను ఇప్పటికి పదిపన్నెండుపర్యాయాలు శ్రీవిజయదుర్గా పీఠశక్తి సన్నిధానంలో వాఙ్మయపూజ చేసుకోవటానికి అవకాశం కల్పించిన పుణ్యమూర్తి. శ్రీస్వామివారినీ, శ్రీగాడ్ గారినీ ఏకకాలంలో ఒక్కచోట దర్శించుకొనే భాగ్యం కలిగినందుకు నన్ను నేను అభినందించుకొన్నాను.

ఆపై విశాఖపట్టణం, భీమునిపట్నంలలో కూడా శ్రీవారిని దర్శించుకో వాలని గాఢమైన కాంక్షఉన్నా పరిస్థితులు అనుకూలించలేదు. ముఖ్యంగా భీముని పట్నంలో సద్గురుశివానందమూర్తిగారి ఆనందవనంలో ప్రతిష్ఠితమైన ఆద్యాది శ్రీమహాలక్ష్మీ ఆలయ ప్రాంగణంలో శ్రీవారిని, సద్గురువులను దర్శించుకో లేకపోవటం నాదౌర్భాగ్యమే.



ఆ తరువాత పశ్చిమగోదావరి మండలంలోని పరిమెల్ల గ్రామానికి శ్రీవారు విచ్చేశారు. అక్కడివారు బ్రహ్మశ్రీ వేదమూర్తులు శ్రీ కొలచన రామలింగేశ్వర సూర్యనారాయణ శర్మగారు మాకు బంధువర్గంలోనివారు. ఎనభై యెనిమిది సంవత్సరాల వయస్సులో కూడా వారు బ్రహ్మ జిజ్ఞాసతో వేదాంత శాస్త్రాధ్యయనం సంప్రదాయబద్ధంగా చేస్తున్న మహనీయులు. అది ఒక చిన్న గ్రామం. శ్రీవారు అక్కడికి రావటంవలన ఆ గ్రామమూ పరిసరగ్రామాలూ పారవశ్యంతో పులకించి పోయాయి. జనసంమర్దనంవలన దర్శనం కొంచెం కష్టసాధ్యమే అయింది. అయినా మా ఆత్మీయులు డాక్టర్ టి.వి. నారాయణరావు గారూ, పరితణప్రజ్ఞులు సామవేదం షణ్ముఖశర్మగారూ మొదలైన వారితో శ్రీవారి వాత్సల్యపూర్ణ దర్శనభాగ్యం పొందగలిగాము.

అలాగే గుంటూరు మండలం పిడుగురాళ్ళ ప్రాంతంలోని 'చౌటపాపాయ పాలెం' అనే కుగ్రామానికి కూడా గురుదేవులు విచ్చేశారు. ఆగ్రామం ఆర్షవిద్యాలంకారులు బ్రహ్మశ్రీ ముదిగొండ వేంకటరామశాస్త్రిగారి అభిజనం. వారు వారికాలంలో వేదాంతవిద్యా అధీతిబోధాచరణ ప్రచారణలలో గొప్ప ప్రఖ్యాతి కలవారు. వారి కుమారులు బ్రహ్మశ్రీ ముదిగొండ శంకరశర్మగారు ఇప్పుడు వారివలె



విద్యాభూషితులై అలరారుతున్నారు. శ్రీస్వామివారు ఆకారణంగా తమ విజయయాత్రలో ఆకుగ్రామానికి కూడా దర్శనభాగ్యం అనుగ్రహించారు. అక్కడ నుండి నరసరావుపేటకు పయనం. అనుగ్రహ భాషణం ముగింపులో 'మేము బయలుదేరుతున్నాము. తరువాత విశ్వనాథ గోపాలకృష్ణ శాస్త్రిగారూ, శలాక రఘునాథశర్మగారూ ఈ సభలో మాటడవలసి ఉన్నది' అని పరమసుకుమారంగా మమ్ములను ఆదేశించారు. శ్రీవారి ఆజ్ఞను శిరసా వహించి మేము కొంతసేపు ఆధ్యాత్మికప్రసంగం చేసి నరసరావుపేట చేరుకున్నాము.

నరసరావుపేట ఒక జనసముద్రం అయిపోయింది. రోడ్లమీద కారులు శ్రీవారి సభాస్థలి సమీపానికి చేరుకోవటానికి చాలా ఇబ్బందిపడవలసివచ్చింది. సభాస్థలి లోనికి ప్రవేశించటమే అసాధ్యం అన్నంతగా అయిపోయింది. ఎలాగో వేదికకు సన్నిహితంగా వెళ్లగలిగాము. స్వాగతసభ ముగిసిన తరువాత మేము మామా స్థలాలకు వెళ్ళబోతూ శ్రీవారి అనుమతికోసం నిలుచున్నాము. శ్రీవారి ప్రసన్న ముఖం అనుమతిస్ఫోరకంగా కదలాడింది. శ్రీవారు ప్రత్యేకించి నన్నుచూచి గుంటూరు అవధానానికి వస్తున్నారు కదా! అన్నారు. అది నాకు చాలా సంతోషం కలిగించింది.

గుంటూరు మహానగరం సంపత్‌నగర్ సార్థక నామధేయం. ఆసార్థకత శ్రీగంగాపార్వతీ సమేతరామలింగేశ్వరస్వామి దేవస్థానం, శ్రీ ఆదిశంకర దేవస్థానం, శ్రీశారదా పరమేశ్వరీ దేవస్థానం, అభయకోదండరామస్వామి వారి దేవస్థానం, శ్రీప్రసన్నాంజనేయస్వామి మందిరం, నవగ్రహమందిరం శ్రీ భారతీ తీర్థప్రవచన మందిరం, గోశాల, వేదపాఠశాల మొదలైనవానిచేత చేకూరినట్టిది. శ్రీ పోలిశెట్టి శ్రీహరిప్రసాదరావు గారు నిలువెల్లా భక్తిశ్రద్ధలే అనదగినవారు. వారి నిర్వహణలో ఈ ఆలయాలన్నీ దివ్యదీధితులతో, నిత్యారాధనలతో, మహాపండితుల ఉదాత్త ఆర్షవిద్యాప్రవచనాలతో అలరారుతూ ఉన్నాయి.

శ్రీ పోలిశెట్టి వారి పరిపూర్ణ సహకారంతో అస్మత్సన్మిత్రము శ్రీ బి.వి.యస్. శాస్త్రి గారు శ్రీశారదాపరమేశ్వరీ ఆలయానికి అనతిదూరంలో శ్రీభారతీతీర్థ వేదస్మార్తపాఠశాలకై సమగ్ర సుందరమైన భవన సముదాయాన్ని నిర్మింపజేశారు. శ్రీవారి విజయయాత్ర సందర్భంగా ఆ భవనసముదాయ ఆవిష్కరణ మహోత్సవం అత్యంతవైభవంగా నందననామ సంవత్సర మాఘ మాసంలో 14.3.2013 గురువారంనాడు శ్రీ భారతీతీర్థుల పవిత్రహస్తాలతో జరిగింది.

శ్రీస్వామివారు ఆ సభలో కూడా నాలుగు మాటలు పలికే అవకాశం నాకు అనుగ్రహించారు. శ్రీశాస్త్రిగారు నన్ను కొన్ని శ్లోకాలు రచించి పఠించ వలసినదిగా కోరారు. నా అంతరంగం ఆనందసాంద్రస్థితిని భజించింది. తొమ్మిది శ్లోకాలు "జగద్గురుపదవందనమ్" అనే శీర్షికతో

వెలువడ్డాయి. శ్రీ గురుపదద్వంద్వాన్ని అష్టమూర్త్యాత్మకంగా నిరూపిస్తూ వ్రాసిన శ్లోకాలను ఇక్కడ తాత్పర్యంతో నివేదించుకుంటున్నాను.

**జగద్గురు పద వన్దనమ్**

**న గురో రధిక మితీదం శివశాసన మస్తి శుభద మస్మాకమ్**
**తస్మాత్ సద్గురుపాదౌ నమామి సంస్థాప్య హృదయసత్పీఠే.**

గురువుకంటే మించినది లేదని మాకు శుభాలు కలిగించే శివశాసనం ఉన్నది. అందువలన హృదయమనే సత్పీఠంలో చక్కగా నిలుపుకొని సద్గురు పాదాలను నమస్కరిస్తూ ఉంటాను.

**వన్దే గురుపదద్వన్ద్వసుందరామలవారిజమ్,**
**యస్య దర్శనమాత్రేణ పరాం శాంతిం లభేత నా.**

గురుపదద్వంద్వం సుందరమూ, స్వచ్ఛమూ అయిన పద్మము. తద్దర్శనమాత్రంచేత నరుడు పరమశాంతిని పొందుతాడు. అట్టి పాదద్వంద్వానికి వందనం చేస్తూ ఉంటాను.

**వన్దే గురుపదద్వన్ద్వమన్దాకిన్యమలోదకమ్,**
**యత్స్పర్శనే నరో భూయాత్ సబాహ్యాభ్యన్తర శ్శుచిః.**

గురుపదద్వంద్వం మందాకినియందలి నిర్మల జలం. ఆ జలస్పర్శతో నరుడు బాహ్యాభ్యంతరములలో పవిత్రుడౌతాడు. అట్టి పాదద్వంద్వానికి వందనం.

**వన్దే గురుపదద్వన్ద్వవిభావసు మనల్పకమ్,**
**భస్మీభవతి పాపౌఘతూలరాశి రనేన వై.**

గురుపదద్వంద్వం చిదగ్నిస్వరూపం. అందులో పాపాలనే ఊకపొట్టు రాశి బూడిదయై పోతుంది. అట్టి అగ్న్యాత్మకతేజోరాశికి వందనం.

**వన్దే గురుపదద్వన్ద్వమాతరిశ్వాన మాలయమ్,**
**అజ్ఞానధూలినిచయ ముద్ధూనయతి య స్సదా.**

గురుపదద్వంద్వం ఒక అద్భుతమైన మారుతం. అజ్ఞానమనే దుమ్ము ప్రోవును అది తుక్కుదూగరగా తొలగించివేస్తుంది. ఆవాయువు ఆపనిని నరజాతికి ప్రళయ పర్యంతం చేస్తూ కాపాడుతుంది.

**వన్దే గురుపదద్వన్ద్వమృదునాదతరంగకాన్,**
**ప్రహ్లాదయన్తి యే-స్మాకం చేతాంసి సుసమాహితాః.**

గురుపదద్వంద్వమనే మృదువైన నాదతరంగాలకు వందనం. అవి సుసమాహితములై మా చేతస్సులను ప్రహ్లాదభరితాలను చేస్తూ ఉంటాయి.

**వన్దే గురుపదద్వన్ద్వభానుమద్దీప్తిమాలికాః,**
**పురుషం దగ్ధకలుషం యాః కుర్వన్తి దినే దినే.**

గురుపదద్వంద్వమనే భాస్కరుని కిరణమాలికలు. మానవుని ప్రతిదినము దగ్ధకిల్బిషునిగా చేస్తూ ఉంటాయి. అట్టి పాదద్వంద్వానికి వందనం.



**వన్దే గురుపదద్వన్ద్వచన్ద్రసున్దరచన్ద్రికాః,**
**సచ్చిదానన్దరూపా స్తా స్తారయన్తి భవాంబుధిమ్.**

గురుపదద్వంద్వం సుందరమైన వెన్నెలలు ప్రసరింపజేసే చందమామ. ఆ వెన్నెలలు సచ్చిదానందరూపాత్మకాలు. అవి మానవులను సంసారసముద్రం నుండి తరింపజేస్తాయి. వానికి వందనం.

**వన్దే గురుపదద్వన్ద్వయజమానహవీంషి చ,**
**పుణ్యగన్ధేన యా న్యస్మద్వాసనా నాశయన్తి వై.**

గురుపదద్వంద్వమనే యజమాన హవిః స్వరూపాలకు వందనం. అవి పుణ్యగంధంతో మా దుష్ట వాసనలను రూపుమాపుతాయి.

**ఏతా శ్శ్రీభారతీతీర్థగురుపాదవిభూతయః,**
**తన్వన్తు నితరాం హార్ద మానన్దం సచ్చిదాత్మకమ్.**

ఇవిగో శ్రీభారతీతీర్థగురుపాదవిభూతులు. అవి మా హృదయాలలో సచ్చిదాత్మకమైన ఆనందాన్ని అత్యంతము విస్తరింపజేయాలి.

శ్రీస్వామివారి సన్నిధానంలో చేసుకొన్న ఈవాఙ్మయ శ్రీపదార్చన నన్ను సంతుష్టాంతరంగుణ్ణి చేసింది.

శ్రీ బి.వి.యన్. శాస్త్రిగారు "శ్రీభారతీ విజయమ్" అనే సర్వాంగ సుందరమైన సంచికను ఈ సందర్భంగా వెలువరించారు. ఆ సంచికలో ఈ శ్లోకాలను కూడా ప్రచురించారు. వారు నాచేత మరొక వ్యాసం కూడా



వ్రాయించి అందులో నిక్షేపించారు. దానిని ఇక్కడ ఉంచుతున్నాను.

**శ్రీభారతీతీర్థ పూర్ణత**

మహాకవి కాళిదాసు రఘువంశకావ్యంలో మానవ జీవిత పరిపూర్ణతను గురించి ప్రతీయమానాత్మకంగా మహోన్నత విషయాలు నిక్షేపించారు. అవి రఘువంశ రాజులనుగురించి చెప్పిన వాక్యాలు. ఆజన్మశుద్ధులు, ఆఫలోదయ కర్ములు, ఆసముద్రక్షితీశులు, ఆనాకరథవర్త్ములు మొదలైనవి. ఇవి సాధించు కోవలసిన ఆదర్శప్రాయలక్షణాలు మాత్రమే. అన్నీ ఉన్నవాళ్ళు లోకంలో సాధారణంగా ఉండరు అని భావించటం సహజమే. కానీ సర్వభావాలకు సర్వకాలాలలో సార్వత్రికంగా చెల్లుబాటు ఉండదు. అపవాదాలు ఉంటూనే ఉంటాయి. అటువంటిఅపవాదాలలో మనకాలంలో మనఅదృష్టం కొద్దీ మనం ఆరాధించుకోగలుగుతున్న శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ స్వాములవారు ఒకరు.

వారు ఆజన్మశుద్ధులు. పూర్వాశ్రమ సంబంధంగా వారి తండ్రిగారు వేద విద్యాపారంగతులు. బ్రహ్మతేజస్సుతో అలరారేముఖం వారిది. వారి తల్లిగారు భారతీయ సంప్రదాయ సౌష్ఠవాన్ని ఆచరణలో నిరంతరమూ నింపుకున్న వ్యక్తి. ఆ పుణ్యదంపతుల పుణ్యఫలరూపమైన శ్రీ తంగిరాల సీతారామాంజనేయలు ఆజన్మశుద్ధులు అనటంలో అసంగతి ఎలా ఉంటుంది?

కాగా శ్రీవారు శ్రీశ్రీశ్రీ అభివనవిద్యాతీర్థస్వాముల కరకమలసంజాతులు. శృంగేరీ దక్షిణామ్నాయ పీఠాధిపతులయ్యారు అంటేనే వారివిద్యాశక్తి, తపశ్శక్తి, సిద్ధిశక్తి ఎంత గొప్పస్థాయికి చెందినవో మనం ఊహించుకోవచ్చు. శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరభారతీ స్వాములవారు సాక్షాత్పరబ్రహ్మస్వరూపులు. ప్రతిక్షణమూ బ్రహ్మసాక్షాత్కారానుభూతి తాదాత్మ్యంతో ఉండేవారట. అట్టి మహాత్ములు ఎన్నుకొన్న శ్రీస్వామివారు అసాధారణ ప్రజ్ఞాప్రాభవాలు కలవారనటంలో సందేహం ఏమాత్రమూ ఉండదు. వారు ఇప్పటి శ్రీవారిని శృంగేరీ మహాపీఠాధిపతిగా నిర్ణయించారంటేనే వారి ఆజన్మ శుద్ధత విస్పష్టంగా తెలియవస్తుంది. ఈఎన్నికలో ఇప్పటిలోకంలో సాధారణంగా కానవచ్చే ప్రాంతీయ దేశభాషాద్యభిమానాలు ఏకోశానా లేవన్నది సర్వజన విదితమైన విషయం. ఈవిధంగా శ్రీవారితురీయఆశ్రమ ప్రవేశఘట్టం కూడా వారిఆజన్మశుద్ధతను నిరూపిస్తుంది.

శ్రీశ్రీశ్రీ అభినవవిద్యాతీర్థస్వాములవారు ఉత్తరాధికారిని గూర్చి నిర్ణయించే సమయంలో ఒక అద్భుతమైన విషయం సంభావించిందరని తెలియ వస్తుంది. శ్రీస్వామివారు శ్రీశారదాపరమేశ్వరి ఆలయంలోపలికి ప్రవేశించి, కొన్నిక్షణాలు ధ్యాననిమీలితనేత్రులై వెలుపలికి వచ్చి వెనువెంటనే ఉత్తరాధికారిని ప్రకటించారట. అంటే అమ్మ స్వామి అంతరంగంలో ఉద్బోధ చేసి ప్రకటింపజేసిందన్నమాట. మరొక విధంగా స్వామియే అమ్మ. అమ్మయే స్వామి. ఆవిధంగా శ్రీశ్రీశ్రీ భారతీతీర్థస్వామిలో శ్రీశారదాదేవి గురువాగ్రూపంగా నెలకొని ఉన్నదన్నమాట. ఆజన్మశుద్ధతను గమనించటంలో ఇవి ఒకటి రెండు లింగాలు.

శ్రీవారు ఆఫలోదయకర్ములు. ఇక్కడ 'కర్మము' అంటే ఒకమహాపీఠానికి అధిపతిగా చేయవలసిన దైవసంబంధమైన యజ్ఞాదికకర్మములు, అనుష్ఠానాదులు. వారు పీఠార్చన చేసేసమయంలో ఆ పరిసరాలలో ఉండ గలగటం ఒకగొప్ప అదృష్టం. మానవమాత్రులుగా జన్మించారు కనుక ఈమాట అనుకోవలసివస్తున్నది. ఆ పూజాసమయంలో వారిత్రికరణాలు ఎంతగా పరమాత్మతాదాత్మ్యంతో ఉంటాయో స్పష్టంగా తెలుస్తూఉంటుంది. నిజానికి అది వారు లోకసంగ్రహంకోసం చేస్తున్నపని. అయినా చెక్కుచెదరనిభక్తితో నిష్ఠతో చేస్తూ ఉంటే చూస్తూ ఉన్నవారికి కూడా ఫలోదయం అవుతున్న ట్లుంటుంది. ఇక్కడ మనం విచారించవలసిన అంశం ఒకటి ఉన్నది. ఆరాధనాపరమైనఅనుష్ఠానానికి ఫలం ఏమిటి? అంటే ఇంద్రియాద్యతీతమైన ఆనందమే. శ్రీస్వామివారు తమ



అనుష్ఠానంతో అది అందుకున్న, అందిస్తున్న స్ఫూర్తి నావంటివారికి అనేకపర్యాయాలు అనుభవంలోకి వచ్చిన విషయం. ఆవిధంగా శ్రీస్వామివారు ఆఫలోదయకర్ములు. అంతే కాదు. శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థస్వాములవారు ఎన్నో శంకరమఠప్రాంగణాలను, ఇతరఆలయాలను హృదయంలో సంకల్పించి, రూపకల్పన చేసి మానవజాతికి అందుబాటులోనికి తెచ్చారు. తెస్తున్నారు. అవి కూడా శ్రీవారి ఆఫలోదయకర్మతను నిరూపిస్తున్నవి. ఇంక వేదశాస్త్ర విద్యాప్రాభవం కోసం శ్రీవారి నేతృత్వంలో రూపొందుతున్న కార్యక్రమాలు కొంగ్రొత్తఫలాలను జాతికి నిరంతరంగా అందిస్తూనే ఉన్నాయి.

శ్రీవారు ఆసముద్రక్షితీశులు. జగద్గురువులు కదా! హద్దు లేనిజగత్తునకు వారు సద్గురువులు. ఈవిధంగా అధ్యాత్మ సామ్రాజ్యాన్ని అహర్నిశమూ ఏలుతున్న సార్వభౌములు. ప్రపంచంలో అనేక సంప్రదాయాలు ఉన్నాయి కదా, అందులో ఒకసంప్రదాయానికి గురువులైతే సర్వజగత్సద్గురువులు ఎలా అవుతారు అని శంకించరాదు. భారతీయవైదిక సంప్రదాయంలో ఒక్కొక్క దృక్కోణంతో ఆలోచించటం ద్వారా అనేక సంప్రదాయాలు ఉన్నట్లు పైకి అనిపిస్తుంది కానీ ఆ సంప్రదాయా లన్నింటి సమాహారరూప మైనతాత్త్వికత ఏక రూపమే. మనగురువులు ఆవిధంగా జగద్గురు సామ్రాజ్య పట్టభద్రులు. వారిని గురువులుగా అంగీకరించని సంప్రదాయాలవాళ్ళు ఉంటేనో! ఉన్నా జగద్గురు పదసార్థ కతకు భంగం కలుగదు. ఒక్కొక్క మూర్ఖుడు తండ్రిని నేను తండ్రిగా అంగీకరించను అంటే అది వాని దౌర్భాగ్యాన్ని సూచిస్తుందే కాని, తండ్రి తండ్రితనాన్ని వదలటం గాని, అట్టి కొడుకును నావాడు కాదు అని ప్రకటించటం కానీ జరగదు. కాబట్టి వారు సర్వజగత్సద్గురువులే. ఆసముద్రక్షితీశులే.

శ్రీవారు కాళిదాసు చెప్పిన విధంగా ఆనాకరథవర్త్ములు. నాకం అంటే దుఃఖం లేనితావు. రథం ఇక్కడ జ్ఞానాత్మకమైనది. ఆమార్గం అనాదిగా ఏకరూపంగా ప్రవర్తిస్తున్నది. ప్రవర్తిస్తూనే ఉంటుంది. అది 'సత్' శ్రీవారివర్త్మము అది. దానిచేత వారు అనుయాయుల నందరినీ గమ్యానికి చేర్చేసత్కార్యంలో పార్థసారథివలె ప్రవర్తిస్తున్నారు.

ఈవిధంగా మనభారతీతీర్థమహాస్వాములవారు మనకు నిత్యమూ, నిరంతరమూ ఆరాధ్యులు. ఆ ఆరాధన మానవజాతికి మహాఫలదాయకం.

◆◆◆

ఈ కార్యక్రమానికి ముందు 8.3.2013న శ్రీవారి ఆదేశంమేరకు శ్రీవారి సమక్షంలో ఒక అష్టావధానకార్యం చాలా ఉదాత్తంగా ప్రవచన మందిరంలో జరిగింది. అవధానం చేసినవారు శ్రీయుతులు కోటలక్ష్మి నరసింహం గారు సత్త్వగుణ సంపన్నులు. శ్రీచరణులయందు అచంచల భక్తి శ్రద్ధలు కలవారు. ఆ అవధానంలో నేను సమస్యాంశానికి ప్రష్టగా వ్యవహరించ వలసినదిగా శ్రీచరణుల ఆదేశం. అవధానం చాలా హృద్యంగా

పూర్తిఅయింది. నేను రూపొందించిన సమస్య

**"మదవిభ్రాంత వివేకశీలునకు సంప్రాప్తించు మోక్షం బిలన్"**

అనేది. నాపూరణం ఇలా ఉన్నది.

**"చెదరంగొట్టెడు నింద్రియాశ్వములరశ్మివ్రాతమున్ నేర్పుగా**
**సదయాత్ముండగు సద్గురూత్తముని హస్తంబందు శ్రద్ధాళుతా**
**స్పదధీవృత్తిని బెట్టి యోగియయి సాఫల్యంబు సాధించుశ్రీ**
**మదవిభ్రాంత వివేక శీలునకు సంప్రాప్తించు మోక్షంబిలన్"**

ఇందులో అత్యంతకీలకమైన పదచ్ఛేదం 'శ్రీమత్, అవిభ్రాంత' అనేది. అంటే మదమూ, విభ్రాంతతా అనేవి తొలగిపోయాయి. శ్రీమత్త్వమూ, అవిభ్రాంతతా సిద్ధించాయి. సమస్యకు పరిష్కారం సిద్ధించింది. మోక్షప్రాప్తికి మార్గం సుగమమైనది. ఆవిధంగా శ్రీచరణులకు నాపద్యం నచ్చింది. 'ఆ! విరుపు అంటే అలా ఉండాలి' అని పెద్దగానే అన్నారు. నాకు కలిగిన ఆనందం మాటలలో చెప్పజాలనిది.

15.3.2013 నాడు గుంటూరు మహానగరంలో గురువందన కార్యక్రమం చాలా సముదాత్తంగా జరిగింది. శృంగేరీ మహా సంస్థాన ధర్మాధికారి శ్రీ గౌరీశంకర్‌గారు సభానిర్వాహకులు. శ్రీ పోలిశెట్టి శ్రీహరిప్రసాదరావుగారు నన్ను ప్రత్యేకించి మాటాడటానికి పిలిపించారు. అప్పుడు నేను అనంతపురంలో శ్రీస్వామివారి ప్రసంగసారాత్మక వాక్యాలతో కూడిన "నానామ్నాయేత్యాది శ్లోకాన్నే మరొకమారు ఉదాహరించాను. తరువాత దానిని శ్రీశంకరకృప పత్రికలో "శంకరుల జగద్గురుత" అనే శీర్షికతో అచ్చొత్తించారు. పునరుక్తి అయినా దానిని ఇక్కడ నిక్షేపిస్తున్నాను.

## శంకరుల జగద్గురుత

సుమారు ఇరవై సంవత్సరాల క్రిందట శ్రీ శృంగేరీ శారదామ్నాయ శారదా పీఠమహాధ్యక్షులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ స్వాములవారు అనంతపురంలో శ్రీ శంకరాచార్య శ్రీ శారదాదేవి ప్రతిష్ఠా కార్యక్రమంలో పాల్గొని అనుగ్రహ భాషణంలో ఒక అద్భుత శ్లోకాన్ని శ్రోతలకు వినిపించారు.

**"నానామ్నాయపరిశ్రమం కలయతాం నాస్త్యేవ శాస్త్రేషు ధీః**
**సత్యో రప్యనయో ర్ద్వయో ర్న సులభా సా హి క్షితౌ సాహితీ,**
**అప్యేతాసు సతీషు నాస్తి వినయో నాచారభక్తిక్షమా**
**చాతుర్యః స చ సా చ సా చ స చ తా శ్శైలంబ్య ఖేలన్త్యముమ్"**

శ్రీ స్వామివారు తమ అనుగ్రహణ భాషణంలో శ్లోకంలోని విశేషాల నన్నింటినీ విస్తృతంగా వ్యాఖ్యానించారు. శ్రీవారి వ్యాఖ్యానవైభవం అనన్య సాధారణం కనుక నావంటివారి హృదయఫలకం మీద అదంతా చక్కగా హత్తుకొని యీనాటికి కూడా భద్రంగా నిలిచి ఉన్నది (15.5.2013 శ్రీ



విజయ సంవత్సర శంకరజయంతి) ఆ వైభవం సనాతన ధర్మం మీద అనురక్తి ఉన్న హృదయాలలో సుదృఢంగా నిలిచిపోవాలి అనే ఉద్దేశంతో నాస్మృతిపథంలో ఉన్నదానికి, తోడు స్ఫురణరూపంలో తిరుగాడుతున్న మరికొన్ని అంశాలను జోడించి వాటికి అక్షరాకృతి కల్పిస్తున్నాను.

ఇందులో నిజానికి శ్రీశంకరభగవత్పాదుల నామ ప్రస్తావన లేదు. 'అముమ్' అనే సర్వనామం మాత్రమే ఉన్నది. 'ఆయనను' అని ఆపదానికి అర్థం. కానీ శ్లోకాన్ని ప్రకటించిన జగద్గురువులు స్వయంగా చెప్పారు కాబట్టి ఇది శ్రీశంకర భగవత్పాదులకు సంబంధించినదే అని నిర్ణయం. అది సర్వనామంగా ఉండటం కూడా గొప్ప విషయమే. సర్వనామమంటే సర్వుని నామం కదా! సర్వుడంటే పరమాత్మయే కదా! స్థూలంగా శ్లోకతాత్పర్యం ఇది.

అనేక ఆమ్నాయాలలో పరిశ్రమం చేసే వారికి శాస్త్రాలయందు బుద్ధి ఉండదు. అవి రెండూ ఉన్నాయనుకున్నా అట్టివారికి ఆ సాహితి సులభ కాదు. ఆమూడూ ఉన్నాయనుకున్నా వినయం ఉండదు. ఆచారము, భక్తి, క్షమ,చాతురి అనేవి ఉండవు. అదీ, అదీ, అదీ, అదీ, అవీ ఈ మహాత్ముని ఆలంబనంగా చేసికొని ఆడుకుంటున్నాయి.

ఆమ్నాయాలు అంటే వేదాలు. అవి ప్రధానంగా నాలుగు. ఋగ్యజుస్సామాథర్వణాలు. అయితే ఇప్పుడు గ్రంథరూపంలో లభిస్తున్న ఋగ్వేదాదులను మాత్రమే



వేదాలనుకోకూడదు. నిజానికి వేదాలు అనంతాలు. వేదాలంటే మంత్రాత్మకంగా తెలుసుకోదగిన విషయాలు. వానిలో పరిశ్రమం చేయటమంటే ఒక్కొక్క దానికే (ఇప్పుడు మనకు అందుబాటులో ఉన్నదానికి) పది పన్నెండు సంవత్సరాల కాలం కావాలి. వేదాలన్నీ అధ్యయనం చేయాలంటే మహామేధావికి దాదాపు నలభై సంవత్సరాల కాలం సరిపోవచ్చునని ఒక అంచనా. అయితే ఇంతశ్రమపడి వేదాలను అధ్యయనం ఎందుకు చేయాలి అని కొందరి హృదయాలలో ఒక శంక పుట్టవచ్చు. శ్రీశంకరులే "వేదో నిత్య మధీయతామ్" అన్నారు. వేదాన్ని నిత్యమూ అధ్యయనం చేయాలి. వేదం అంటే ఇలా నిర్వచనం చెప్పారు. "ఇష్టప్రాప్త్యనిష్టపరిహారయో ర్యో అలౌకిక ముపాయం వేదయతి స వేదః" ఇష్టమైనదానిని పొందటానికీ అనిష్టమైన దానిని తొలగించుకోవటానికీ ఏది అలౌకికమైన ఉపాయం తెలియజేస్తుందో అది వేదం. మానవజన్మను పొంది, దానిని సార్థకం చేసుకోవాలి అనే భావన సుస్థిరంగా ఉన్నవానికి ఇష్టం పునరావృత్తిరహిత శాశ్వతబ్రహ్మలోక నిత్యనివాసం. అనిష్టం సంసారము. మరొక విధంగా చెప్పాలంటే ఇష్టం జ్ఞానం. అనిష్టం అజ్ఞానం. జ్ఞానం కైవల్యాన్నిస్తుంది. అజ్ఞానం సంసారగర్తంలోనికి పడదోస్తుంది. కాబట్టి వేదాలలో పరిశ్రమ చేయటం అనేది అనివార్య కర్తవ్యం. ఆ పరిశ్రమ ఫలం అనంతం.

అయితే వేదార్థజ్ఞానం సాధించాలి అంటే శాస్త్రాలను బుద్ధికి పట్టించు కోవాలి. తర్కం, వ్యాకరణం, మీమాంస, న్యాయం, సాంఖ్యం, యోగం అనేవి శాస్త్రాలు. ఇవి ఒక్కొక్కటీ ఒక్కొక్క మహాసముద్రం అంతటివి. అయినా వాని మూలతత్త్వం పట్టుకోకపోతే వేదాధ్యయనం నిష్ఫలం అయిపోతుంది. కాగా వేదపరిశ్రమ చేసినవారికి శాస్త్రవిషయకంగా పాకానికి వచ్చిన బుద్ధి ఉండాలి. అది వారికి లేనేలేదు.

ఎవడైనా నూటికీ కోటికీ ఒకడు వేదాలనూ, శాస్త్రాలనూ కూడా అపోశనం పట్టాడనుకుందాం. అట్టి వానికి సాహితి సులభ కాదు. సాహిత్యం అంటే కావ్యనాటకాదివాఙ్మయం. ఇతిహాస పురాణాలు కూడా అందులో భాగాలే. "ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" అని స్మృతికారుని అభిభాషణం. వేదార్థాన్ని సరిగా, సమగ్రంగా పట్టుకోవాలంటే సాహిత్య జ్ఞానం చాలా అవసరం. సాహిత్యమంటేనే సహితము యొక్క భావం. హితమంటే భవిష్యత్తునంతా సుఖమయం చేసేది. సాహిత్యం కాంతాసమ్మితమై ఉపదేశం చేస్తుంది. ప్రాచీన భారతీయ సాహిత్యం అంతా ఇంచుమించు వేదోపనిషదర్థాలను మన హృదయాలలో కుదురుకొల్పటానికై రూపొందినదే. అయితే చాలామంది వేదవిద్వాంసులకు సాహిత్యం అంటే చులకన. అదీ ఒక చదువేనా అని వెక్కిరించే వాళ్ళను ఈ వ్యాసకర్త అనేకులను చూచాడు. ఇది సంప్రదాయ విరుద్ధవ్యవహారం. కనుక ఆదరణీయం కాదు. కాబట్టి వేదపరిశ్రమచేసి, శాస్త్రజ్ఞానాన్ని సాధించినవాడు తప్పనిసరిగా సాహిత్య కృషీవలుడు కావాలి. ఎందుకంటే వేదశాస్త్రాల మహారహస్యాలు సాహిత్యంద్వారా లోకానికి రసాత్మకంగా ఆవిష్కృత మవుతాయి. ఇంతవరకూ చెప్పుకొన్నవానిని సమీక్షిస్తే మహాప్రతిభావంతునకు తప్ప ఈ మూడూ వశంకావటం అసంభవం. ప్రస్తుత శ్లోకం అటువంటి అవతారవ్యక్తినే ప్రస్తావిస్తున్నది. ఆ మహావ్యక్తి సర్వజ్ఞ కల్పుడవుతాడు.

వేదవ్యాప్తి పరిధికి చాలా పరిమితులున్నాయి. శాస్త్రజ్ఞులు కూడా చాలా తక్కువగానే ఉంటారు. సాహిత్య స్రష్టల, వేత్తల సంఖ్య కొంత అధికంగానే ఉంటుంది. కాబట్టి సాహిత్య సారమైనరసస్వరూపాన్ని - దేనిని భగవత్స్వ రూపంగా వేదం కూడా పరిగణించిందో - దానిని సరహస్యంగా భావనలో పండించుకొన్నవాడు మహాత్ములలో అగ్రగణ్యుడే అవుతాడు. అట్టి మహర్షులే వాల్మీకి కృష్ణద్వైపాయనాదులు.

అయితే వేదాధ్యయనాధ్యాపనతత్పరులైన వారిలో కొందరికీ, శాస్త్రాలలో ప్రతిభాపాటవాలు సాధించినవారిలో కొందరికీ, సాహిత్య స్రష్టలలో కొందరికీ దురహంకారం తెలియకుండా పెరిగిపోతూ ఉంటుంది. దానివలన వారి

వేదాదిజ్ఞానానికి వన్నె తరిగిపోతూ ఉంటుంది. ఆవిధంగా అది సర్వజనోపాదేయం కాకుండా పోతుంది. ఆ ప్రమాదగర్తంలో పడిపోకుండా ఉండాలంటే వారు గట్టిపూనికతో సాధించి కాపాడుకుంటూ ఉండవలసిన లక్షణం 'వినయం'. ముఖ్యంగా గురుపదాధిజిగమిష ఉన్నవారికి వినయం లేకపోతే అది విద్యను పాడుచేస్తుంది, అంటే విద్యార్థిని పాడుచేయటమే. వినయం అంటే ప్రధానంగా జ్ఞేయం అనంతంగా ఉంది అనేవిషయాన్ని నిత్యప్రత్యగ్రంగా హృదయంలో నిలుపుకోవటం. దానివలన జిజ్ఞాస పెరుగుతూ ఉంటుంది. శిష్యజనహృదయాలలో జ్ఞానవాహినిని నిరంతరంగా ప్రవహింప జేయటానికి కావలసినశక్తి అనంతంగా వృద్ధి పొందుతూ ఉంటుంది.

ప్రస్తుత శ్లోకంలో శ్లోక రచయిత 'నాస్తి వినయః' అన్నవాక్యం ద్వారా ఆపైన మూడు సమృద్ధిగా సాధించిన వాళ్ళు కొందఱు వినయం లేనివారైపోతూ ఉండటాన్ని గురించి ఏర్పడిన నిర్వేదాన్ని తెలియజేస్తున్నారు.

తరువాత శ్లోకకర్త నాలుగు విషయాలను ప్రస్తావించి అవి లేకుండా పోతున్నాయన్న ఆవేదనను అభివ్యక్తం చేస్తున్నారు. ఉండాలి అనటం ధ్వని. అవి ఆచారము, భక్తి, క్షమ, చాతురి అనేవి. ఆచారం అంటే స్థూలంగా త్రికరణాలపవిత్రతకోసం పాటింప వలసిన నియమాల సముదాయం. అంతే కాదు, ఋషులు నిర్దేశించిన విద్యాసంబంధమైన నాలుగుదశలైన అధీతి, బోధ, ఆచరణ, ప్రచారణలలోని ఆచరణ కూడా ఆచారమే. వ్యాసులవారు "ఆచారప్రభవో ధర్మః, ధర్మస్య ప్రభు రచ్యుతః" అన్నారు. ధర్మము ఆచారంనుండి పుడుతుంది. ధర్మానికి ప్రభువు అచ్యుతుడు. కనుక వర్ణ, ఆశ్రమధర్మాలను యథావిధిగా ఆచరించటం ఆచారం. ఆచారాన్ని పాటించటమంటే అచ్యుతుని ఆరాధించటమే. అచ్యుతారాధన అచ్యుతస్థితికి తీసుకొని వెళ్తుంది. కాబట్టి గురుపదబుభూష కలవాడు ఆచారనిష్ఠకలవాడు కావాలి. కాని చాలమందిలో అది గగనకుసుమం అయిపోతున్నది. తరువాతిది 'భక్తి'. మోక్షసాధన సామగ్రిలో భక్తియే గరీయసి. భక్తి అంటే స్వస్వరూపాను సంధానమే అన్నారు శ్రీశంకరులు వివేకచూడామణిలో. భక్తిలేని మానవుడు ఎండిపోయిన కట్టెవంటివాడు. విశ్వనాథవారు "పోతన్న తెలుగులపుణ్యపేటి" అని అభివర్ణించారు. అందు వలననే పోతన్న వ్రాసిన భాగవతం భక్తిరసామృతాన్ని నిలువెల్లా నింపుకొని తెలుగువారిని ఆనందసాంద్రస్థితిలో ముంచి లేపుతున్నది. కాలప్రవాహంలో తమంతతాము గురువులుగా ప్రకటించుకొని అధ్యాత్మ వ్యాపారం చేస్తున్న వారిలో అచ్చమైనభక్తి కలవారు లేరు. అచ్చమైనభక్తి అంటే అలనాటి ప్రహ్లాదాదులను, ఇటీవలి రామకృష్ణ పరమహంస వంటి



వారినీ సంభావించాలి. సదాశివ బ్రహ్మేంద్రులు, త్యాగరాజు మొదలైన మహాత్ములు కూడ భక్తిపరీపాకం కలవారుగా మనస్మృతి పథంలో కదలాడుతూ ఉంటారు. వారిని స్ఫూర్తిదాత లుగా మదిలో నిలుపుకొని మనం భక్తులం కావాలి.

క్షమ ఒక మహాత్మగుణం. తల్లి చిన్నిబిడ్డడు తనమీద ఎక్కి తొక్కుతూ ఉంటే, తనకట్టుకొన్న వస్త్రాలను మలినం చేస్తూ ఉంటే, తనకు దొరకకుండా పారిపోతూ ఆయాసపెడుతూ ఉంటే పైకి కోపాన్ని అభినయిస్తున్నా లోలోపల ఆనందంతో మురిసిపోతూనే ఉంటుంది. అదిగో అటువంటిది క్షమ.

**క్షమియించువారిఁ గని చా**
**లమివెట్టుదు రైననుం దలంప ననూన**
**క్షమయ కడుమెరయుతొడవు**
**త్రమరూపము కోరువారు తాల్తురు దానిన్**

అన్నారు తిక్కన మహాకవి విదుర నీతులలో. "నా బంగారు కన్నులో వేలు పెడితే నేను కుట్టనా?" అనేది చీమ మనస్తత్వం. కాని దానికంటె కొన్ని వందల సోపానాలపై ఉన్న మనిషి ఆవిధంగా ఆలోచించ గూడదు. సహనాన్ని చుట్టచుట్టి సాగరంలో పారవేయటానికి సిద్ధపడ కూడదు. అలా అయితే అతడు లఘుబుద్ధి అవుతాడు. కానీ సాధించవలసినది. మహాత్మత. దానికి 'క్షమ' గొప్పసాధనం. గురువునందు అది బరువైన ద్రవ్యంగా స్థిరంగా నిలిచిఉండాలి.

చిట్టచివరగా ప్రకృత శ్లోకంలో ప్రస్తావనకు వచ్చినది 'చాతురి' "చతతే కాంక్షతే ప్రయోజనమితి చతురః" అని గురుబాల ప్రబోధిక తెలియజేస్తున్నది. ప్రయోజనాన్ని సాధించటం ఏక లక్ష్యంగా కార్యంలో జాగరూకతతో ప్రవర్తించేవాడు చతురుడు. తెలుగులో నేర్పరి అంటారు. అతని భావము చాతుర్యం, లేదా చాతురి. ఉత్తమస్థాయికి చెందినగురువు తనచాతుర్యంతో శిష్యహృదయాలను తనవైపునకు ఆవర్జించుకుంటాడు. ఆ శిష్యుడు గురువునందలి ఆ గొప్పలక్షణంతో అతుకుకొని పోతాడు. 'అంతేవాసి' అయిపోతాడు. అటువంటి గురుశిష్యుల యందు విద్య సాఫల్యాన్ని సాధిస్తుంది. అయితే చాలా ఎక్కువ మందిలో ఇది మృగ్యస్థితిలో ఉంటుంది.

వక్తవ్యాంశాన్ని శ్లోకకర్త ఉపసంహరిస్తున్నారు. సః - అది - ఆమ్నాయపరిశ్రమ, సా-అది-శాస్త్రబుద్ధి; సా-అది - సాహితి; సః - అది - వినయము. తాః - అవి - ఆచారము, భక్తి, క్షమ, చాతురి అనేవి - మొత్తం ఎనిమిది గుణాలు. ఇక్కడ మరొక విశేషాన్ని కూడా మనం తప్పక సంభావించాలి. ఈ చరమపాదంలో అయిదు చకారాలు ఉన్నాయి. అవి ఇక్కడ సాక్షాత్తుగా ప్రసక్తం కాని, కావలసిన మరొక లక్షణం ఏదైనా ఉంటే దానిని సముచ్చయం చేస్తాయి. మనం నిరభ్యంతరంగా దానిని భగవత్త్వంగా సంభావించుకోవచ్చు. అది తొమ్మిదవది అవుతుంది.

ఈ తొమ్మిది లక్షణాలూ సమగ్రంగా కూడుకొని శ్రీశంకర భగవత్పాదులవారిని ఆలంబనంగా చేసుకొని ఆడుకుంటున్నాయి. ఆ విధంగా శ్రీశంకరులు జగద్గురువులు అవుతున్నారు. శ్రీ శంకరులు జగద్ధితబుద్ధితో ప్రవర్తింపజేసిన శ్రీశారదాద్యామ్నాయపీఠాల మహాధ్యక్షులందరూ అటువంటి దివ్యతేజస్సుతో మానవజాతిని సముద్ధరిస్తున్నారు. ఇది స్వభావోక్తిగా గమనించటానికి మనయెదుట సాక్షాత్కరించి ఉన్న శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వాములే ప్రమాణభూతులు.

◆◆◆

అటుపై శ్రీజగద్గురువులను అనంతపురంలో దర్శించుకున్నాను. అనంతపురంలో నేను ముప్పదిమూడు సంవత్సరాలు శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో అధ్యాపకునిగా ఉన్నాను. (1968-2001). అక్కడి వారంతా నన్ను ఆత్మీయునిగా దగ్గరకు తీసుకున్నారు. ముఖ్యంగా బ్రహ్మశ్రీ వేదమూర్తులు స్వర్గీయ మాడుగుల వెంకటశివశాస్త్రిగారు, స్వర్గీయులు లంక శ్రీనివాసరావుగారు, స్వర్గీయ మాడుగుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు నన్ను కేవల కృపతో ఆదరించిన మహాత్ములు.

శ్రీ రొద్దం ప్రభాకరరావుగారు, శ్రీ కె. అరవిందరావుగారు, శ్రీ ఓరుగంటి విశ్వం మొదలైన వారు నాకు అత్యంతాత్మీయులు. శ్రీవారిసేవలో చారితార్థ్యం పొందాలనే గాఢమైన అభిప్రాయం ఉన్నవారు. శ్రీవారి ఆగమనసందర్భంగా అనంతపురం శ్రీశృంగేరీశారదాశంకర మందిరంలో కొన్ని కార్యక్రమాలు ఏర్పాటయ్యాయి. శ్రీచరణులు అక్కడ భువనవిజయ కార్యక్రమాన్నీ ఒక వేద శాస్త్రవిద్వత్సభనూ నిర్వహించ వలసినదిగా కార్యకర్తలను ఆదేశించారు. నేను ఆ రెండు కార్యక్రమాలలో పాల్గొనటానికి అక్కడకు వెళ్ళాను. భువన విజయంలో విశిష్టవిద్వాంసునిగా ఒక స్థానం సంపాదించుకొని భువనవిజయ పరిచయం సభాముఖంగా చేశాను. సుమారు





రెండుగంటల కార్యక్రమం నడచిన తరువాత శ్రీవారు 'రవి కాననిచో కవి గాంచునే కదా' అని ఒక ప్రసిద్ధ సమస్యాపూరణంతో దీనికి ముగింపు పలుకుదాం అన్నారు. అస్మత్ప్రియ సుహృద్వరులు శ్రీ గండ్లూరి దత్తాత్రేయశర్మ గారు క్రొత్తపద్యాన్ని అప్పటికప్పుడు చెప్పారు. శ్రీచరణులు సంతోషించారు.

వేదశాస్త్రవిద్వత్సభలో బ్రహ్మశ్రీ విశ్వనాథ గోపాలకృష్ణ శాస్త్రిగారు, నేనూ కొంతసేపు ప్రసంగించాము. నేను ముఖ్యంగా వ్యాకరణ శాస్త్ర అధ్యయనావశ్యక తను గూర్చి ప్రసంగించాను. సంమానం చేయిస్తూ శ్రీచరణులు మీరు వ్యాకరణం ఎవరిదగ్గర చదువుకున్నారు అని అడిగారు. బ్రహ్మశ్రీ పేరి వేంకటేశ్వరశాస్త్రి మహోదయుల దగ్గర అని నివేదించుకున్నాను. శ్రీస్వామివారు పరితృప్తిని వెల్లడించారు.

స్మృతిశక్తిని ఉద్దీప్తం చేసుకొని 2012-2013 సంవత్సరాలలో శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ శ్రీచరణుల సందర్శన సంభాషణాను భూతులకు ఈవిధంగా అక్షరాకృతి కల్పించుకోగలిగినందులకు నాహృదయం ఆనందాన్ని అనుభవిస్తున్నది.

వివేకచూడామణిలో శ్రీశంకర భగవ త్పాదుల వారు లోకానికి అనుగ్రహించిన మహావాక్యాలవంటి రెండు శ్లోకాలను వ్యాఖ్యాన సహితంగా ఇక్కడ ఆత్మపరితృప్తికోసం నిక్షేపించుకుంటాను.

**బ్రహ్మానందరసానుభూతికలితైః పూతైః సుశీతైః సితైః**
**యుష్మద్వాక్కలశోజ్ఝితైః శ్రుతిసుఖైః వాక్యామృతైః సేచయ,**
**సంతప్తం భవతాపదావదహన జ్వాలాభి రేతం ప్రభో**
**ధన్యాస్తే భవదీక్షణ క్షణగతేః పాత్రీకృతాః స్వీకృతాః** 41

ప్రభూ! గురుదేవా! తమవాక్కులు అమృతద్రవాలు. వానిలో బ్రహ్మానంద రసం వలన కలిగే అనుభూతి కూడి ఉన్నది. పరమపవిత్రమైనవి. జీవుల హృదయాలను కాల్చివేస్తున్నవీ అయిన మూడువిధాలైన తాపాలను రూపుమాపే చక్కని చల్లదనంతో అలరారుతున్నవి. రజస్తమోమార్గాలను మరలించటం ద్వారా సత్త్వమార్గాన్ని మాత్రమే పొందింపగల నిర్మలత్వం కలవి. తమ వాక్కులనెడి కలశాలనుండి వెలువడుతున్నవి. చెవులకు ఆనందదాయకమైనవి. వానితో సంసార తాపమనే కారుచిచ్చుల మంటలతో కాలి పోతున్న ఈ నన్ను తడపండి. తమ చూపులు క్షణకాలమైనా పొందగలిగి తాము నావారని భావించిన పుణ్యాత్ములు ధన్యులు గదా!

శ్రీశంకరుల ఈ సారవంతమైన శ్లోక రాజాన్ని సంభావించుకుంటూ శ్రీభారతీతీర్థ జగద్గురువులను అది నా ప్రార్థనగా మన్నింపవలసినదిగా అభ్యర్థిస్తున్నాను.

**సంసారాధ్వని తాపభానుకిరణ ప్రోద్భూత దాహవ్యథా**
**ఖిన్నానాం జలకాంక్షయా మరుభువి భ్రాన్త్యా పరిభ్రామ్యతామ్**
**అత్యాసన్నసుధాంబుధిం సుఖకరం బ్రహ్మాద్వయం దర్శయ**
**త్యేషా శంకర భారతీ విజయతే నిర్వాణసంధాయినీ** 581

సంసారం అనేదారిలో ఉడుకెక్కించే సూర్యకిరణాలవలన ఉవ్వెత్తుగా ఎగసిపడుతున్న మంటల వేదనలతో కుమిలిపోతున్న వారూ, నీరుకోరి ఎడారులలో భ్రాంతితో దిక్కుమాలి తిరుగు తున్నవారూ అయిన జనులకు మిక్కిలి సన్నిహితంగా ఉన్న అమృతసాగరం అయినది, సుఖాన్ని కలిగించేది, బ్రహ్మాద్వైతాన్ని ప్రదర్శించేదీ, నిర్వాణాన్ని చక్కగా అనుగ్రహించేదీ అయిన ఈ శంకరభారతి విరాజిల్లుగాక.

- శలాక రఘునాథ శర్మ



# ఆధునిక భారతావనికి సంప్రదాయ గురువు

**సనాతన కర్మభూమి భారతభూమికి ఆదిశంకరులు ఎనలేని సేవ చేశారు. ఆది శంకరులు 32 సంవత్సరాలు మాత్రమే జీవించారని అంటారు చరిత్రకారులు. కానీ ప్రస్తుతం ఆది శంకరులు 57 సంవత్సరాలు పూర్తి చేసుకుని 58వ సంవత్సరంలో అడుగుపెడుతున్నారు. ఆశ్చర్యంగా ఉంది కదూ!! ఇది యదార్థ సత్యం. ఆదిశంకరాచార్యులవారు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థస్వామివారి రూపంలో శృంగేరీ శారదా పీఠానికి 36వ జగద్గురువుగా 57 సంవత్సరాల వయస్సును పూర్తి చేసుకుని 58వ సంవత్సరంలో అడుగుపెడుతున్నారు. నడిచే భారతీ స్వరూపమే శ్రీశ్రీశ్రీ భారతీతీర్థస్వామివారు. ఈ సందర్భంగా 'దర్శనమ్' సభక్తి పూర్వకంగా అందించిన వ్యాసం.**

అజ్ఞానాం జాహ్నవీ తీర్థం విద్యాతీర్థం వివేకినామ్
సర్వేషాం సుఖదం తీర్థం భారతీ తీర్థమాశ్రయే ॥

ధర్మానికి హాని కలిగినప్పుడు పరమేశ్వరుడు ధర్మసంరక్షణకు అవతరిస్తాడు అని గీతా వాక్యం. సనాతన ధర్మం విధర్మీయుల చేత బాధించబడినప్పుడు సనాతనధర్మ పునఃప్రతిష్ఠాపనకు ఈ జగత్తులో పరమేశ్వరుడు ఆదిశంకరుల రూపంలో అవత రించే ధర్మస్థాపన చేశాడు. హిందూమతం అంటూ ఒక మతం కాదు. సనాతన ధర్మం అని అర్థం. సర్వకాల సర్వావస్థలందు ఆ ధర్మం నిలవాలని ఆదిశంకరులు చతురామ్నాయ పీఠాలు స్థాపించారు. చతురామ్నాయ పీఠంలో 'సమ్రాట్ పీఠము'గా దక్షిణామ్నాయ శృంగేరీ పీఠాన్ని నెలకొల్పి తనతో వాదించి, వాదంలో అపార ప్రతి భ కనబర్చి శంకర శిష్యత్వం పొందిన మండమిశ్రుడిగా ఖ్యాతి చెందిన శ్రీశ్రీశ్రీ సురేశ్వరాచార్యులను ప్రథమ పీఠాధిపతిగా నిల్పి, ఆనాటి నుంచి నేటివరకు 'అవిచ్ఛిన్న గురు పరంపరం కలిగిన శ్రీ శృంగేరీ శారదా పీఠమున 36వ పీఠాధీశ్వరుడిగా అపర శారదామూర్తిగా, ఆదిశంకరుడి అవతారంగా విరాజిల్లు తున్న జగద్గురువులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారు.

### బాల్య విశేషాలు

ఆంధ్రప్రదేశ్‌లో గుంటూరు జిల్లాలో పల్నాడు తాలూకాలోని నాగులేరు అనే నదీతీరం మీద ఉన్న అలుగుమల్లెపాడు గ్రామం లో బ్ర॥శ్రీ తంగిరాల వేంకటేశ్వర అవధాన్లు, శ్రీ అనంతలక్ష్మమ్మ అనే పుణ్యదంపతులు నివసించేవారు. ఆ గ్రామంలోని భవానీశంకర దేవాలయంలో ప్రతిరోజు శ్రీ అవధానిగారు ఆ శివలింగానికి ప్రతీరోజు మహన్యాసపూర్వక రుద్రాభిషేకం చేసేవారు. కొద్దికాలం తర్వాత శ్రీ అవధానిగారు తమ నివాసమును

మచిలీపట్నంకు మార్చారు. అక్కడ శివాభిషేకం కొనసాగిస్తూ శ్రీరామనవరాత్రోత్సవం చేసేవారు. అవధానిగారు తనకు కుమారుడు పుడితే శ్రీరాముని పేరు పెడతానని మొక్కుకున్నాడు. శ్రీమతి అనంతలక్ష్మమ్మ ఆంజనేయున్ని ఆరాధిస్తూ కుమారుడు పుడితే ఆంజనేయుడి పేరుపెడతానని మొక్కుకున్నది. ఒకరోజు బ్రాహ్మీముహూర్తంలో ఆమెకు ఆంజనేయస్వామి స్వప్నంలో కనబడి మూడు మామిడిపండ్లు అనుగ్రహించి అంతర్థానం అయ్యాడు. ఆ స్వప్న వృత్తాం తం భర్తకు చెప్పగా ఆ మూడు పండ్లు అంతరార్థం ఏమిటా అని ఆలోచించినాడు. శివ, రామ, ఆంజనేయ అనుగ్రహంతో పుత్రుడు కలుగుతాడా? లేక మూడు జన్మలు శిశువు, బ్రహ్మచారి, సన్యాసి అని అర్థమా అని ఆలోచించాడు.

ఆర్యాంబాదేవి ఆదిశంకరుని ప్రసవించినట్లు ఖర నామ సంవత్సర చైత్ర శుక్ల పంచమినాడు షష్ఠీ ఘడియలలో (11.4.1951) నాడు ఒక అద్భుత ప్రవేశం కలిగిన బాలుడిని శ్రీమతి లక్ష్మమ్మ ప్రసవించింది. ఆ శిశువుకు సీతారామాంజ నేయులు అని నామకరణం చేశారు. ఆ తర్వాత శ్రీ అవధాని గారు తమ నివాసాన్ని మచిలీపట్నం నుంచి నరసరావుపేటకు మార్చారు. శ్రీకృష్ణుడు యశోదను ఎలా తన లీలలతో ఆనందపరిచాడో, ఆ శిశువు యొక్క ప్రవేశ, సుందరముఖ కాంతులను చూచి ఆ తల్లి ఆనందపరవశురాలయింది. తన కుమారుడు లౌకిక వ్యవహారా లతో జీవితం గడిపే మామూలు మనిషి కాడని, తన దివ్యశక్తితో ఈ భరతభూమి యొక్క ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని పెంపొందించే జగద్గురువు అని తెలియదు.

మూడు సంవత్సరాల వయస్సు నిండకమునుపే ఆ బాలుడి భక్తిభావాన్ని చూచి అందరూ ఆశ్చర్యపడినారు. 'శంభోశివశివ సాంబశివశివ" అనే నామాన్ని మధుర స్వరంతో చేసే ఆ బాలుడి లీలను చూసినవారు తెలియకుండానే నమస్క రించేవారు. శ్రీ అవధానులుగారు తమ కుమారుడికి పురాణాలలోని నీతికథలు చెబుతూ ఉండేవారు. "ఇది ఇలా చెయ్యాలి" ఈ విధంగా చెయ్యకూడదు అని చెబితే చాలు, ఆవిధంగానే ప్రవర్తించేవాడు.

నరసరావుపేటలో శ్రీ ప్రతాపగిరి శివరామశాస్త్రిగారు అనే సంస్కృత పండితుడి దగ్గర చాలా స్వల్ప వ్యవధిలో సంస్కృతం నేర్చుకుని, అనర్గళంగా సంస్కృతంలో మాట్లాడేవాడు. గర్భాష్టమంలో ఉపనయనం చేయగా ఆ బ్రహ్మచారిలో చాలా మార్పు కలిగింది. శిఖతో, ఫాలభాగం విభూతి ధరించి అపూర్వమైన శోభతో ప్రవేశించాడు. సంధ్యావందనం, అగ్ని కార్యం తప్పక ఆచరించేవాడు. సంస్కృత భాషాజ్ఞానం వల్ల మంత్ర అర్థమననం చేస్తూ ఉండేవాడు. ఏకసంధాగ్రాహి కాబట్టి స్వల్పకాలంలోనే



గుంటూరు జిల్లా వేదసభలో పరీక్షకు వెళ్లి ఉన్నత శ్రేణిలో ఉత్తీర్ణుడైనాడు. ఒకరోజు తన తండ్రి గ్రామాంతరానికి వెళ్లగా ఒక గృహస్థు ఇంట్లో ఉపనయనం చేయడానికి వెళ్లి యథావిధిగా ఆ ఉపనయనం చేయించాడు. ఇంతవరకు తాను ఎక్కడా ఆ పని చేయలేదు. తన తండ్రి చేయించడం చూసి తాను ఉపనయనం చేయించాడు. తండ్రిగారైన అవధానిగారు చాలా ఆనందపడ్డారు. శ్రీ సీతారామాంజనేయులకు 11 సంవత్సరాల వయస్సు వచ్చింది. ఇక్కడి నుంచే అనేక అద్భుత సంఘటనలు మొదలైనాయి.

### శ్రీ శారదాపీఠంతో సంబంధం

శ్రీ శృంగేరీ శారదాపీఠంలో 35వ పీఠాధీశ్వరులైన శ్రీశ్రీశ్రీ అభినవ విద్యాతీర్థమహాస్వామివారు ఆంధ్ర దేశంలో సంచారం చేస్తూ విజయవాడకు వచ్చారు. నరసరావుపేట వాస్తవ్యులైన శ్రీ కవితా సుబ్రమణ్యశాస్త్రిగారు జగద్గురువులకు పరిచితులు. ఆయన వెళ్తూ శ్రీ సీతారామాంజనేయులును వెంటబెట్టుకుని వెళ్లి స్వామివారితో ఈ పిల్లవాడు సంస్కృతం చాలా బాగా మాట్లాడుతాడు అని పరిచయం చేయగా జగద్గురువులు ఆ సభలో ఆంజనేయులుతో సంస్కృతంలో సంభాషించి, ఆనంద ంపడి ఒక పట్టువస్త్రాన్ని అనుగ్రహంగా ఇచ్చారు. శ్రీచరణుల ప్రథమ వీక్షణంలోనే ఆంజనేయులు గురువులను ఆకర్షించా డు. విజయవాడ నుంచి శ్రీచరణులు నరసరావుపేటకు రాగా, విజయవాడలో చూచినప్పుడు ఆ



బాలుని విషయంలో ప్రాదుర్భ వించిన వాత్సల్యబీజం ఇక్కడ అంకుర రూపం దాల్చింది. అతనిని శ్రీచరణులు విశేషంగా అనుగ్రహించారు. ఆంజనే యుల మనస్సులో ఒక పవిత్రమైన పరిణామం ఏర్పడింది.

శ్రీ ఆంజనేయులు పాఠశాలలో ఆరవ తరగతిలో ప్రవేశిం చాడు. ఆ రోజుల్లో ఆ క్లాసును 'ఫస్ట్ ఫారం' అనేవారు. అక్కడా మంచి ప్రవర్తనతో నిరాడంబరంగా ఉండేవాడు. కర్మయోగిలాగా ఉండేవాడు. అయితే సంప్రదాయం ప్రకారం శాస్త్రములను అధ్యయనం చేయాలనే కోరిక కల్గింది. 1966వ సంవత్సరంలో శృంగేరీ జగద్గురువులు తిరిగి నరసరావుపేటకు వచ్చారు. తాము ఐదు సంవత్సరాల క్రితం సంస్కృతంలో మాట్లాడిన విషయం శ్రీచరణులకు జ్ఞాపకం వచ్చింది. తిరిగి ఆ బాలుడితో సంస్కృతంలో మాట్లాడగా ఈ దర్శనంతో ఒక దృఢమైన భావం ఏర్పడింది. తనకు వీరే గురువులు. వీరి కృపతోనే తన జన్మ సార్థకం కావాలి. అందుకు వారి పాదాలను ఆశ్రయించడమే తన లక్ష్యం అని అనుకున్నాడు. జగద్గురువులు ఆ సంవత్సరం ఉజ్జయినిలో చాతుర్మాస్యదీక్ష చేస్తున్నారు. నరసరావుపేట నుంచి శ్రీ విద్యారణ్యస్వామి అనే యతి ఉజ్జయినికి వెళ్తుండగా, వారితో కలిసి శ్రీ ఆంజనేయులు ఉజ్జయిని బయలుదేరాడు. శ్రీ జగద్గురువులు ఆ సమయంలో సిప్రానదీతీరంలో ఉన్నారు. ఆ నదీతీరంలో సదాశివుడిగా ప్రకాశిస్తున్న శ్రీచరణులను చూడగానే ఆ బ్రహ్మచారి సాష్టాంగం చేయగా, శ్రీచరణులు ఆ బ్రహ్మచారి మనస్సులో ఉన్న విషయాన్ని గ్రహించారు. "నువ్వు ఉజ్జయినికి ఎందుకు వచ్చావు" అని ప్రశ్నించగానే "నేను మీ చరణ సన్నిధానంలో శాస్త్ర అధ్యయనం చేయాలనే కోరికతో వచ్చాను" అని సమాధానం చెప్పగా శ్రీచరణులు అభయం ప్రసాదించారు. ఆ దయాసముద్రుడు కొద్దిరోజుల తర్వాత "నువ్వు తర్కసం గ్రహం" చదివావా అని ప్రశ్నించగా చదవలేదని సవినయంగా సమాధానం చెప్పాడు. సరే! నేను మీకు ఆ గ్రంథం పాఠం చెబుతాను అని అనగానే శ్రీ ఆంజనేయులు జగద్గురువులకు సాష్టాంగ చేశాడు. అదేరోజు పాఠం మొదలైంది.

తర్క సంగ్రహం చిన్న ప్రకరణ గ్రంథం. ఎవరితోనైనా ఆ పాఠం చెప్పించవచ్చు. కాని జగద్గురువులు తామే స్వయంగా పాఠం చెప్పడానికి నిశ్చయించుకున్నారంటే ఎంత వాత్సల్య అనుగ్రహం శ్రీ ఆంజనేయులు మీద ఉన్నదో అర్థమవుతోంది. తల్లిదండ్రు లకు ఈ వార్త తెలుపగా, వారు పుత్రవాత్సల్యం కొద్దీ దుఃఖ పడ్డారు. జగద్గురువుల వెంట ఉండడం ఈశ్వరేచ్ఛగా భావించి తృప్తిపడ్డారు. చిన్న శిశువుకు తన తల్లి ఒడిలో ఎంత ఆనందం ఉంటుందో సద్గురువుల సన్నిధిలో అలా ఆంజనేయులు ఉన్నాడు. ఊపిరి సలపని అనేక కార్యక్రమాలు ఉన్నా జగద్గురు వులు శ్రీ ఆంజనేయులుకు పాఠం చెప్పడానికి కొంత సమయం కేటాయించేవారు. 1968వ సంవత్సరంలో జగద్గురువులు శృంగేరికి చేరుకున్నారు. తన శిష్యుడికి నరసింహవనంలో ఆహ్నిక మందిరంలో సుఖప్రదమైన నివాసం ఏర్పాటుచేశారు. కాని విద్యపై శ్రద్ధ కలిగిన శ్రీ ఆంజనేయులు సుఖాలకు ప్రాధాన్యత ఇవ్వలేదు.

ఒకసారి శ్రీచరణులు ఆంజనేయులుతో ఇలా అన్నారు. "బ్రహ్మ సాక్షాత్కారం పొందిన గురువు దయాసముద్రుడనే విషయం గుర్తుంచుకోవాలి. ఆయన ఏవిధమైన స్వార్థచింతన లేకుండా శిష్యుల అభివృద్ధిని కాంక్షిస్తూ ఉంటాడు. శిష్యుల విషయంలో అలాంటి సద్గురువుకన్నా తపన తల్లిదండ్రుల తపన కంటే కూడా ఎక్కువ. వాళ్లు తమ పుత్రునికి భౌతికమైన సుఖాలన్నీ సమకూర్చాలనే ఆసక్తిలో పడి శ్రీ మహాసన్నిధానం వారి మాటలలోని అంతరార్థాన్ని బాగా గ్రహించాడు. నరసింహవనం నుండి నదీ ఆవలి తీరంకు వెడితే, శ్రీచరణులు "నువ్వు ఎల్లప్పుడు నరసింహ వనంలోనే ఉండాలి. నిన్ను నేను ఎల్లప్పుడూ ఒక కంట కనిపెట్టి చూస్తుంటాను" అన్ని అన్నారు. కావున శ్రీచరణులు ఎప్పుడు శిష్యవాత్సల్యంతో ఉండేవారు.

**ఉత్తమ శిష్యులు**

శ్రీ గొల్లపూడి గోపాలకృష్ణమూర్తి శాస్త్రిగారి వద్ద తర్కశాస్త్రం

లోని వాద గ్రంథాలు అధ్యయనం చేశాడు. శాస్త్ర అధ్యయనం, యజు ర్వేదం, సకల శాస్త్ర పాండిత్య గరిష్ఠుడైనాడు. బ్రాహ్మీముహూ ర్తంలో లేచి విద్యాభ్యాసం కొనసాగించేవాడు. సుమారు ఎనిమిది సంవత్సరాలు శ్రీచరణులకు చేసిన నిస్వార్థసేవ ఆంజనేయులలో ఒక దివ్య ప్రకాశాన్ని ఆవిర్భవింప జేసింది. శ్రీ ఆంజనేయులు సంపాదించిన అసాధారణమైన వేదశాస్త్రాల పాండిత్యం, ఆచార్యుల కృపను చూచి భక్తులంతా ఉత్తరాధికారిగా ఆంజనేయులును ఊహించారు. 1974వ సంవత్సరంలో శృంగేరిలో నవరాత్రి ఉత్సవాలు ప్రారంభ మైనాయి. శ్రీ అవధాని దంపతులు శృంగేరికి రాగా శ్రీచరణులు అవధానిగారిని పిలిచి ఇలా చెప్పారు. "శారదాదేవి ఆజ్ఞ ప్రకారం మేము సీతారామాంజ నేయులుకు సన్న్యాసాశ్రమం ఇచ్చి ఈ మఠానికి పీఠాధిపతిని చెయ్యాలని నిర్ణయించాం. ఈ విషయం మీరు మీ భార్యకు చెప్పవచ్చు. మీ రెండవ కుమారుడు (చి॥ దక్షిణామూర్తి) మిమ్ములనిద్దరినీ బాగా చూచుకుంటాడు. మీకు ఎల్లప్పుడూ మా ఆశీస్సులుంటాయి" అని అనగానే ఆశ్చర్యపోయారు. తమ కిచ్చిన అసాధారణమైన అనుగ్రహానికీ, ఆశీస్సులకు కృతజ్ఞతలు తెలిపారు. తల్లి లక్ష్మమ్మ కొంత బాధపడినా, జగద్గురువుల కృప కలిగినందుకు ఆనందపడింది.

1974వ సంవత్సరం నవంబర్ 10వ తేదీ నాడు "ఆశ్వయుజ కృష్ణ ఏకాదశి రోజున సన్న్యాస గ్రహణ పూర్వాంగ కార్యక్రమాలు ప్రారంభమైనాయి. 11వ తేదీనాడు తుంగానదీ తీరంలో శ్రీ మహాసన్నిధానం శిష్యుడికి కాషాయవస్త్రాలు, దండం, కమండ లం అనుగ్రహించారు. శ్రీశ్రీశ్రీ చంద్రశేఖర భారతీస్వాముల అధిష్ఠానంలో శ్రీచరణులు శిష్యుడికి ప్రణవోపదేశం చేసి, మహా వాక్యోపదేశం చేసి వారికి "శ్రీ భారతీతీర్థ" అనే యోగపట్టాను అనుగ్రహిం చారు. అక్కడ శ్రీ శారదాదేవి ఆలయంలో వ్యాఖ్యాన సింహాసనంపై ఆసీనులను చేసి ఆయన శిరస్సు మీ ఒక సాలిగ్రామం ఉంచి దానికి పూజ చేశారు. ఆ తర్వాత శ్రీ భారతీతీర్థ స్వామివారు శ్రీ విద్యాతీర్థ స్వామి వారికి పాదపూజ చేశారు. సన్న్యాసి యొక్క అనుష్ఠాన క్రమాన్ని శ్రీ మహాసన్నిధానం శ్రీ భారతీతీర్థులకు తామే స్వయంగా ఉపదేశించేవారు. మఠంలో పాటించ వలసిన సంప్రదాయాలన్నీ అయిన బోధించారు. శ్రీ అభినవ విద్యాతీర్థ స్వామివారి ఆశీస్సులతో జగత్ప్రసిద్ధమైన శృంగేరీ వ్యాఖ్యాన సింహాసనమున 36వ పీఠాధీశ్వరుడిగా శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహా స్వామివారు నిర్ణయించబడడం తెలుగు జాతి చేసుకున్న పుణ్యప్రభావమేనని పండితులు భావించారు.



**జగద్గురువులు**

శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వాముల వారికి అసామాన్య శిష్యుడుగా, శాస్త్రముల్లో వర్ణించిన శిష్యలక్షణములు అన్నీ శ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి వారిలో మూర్తీభవించినాయి. 1989 అక్టోబర్ 19 నాడు ఆశ్వయుజ కృష్ణ పంచమినాడు శ్రీచరణులకు శ్రీ శారదాపీఠంలో 36వ పీఠాధిపతులుగా పట్టాభిషేకోత్సవం చాలా వైభవంగా జరిగింది. శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి సంప్రదాయ గురువులు. సనాతన ధర్మ రక్షకులు కావున ఈనాటికీ శాస్త్ర సంప్రదాయం ప్రకారం తమతమ విద్యుక్త ధర్మాలను నిర్వర్తిస్తున్నారు. ఈనాటి హైటెక్ యుగంలో ఎందరో స్వాములు సన్యాసం స్వీకరించినా లౌకిక వ్యవహారాల నుంచి తమ మనస్సులను మార్చుకోలేకపోతున్నారు. శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారు ఈనాటికీ ఫోన్‌లో మాట్లాడరు. దేశం దాటి విదేశీయానం, సముద్రములను దాటడం చేయరు. తమిళం, తెలుగు, ఆంగ్లం, హిందీ, కన్నడ, సంస్కృతం మొదలైన భాషల లో అసామాన్య ప్రజ్ఞ కలిగినవారు. మానవసేవయే మాధవ సేవగా పరిగణించి శృంగేరిలో 'శారదా ధన్వంతరీ ఛారిటబుల హాస్పిటల్" అనే వైద్యశాలను స్థాపించారు. "వేదపోషకసభ", "శాస్త్ర సంవర్ధినీసభ"ల ద్వారా ప్రతి నెల వేద పండితులకు, శాస్త్ర పండితులకు భృతి కల్పించారు. మాజీ భారత రాష్ట్రపతులు శ్రీ శంకర్‌దయాళ్‌శర్మ, రాజేంద్రప్రసాద్, శ్రీ వెంకట్రామన్ గారలు శృంగేరీ పీఠ శిష్యులు ఈనాటికీ ఎంతోమంది భక్తులకు మార్గదర్శనం చేస్తూ అపర శారదామూర్తులై పీఠంలో ఆదిశంకర అవతారమూర్తిగా విరాజిల్లుతున్నారు. వారు వివిధ సంద ర్భములలో వారి వారి శిష్యులతో సంభాషించిన తీరు, శ్రీచరణుల ప్రభోదాత్మక సందేశములు చదివితే వారు భూమిపై నడుస్తున్న 'శ్రీదక్షిణా మూర్తి' అని తెలుస్తుంది.

- బాచంపల్లి సంతోష్‌కుమార్‌శాస్త్రి

# సమస్త ఆస్తిక లోకానికి దార్శనికులు భారతీతీర్థులు



కోమలమైన పుష్పవన వాటికల నడుమ-పీఠభూమిపైన- తుంగానదీ తీరమున, అతి పూర్వకాలమున విభాండక ముని ఆశ్రమం ఉండేది. ఆయన కుమారుడు ఋష్యశృంగుడు. ఆయన అమాయకత వాల్మీకి రామాయణంలో రమణీయంగా వర్ణింపబడింది. దశరథ మహారాజుచే పుత్రకామేష్ఠి యాగం చేయించింది ఆయనే. వారి ఆశ్రమ ప్రదేశమే ఋష్యశృంగపురమై, నేటికీ 'శృంగేరి' అన్న పేరుతో, ప్రకృతి రమణీయకతకు నిలయమై విరాజిల్లుచున్నది.

హైందవ సంస్కృతి నలుమూలలా నిర్మూలింపబడే కాలం ఒకప్పుడు బౌద్ధ, జైన, శాక్త మత శాఖలను అవలంబించే వారి వలన సంభవించింది. అప్పుడు శ్రీ శంకర భగవత్పాదులు అవతరించి భారతీయ సంస్కృతి - అనగా సనాతన ధర్మాన్ని పునర్వ్యవస్థీకరించి, పునరుజ్జీవనం చేసి పునః ప్రతిష్ఠించారు. సనాతన హైందవ సంస్కృతిని రక్షించడానికి భారతదేశంలో ఆయన నాలుగు మూలలా నాలుగు వేదాలకు ప్రతీకలుగా నాలుగు మఠాలను స్థాపించారు.

స్థల నిర్ణయం చేసే ప్రక్రియలో శ్రీ శంకర భగవత్పాదుల వారు దేశమంతటా పర్యటిస్తూ 'శృంగేరి'కి వచ్చారు. అక్కడి ప్రకృతి సౌందర్యానికి ముగ్ధులై తపస్సు చేసుకోవడానికి తగిన ప్రదేశమని భావించి తుంగా నదీతీరంలో అనుష్ఠానానికి కూర్చోగానే ఆయనకొక వింత దృశ్యం కనబడింది. ప్రసవ వేదన అనుభవిస్తున్న ఒక కప్పకు ఎండ బాధను తప్పించడానికి ఒక సర్పం తన పడగ విప్పి గొడుగులా పట్టుకోవడం చూశారాయన. శాంతియుత సహజీవనానికి చక్కటి ఉదాహరణ అది. శృంగేరీ శాంతి స్వర్గమని భావించి యజుర్వేద పీఠమైన శ్రీ శారదాపీఠాన్ని అక్కడ స్థాపించారు. ఈ పీఠం ఆదిశంకరాచార్యుల వారు స్థాపించిన నాలుగు పీఠాలలో ప్రప్రథమమైనది. ప్రధానమైన పీఠంగా ఆనాటి నుంచి నేటి వరకు విరాజిల్లుతున్నదనడం నగ్నసత్యం. మిగిలిన మూడు పీఠాలను పూరి, ద్వారక, బదరీల యందు ప్రతిష్ఠించారు.

ఆనాటి నుంచి నేటివరకు శృంగేరిలోని శ్రీ శారదాపీఠం అవిచ్ఛిన్న గురుపరంపర సాంప్రదాయ విద్యమానమై విరాజిల్లుతూ ఉన్నది. శంకరానంతరం శృంగేరీ తాత్విక, దార్శనిక భావాలకు ప్రథమ స్థానంగా తపశ్చక్రవర్తుల ఆశ్రమ స్థానంగా ప్రకాశిస్తున్నది. శ్రీ జగద్గురు శంకరాచార్యుల శిష్యపరంపరలో 36వ పీఠాధిపతులుగా నేడు జగద్గురువులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వాములవారు విరాజిల్లుతున్నారు. నా అనుభూతిలో వీరు సాక్షాత్ పరమేశ్వరుల అవతారులే. వారే శ్రీ చంద్రమౌళీశ్వరులు, వారే శ్రీ శారదాంబ. ఎలా తలిస్తే అలా దర్శనమిస్తారు. 'యద్భావం తద్భవతి' సమస్త ఆస్తిక లోకాన్ని అనుగ్రహిస్తున్న అవతార పురుషులు.

మఠ సాంప్రదాయానుసారంగా శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి వారు 1989వ సంవత్సరం అక్టోబర్ 28వ తేదీన 36వ పీఠాధిపతిగా వ్యాఖ్యాన సింహాసనాన్ని అధిరోహించారు. పీఠంతో విశేషమైన అనుబంధం కలిగిన లక్షలాది భక్తులు జగద్గురువులను అత్యంత భక్తితో సేవిస్తారు. వాళ్లు ఆయా సమయాలలో శృంగేరీ యాత్ర చేసి కొన్ని రోజులు అక్కడ ఉండి, జగద్గురువుల దర్శనం వలన, ఆయా దేవతల దర్శనం వల్ల కలిగే ఆనందాన్ని తమ హృదయాలకు సంతృప్తి కలిగేవరకు అనుభవించి తిరిగి స్వస్థానాలకు వెళ్లడం మామూలే. వాళ్లకు సుఖంగా నివసించడానికి తగిన ఏర్పాట్లు చేయడం తమ ధర్మంగా కార్యనిర్వహణ శాఖ భావిస్తుంది. యాత్రికుల సంఖ్య వృద్ధిపొందడాన్ని గమనించిన జగద్గురువులు శ్రీ శారదాకృప, యాత్రిక్ నివాస్ మొదలుగా అనేక వసతిగృహ నిర్మాణాలకు

ఆదేశించి నిర్మాణాలు పూర్తిచేయించారు. అతిథి గృహాలన్నిటిలోనూ ఆధునిక సౌకర్యాలతో ప్రత్యేక గదులు ఏర్పాటుచేశారు. శృంగేరికి వచ్చే యాత్రికులకు, భక్తులకు మధ్యాహ్నం, రాత్రి ఉచిత భోజన వ్యవస్థను ఏర్పాటు చేయించారు. భక్తులకు దర్శన సౌకర్యార్థం 'గురు భవనం' నిర్మించారు. తుంగా నదికి ఉత్తర తీరాన ఉన్న మఠ వసతి భవనాలు శ్రీవారుండే నృసింహ వనమున దక్షిణ తీరాన్ని కలుపుతూ భక్తుల సౌకర్యార్థం లోగడ చేపట్టిన వంతెన నిర్మాణం త్వరగా పూర్తిచేయించి దానికి 'విద్యాతీర్థ సేతువు'అని నామకరణం చేసి తమ గురుభక్తిని చాటుకున్నారు.

శ్రీ జగద్గురువుల సన్నిధికి భక్తులు ఎన్నో రకాలైన ప్రార్థనల తోను, కోరికలతోను వస్తూ ఉంటారు. ఒకరు ఉపనయనం చేసిన కుమారుణ్ణి వెంటబెట్టుకుని వచ్చి ఆశీర్వదించవలసిందిగా కోరతారు. మరొకరు కుమార్తె లేదా కుమారుల వివాహ పత్రిక తీసుకుని వచ్చి ఆశీర్వదించమని కోరతారు. ఏదో ఒక దేవాలయానికి కుంభాభిషేకం చేయడానికి ఒకరోజు నిర్ణయించ వలసిందిగా కోరుతూ మరొక భక్తుడు వస్తారు. మరొకరెవరో అనారోగ్యంతో బాధపడుతున్న తన వాళ్లకి శీఘ్రంగా ఆరోగ్యం చేకూరేటట్టు అనుగ్రహ ఆశీర్వచనాలు అందించవలసిందిగా అభ్యర్థిస్తారు. కొందరు ఆధ్యాత్మిక మార్గంలో దారిచూపవలసిందిగా శ్రద్ధాపూర్వకంగా ప్రార్థిస్తారు. మరికొందరు జగద్గురువుల అనుగ్రహం వల్ల కొన్ని ఆపదలు తొలగిపోయినందుకు కృతజ్ఞత తెలుపుకోవడానికి వస్తారు. ఇక్కడ మనసును ఆకర్షించే విషయం ఏమిటంటే జగద్గురువులు ఓపికతో మందస్మిత వదనంతో ప్రతి ఒక్కరూ చెప్పే విషయాన్ని శ్రద్ధగా విని వారి కోర్కెను తీర్చడమే. తపస్సంపన్నులైన జగద్గురువుల సన్నిధిలో నిలబడగానే మనలోని ఆలోచనలు, ఆవేదనలు అన్నీ వారికి అవగతమౌతాయి. వారు భవిష్యత్ ద్రష్టలు. వారు తగిన సలహాలు, ఉపదేశాలు అనుగ్రహించి మనలను సన్మార్గంలో నడిపిస్తారు.

జగద్గురువులు వేదశాస్త్రాలలో నిష్ణాతులు. శృంగేరిలో, శ్రీవారి సమక్షంలో నిర్వహించబడే వాక్యార్థ సభలకు భారతదేశం నలుమూలల నుంచి వేదశాస్త్ర పండితులు విచ్చేసి సభల్లో పాల్గొని వారి వారి సందేహాలను శ్రీవారి ముఖతా నివృత్తి చేసుకుంటారనడం నిర్వివాదాంశం. వీరు విద్వల్లోకతల్లజులు. వీరి శాస్త్ర పాండిత్యం ఎంత నిరుపమానమో వారి సంభాషణా చాతుర్యం అంత అనిర్వచనీయం. సంస్కృతం, కన్నడం, తెలుగు, తమిళం, హిందీ భాషల్లో వీరు చేసే ఉపన్యాసాలు శ్రోతలను



మంత్రముగ్ధులను చేస్తాయి. వీరి విషయ ప్రతిపాదనా చాతుర్యం అసాధారణం. శిష్యకోటిని, ఆస్తిక లోకాన్ని తరింపజేయడానికి వారు చేసే అనుగ్రహభాషణలే నిదర్శనం. స్థాలీపులాక న్యాయంగా వీటిని ఉదహరించడం సమంజసం-

"ప్రతి ధనవంతుడు ఒక పేదవానికి, అతని కాళ్లమీద అతను నిలబడే రకంగా సహాయం చేసినప్పుడే మనం పేదరికాన్ని నిర్మూలించగలం. కొన్ని నీటి బిందువులు కలిస్తే సముద్రమవు తుంది. ధనవంతులందరూ కొద్దిగా సహాయం చేస్తే పేదరికాన్ని నిర్మూలించవచ్చు."

"మన కోసమే మనం జీవించడం వ్యర్థం. మన సంతోషం కొరకు మాత్రమే మనం జీవించినట్లయితే మనం జంతువుల కంటే కూడా ఘోరం. వృక్షం రుచిగల తన పళ్లను తాను భక్షించదు. ఇతరులకు అందిస్తుంది. ఇతరులకు సహాయం చేయడం, సేవ చేయడం, ఇతరుల ఆనందం కోసమే ప్రవర్తించడం నిజమైన ఆనందం."

"సామాజిక సేవా కార్యక్రమాల విలువలను అన్ని మతాలు గుర్తించాయి. పాఠశాలలు, వైద్యశాలలు, అనాథాశ్రమాలు, వృద్ధాశ్రమాలు నిర్వహించడానికి మనందరం అద్భుతంగా పనిచేస్తూ పేదవారికి అవసరమైన సహాయం చేస్తూనే ఉన్నాం. ఇంకా చేయవలసింది ఎంతో ఉంది. లక్షల మంది పేదరికంతో బాధపడుతున్నారు. మన సహాయం కొరకు అర్రులు చాస్తున్నారు. లక్షల మంది ఆధ్యాత్మిక లేమితో బాధపడుతున్నారు. వెంటనే వారికి సహాయం చెయ్యాలి. ఈ



రెండు రకాల పేదరికాన్నీ నిర్మూలించాలి. అప్పుడే భూమి సుఖశాంతులతో నిండి స్వర్గమౌతుంది."

"సనాతన ధర్మాన్ని ఆచరించండి. ఎప్పుడూ నిజం పలకండి. ప్రతిరోజూ దైవప్రార్థన చేయండి. చేతనైనంత పరోపకారం చేయండి. ఎట్టి పరిస్థితుల్లోనూ ఎవరికీ హాని చేయకండి. ఎప్పుడూ దయతో ఉండండి. మీకు సదా మా ఆశీస్సులు."

జగద్గురువుల భాషణములు అమృతాన్ని వర్షిస్తాయి.

శ్రీ జగద్గురువుల శిషవాత్సల్యాన్ని చవిచూచి దివ్యానుభూతి పొందిన భాగ్యం గల శిష్యుల్లో నేనొకణ్ణి నా అనుభవంలోనూ, భావనలోనూ జగద్గురువులు శిష్యకోటిపై వాత్సల్యాన్ని వర్షించి, ఉద్ధరించిన సంఘటనలు ఎన్నెన్నో ఉన్నాయి. వాటిలో కొన్నైనా స్మరించుకుని, వాటినే కుసుమాలుగా భావిస్తూ శ్రీ జగద్గురువుల పాదాల చెంత ఒక పూలమాలగా అర్పిస్తూ ఒక శిష్యుడు తన తృప్తికొరకు చేసే అర్చన అని సహృదయులైన పాఠకులు భావించగలరని నా విన్నపం. నా ఆనందాన్ని పాఠకులూ పంచు కుంటే మరింత తృప్తి.

శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వాములవారు శ్రీ శారదా పీఠమునకు 36వ పీఠాధిపతులుగా దేదీప్యమానంగా విరాజిల్లుతున్నారు. వీరు వీరి గురువుల ప్రతిబింబమే. ఆ మాట శ్రీవారి గురువులే అనుగ్రహించారు. శ్రీశ్రీశ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వాముల వారే, నాకు అనుగ్రహించిన మంత్రాన్ని ఎలా అనుష్ఠించాలో బోధిస్తూ అన్నారు. "మీరు మంత్రానుష్ఠానం చేసే సమయంలో భృకుటిలో అమ్మవారిని దర్శించండి, శ్రీ శారదాంబమూర్తిలో మమ్మల్ని చూడండి, మాలో శ్రీ భారతీతీర్థ స్వామిని చూడండి. నిజానికి మేము ముగ్గురమూ ఒకటే. ఈ రహస్యం గ్రహించండి" నా ఆనందానికి అవధుల్లేవు. ఆస్తిక లోకమంతా ఇపుడు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి వారిని "నడయాడే శారదాంబ" అని భావించి, ఆరాధించి, దర్శించి తరిస్తున్నారు. శ్రీ చరణుల శిష్యవాత్సల్యానికీ అవధుల్లేవు. నా అనుభవాలు కొన్ని వివరించు కోవాలని నా కోరిక దీనికి ముందు కొన్ని విషయాలు పాఠకుల స్ఫురణకు తీసుకురావాలి. ఆదిశంకరుల వలెనే శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వాములవారు కూడా అవతారపురుషులే.

శ్రీవారి జీవిత విశేషాలు సింహావలోకనం చేస్తే సామ్యాలు తప్పక స్ఫురిస్తాయి. ఆదిశంకరులు తమ గురువులను అన్వేషిస్తూ శ్రీ గోవింద భగవత్పాదుల వారి సన్నిధికి చేరుకుంటారు. శ్రీ భారతీతీర్థ స్వామివారు కూడా (పూర్వాశ్రమంలో శ్రీ సీతా రామాంజనేయులుగా) గురువులను అన్వేషిస్తూ ఉజ్జయినీలో శిప్రానదిలో స్నానం చేసి వస్తున్న శ్రీశ్రీశ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వాముల వారికి సాష్టాంగ ప్రణామాలు చేసి శిష్యునిగా గ్రహించి, వేద శాస్త్రాలను అనుగ్రహింపమని ప్రార్థించారు. ఇది సామాన్య బాలునకు సాధ్యమా? శ్రీచరణులు ఆ ప్రార్థనను అంగీకరించుట, తరువాత సుమారు ఏడు సంవత్సరాల కాలంలో కృష్ణ యజుర్వేదంనందు, న్యాయ, వ్యాకరణ, పూర్వోత్తర మీమాంసాది సమస్త శాస్త్రములందు పరిపూర్ణ పాండిత్యం గడించడం, అవతార పురుషులకు కాక ఇతరులకు సాధ్యమా? సమాధానం మన అంతరాత్మకు తప్పక స్ఫురిస్తుంది. ఆదిశంకరుల వలె శ్రీవారికి సర్వవిద్యలు ద్యోతకమైనాయని శాస్త్రవేత్తల భావన. శ్రీచరణులు సమస్త వేదశాస్త్రముల నాచమించినట్టి అగస్త్యులు.

శ్రీ చరణుల ఆశీస్సులు అమోఘములనే విషయం భక్తులకు సువిదితమే. వీరు కరుణాసముద్రులు. వీరి శిష్య వాత్సల్యము నిరుపమానం! ఊహలకు అందేది కాదు. కేవలం అనుభవైకవేద్యమే. శ్రీచరణులు ఎందరో శిష్యులు, భక్తులపై వాత్సల్యము చూపి, వారిని కష్టాల నుంచి ఉద్ధరించి కాపాడిన సంఘటనలు ఎన్నెన్నో వివరింపలేం. "జగద్వంద్యుడైన జగద్గురువు" అను పుస్తకంలో వీటిని ఉటంకించారు. స్వవిషయంలో జరిగిన సంఘటనలు కొన్నిటిని వివరించడం సమంజసమని నా భావన. నాకు 1991 సంవత్సరంలో గుండెనొప్పి వచ్చింది. నిమ్స్‌లో చేర్చారు నా పిల్లలు. కొన్ని పరీక్షలు నిర్వహించిన వైద్యులు శస్త్రచికిత్స అవసరమని భావించారు. నా అనారోగ్యం శ్రీచరణుల దృష్టికి నేను తీసుకువెళ్లేలోపే, హైదరాబాద్ నుంచి శృంగేరి వెళ్లిన భక్తుని ద్వారా శ్రీవారే మంత్రాక్షతలు



అనుగ్రహించారు. తరువాత నేను ఒక మఠ భక్తునికిచ్చి నా విన్నపాన్ని పంపుకోవడం జరిగింది. నాకు శస్త్ర చికిత్స అవసరం లేదని నాకు పరిపూర్ణ ఆరోగ్యం తొందరగా లభిస్తుందని, మఠానికి నేను చాలా సంవత్సరాలు సేవ చేయవలసి ఉన్నదని సందేశం అనుగ్రహించారు. తరువాత శృంగేరి నుంచి అప్పటి కార్యదర్శి శ్రీ దక్షిణామూర్తిశాస్త్రిగారిని కూడా పంపి ఆశీర్మంత్రాక్షతలు అనుగ్రహించి నాపై అనూహ్యమైన శిష్యవాత్సల్యాన్ని చూపారు. ఈ విషయాలన్నీ నాకు మిత్రులు, ఆప్తులు, సహృదయులు డాక్టర్ శ్రీ శాంతారాంగారికి విన్నవించాను. వారి ప్రేరణతో డాక్టర్లందరూ సంప్రదించుకుని కొన్నాళ్లు మందులు వాడి చూడడమే మంచిదని నిర్ణయించారు. ఆశ్చర్యకరమైన విషయం ఒక వారం తరువాత ఆపరేషన్ అవసరం లేదని నిర్ణయించి మందులు వాడడం వల్లే ఫలితం లభిస్తుందన్నారు. శ్రీ జగద్గురువుల ఆశీస్సులు అమోఘం. వారి శిష్యవాత్సల్యానికి అవధుల్లేవు. శ్రీవారు భవిష్యద్ద్రష్టలు. ఇది వైద్యులకే ఆశ్చర్యం కలిగించింది. నేను, సుప్రసిద్ధవైద్యులు, దైవచింతనాపరులు, పరోపకారులు, మంచిపేరు ప్రతిష్ఠలుగల డా॥ శ్రీ శాంతరాము గారి వద్ద ఉచిత చికిత్స పొందుతూ నేటివరకూ శస్త్రచికిత్స అవసరం లేకుండా ఆరోగ్యంతో 86వ సంవత్సరంలో అడుగిడి జీవితం గడుపుతున్నాను. ఎక్కడ 1991? ఎక్కడ 2008? నేటివరకు నేను శ్రీ మఠ సేవచేసే భాగ్యం కలగడం శ్రీచరణుల కృపవలననే కదా! నిస్సందేహంగా వారి కరుణే! అందువలనే నేనెప్పుడూ భావిస్తా; నా జీవితం శ్రీ శృంగేరి శారదాపీఠేశ్వరులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారి పాదపద్మములకు అంకితమని, ఇది పూర్వజన్మ సుకృతఫలము.

మరొక అనుభూతి. మా పెద్ద కుమారునికి 1991 ప్రాంతంలో మూత్రపిండాల వ్యాధి సంక్రమించింది. మూత్రపిండాల మార్పిడి తప్పదన్నారు. ఎంతమంది దాతలు ముందుకు వచ్చినా వారిని పరీక్షించిన తరువాత అవి సరిపడవు అన్నారు. దానికి కారణం మావాడి నెత్తురులో యాంటీ బాడీస్ తయారయ్యాయని, అవి పోవాలంటే అమెరికా నుంచి రక్తం శుభ్రం చేసే ఫిల్టర్లు తెప్పించాలన్నారు. కొంతకాలం తరువాత ఈ విషయాలు శ్రీవారి దృష్టికి తీసుకువెళ్లాను. 10 రోజులు, శ్రీ శారదాంబ అంత రాలయంలో సప్తశతి=పారాయణ చేయించమని శ్రీ చరణుల ఆదేశం. ఇక్కడ పండితుడు 9 రోజులు గుడిలో చేస్తే చాలునని వ్యాఖ్యానించబోతే, అతన్ని నేను మందలించడం జరిగింది. అయినా శాస్త్రిగారి ధోరణి మారలా. సరే పారాయణ మొదలైంది. తమాషా జరిగింది. పండితుడు రోజులు తప్పు లెక్క వేసుకుని గుడిలోనే పదిరోజులు పారాయణ చేసి తరువాత చెంపలు వేసుకుని "శ్రీచరణుల వాక్కు అమోఘం. వారి ఆదేశాన్ని వ్యాఖ్యానించడం క్షంతవ్యం గాని తప్పు. మన్నించమని వారినే వేడుకుంటా" అని మిక్కిలి చింతించాడు. జపం పూర్తయిన మరునటి రోజునే ఒక దాత మూత్రపిండాలు సరిపోవడం వల్ల మా వాడికి జయప్రదంగా ఆపరేషన్ జరిగింది. ఇది అందరినీ ఆశ్చర్యపరిచింది.

మరియొక సందర్భం. అతి చిత్రం. అమెరికా దేశంలోని శ్రీమఠ భక్తుల కుమారునికి జరిగింది. హైదరాబాద్ కేంద్రంగా "శ్రీ శృంగేరీ శారదా సేవాసమితి, ఆంధ్రప్రదేశ్" అనే సంస్థ ఉన్నది. క్లుప్తంగా ఈ సంస్థ ఆశయం రాష్ట్రవ్యాప్తంగా స్త్రీలలోను, పిల్లలలోను శ్రీ శృంగేరీ శారదాపీఠ విశిష్టత, శ్రీ శృంగేరీ జగద్గురువులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వాముల వార్ల ఆశీరనుగ్రహ విశేషాలు ప్రచారం చేస్తూ సనాతన ధర్మరక్షణకు కృషి చేయడం. దీనికి రాష్ట్ర కార్యదర్శి శ్రీమతి కొవ్వూరి రాజేశ్వరి. ఈమెగారి భర్త కొవ్వూరి లక్ష్మీనారాయణ. ఈయన స్టేట్‌బ్యాంక్ ఆఫ్



ఇండియాలో ఆఫీసరు. శ్రీమతి రాజేశ్వరి సెక్రటేరియట్‌లో సెక్షన్ ఆఫీసర్. వీరుభయులు శ్రీ మఠానికి అత్యంత ప్రీతిపాత్రులైన శిష్యులు. వీరిని ఆధ్యాత్మిక సామ్రాజ్య పరిధిలోనికి ప్రవేశపెట్టింది నేనే అవడం వలన, వారి అనుభూతులు, అనుభవాలు, దాపరికం లేకుండా నాకు విన్నవిస్తూ ఉంటారు. వీరికి ఒకే కుమారుడు. బి.టెక్ ఇక్కడ పూర్తి చేసి, పై చదువులకు అమెరికా వెళ్లాడు. కుర్రవాడు కూడా శృంగేరి జగద్గురువుల భక్తుడు. తరచూ శృంగేరి వెళ్లడం, శ్రీవారిని దర్శించడం, ఆశీస్సులు పొందడం పరిపాటి. అమెరికా వెళ్లే ముందు, తల్లిదండ్రులతో శ్రీచరణులను దర్శించి ఆశీస్సులు పొందాడు. ఆ సందర్భంలోనే శ్రీవారన్నారట- "అక్కడ ఏ ఇబ్బంది వచ్చినా నన్ను తలచుకో, నేను నీ వెంటే ఉంటా, భయం లేదని." రెండు సంవత్సరాలు బాగానే గడిచాయి. ఏ సమస్యా రాలేదు. తరువాత ఒక సంఘటన జరిగింది. కుర్రవాడు వేరే ప్రాజెక్టు పనిమీద అమెరికాలోనే మరో ప్రదేశానికి వెళ్లి, ఒంటరిగా గది అద్దెకు తీసుకుని నివసిస్తున్నా. ఆ ఇంటి యజమాని ధనాశాపరుడు. ముందు అనుకున్న విధంగా కాక, కారణాంతరాల వల్ల ప్రాజెక్టు పని మరొక మాసం పొడిగించబడింది. కుర్రవాడు అదే రూములో ఉంటానన్నాడు. "48 గంటల్లోగా గది ఖాళీ చెయ్యాలి, లేకపోతే సామాన్లు వీధిలో పారేస్తా" అని ఇంటి యజమాని నిర్మొహ మాటంగా శాసించాడు. కాస్త ఆలోచించండి. దేశం కాని దేశం 20 ఏళ్ల కుర్రవాడు. దగ్గరలో నా అనేవారు లేరు. కుర్రవాని మేధస్సును ఛేదించే సమస్య. పరిష్కారం తోచక తలచుకుని రక్షించమని మనస్సులో విలపిస్తూ భారతదేశంలోని తల్లికి ఫోను చేశాడు. చూడండి గురు కృప! అదే సమయానికి, సెక్రటేరియట్‌లో ఆమె పనిచేసే సెక్షన్‌లో పనిపడి, ఒక పెద్దమనిషి... అపరిచితుడు వచ్చి "మేడమ్! దిగాలుగా ఉన్నారేమిటి?" అని ప్రశ్నించడం, శ్రీమతి రాజేశ్వరి తన సమస్యను ఆయనతో ప్రస్తావించడం జరిగింది. ఆయనగారన్నారు- "అమ్మా! మా అబ్బాయి కూడా అమెరికాలోనే ఉన్నాడు. వాడికి ఫోను చేసి ఏమైనా ఉపయోగపడగలడేమో ప్రయత్నిస్తాను" అని. వెంటనే ఆయనగారు సెల్‌లో కుమారునితో మాట్లాడాడట. చిత్రమేమంటే ఆయనగారి కుమారుడు శ్రీమతి రాజేశ్వరి కుమారుడుండే ప్రాంతానికి కేవలం ఒక ఫర్లాంగు దూరంలో ఉండడం, తన ఇల్లు విశాలమైనది కావడం, తండ్రి సలహా ప్రకారం శ్రీమతి రాజేశ్వరి కుమారుణ్ణి సామాన్లతో సహా తన ఇంటికి తీసుకురావడం, అద్దె లేకుండా భోజన సౌకర్యంతో తన ఇంట్లో ఉండే ఏర్పాటుచేసి, ఒక గంటలోనే సమాచారం సెక్రటేరియట్‌లో వీరికి అందించాడు. అంతవరకూ ఈ ప్రథమ పరిచయ వ్యక్తి సెక్రటేరియట్‌లో శ్రీమతి రాజేశ్వరికి ఆదుర్దా పడవద్దని ధైర్యం చెబుతూ కూర్చోవటం ఆమెకు అపూర్వమైన అనుభవం. శ్రీమతి రాజేశ్వరిగారి కుమారుడు అమితానందంతో తల్లికి గురువుగారి దయవల్లనే కథ తేలికగా సుఖాంతమైందని చెప్పడం, తల్లిదండ్రుల ఆనందానికి అవధుల్లేకుండా చేసింది. అంతా శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వాములవారి కృపాకటాక్ష మహిమ!! ఈ కుటుంబం వారి గురుభక్తి వర్ణనాతీతం. గురుకృపకు ఎల్లలు లేవు కదా! శ్రీచరణులు యతిలోక చక్రవర్తి. దయతో భక్తపాలన నెరపు జగద్గురువులు.

ఇలాంటి సన్నివేశాలు మరెన్నో ఉన్నాయి. మచ్చుతునకలుగా కొన్నిటిని మాత్రమే భక్తకోటికి అందించాను. క్షంతవ్యుడను.

శ్రీచరణుల సన్నిధిలో భక్తులకు కలిగే ఆనందానుభూతి వర్ణనాతీతం. ఇట్టి మహాయోగీంద్రుల అనుగ్రహం వలన కలిగే ఆనందం అనుభవైకవేద్యమే. జగద్గురువులు కరుణా సముద్రులు. విద్వల్లోకతల్లజులు. పరమహంస పరివ్రాజకా చార్యవర్యులు. చులుకీకృత సర్వశాస్త్ర సముద్రులు. సనాతన ధర్మ ఆచారవిచారదక్షులు. శ్రీ శారదాచంద్రమౌళీశ్వర నిత్య పూజా దురంధరులు. ఉపనిషదర్థాను సంధాననిరతులు. అపర శంకరులైన వీరి నామస్మరణ ధన్యతకు ఉపాయం. ఆసేతు శీతాచల మధ్యస్థ ఆస్తిక లోకమును అనుగ్రహ కటాక్ష వీక్షణాలచే పాలిస్తూ శిష్యవాత్సల్యాన్ని చెలువు తీర్చిన మూర్తులు. శ్రీచరణు లను దర్శించండి. సేవించండి. తరించండి. పున్నమినాటి వెన్నెలసోన శ్రీచరణుల దివ్యకరుణా స్రవంతి.

ఆకెళ్ల సత్యనారాయణమూర్తి

# అవిచ్ఛిన్న గురు పరంపర!

సృష్టి, స్థితి లయాత్మకుడైన పరమాత్మ 'శ్రీ శంకర భగవత్పాదులు'గా అవతరించి అద్వైత సిద్ధాంతానికి అద్భుత భాష్యం చెప్పారు. భక్తితత్వాన్ని పరాకాష్ఠ స్థితికి గొనిపోయారు. జనబాహుళ్యాన్ని చైతన్యవంతం చేసి అనేకత్వం నుంచి ఏకత్వం లోకి పయనింపజేశారు. అర్థంలేని శుష్కక్రియల నుంచి భక్తి, ధర్మ, జ్ఞాన పథాలకి మళ్లింపజేశారు. తాత్విక, దార్శనిక, వైదిక, విజ్ఞాన కేంద్రాలలో భారతదేశాన్ని యావత్ ప్రపంచానికే తలమానికం గావించారు.

శ్రీ శంకర భగవత్పాదులు తాను పరిపుష్టం గావించిన అద్వైత సామ్రాజ్య శాశ్వత పరిరక్షణకు గాను దేశం నలుమూలల్లో నాలుగు పీఠాలను స్థాపించారు. శృంగేరి, పూరి, బదరి, ద్వారకల్లో శృంగేరి శ్రీ శారదాపీఠం చాలా ప్రత్యేక ప్రాభవం కలిగి ఉన్నది. శ్రీ శృంగేరీ శారదాపీఠానికి ప్రథమ పీఠాధిపతులు శ్రీ సురేశ్వరాచార్యులు. పూర్వాశ్రమంలో వీరు శ్రీ మండనమిశ్రులు. శ్రీ శృంగేరీ శారదాపీఠం దక్షిణ భారతావనిని పరిరక్షించడానికి గాను నిర్ణీతమై ఉన్నది. ఆంధ్ర, తమిళ, కర్ణాట, మలయాళ భూములు శ్రీ శారదాపీఠ పాలితములు.

ఆదిశంకరుల నుండి అవిచ్ఛిన్నంగా నేటివరకు గల పీఠాధిపతులందరూ గురుపరంపరా సాంప్రదాయ పట్టభద్రులే. అం దరూ తపశ్చక్రవర్తులే, అందరూ సారస్వతమూర్తులే. అందరూ బ్రహ్మవిద్వద్వరేణ్యులే. అందరూ కరుణామూర్తులే. దాదాపుగా శ్రీ శృంగేరీ శారదాపీఠాధిపతులందరూ ఆసేతు హిమాచలం పర్యటించి ఆశీర్వర్వాన్ని కురిపించి భక్తజనులకు ఆనంద సంతర్పణం చేసినవారే.

ప్రస్తుత పీఠాధిపతులైన శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారి గురుదేవులైన శ్రీమదభిన విద్యాతీర్థ మహాస్వామివారు. మన పరమ గురువుల వైభవాన్ని, మహాత్మ్యాన్ని శిష్యవాత్సల్యాన్ని స్మరించుకోవడం మహాభాగ్యప్రదాయకం.

శ్రీ శృంగేరీ జగద్గురువులు శ్రీశ్రీశ్రీ మదభినవ విద్యాతీర్థ మహా స్వామివారు 34వ పీఠాధిపతులైన శ్రీశ్రీశ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామివారి పదసన్నిధిలో నిశ్చలచిత్తులై శ్రీ స్వామివారికి శుశ్రూష చేస్తూ విద్యనభ్యసించారు. ఉపనిషద ధ్యయనం, శాస్త్రాధ్యయనం చేసి బ్రహ్మవిద్యావేత్తలై తదుపరి 35వ శ్రీ శృంగేరీ శారదాపీఠాధిపతులై పరమహంస పరివ్రాజకా చార్యవర్యులై



జగద్విఖ్యాతిని పొందారు.

శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వామివారి యొక్క పూర్వాశ్రమ నామధేయం శ్రీనివాసశాస్త్రి. జననం 1917. పింగళ నామ సంవత్సర నరక చతుర్దశి (నవంబర్ 13వ తేదీ). తండ్రి గారి పేరు రామశాస్త్రి. వీరిది బెంగుళూరు. రామశాస్త్రిగారికి శ్రీనివాసశాస్త్రిని చూసి ఎంతో బాధ కలిగేది. ఎందుకంటే అందరి పిల్లల్లాగా కాకుండా ఈ బాలుడు ప్రత్యేకంగా ప్రవర్తించేవాడు. ఇది కావాలి అని అడగడు. అది వద్దు అనడు. ఆటలాడుకోవడం కాని, నలుగురు స్నేహితులతో కలసి నవ్వుకోవడం గాని లేదు. ఆట, పాట అసలే లేదు. ఏదైనా గ్రహశాంతి చేయిస్తే బాగుంటుందేమోననుకుని రామశాస్త్రిగారు తమ కుమారుని జాతకాన్ని ఒక పండితునికి చూపించారు. ఆయన "మీ పిల్లవాడు గొప్పవాడై అందరిచేతా పాదాభివందనాలు చేయించుకుంటాడు. ఎంతో విరాగి, అందుకే అందరిలాగా లేడు" అని చెప్పారు.

ఆ తరువాత శ్రీ శృంగేరీ మఠాధికారి ఇదే జ్యోతిష్య

పండితుని కలిసి "పరివ్రాజక యోగములు గల బాలుడెవరైనా మీకు తెలిస్తే చెప్పండి" అని అడిగాడు. శ్రీనివాస శాస్త్రిని గురించి చెప్పగా మఠాధికారి నీలకంఠశాస్త్రిగారు శ్రీనివాస శాస్త్రిని, అతని తండ్రి రామశాస్త్రిని శృంగేరికి ఆహ్వానించారు. శృంగేరీ శ్రీ శారదాపీఠ సన్నిధిలో ఉపనయనం జరిపించేందుకు దివ్యమైన శుభలగ్నం పెట్టించారు. ఈ సమయంలో శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామివారు పీఠాధిపతులై వరలుచున్నారు. ఉపనయనం తరువాత జగద్గురువులు శ్రీనివాసశాస్త్రిని "నీకు ఉపనయనం అయింది. గాయత్రిని చక్కగా చేసుకో. మీ ఊరు వెళ్లు" అన్నారు. కానీ శ్రీనివాసశాస్త్రి, తాను అక్కడే ఉండి సంస్కృత పాఠశాలలో చదువుకుంటానన్నాడు. జగద్గురువుల సమక్షంలో శ్రీనివాసశాస్త్రి సంస్కృత విద్యాభ్యాసం, శాస్త్రాధ్యయనం చేశాడు.



శ్రీనివాసశాస్త్రి సచ్ఛీలత, సద్గుణ సంపద చూచిన జగద్గురువులు సన్యాసదీక్షనిచ్చి తమ శిష్యుణ్ణి గావించుకున్నారు. న్యాయశాస్త్రం, తర్కశాస్త్రం, కావ్య, నాటక సాహిత్యం జగద్గురువులు స్వయంగా తమ శిష్యులకి బోధించారు. 1954వ సంవత్సరం సెప్టెంబర్ 26 వేకువ జామున తుంగా నదిలో స్నానమాచరిస్తూ శ్రీ జగద్గురువులు శ్రీ చంద్రశేఖర భారతీ మహాస్వామివారు జల సమాధి అయ్యారు. అదే సంవత్సరం అక్టోబర్ 16వ తేదీన శ్రీ సన్నిధానం వారు శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వామివారికి శ్రీ శారదాపీఠ పట్టాభిషేకం చేశారు. పీఠాధిపత్యానికి ముందు నుంచే పీఠం యొక్క కార్యభారాలన్నిటినీ వహించగల శక్తిసామర్థ్యాలు గల జగద్గురువులు అలవోకగా పీఠ పరిపాలన గావించగలిగారు. శ్రీ మదభినవ విద్యాతీర్థ మహాస్వాములవారు శ్రీ శృంగేరీ శారదాపీఠానికి 35వ పీఠాధిపతులు.

శ్రీ మహాసన్నిధానం వారి నుంచి అనేక విషయాలు గ్రహించడానికి విదేశీ పండితులు వచ్చేవారు. వీరిలో అమెరికా, జర్మనీ, యూరప్ దేశాల నుండి లెక్కకు మిక్కిలిగా వచ్చి, తమ అనుమానాలను తీర్చుకుని వెడుతూ ఉండేవారు. పూర్వ రాష్ట్రపతి బాబూ రాజేంద్రప్రసాద్ గారు శృంగేరీ వెళ్లినప్పుడు వారితో హిందీలో అనర్గళంగా మాట్లాడి రాష్ట్రపతిని అబ్బురపరిచారు.

శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వామివారి కరుణ వర్ణింపలేం. ఆహ్వానించకుండానే ఎందరి గృహాలకో అకస్మాత్తుగా వెళ్లి, వారిని ఆశీర్వదించి మంత్రాక్షతలను ప్రసాదించేవారు. ఆ గృహస్థులకు స్వామివారి రాక ముందు తెలియక పీఠాధిపతులను తగిన గౌరవ లాంఛనాలతో ఆహ్వానించలేకపోయామే అని చింతించేవారు.

శ్రీ జగద్గురువుల యొక్క ఆగతానాగత విషయజ్ఞత ఎంతో ఆశ్చర్యకరంగా ఉండేది. ఎంతో మంది భక్తులకు, భక్తులు కానివారికి స్వప్నంలో దర్శనమిచ్చి ఆరోగ్య సమస్యలను, ఇతర సమస్యలను తీర్చేవారు, మంత్రోపదేశం చేసేవారు. ఇలా చెయ్యి, అలా చెయ్యి అని మార్గోపదేశం చేసేవారు. ఎన్నో సంస్కృత వేద పాఠశాలలను నిర్మింపజేశారు.

ఒకసారి కాశ్మీర్‌లో ఒక ముస్లిం సంస్థ వారు సభ ఏర్పాటుచేసి శ్రీ జగద్గురువులను ఉపన్యసించమని ఆహ్వానించారు. సభలో ముస్లింలు, క్రైస్తవులు, హిందువులు ఉన్నారు. ఎవరినీ నొప్పింపకుండా భగవంతుడు ఒక్కడేనని సోదాహరణంగా వివరించ గా, అన్ని మతాలవారు ఆనందించారు.

1960వ సంవత్సరం ఏప్రిల్ 28న హైదరాబాద్ నల్లకుంట శంకర మఠంలో శ్రీ శంకర శారదాదేవి మూర్తుల విగ్రహ ప్రతిష్ఠను శ్రీ జగద్గురు శ్రీమదభినవ విద్యాతీర్థ



మహాస్వామివారు గావించారు. శతాధికంగా ఋత్విగ్వరేణ్యుల వేదఘోషల మధ్య ప్రతిష్ఠ ఎంతో ఘనంగా జరిగింది. శ్రీ ఆదిశంకరుల వలనే శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వామివారు కూడా భారతదేశ పర్యటన అనేకమార్లు గావించారు.

1976 అక్టోబర్‌లో వారణాసిలో అన్నపూర్ణాదేవి నూతన విగ్రహ ప్రతిష్ఠ చేస్తున్న శుభ తరుణంలో శ్రీ జగద్గురువుల వెంట ఈనాటి శ్రీ జగద్గురువులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారు కూడా ఉన్నారు. ఇరువురూ కలిసి ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్ర మొదలైన అనేక రాష్ట్రాలలో సంచరించి, భక్తులకు ఆశీస్సులు అందించారు.

శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వామివారి భవిష్యద్దర్శనానికి, దివ్యజ్ఞానానికి, గుర్తుగా శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారు మనలను అనుగ్రహిస్తూ శ్రీ శృంగేరీ శారదా పీఠానికి 36వ అధిపతిగా ఆధిపత్యం వహిస్తూ భక్తుల ఆర్తులను తీరుస్తున్నారు.

శ్రీమదభినవ విద్యా తీర్థులను శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి వారు దాదాపు 35 సంవత్సరాలు సేవించుకున్నారు. శ్రీ ఆదిశంకరులే శ్రీ శృంగేరీ పీఠాన్ని మరల, మరల వేర్వేరు రూపాలతో, వేర్వేరు నామాలతో అధిరోహిస్తున్నట్లుగా



శ్రీ భారతీతీర్థ మహాస్వామి, శ్రీ విధుశేఖరభారతీస్వామి

అందరూ ఒకే శక్తితో ఒకే లక్ష్యంతో ఒకే ధ్యేయంతో ఒకే కరుణతో మన పూర్వపుణ్య సౌభాగ్యం వల్ల మరల మరల వరలుతూ ఉన్నారు. ఒకే దీక్షతో శారదా చంద్రమౌళీశ్వరుల పద పద్మారాధన చేస్తూ వారి పదపద్మాలను మనకు హృదయాంకితం గావిస్తున్నారు. ఇందుకు ఆ పీఠానికి ఎంతో ఋణపడి ఉందుము గాక!

**– డా|| దిట్టకవి శ్యామలాదేవి**



అద్వైత జగద్గురు పీఠం

# శ్రీ శృంగేరీ మహా సంస్థానం

**కర్మభూమి భారతావనిలో ఎందరో మహత్తర మహర్షిపుంగవులు తపస్సు చేసిన మహాక్షేత్రం ఋష్యశృంగ గిరి... అదే నేటి శృంగగిరి...శృంగేరి. బ్రహ్మవిద్యా స్వరూపిణి శారదాదేవి కొలువైయున్న దివ్యధామం. విశ్వానికి అద్వైత దర్శనాన్ని అందించిన ఆదిశంకరులు ప్రతిష్ఠించిన సమ్రాట్ పీఠం దక్షిణామ్నాయ శృంగేరీ జగద్గురు శారదాపీఠం. ఆదిశంకరుల ప్రియశిష్యులైన సురేశ్వరాచార్యుల నుండి నేటి భారతీతీర్థ మహాస్వాముల వరకు అవిచ్ఛిన్న గురుపరంపర గలిగిన సనాతన పీఠం. విజయదశమి పర్వదినాన్ని పురస్కరించుకుని దర్శనమ్ అందిస్తున్న విశేష కథనం.**

కర్ణాటక ప్రాంతంలోని చిక్కమగళూరు జిల్లాలోని ఒక తాలూకా కేంద్రం శృంగేరీ. పడమటి కనుమలలో సహ్యాద్రి పర్వత సానువులపై ప్రకృతి తన సౌందర్యాన్నంతా కలపోసుకుని ఉన్నదా అన్నట్లు కనబడే ప్రదేశమిది. అనేక దేవాలయాలతో విలసిల్లుతూ యాత్రికులకు ఆధ్యాత్మికానుభూతితోపాటు మానసికాహ్లాదాన్ని అందిస్తున్న కేంద్రం. కొండసానువులపై పోకచెట్లు, కొబ్బరిచెట్లు తమ తలలను ఊపుతూ మనల్ని సాదరంగా ఆహ్వానిస్తూ ఉంటాయి. పచ్చటిపైరు భూదేవి కట్టుకున్న చీరలా, చల్లటి పైరుగాలి ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా, ప్రక్కనే పారుతున్న సెలయేళ్ల గలగలలు ఆమె చిరునవ్వులా మనకనిపిస్తుంటాయి. శృంగేరీ తుంగానది ఎడమ గట్టుపై ఉన్నది. తుంగానదీ జలాల ప్రాశస్త్యాన్ని సూచించేదే 'గంగా స్నానం-తుంగా పానం' అన్న సామెత. తుంగాజలాలు త్రాగటానికే కాదు స్నానానికీ మంచివే. నదికి ఎడమ వైపు దేవాలయాలు, కుడివైపు నరసింహ తపోవనం ఉంటే, గులకరాళ్లపై గలగలా మెలికలు తిరుగుతూ ప్రవహించే తుంగానదిలో స్నానం చేస్తుంటే మనల్ని మనం మరచిపోతాం. ఆ క్షణం అనిర్వచనీయమైన ఆనందానుభూతిలో మునిగిపోతాం. ఇది ఏదో ఊహాజనితమైన విషయంకాదు. కవులు తరచుగా ఉపయోగించే అతిశయోక్తి అలంకారమూ కాదు. ఆనందాన్ని - అనుభవించేటప్పుడు అది ఎటువంటి ఆనందమైనా మనల్ని మనం మరచిపోకతప్పదు. తాదాత్మ్యతాభావం అన్నా అదే. అక్కడ స్నానం చేసిన ప్రతి ఒక్కరికీ అనుభవ సిద్ధమైన విషయం.

నదికి దూరంగా పర్వతశ్రేణువులపై మేఘాలు ఇంద్రుని వజ్రాయుధానికి భయపడి తలదాచు కుంటున్నట్లు కనిపిస్తాయి. మేఘదూతంలో కాళిదాసు రచించిన మొదటిశ్లోకం మనకు అప్పుడు గుర్తుకు రాకమానదు.

**శ్లో॥ ఆషాఢస్య ప్రథమదివసే మేఘమాశ్లిష్ట సానుం**
**వప్రక్రీడా పరిణత గజప్రేక్షణీయం దదర్శ**

ఆషాఢమాసం మొదటి రోజున కోట గోడలను ఢీ కొంటున్న

గజరాజువలె మేఘాలు శిఖరాగ్రాలను ఢీకొంటున్నాయట. ఆ విధంగా పర్వతశ్రేణి, లోయలూ, పంటపొలాలూ, నదీ కలిసి శృంగేరీకి చక్కటి సౌందర్యాన్ని అందిస్తున్నాయి. శృంగేరి పూర్తిపేరు ఋష్యశృంగగిరి. అంటే ఋష్యశృంగమహర్షి పేరు తో పిలువబడుతోంది. ఆయన కథ మనకు రామాయణంలో వస్తుంది. విభాండక మహర్షి పుత్రుడాయన. క్షామపీడితమైన రోమపాదుని రాజ్యభూములలో ఆయన అడుగుపెట్టగానే సుభిక్షమైన వాతావరణం ఏర్పడింది. వర్షాలు పడ్డాయి. కరువు పీడ తొలగింది. ప్రజలకు సుఖశాంతులు లభించాయి.

శ్రీశంకర భగవత్పాదులు సనాతన ధర్మ పునఃప్రతిష్ఠకై, పరిరక్షణకై దేశమంతటా పర్యటిస్తూ శృంగేరికి వచ్చారు. శృంగేరి ప్రాకృతిక సౌందర్యానికి ముగ్ధులై, అది తపస్సు చేసుకోవటానికి తగు ప్రదేశమని భావించి తుంగానదీతీరాన అనుష్ఠానానికి కూర్చోగానే ఆయనకొక వింత దృశ్యం కనపడింది. ప్రసవవేదనను అనుభవిస్తున్న ఒక కప్పకు ఎండ బాధను తప్పించడానికి ఒక సర్పం తన పడగను విప్పి గొడుగు పట్టటం చూశారాయన. శాంతియుత సహజీవనానికి చక్కటి ఉదాహరణ అది. వెంటనే ఒక మఠాన్ని అక్కడ స్థాపించి శారదాపీఠాన్ని ప్రతిష్ఠించారు. మెలికలు తిరుగుతూ ప్రవహి స్తున్న తుంగానదీ, అంబరాన్ని చుంబించే పర్వతాలు కూడా ఆయన్ని ఆకర్షించాయి. శ్రీశంకరులు ఆ తర్వాత దేశంలో మరో మూడు మఠాలను స్థాపించారు. ఈ నాల్గింటినీ చతురామ్నాయ పీఠాలనీ, శృంగేరి పీఠాన్ని దక్షిణామ్నాయ పీఠమనీ అంటారు. శ్రీ శంకర భగవత్పాదులు ఈ నాలుగు పీఠాలనే స్థాపించారు. ఈ నాలుగింటిలో మొదటిదీ, ప్రధానమైనదీ అయిన శృంగేరీ దక్షిణామ్నాయ పీఠానికి తమ ప్రధాన శిష్యుడైన సురేశ్వరా చార్యులను అధిపతిగా చేశారు.

శృంగేరిలో ఆ చుట్టుప్రక్కల అనేక దేవాలయాలు ఉన్నాయి. పదునాల్గవ శతాబ్దానికి పూర్వం శృంగేరి జగద్గురువులు శృంగేరిలో ఉన్న ఆశ్రమాలలో నివసించేవారు. కాని విజయ నగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన రెండవ హరిహరరాయల కాలంలో శృంగేరి అగ్రహారం, విద్యారణ్యపురం ఒక రూపాన్ని సంతరించుకున్నాయి. ఇప్పుడు ఆ గ్రామంలో దాదాపుగా నూటయిరవై దేవాలయాలు ఉన్నాయి. అందులో కొన్ని పెద్దవి కొన్ని చిన్నవి. శృంగేరీలోని ప్రధాన దేవాలయం జగన్మాత శారదాదేవి ఆలయం. శ్రీశంకర భగవత్పాదులే స్వయంగా ఒక రాతిపై శ్రీచక్రాన్ని చెక్కి దానిపై గంధపు చెక్కతో తయారుచేసిన శ్రీశారదాదేవి విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. ఆ తరువాత శ్రీవిద్యా రణ్యులు దేవాలయాన్ని పునరుద్ధరించి స్వర్ణవిగ్రహాన్ని ప్రతిష్ఠిం చారు. గ్రానైట్‌తో నిర్మించిన ప్రస్తుత



ఆలయ నిర్మాణం శ్రీసచ్చిదానంద శివాభినవ నృసింహభారతీ మహాస్వాముల వారి కాలంలో ప్రారంభమైంది. శ్రీచంద్రశేఖర భారతీ మహాస్వాముల వారు ఆ నిర్మాణకార్యం పూర్తిచేసి కుంభాభిషేక మహెూత్సవం చాలా వైభవంగా నిర్వహించారు. ద్రావిడ సంప్రదాయ వాస్తు శిల్పం ఈ దేవాలయంలో మనకు కనపడుతుంది. దేవాలయ మంతా నల్లటి రాతితో నిర్మించబడింది. ముఖ్య మంటపానికి నాలుగు స్థంభాలున్నాయి. వాటిమీద శ్రీదుర్గ, శ్రీరాజరాజేశ్వరి మొదలగు దేవీ విగ్రహాలున్నాయి. శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వాముల వారి ఆశీస్సులతో ప్రధాన ద్వారంపై గోపురం నిర్మించబడింది. ఆలయానికి ముందు 35 అడుగుల ఎత్తుగల దీపస్తంభాన్ని ప్రతిష్ఠించారు.

శృంగేరిలో ప్రాదేశిక పవిత్రతోపాటు, జగద్గురువులు శ్రీశారదామాత కూడ ఉండడంతో అచ్చట ఆధ్యాత్మికానుభవా నికి అవకాశం లభిస్తుంది. అది ఉద్దీప్తమైన పవిత్రతా భావం. అసలు ఈ మూడు విషయాలు విడివిడిగా ఊహించలేని పవిత్రతా కేంద్రాలు. ఇక మూడు కలిస్తే ఏమని చెప్పగలం?

శృంగేరిలో మరో ముఖ్యమైనది విద్యాశంకర దేవాలయం. శృంగేరీ చాలాకాలం హెూయసాల రాజుల పాలనలో ఉండేది. మాలిక్ కాఫిర్ దండయాత్రల ఫలితంగా హెూయసాల రాజుల పాలన ముగిసింది. మాలిక్ కాఫిర్ దండయాత్రలలో హిందూ దేవాలయాలు ఎన్నో ధ్వంసమయ్యాయి. ఆ కాలంలో శ్రీవిద్యా తీర్థులు శృంగేరీ శారదాపీఠాధిపతులు. దేశంలో మారుతున్న రాజకీయ పరిస్థితులు కారణంగా సనాతన ధర్మం ఎదుర్కొంటున్న విషమస్థితిని గమనించి దానికి పరిష్కార మార్గం కోసం సనాతన ధర్మాను యాయులూ, ప్రచారకులూ ధర్మపరిరక్షకులూ ప్రయత్నించాలని తమ శిష్యులకు

# జగద్గురువంటే...

ఒకసారి శ్రీజగద్గురు శ్రీ సచ్చిదానంద శివాభినవ నృసింహభారతీ మహాస్వాముల వారి వద్దకు ఒక విదేశస్థుడు వచ్చి యిలా ప్రశ్నించాడు: "మీరు జగద్గురువునని ఎలా చెప్పగలరు? ప్రపంచంలో హైందవేతరులు ఎందరో ఉన్నారు కదా!"

శ్రీజగద్గురువులు ఇలా సమాధానమిచ్చారు: "ప్రపంచంలోని ప్రతి ఒక్కరికీ మేము ఆధ్యాత్మిక గురువుల మని చెప్పుకోవటానికి కాదు జగద్గురువులనటం. ప్రపంచంలో ఏ మారుమూల ప్రాంతంలో నివసిస్తున్న ఎవరైనా సరే చిత్తశుద్ధితో మా ఆధ్యాత్మిక మార్గదర్శనాన్ని కోరుకుంటే మాకు తెలిసినంతవరకు ఆ మార్గదర్శనాన్ని అందివ్వవలసిన బాధ్యత మాపై ఉంది. దూరాతి దూర ప్రదేశంలో నివసిస్తూ కూడా మా యొక్క మార్గదర్శనాన్ని కోరుకునే వ్యక్తి ఉండవచ్చు. మరోవ్యక్తి మఠ ప్రాంగణంలో నివసిస్తున్నా మా సలహాను కోరకపోవచ్చు. మొదటి వ్యక్తికి సహాయమందించటం మా బాధ్యత. రెండవ వ్యక్తికి కాదు. మొదటి వ్యక్తికి గురువయితే రెండవ వ్యక్తికి కాదు. అందువలన ఆ పదం మా బాధ్యతనే తెలియజేస్తుంది కానీ, మా మార్గదర్శనం కోరని వారిపై అధికారాన్ని కాని, హక్కుని కాని సూచించదు"

సూచించారు. ఆయన తరువాత శ్రీభారతీ కృష్ణతీర్థ, శ్రీవిద్యారణ్య మహాస్వాములు వరుసగా శ్రీ శారదాపీఠాన్ని అధిరోహించారు. వీరిరువురూ పూర్వాశ్రమంలో అన్నదమ్ములే. ఏకశిలా నగరానికి కాకతీయ సామ్రాజ్య పతనానికి వారు ప్రత్యక్షసాక్షులు. వారి మనస్సులలో సనాతన ధర్మానికి ఎదురైన సంకట పరిస్థితులు ఆందోళన కలిగిస్తుంటే, శ్రీవిద్యాతీర్థులను ఆశ్రయించారు. వీరిద్దరిలో శ్రీవిద్యారణ్యులు వయస్సులో పెద్దవారు. అయితే శ్రీభారతీ కృష్ణతీర్థులు ముందుగా అంటే క్రీ.శ. 1328లో సన్యాసాశ్రమాన్ని స్వీకరించారు. మూడు సంవత్సరాల తరువాత క్రీ.శ. 1331లో శ్రీవిద్యారణ్యులు ఆశ్రమాన్ని స్వీకరించారు.

క్రీ.శ. 1338లో శ్రీవిద్యాతీర్థులు తుంగాతీరంలో భూగర్భ గృహంలో అంబికా యోగ నిరతులై కూర్చొంటూ పన్నెండు సంవత్సరాల తర్వాత భూగృహాన్ని తెరవమని శిష్యులకు చెప్పారు. శ్రీ భారతీకృష్ణతీర్థుల అనుమతి లేకుండా, అసలు శ్రీవారికి తెలియకుండానే శ్రీవారి పరిచారకులు కేవలం కుతూహలంతో మూడుసంవత్సరాల తరువాత భూగర్భ గృహాన్ని తెరిచారు. అప్పుడు శ్రీవిద్యాతీర్థుల దేహం కనిపించ లేదు. ఒక లింగము మాత్రమే కనిపించింది. పరిచారకుల తొందరపాటుకు పరితపిస్తున్న శ్రీభారతీకృష్ణతీర్థులకు స్వప్నంలో గురుదర్శనమై ఉపశమనం కలిగిందట. ఆచోట శ్రీభారతీకృష్ణతీర్థులు విద్యాశంకర లింగ ప్రతిష్ఠాపన చేసి కొన్ని సంవత్సరాలలో అద్భుతమైన దేవాలయాన్ని నిర్మింపచేశారు. అదే శ్రీవిద్యాశంకర దేవాలయం. ఈనాటికీ మఠముద్రలో విద్యాశంకరుల పేరే ఉన్నది. ఈ విద్యాశంకర దేవాలయం వాస్తుశిల్ప సౌందర్యానికి చక్కటి ఉదాహరణ.

తుంగానదీ ప్రవాహం మలుపు తిరిగేచోట ఎత్తైన పీఠంపై విద్యాశంకర దేవాలయాన్ని నిర్మించారు. పశ్చిమ భాగంలో గర్భగుడి, దానికిరువైపులా విద్యాగణపతి, దుర్గా అమ్మవారు మిగిలిన మూడు వైపులా బ్రహ్మ విష్ణు మహేశ్వరుల శిల్పాలూ ఉన్నాయి. గుడి మధ్యలో పన్నెండు స్తంభాల మంటపం ఉంది. దానిని నవరంగ మంటపం అంటారు. ఈ పన్నెండు స్తంభాలు పన్నెండు జ్యోతిషరాశులకు చిహ్నాలు. ద్రావిడ సంప్రదాయంలో చెక్కబడిన విగ్రహాలు, లతలూ ఈ స్తంభాలపై ఉన్నాయి. ఇవి ఏకశిలలే. క్రింద ఎత్తిన తొండంతో ఏనుగులు, పైన శరభాలు, సింహాలు చెక్కబడ్డాయి. సింహాల నోరు తెరచి ఉంటే, ఆ నోట్లో కదిలే శిలాకందుకాలు ఉన్నాయి. వాటిని కదిలించగలం, కాని బయటికి తీయలేం. కప్పుపైన ఎనిమిది చదరపు అడుగుల చతురస్రంలో పద్మం చెక్కబడింది. ఆ పద్మం చుట్టూ ఆకులు, వాటిపై చిలుకలూ ఉన్నాయి. దేవాలయ కుడ్యాలపై అనేక దేవతా విగ్రహాలు చెక్కబడి ఉన్నాయి.

శృంగేరి పట్టణం మధ్యలో కొండపై మలహానికరేశ్వరస్వామి దేవాలయం ఉంది. జనార్దనస్వామి దేవాలయం, కాలభైరవా లయం కూడా చెప్పుకోదగ్గవే. కిగ్గ శృంగేరి నుండి సుమారు ఐదుమైళ్ల దూరంలో ఉంది. అక్కడి ఋష్యశృంగ దేవాలయం మరో విశేషం. ఏడవ శతాబ్దానికి చెందిన అనేక శాసనాలు అక్కడ ఉన్నాయి. ఋష్యశృంగ దేవాలయ గర్భగుడిలోని లింగం రుద్రాక్ష ఆకారంలో పైన కొమ్ముతో ఉంటుంది. దేవాలయానికి ఎడమవైపు శాంతాదేవి ఆలయం వుంది. ఈ ఆలయంలో స్వామిని శ్రద్ధగా అర్చిస్తే, కరువు కాటకాలు రావని ప్రతీతి.

తుంగానదీ, దేవాలయాలతో పాటు శృంగేరి పవిత్రతను పెంచిన కారణం మరొకటుంది. శ్రీశంకరభగవత్పాదులు తమ ముఖ్య శిష్యగణానికి వేదాంతశాస్త్రాన్ని బోధిస్తూ శృంగేరిలో కొంతకాలం గడిపారు. ఇప్పుడు ఆయన శిష్యపరంపరకు చెందిన ఆచార్య పురుషులు శృంగేరిలోనే సంచరిస్తున్నారు. భక్తుల మనస్సులకు అనిర్వచనీయమైన స్ఫూర్తి శృంగేరిలోనే లభిస్తున్నది. ఈ జగద్గురు పరంపర సదాశివునితో ప్రారంభ మవుతుంది. శ్రీశంకర భగవత్పాదులు

సాక్షాత్తూ పరమశివుని అవతారమే. వివిధ సంప్రదాయాలను క్షాళితం చేసి, వాటిని సమన్వయపరచి భారతీయ ఆధ్యాత్మిక భావనా ప్రపంచంలో ఒక సమగ్ర దృక్పథాన్ని నిర్మించి ధర్మం పతనం కాకుండా కాపాడి. వేదమతాన్ని పునరుద్ధరించటం అనే మహత్తర కార్యాన్ని మరొకరి తోడులేకుండా శ్రీశంకర భగవత్పాదులు సాధించారు. జాతీయ సమైక్యతను సాధించారు. ప్రస్థానత్రయ భాష్యాల్ని అనేక ప్రకరణ గ్రంథాలను, స్తోత్రాలను రచించారు. తమ వాక్పటిమతో ప్రతివాదులను ఓడించారు. సర్వజ్ఞ పీఠాన్ని అధిరోహించారు. దేశం నలుమూలలా నాలుగు పీఠాలను స్థాపించి అవిచ్ఛిన్నంగా సనాతన ధర్మ ప్రచారం, అద్వైతతత్త్వ ప్రచారం జరగటానికొక శాశ్వత వ్యవస్థను ఏర్పరిచారు.



శ్రీశంకరులు స్థాపించిన నాలుగు పీఠాలలో దక్షిణ భారతం లో శృంగేరిలో ప్రారంభించిన శ్రీశారదాపీఠం అతిముఖ్యమైనది. శ్రీశంకరులు తమ జీవితకాలంలో ఎక్కువ సమయం గడిపిన స్థలమిది. శ్రీసురేశ్వరాచార్యులను శ్రీశంకరులు అక్కడ పీఠాధి పతిగా నియమించారు. ఆనాటి నుండి శ్రీశారదాపీఠంలో అవిచ్ఛిన్నంగా గురుశిష్య పరంపర కొనసాగుతూ ఉన్నది. ఆ పీఠాన్ని అధిరోహించిన ఆచార్య పురుషులందూ గొప్పవారే. తపస్సంపన్నులే.

శృంగేరి శారదా పీఠంలో పదకొండవ పీఠాధిపతులు శ్రీ భారతీకృష్ణతీర్థులు, పన్నెండవవారు శ్రీవిద్యారణ్యులు. శ్రీవిద్యా రణ్యులు హరిహర బుక్కసోదరుల చేత హిందూ సామ్రాజ్య స్థాపన చేయించ సంకల్పించి, అనేక యుద్ధాలలో వారికి విజ యాన్ని ఆశీర్వదించి, వారికి క్రీ.శ. 1336లో తుంగభద్రా నదీతీరాన విద్యానగరాన్ని రాజధానిగా నిర్మింపజేసి వారికి పట్టాభిషేకం గావించారు. దానినే విజయనగరమనీ అంటారు. అందువల్లనే శ్రీజగద్గురువులు బిరుదావళిలో 'కర్ణాటక సింహాసన ప్రతిష్ఠాపనాచార్య' అన్న బిరుదు కూడా ఉంది. శంకరానంతర అద్వైత వేదాంతానికి అనేక గ్రంథాలు ఈ కాలంలోనే రచింపబడ్డాయి. శృంగేరిపీఠం మహాసంస్థానంగా అప్పుడు ప్రసిద్ధికెక్కింది. విజయనగర సామ్రాజ్య పతనానం తరం నాయకరాజులు, ఆ తరువాత మైసూరు రాజులు జగద్గురువుల పట్ల భక్తి శ్రద్ధలను ప్రదర్శిస్తూ వచ్చారు. స్వాతంత్ర్యానంతరం శృంగేరి జాగీరును కర్ణాటక రాష్ట్ర ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది.

శృంగేరి పీఠాధిపతులలో ముప్పది మూడవవారు శ్రీసచ్చిదా నంద శివాభినవ నృసింహభారతీ మహాస్వాముల వారు. క్రీ.శ. 1879 నుండి. క్రీ.శ. 1912 వరకు వారు పీఠాధిపతులుగా ఉన్నారు. శ్రీశంకర భగవత్పాదుల అవతార స్థలాన్ని కేరళలో 'కాలటి'గా కనుగొని అచట ఒక దేవాలయాన్ని నిర్మించడం ఆ ప్రక్కనే శ్రీశారదాంబ దేవాలయాన్ని నిర్మించడం శ్రీశంకరుల మాతృమూర్తి ఆర్యాంబ సమాధిస్థలాన్ని కనుగొని అచట బృందావనాన్ని ఏర్పరచటం వారి హయాంలో జరిగిన మహత్తర కార్యక్రమాలు. వైశాఖమాసంలో శు. పాడ్యమి నుండి శు. పంచమి వరకు ఐదురోజులు శ్రీశంకరజయంతి ఉత్సవాలు జరగాలని శ్రీవారే నిర్ణయించారు. గణపతి వాక్యార్థ విద్వత్స భలూ వీరి హయాంలోనే ప్రారంభమయ్యాయి. క్రీ.శ. 1912లో శ్రీచంద్రశేఖర భారతీస్వాములవారు పీఠాధిపతి అయ్యారు. శ్రీవారు జీవన్ముక్తులు, నిత్యమూ తపస్సులో నిమగ్నులై వుండేవారు. వారి తరువాత శ్రీమదభినవ విద్యాతీర్థులు క్రీ.శ. 1954లో పీఠాన్ని అధిరోహించారు. వీరి హయాంలో శంకర మఠాలు దేశంలో ఎన్నోచోట్ల స్థాపించబడ్డాయి. దేశమంతటా వీరు సంచరించి ఆస్తికభావాలను ప్రోత్సహించారు. వారి తరు వాత 1989లో శృంగేరీ శారదాపీఠాన్ని అలంకరించి తేజోభరితం చేస్తున్న ఆచార్య పురుషులు శ్రీ భారతీతీర్థ మహాస్వాముల వారు. శ్రీవారు బహుభాషాకోవిదులు. బహుశాస్త్రాలను అధ్యయనం చేసిన మహాపండితులు.

శృంగేరిలో ముఖ్యంగా చూడవలసినవి శ్రీశారదాంబ దేవా లయం, శ్రీమలహానికరేశ్వరాలయం,శ్రీశంకర భగవత్పాద ఆల యం, శ్రీజనార్దనస్వామి ఆలయం, శ్రీ విద్యాశంకర దేవాలయం, శ్రీసురేశ్వరాచార్య దేవాలయం. శ్రీ ఉగ్రనరసింహ భారతీ స్వాములవారి సమాధి, శ్రీ అభినవ సచ్చిదానంద భారతీస్వాము ల వారి సమాధి, శ్రీసచ్చిదానంద భారతీస్వాములవారి సమాధి, శ్రీవిద్యాశంకర దేవాలయం వెనుకనే ఉన్నాయి. నరసింహ వనంలో శ్రీసచ్చిదానంద శివాభినవ నృసింహభారతీ భారతీస్వాములకు, శ్రీచంద్రశేఖర భారతీస్వాములకు, శ్రీమదభినవ విద్యాతీర్థస్వాములకు అధిష్ఠానాలు నిర్మింపబడ్డాయి. శ్రీ జగద్గురువులు శ్రీ చంద్రమౌళీశ్వరునికి, శ్రీరత్నగర్భ గణపతికి, శ్రీ చక్రానికి నిత్యమూ పూజా కార్యక్రమాలు నిర్వహిస్తూనే ఉంటారు. స్ఫటికలింగరూపంలో శ్రీ చంద్రమౌళీశ్వరులు, శ్రీరత్నగర్భ గణపతి, శ్రీశంకరభగవత్పాదుల కాలం నుండీ సచ్చిదానంద జగద్గురువుల పూజలను అందుకుంటూనే ఉన్నారు.

# ధర్మప్రబోధానికి భగవంతుని ఉపదేశమే వేదం

## పీఠాధిపత్యం సందర్భంలో భారతీతీర్థస్వామి సందేశం



**వన్దే గురూణాం చరణారవిన్దే సన్దర్శితస్వాత్మసుఖావబోధే॥**
**జనస్య యే జాంగలికాయమానే సంసారహాలామలమోహశాన్త్యై॥**

శ్రీశంకర భగవత్పాదులు అనుగ్రహంతో, జగన్మాత శ్రీశారదా పరమేశ్వరి కరుణతో శ్రీశంకర భగవత్పాదులు స్థాపించిన దక్షిణా మ్నాయ శ్రీశారదా పీఠం అవిచ్ఛన్న గురుపరంపరతో అలరారుచున్నది.

మా పూజ్యగురుపాదులు, గురుపరంపరలో శిఖామణివంటి వారూ అయిన శ్రీఅభినవవిద్యాతీర్థ మహాస్వాములు భారత దేశంలోని అన్ని ప్రాంతాలకీ చెందిన ఎందరో భక్తులభక్తికీ, శ్రద్ధకూ, గౌరవానికీ, ప్రేమకూ పాత్రులైనవారు. ఆ యతీంద్రుల శిష్యులమని చెప్పుకోవటం నిజంగా మనకు గర్వకారణం.

సనాతన ధర్మ ప్రచారానికై శ్రీశంకర భగవత్పాదులు శృంగేరి శారదాపీఠాన్ని స్థాపించారు. సనాతన ధర్మ ఆచారవిచారాలు కొనసాగుతున్నంత కాలం మన దేశం సుభిక్షంగా ఉంటుంది. ధర్మానికి తావు లేనిచోట సంపదకూ తావుండదు. భౌతికంగా మనం అభివృద్ధిని సాధించినా, ధర్మాన్ని అనాదరిస్తే మనం ప్రమాదంలో చిక్కుకుంటాం. మనకు మనమే దురదృష్టాన్ని తెచ్చిపెట్టుకుంటాం.

భౌతికంగా, వైజ్ఞానికంగా అభివృద్ధి చెందుతున్న ఈ శతాబ్దంలో ధర్మం యొక్క అవసరమేమిటని కొందరు ప్రశ్నిస్తుంటారు. ధర్మస్వరూపాన్ని, ఔన్నత్యాన్ని గ్రహించలేకపోవటంచేత, భారతీయ సంస్కృతిపట్ల సదవగాహన లేకపోవటంచేత ఇటువంటి ప్రశ్నలను అడుగుతుంటారు. తమ భావననలే ఒప్పు అని భావించే కొందరు వారి బుద్ధి పెడత్రోవ పట్టిన కారణంగా ఈ విధంగా అడుగు తుంటారు.

"ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా" అని కొన్ని వేల

సంవత్సరాలకు పూర్వమే వేదం చెప్పింది. (ఈ విశ్వం యొక్క స్థిరత్వం, దాని అస్తిత్వం ధర్మం మీద ఆధారపడివుంది.) భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు చెప్పిన విషయాన్ని మనం మరవకూడదు.

**దేవాన్ భావయతానేన తే దేవా భావయన్తు వః।**
**పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ॥**

(మీరీ యజ్ఞక్రియలచే దేవతలను సంతృప్తిపరచండి. ఆ దేవతలు సకాల వృష్ట్యాదులతో మిమ్ము తృప్తిపరుస్తారు. మీరొండురులను సంభావించుకొనుచు పరమ శ్రేయాన్ని పొందండి.)

భగవంతుడు వేదరూపంలో మనకు ధర్మోపదేశం చేశాడు. ధర్మాన్ని బోధించటానికి భగవంతుడిచ్చిన ఉపదేశమే వేదం. సాధారణంగా మానవుల్ని వేధించే ప్రశ్నలు: "దేవుడు మనకు కనబడ్తాడా? కనపడి ఏదైనా చెప్తాడా? దేవుని కృప అంటే ఏమిటి?" మున్నగునవి. అయితే ఈ ప్రశ్నలకు కొందరు తప్పుగా ఇలా సమాధానమిస్తుంటారు. "సామాన్య మానవుని మోసం చేయటానికై కొందరు తయారుచేసిన కల్పనలివి"అని. వాస్తవంగా భగవంతుని కృప అంటే ఏమిటో మన పూర్వీకులు చక్కగా వివరించారు. ఆ సమాధానం ఇది.

**న దేవా దణ్డమాదాయ రక్షన్తి పశుపాలవత్ ।**
**యం హి రక్షితుమిచ్ఛన్తి బుద్ధ్యా సంయోజయన్తి తమ్॥**

పశువుల కాపరి చేతిలో కఱ్ఱతో పశువులను కాసినట్లుగా భగవం తుడు కూడ మనల్ని కాయడు.

మనం సత్కర్మల నాచరించటానికి తగిన బుద్ధిని పుట్టిస్తుంటాడు. మన మాచరించే ప్రతిపని వెనుక ఒక ప్రేరణ ఉంటుంది. ఆ ప్రేరణ కారణంగా తీవ్రమైన ఆసక్తి ఏర్పడుతుంది. అలాంటి ప్రేరణ లేకపోతే ఎవ్వడూ ఏపనీ చెయ్యడు. పనిచెయ్యాలనే ప్రేరణ ఎక్కడ నుండి కలుగుతాయి అనే ప్రశ్నకు భగవంతునినుండి అనేది ఒకటే సంతృప్తికరమైన సమాధానం. భగవంతుని ప్రేరణ లేకపోతే మంచి పనులు చేయాలనే కోరిక మనకు ఎలా కలుగుతుంది? అయితే కొంతమంది మనల్ని "సత్కర్మల నాచరించటానికి భగవంతుని నుండి ప్రేరణ లభిస్తే మరి దుష్కర్మలకు ప్రేరణ ఎవరి నుండి లభిస్తుంది?" అని ప్రశ్నిస్తుంటారు. దీనికి సమాధానం దుష్కర్మలకు కూడ ప్రేరణ భగవంతుని నుండే లభిస్తుందని. అయితే మనం చెడుపనులు చేయాలని భగవంతుని ఉద్దేశమా? అదేమి భగవంతుడు? మనం పరమోన్నత స్థానంలో ఉంచి భక్తి శ్రద్ధలతో కొలిచే భగవంతుడు మన చేత చెడుపనులు చేయించడమేమిటి? అనే ప్రశ్నలకు సమాధానాన్ని శాస్త్రాలు ఇలా చెప్తున్నాయి.



"గత జన్మలో చేసిన చెడు పనుల ఫలాన్ని నీవే అనుభవించాలి కాబట్టి అందుచేత ఆ ఫలాన్ని అనుభవించటానికి అవసరమైన పనులు చేసేవిధంగా ప్రేరణను కలిగిస్తాడు. అందువలన ఈ విష యంలో భగవంతుని బాధ్యత ఏదీ లేదు. ఆయనను నిందించ వలసిన పనిలేదు."

పూర్వజన్మల కర్మఫలాన్ని అనుభవించటానికై మరల మరల జన్మల నెత్తటం అనాదికాలం నుంచీ వస్తూనే ఉన్నది. వేదవ్యాస భగవాన్ తమ బ్రహ్మసూత్రాలలో శ్రీశంకరభగవ త్పాదులు తమ బ్రహ్మసూత్ర భాష్యంలో ఈ సంసారం అనాది నుండి ఉన్నదనే విషయాన్ని స్పష్టం చేశారు. అందుచేత అనాది అయిన ఈ సంసారంలో పూర్వజన్మల కర్మఫలాన్ని అనుభవించడమనే భావనలో దోషం లేదు. అది శాస్త్ర విరుద్ధమూ కాదు.

అందువలన భగవంతుని కృపను సంపాదించటానికై ఆయనను మెప్పించాలనుకున్న మనం ఆయన విధించిన ధర్మాన్ని పాటించాలి. భగవంతుడు మనకు వివేకాన్ని ప్రసాదించాడు. ఆ వివేకాన్ని సక్రమంగా వినియోగించవలసిన బాధ్యత మనపైనే ఉన్నది. దానిని సక్రమంగా ఉపయోగించకపోతే తప్పు మనదే. మన ప్రాచీన ఋషులు చక్కటి ఉదాహరణతో ఈ విషయాన్ని





వివరించారు.

యుద్ధంలో ఉపయోగించమని తండ్రి కుమారునికి కత్తినిస్తే, కుమారుడు దానితో తన గొంతునే కోసు కుంటే తప్పెవరిది? అది తండ్రి తప్పా? కుమారుని తప్పా? మంచి పనికి ఉపయో గించవలసిన దానిని తనను చంపుకోవ టానికే ఉపయోగించుకుంటే ఎలా? అటువంటి వానిని బుద్ధిలేనివాడు అనవద్దా? అలాగే ధర్మాన్ని అనుసరించ వలసిన మనం, వివేకాన్ని కోల్పోయి ధర్మాన్ని అనుసరించకుండా, శాస్త్ర బోధనలను పట్టించుకోకుండా కష్టాలపా లైతే తప్పెవరిది? ధర్మమార్గాన్ని అనుసరిం చకుండా, చార్వాక సిద్ధాంతాన్ని అనుసరిస్తూ, మనల్ని ఎవరూ చూడటం లేదనే భ్రాంతిలో "జీవించినంతకాలం సుఖంగా జీవించు, అప్పుచేసి పప్పుకూడు తిని బ్రతుకు"అనే పద్ధతిలో

ప్రవర్తిస్తూ, మనకు మనమే కష్టాన్ని తెచ్చిపెట్టుకుంటే ఇందుకు మనం తప్ప వేరెవరు బాధ్యులవుతారు?

అందువలన భగవంతుడు మనకు ప్రసాదించిన వివేచనా శక్తి ధర్మకార్యాచరణకై వినియోగించాలి. మన పెద్దలు మన మంచి కోసమే ధర్మాచరణ చేయమని చెప్పారనీ, అందుచేత వారి సూచన లను పాటించాలనీ మనకు విశ్వాసముండాలి.

ఏదైనా ఒక పని విషయంలోకాని ఆచారం విషయంలో కాని మనకు సందేహం రావచ్చు. ఆ సందేహం తీర్చుకోవటానికి శాస్త్రా లను ఆశ్రయించగల తెలివితేటలు అందరికీ ఉండవు. ఆ సంద ర్భంలో మనం ఏమి చెయ్యాలో ఉపనిషత్తులు మనకు సూచించాయి.

శాస్త్ర గ్రంథాలను పరిశీలించి సందేశాలను తీర్చుకునే శక్తి సామర్థ్యం గనుక లేకపోతే పెద్దలు చూపించిన మార్గాన్నే అనుసరించాలి. అయితే పెద్దలంటే ఎవరు? నిష్పక్షపాతంగా నిర్ణ యించగల శక్తి, శాస్త్రపరిజ్ఞానము, మంచిచెడుల విచక్షణా జ్ఞానము, సచ్ఛీలము గలవారే పెద్దలు. అటువంటి పెద్దల సలహా లను పాటించవచ్చు. ఉపనిషత్తులు ఈ విషయాన్నే స్పష్టీకరిం చాయి. అటువంటి మార్గాన్ని అనుసరిస్తే శ్రేయస్సు లభిస్తుంది. మన పూర్వీకులు

**యేనాస్య పితరో యాతా యేన యాతాః పితామహాః ।**
**తేన యాయాత్సతాం మార్గం తేన గచ్ఛన్న దుష్యతి ॥**

అని చెప్పారు.

మన పూర్వికులు నడిచిన మార్గమే మనకు కూడా శ్రేయో దాయకం. పూర్వీకులను తక్కువగా అంచనావేసి, వారికి తెలివి లేదని, అజ్ఞానులని భావించి చిన్నచూపు చూసేవారు తాము చాల తెలివైనవారమనీ, మేధావులమనీ భావిస్తూ భ్రమలో పడుతున్నారు. వారి అహంకారం కంటే అజ్ఞానం మరొకటి ఉండదు. జాగ్రత్తగా ఆలోచించకుండా, విశ్లేషణాత్మకంగా పరిశీలించకుండా మన పూర్వీకులు ఒక నిర్ణయానికి వచ్చి ఒక మార్గాన్ని అనుసరించేవారు కారు. ఇతరులను అనుసరించమని చెప్పేవారు కాదు. తమ బుద్ధినీ, మనస్సును ఉపయోగించి, వేదోక్త ధర్మమే సరియైనదని నిర్ధారించుకుని దాన్ని అనుసరించి వాళ్ల శ్రేయస్సును సాధించారు. అందువలన పెద్దలమార్గం అంగీకరించి, అనుసరించదగినదని మనకు గట్టి నమ్మకముండాలి.

ధర్మప్రచారం నిరంతరం జరగాలని శ్రీశంకర భగవత్పాదులు సంకల్పించారు. శతాబ్దాల పర్యం తం ధర్మాచరణ, ధర్మప్రచారం జరుగుతుండాలనే భావనతో వారు చతురామ్నాయ పీఠాలను ఏర్పరచారు. మనం గొప్పవారిగా భావించే వారిలోగాని, తత్త్వవేత్తల్లోగాని అయనంతటి గొప్పవారు లేరని చెబితే అతిశయోక్తికాదు. కేవలం ముప్పదిరెండు సంవత్సరాలు జీవించిన ఆ మహాపురుషుడు కన్యాకుమారినుండి కాశ్మీరువరకు



ధర్మప్రచారం ఎలా చేయగలిగారు? చతురామ్నాయ పీఠాలను ఎలా స్థాపించగలిగారు? పరమేశ్వరావతార స్వరూపు లవటం చేతనే ఆ పనులు సాధించగలిగారు.

ఆ మహాయోగి పవిత్రమైన శృంగేరీ క్షేత్రంలో దక్షిణామ్నాయ పీఠాన్ని స్థాపించారు. బ్రహ్మవిద్యకు ఆధారభూతము, జ్ఞానరూపిణి, జగన్మాత అయిన శ్రీ శారదాంబను శృంగేరీలో ప్రతిష్ఠించారు. ఈ పీఠాన్ని ఏ పవిత్ర ఘడియల్లో స్థాపించారో మనకు తెలియదు. ఆ ఘడియల పవిత్రతను అంచనావేసే శక్తి కూడా మనకు లేదు. ఈ పీఠాన్ని అధిష్ఠించిన ఆచార్యుల పరంపర అవిచ్ఛిన్నంగా కొనసాగుతుందనే విషయం ఆ ముహూర్తం ఎంత మహత్తరమైనదో తెలుపుతున్నది. చరిత్రలో గడ్డు పరిస్థితులెన్నో వచ్చాయి. ఎన్నో దెబ్బలు తగిలాయి. ఎన్నో ద్రోహపూరిత చర్యలూ కొనసాగాయి. కానీ శృంగేరీ పీఠ అవిచ్ఛిన్న గురుపరంపరకు ఎట్టి ప్రమాదమూ వాటిల్లలేదు. కర్ణాటక సామ్రాజ్య ప్రతిష్ఠాపనాచార్యులైన శ్రీ విద్యారణ్యుల కాలం శృంగేరీ మఠ చరిత్రలో స్వర్ణయుగం అని సర్వజన విదితం. ప్రపంచాన్ని పరిత్యజించిన సన్యాసికి పట్టాభిషేకం నిర్వహించడం అసంబద్ధమైన విషయం కదా! అని మమ్మల్ని చాలామంది ప్రశ్నించారు. ప్రాపంచిక విషయాలలో నిమగ్నుడైన వ్యక్తి తన మనస్సులోని కోరికలను తీర్చుకొనడం కోసం ప్రయత్నించే వానికి ఇటువంటి కార్యక్రమం యుక్తమైనది కానీ అందులకు విరుద్ధమైన నివృత్తి మార్గంలో ఉండవలసిన వానికి ఇది ఎలా యుక్తం? అని వాళ్లు మమ్మల్ని ప్రశ్నిస్తూ ఉంటారు. దానికి సమాధానం ఇది. సర్వసంగ పరిత్యాగి లోకోద్ధారం కోసం ఇటువంటి పనులు చేయడం అనుచితం కాదు. వారి చర్యలన్నీ పరా ర్థానికే కానీ, స్వార్థగంధం కూడా దానిలో ఉండదు.

వాస్తవానికి శ్రీ శంకర భగవత్పాదుల వారి కాలంలో శృంగేరీ పీఠాధిపతు లకు రాజచిహ్నాలు కానీ, రాజరికపు అలంకా రాలు కానీ ఉండేవి కావు. పట్టాభిషేక మహోత్సవాలూ లేవు. శ్రీ శంకర భగవ త్పాదుల వారి నుండి శ్రీ విద్యారణ్య స్వాముల వారి వరకూ ఉన్న శ్రీ శృంగేరీ శారదాపీఠ ఆచార్యపురుషులు తమ సమయాన్ని శిష్యుల అధ్యాపనానికి, తత్వ జిజ్ఞాసువులకు తత్వాన్ని బోధించడానికి వెచ్చించేవారు. కర్ణాటక సింహాసనా ప్రతి ష్ఠాపనాచార్యులైన శ్రీ విద్యారణ్యస్వామి మహాయోగి.

శ్రీ విద్యారణ్యుల వలె శృంగేరీ పీఠానికి చెందిన ఇతర ఆచార్య పురుషులు ఎందుకు చేయలేదని మమ్మ చాలామంది అడు గుతూ ఉంటారు. శ్రీ విద్యారణ్యస్వామి వలె మిగిలిన ఆచార్య పురుషులు కూడా బహిర్ముఖులు.



ఎందువలన కాలేదని కూడా అడుగుతూ ఉంటారు. శ్రీ విద్యారణ్యులు అసలు అలా బాహ్య విషయాలను పట్టించుకున్నవారు కాదు. హరిహర, బుక్క సోదరులు ఆయనను వెతుక్కుంటూ వచ్చారు. తమ తపోబలంతో, మేధతో శ్రీ విద్యారణ్యులు ఆ సోదరులకు తోడ్పడ్డారు. వారి సహాయం కారణంగా హరిహరి బుక్క సోదరులు కర్ణాటక సామ్రాజ్య సింహాసనాన్ని అధిష్ఠించగలిగారు. అయితే శ్రీ విద్యారణ్యులు తమ సన్యాస జీవనాన్ని కొనసాగించారు.

తమకు, హిందుత్వానిక శ్రీ జగద్గురు విద్యారణ్య స్వాములవారు చేసిన సహాయానికి కృతజ్ఞతా పూర్వకంగా హరిహర బుక్క సోదరులు తమ రాజచిహ్నాలను జగద్గురువుల పాద´పద్మాల వద్ద సమర్పించారు. శిష్యుల పట్ల గురువు కఠినంగా వ్యవహరించకూడదు. అందువలన శిష్యుల్ని సంతోషపరచడానికై ఆ రాజచిహ్నాలను శ్రీ విద్యారణ్యులు స్వీకరిం చారు. ఆ గౌరవ చిహ్నాలను కోరుకున్నారని భావించినట్లయితే అంతకంటే పెద్ద తప్పు మరొకటి ఉండదు. హరిహర రాయలు, బుక్కరాయలను సంతోషపరచడానికై శ్రీ విద్యారణ్యులు స్వీకరిం చిన ఈ రాజచిహ్నాలను తరువాత వచ్చిన ఆచార్యులు కూడా ధరించి శ్రీ విద్యారణ్యులు చూపిన మార్గాన్నే అనుసరిస్తూ వచ్చారు.

అందుచేత పట్టాభిషేకోత్సవాల వంటి ప్రాపంచిక విషయాలు జగద్గురువులకు లౌకిక విషయాల మీదగల ఆసక్తికి చిహ్నాలని ఎవరైనా భావిస్తే అది పొరపాటు. జగద్గురువులైన ఆచార్య పురుషులకు ఈ విషయాలపై ఏమాత్రం మోహం లేదు. శ్రీ భగవత్పా దులు బోధించిన అద్వైతతత్వాన్ని ప్రచారం చేయడం కోసమే నిరంతరమూ ఉద్యుక్తులైనవారికి వీటిమీద మోహం కలదని భావించడం అసంగతమైన విష యం. శిష్యులకు సంతోషం కలిగిం చడం గురువుయొక్క బాధ్యత అనే అభిప్రాయంతో సంప్రదాయాన్ని పరిరక్షిం చాలనే అభిలాషతో మేము ఈ ఉత్సవా నికి అంగీకరించాం. అంతే మరో ఉద్దేశం లేదు. ఇంకేమీ ఆశించలేదు.

మా గురుపాదులు, ఆదర్శమైన సన్యాసి జీవితం గడిపారు. మాకు ఆదర్శం అదే. మా గురుపాదులు నెలకొల్పిన పద్ధతులను, మార్గాన్ని అనుసరిస్తూ, వారు సూచించిన రీతిగా కర్తవ్య నిర్వహణను కొనసాగిస్తూ శ్రీ శారదాపరమేశ్వరిని ఆరాధించి, ఆమె అనుగ్రహానికి పాత్రులమగుటయే మా దృఢసంకల్పం.

మా హృదయమందు నిలిచి, మా కర్తవ్య నిర్వహణలో ప్రతి అడుగులోనూ మాకు మార్గదర్శనం చేయాలని భక్తి అతిశయంతో మా గురుపాదుల పాద పద్మములకు ప్రణమిల్లుతున్నాము. శ్రీ శృంగేరీ పీఠ ఆచార్య పరంపరకు, మా గురుపాదులకు శ్రీ చంద్రమౌళీశ్వరులకు, శ్రీ శారదాపరమేశ్వరికి మమ్ము సరియైన మార్గంలో నడిపిస్తూ మాకు అప్పగించిన కర్తవ్యాన్ని సామర్థ్యంతో నిర్వహిం చగల మనోబలాన్ని కూడా అనుగ్రహించగలరని పదేపదే ప్రార్థిస్తు న్నాం. శిష్య జనులందరికీ మా ఆశీస్సులనందజేస్తూ మా భాషణాన్ని ముగిస్తున్నాం.

హర నమః పార్వతీపతయే హరహర మహదేవ
జానకీకాన్త స్మరణం జయజయ రామరామ

# మానవునికి ప్రధాన శత్రువులు

## జగద్గురు ఉపదేశామృతం



ఉంది. పుణ్యపాపాలు క్రమంగా సత్కర్మలు మరియు దుష్కర్మల ఫలితమని వారికి తెలుసు. మంచీచెడుల మధ్య తేడాను గ్రహించగలిగినా ఆశ్చర్యకరంగా మానవుడు పాపపు కర్మలలోనే నిమగ్నుడవుతాడు. ఒకసారి దుర్యోధనుని ఇలా ప్రశ్నించారు. "మీరు రారాజు. శాస్త్రాలను చదివారు ధర్మమంటే ఏమిటో తెలుసు. అయినా మీరు ఇలా ఎందుకు ప్రవర్తిస్తారు?" అందుకు దుర్యోధనుడు

**జానామి ధర్మం న చ మే ప్రవృత్తిః**

**జానామ్యధర్మం న చ మే నివృత్తిః**

"ధర్మమంటే ఏమిటో నాకు తెలుసు. అయినా నా మనస్సు దానివైపు మొగ్గటం లేదు. అధర్మమూ నాకు తెలుసు. కాని నా మనస్సు పాప కర్మల నాచరించడానికే ఇష్టపడుతోంది." అని సమాధానమివ్వడం ఆశ్చర్యకరమైన విషయం.

శ్రీకృష్ణ భగవానుని మాటలను వింటున్న అర్జునుడు "దేవా! నీవు బోధించే విషయం తెలుస్తున్నా మనిషి ప్రవర్తన చూస్తే వింతగా అనిపిస్తోంది" అని ప్రశ్నించాడు.

**అథ కేన ప్రయుక్తో యం పాపం చరతి పూరుషః ।**

**అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః ॥**

"మనిషికి తాను ఏమి చేస్తున్నాడో తెలిసి చేసినా ఎవరి బలవంతం మీదనో చేస్తున్నట్లు పాపపు పనులనే చేస్తుంటాడు. దానికి కారణమేమిటి?" దానికి శ్రీకృష్ణ భగవానుని సమాధానం ఇది.

**కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః ।**

**మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥**

కామము మరియు క్రోధ మనబడు రజోగుణం వలన జనిస్తవి. అవి ఎంతకూ తనియవు. మహా పాపిష్ఠమైనవి. అవే మనిషిని బలవంతంగా పాపానికి ప్రేరేపిస్తాయి.

పై అభిప్రాయం మనకు కొత్త కాదు. మనందరికీ సామాన్యంగా తెలిసినదే. అయితే మళ్ళీ మళ్ళీ మనం దానిని గురించి ఆచరణలోకి తీసుకురాలేకపోతున్నాం. కామం, క్రోధం అనేవి ప్రతి మనిషికీ బద్ధశత్రువులు. మనిషికి మొదట ఇష్టం లేకపోయినా పాపకార్యాలు చేసేటట్లు ఈ రెండూ బలవంత పరుస్తాయి. కామక్రోధాలను అదుపులో ఉంచుకున్నట్లయితే పాపం చేయాలనిపించదు.

ఒక వస్తువును తీవ్రంగా కోరుకోవడం కామమైతే, ఆ వస్తువు లభించకపోతే లేదా దానిని కోల్పోతే క్రోధం వస్తుంది.

**క్రుద్ధో హన్యాద్గురూనపి**

క్రోధంతో ఉన్నవాడు ఏమైనా చేస్తాడు. చివరికి తన గురువు గారిని హింసించడానికి కూడా వెనుకాడడు. శ్రీకృష్ణ భగవానుడు కామక్రోధాలను తొలగించుకోవలసిన అవసరం గురించి వివరించాడు. కామ క్రోధాల బంధువులే లోభ, మోహ, మద, మాత్సర్యాలు. కామం తన బంధువర్గంతో ఒక వ్యక్తిలో స్థిరపడితే అతను పూర్తిగా నాశనమవుతాడు. కామాన్ని దాని కారణంగా ఉద్భవించే ఇతర శత్రువులతో సహా సమూలంగా తొలగించడానికి మార్గమేమిటి? మన శాస్త్రాలు ఈ ప్రశ్నకు సమాధానం చెప్పాయి.

మాధవీయ శంకర విజయంలోని ఐదవ సర్గలో శ్రీ శంకర భగవత్పాదుల వారి బాల్యం వంద శ్లోకాలలో వర్ణించబడింది. వారి రూపం ఎలా ఉన్నదో, వారి ప్రవర్తన ఎలా ఉండేదో వారు ఎంతటి నిజాయితీపరులో మనం మాధవీయ శంకర విజయం నుండి గ్రహించవచ్చు. అందులో వారు అరిషడ్వర్గాలైన కామ క్రోధ మోహ లోభ మద మాత్సర్యాలను జయించారని చెప్పబడింది. ఎలా జయించిందీ కూడా చెప్పబడింది. మనకు కూడా వాటిని జయించాలని ఉంటుంది. కానీ మార్గమే తెలియదు. ఆ మార్గాన్ని బోధిస్తే, కొందరైనా ప్రయత్నించి కామక్రోధాదుల నుంచి ముక్తిని పొందవచ్చు. కొంతమంది

ఉపన్యాసాలు విన్నా, తమ మామూలు దారినే పోతుంటారు. మనం ఆ వర్గంలో చేరకూడదు.

కోరికను జయించడమెలా? భౌతికమైన వస్తువుల పట్ల నిర్లక్ష్యాన్ని పెంచుకోవాలి. "భౌతికమైన వస్తువులు ఆనందదాయకం కానప్పుడు అవి మనకెందుకు? వాటి వలన ప్రయోజనం లేదు." అనెడి ఆలోచనను పెంచుకోవాలి. ఒక వస్తువు ఆకర్షణీయంగా అందంగా ఉన్నదనుకున్నప్పుడే మనం దానిని కోరుకుంటాం. మనం చూసిన వస్తువుల గురించి మన కళ్ళే మనకు తెలియజెపుతాయి. చక్షురింద్రియ స్వభావమది. మనం చాలా వస్తువులను చూస్తున్నా. అన్నిటినీ మనం కోరుకోనం. ఆనందాన్ని, సంతోషాన్ని అందించగలవని అనుకున్న వాటినే మనం కోరుకుంటాం. ఒకవేళ అన్ని వస్తువులు పనికిరానివే అని ఎవరైనా భావిస్తే, అతను కోరుకోవడానికి ఇంకేం ఉంటుంది? అందువలన కామాన్ని జయించాలంటే భౌతికమైన వస్తువులు ఆకర్షణీయమూ, ఆనందదాయికమూ కావనే ఆలోచనను పెంచుకోవాలి.

**అసారమేవ సంసారం దృష్ట్వా సారదిదృక్షయా ।**
**ప్రవ్రజన్త్యకృతోద్వాహాః పరం వైరాగ్యమాశ్రితాః ॥**

శంకరులు సన్యాసాన్ని ఎందుకు స్వీకరించారు?

**అసారమేవ సంసారం దృష్ట్వా**

ఇదీ కారణం.

ఏ వస్తువునైనా అనుభవిస్తే ఈ ప్రపంచంలో మనకు ఏమి దక్కుతుంది. అన్ని వస్తువులు అందంగా కనపడతాయి. కాని, వాటి స్వభావాన్ని విశ్లేషించి చూస్తే వానిలో సారమేమీ కనపడదు.

అంతేకాదు. వానిని మనం సంపాదించేదాకానే వాటి అందం, ఆ తరువాత వానిలో ఎటువంటి ఆకర్షణ ఉండదు. నిర్లక్ష్యం కనుక నిరంతరం ఉంటే ఏ వస్తువునూ పొందడానికి ప్రయత్నం చేయవలసిన పని ఉండదు. కోరికలను జయించడానికి ఇటువంటి మనః స్థితి అవసరం.

క్రోధాన్ని జయించడానికి మనం తితిక్షను సంపాదించుకోవాలి. అయితే తితిక్ష అంటే ఏమిటి?

**సహనం సర్వదుఃఖానామ ప్రతీకారపూర్వకమ్ ।**
**చిన్తావిలాపరహితం సా తితిక్షా నిగద్యతే ॥**

ఎంతటి బాధనైనా సంతోషంగా భరించడమే తితిక్ష. శంకర విజయంలో శ్రీ శంకరుల జీవితంలోని ఓర్పు యొక్క పరిధిని వివరించారు. ఉగ్రభైరవుడు శ్రీ శంకరులను కలిసి ఇలా ప్రార్థించాడు. "స్వామీ! నేనూ భైరవారాధకుడిని. ఒక చక్రవర్తినో లేదా ఒక మహామేధావి అయిన సన్యాసితో తనకు బలి ఇస్తే, నే కోరిన వరాన్ని ప్రసాదిస్తానని భైరవుడు అనుగ్రహించాడు. ఒక చక్రవర్తిని బలి ఇవ్వడానికి ప్రయత్నించడమంటే, నా ప్రాణమే పోగొట్టుకోవడం. అందువలన నేను దానిని సాధించలేను.



మీరు సర్వజ్ఞమూర్తియైన యతులని ప్రజలు చెప్పుకోవడం నేను విన్నాను. మీ దేహంపై మీకు వ్యామోహం లేదనీ, మీరు చాలా గొప్ప వేదాంతి అనీ నాకు తెలుసు. ఈ శరీరం ఎప్పుడో ఒకప్పుడు నశించేదే.

**వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి ।**
**తథా శరీరాణి... ॥**

"ఓ వ్యక్తి పాత వస్త్రాలను విడిచి నూతన వస్త్రాలను ధరించినట్లే ఆత్మ జీర్ణమైన దేహాన్ని వదిలి నూతన దేహాన్ని స్వీకరిస్తుందని మీరు బోధిస్తారు కదా! అందువలన నశ్వరమైన ఈ దేహంతో ఏమి సాధిస్తారు? మీ శిరస్సు లభిస్తే నాకు గొప్ప లాభం కలుగుతుంది. కాబట్టి దానిని పొందడానికి నాకు అనుమతిస్తారా?"

అటువంటి కోరికతో ఎవరైనా మనల్ని సమీపిస్తే, వెంటనే మనం రక్షణకై చాలా మంది రక్షకభటులను మన చుట్టూ పెట్టుకుంటాం. శ్రీ శంకరుల సమాధానం మాత్రం విశిష్టంగా ఉన్నది. తనను మరునాడు కలుసుకొమ్మని భైరవునికి సూచించారు. ఇంకా ఇలా చెప్పారు. "నా శిష్యులు చుట్టుప్రక్కల ఉన్నప్పుడు రావద్దు. వాళ్ళు నీపనిని పూర్తి చేసుకోనివ్వరు. మధ్యాహ్న స్నానానికై వాళ్ళు బయలుదేరినప్పుడు నేను తరువాత వస్తానని ఆగిపోతాను. నేను ఒంటరిగా ఉంటాను. అపుడు నీవు వచ్చి నీ పనిని పూర్తి చేసుకో" అని చెప్పినట్లు మరొకరు చెప్పడం మనం ఊహించగలమా?

మరునాటి మధ్యాహ్నం శిష్యులు స్నానానికై వెళ్ళారు. శిష్యులతో శ్రీశంకర భగవత్పాదులు ఉగ్రభైరవుని రాక గురించి ఏమీ చెప్పలేదు. వానికి సహాయం చేయాలని ఆయన ఉద్దేశం. ఉగ్రభైరవుడు వచ్చే సమయానికి ఆయన ఆనందంతో సమాధిలో నిమగ్నులైపోయారు. శ్రీ శంకరులను చూసిన ఉగ్రభైరవునికి చాలా సంతోషమయింది. తన కోరికను తీర్చుకోవడానికై కత్తిని చేత పట్టుకున్నాడు. అయితే ఈశ్వరేచ్ఛ మరో విధంగా ఉన్నది. ఉగ్రభైరవుని ఆశయం పూర్తి కాలేదు.



అనుకోకుండా శ్రీ నరసింహస్వామి ఆవహించిన పద్మపాదాచార్యులు అక్కడకు వచ్చి ఉగ్రభైరవుని మీద పడి గోళ్ళతో చీల్చి సంహరించాడు. శ్రీ నరసింహస్వామి చేసిన గర్జనకు శ్రీ శంకరులు సమాధి నుండి బయటకు వచ్చారు.

ఒక స్తంభం నుండి గర్జనతో భయంకర రూపంతో వెలువడి హిరణ్యకశిపుని సంహరించిన శ్రీ నరసింహస్వామి వర్ణన శ్రీమద్భాగవతం సప్తమ స్కంధంలో ఉన్నది. హతుడైన ఉగ్రభైరవుని దేహాన్ని ఒకవైపు, ఉగ్రనరసింహ రూపుడైన పద్మపాదుని మరోవైపు చూచిన శ్రీ శంకరులు శ్రీ నరసింహస్వామిని స్తుతించి, ప్రశాంత వాతావరణాన్ని పునఃప్రతిష్ఠించారు. "నేను సమాధిలో ఉన్నాను. నేను అనుమతించినట్లుగా ఉగ్రభైరవుడు నా శిరస్సును ఖండించలేదే?" అని శ్రీ శంకరులు ప్రశ్నించారు. "అది ఈశ్వరేచ్ఛ కానందున ఉగ్రభైరవుడు తన లక్ష్యాన్ని సాధించలేకపోయా"డని పద్మపాదులు సమాధానం చెప్పారు.

అంతటి సహనం ఇంకెవరు ప్రదర్శించగలరు? మనమందరం అటువంటి ఓర్మిని అలవరచుకోవాలి. క్రోధాన్ని జయించడానికి సహనమొక్కటే మనకు తోడ్పడుతుంది. ఒక సంఘటనను పరిశీలిద్దాం. మా పరమేష్ఠి గురువైన శ్రీ సచ్చిదానంద శివాభినవ నృసింహభారతీ మహాస్వాముల వారి హయాంలో ఇది జరిగింది. శ్రీవారు ఒకచోట మకాం చేసియున్నప్పుడు ప్రభుత్వ అడవుల శాఖకు చెందిన అధికారి ఒకరు ఆయనను కలుసుకోవడానికి వచ్చాడు. క్షేమ సమాచారాలు అడిగి భక్తులను పంపించడం వారికి అలవాటు లేదు. ఆ అధికారికి పరమసత్యాన్ని తెలుసుకోవాలనే ఆలోచన ఉన్నదో లేదో అని గ్రహించడానికి శ్రీవారు ఇలా ప్రశ్నించారు. "మీకెప్పుడైనా కోపం వస్తుందా?" అధికారి అప్పుడప్పుడు సహనాన్ని కోల్పోతానని చెప్పాడు.

**ఆచార్యపాదులు** : మీకు కోపం వస్తే ఏమి చేస్తారు?

**అధికారి**: నా క్రింద పనిచేసే వారిపై ఆ కోపాన్ని ప్రదర్శిస్తాను.

**ఆచార్యపాదులు** : అప్పుడు అతను ఏమి చేస్తాడు?

**అధికారి** : అతను తన క్రింద పనిచేసే వారిపై తన కోపాన్ని ప్రదర్శిస్తాడు.

**ఆచార్యపాదులు**: ఒక మనిషి క్రోధం ఎందరిని ఇబ్బంది పెడ్తుందో చూశారా?

అధికారి తన తప్పును అంగీకరించి, తాను ఏమి చేస్తే బాగుంటుందో వివరించమని ప్రార్థించాడు. ఆచార్యపాదులు ఇలా బదులిచ్చారు. "మూడు రకాల మనుష్యులున్నారు. కొందరు తమకు కోపం రావచ్చని ముందే గ్రహిస్తారు. మరికొందరు వచ్చే కోపాన్ని ముందు పసిగట్టలేరు కాని కోపం వచ్చిన తరువాత తమకు కోపం వచ్చిందని గ్రహించగలరు. ఇంకొందరు తమ కోపాన్ని చాలా ఆలస్యంగా అంతా అయిపోయింతర్వాత నష్టం జరిగిన తరువాత గుర్తిస్తారు. ఈ ముగ్గురిలో నీవు ఏ వర్గానికి చెందుతావు?"

అధికారి తాను మొదటి వర్గానికి చెందననీ, రెండవ వర్గానికి చెందుతానని చెప్పగా ఆచార్యపాదులు మొదటి వర్గంలో చేరడానికి ప్రయత్నించమనీ, కోపం వస్తోందనుకున్నప్పుడు, "కోపం తెచ్చుకోవడం ఎంతవరకు సమంజసం?" అని ఆలోచించి కోపాన్ని ఆపుకోవాలనీ చెప్పారు. ఆ అధికారి జగద్గురువులకు సాష్టాంగ ప్రణామ మొనరించి సెలవు తీసుకుని తన మకాం వైపు బయలుదేరాడు. ఆయన తమ వసతిని చేరుకునేటప్పటికి మధ్యాహ్నమయింది. అందువలన విపరీతంగా ఆకలివేయసాగింది. అయితే దురదృష్టం కొద్దీ ఆయన వంటవాడు రెండు రొట్టెలను మాత్రమే చేశాడు. అది తెలియగానే ఆయనకు కోపం వచ్చి సహనం కోల్పోయి వంటవానిపై కేకలు వేయబోయాడు. అయితే ఆచార్యపాదుల సలహా జ్ఞాపకం వచ్చింది. వెంటనే వంటవాడిని పిలిచి రెండు రొట్టెలను మాత్రమే తయారుచేయడానికి కారణమడిగాడు. ఇంట్లో పిండి లేదని, పిండి తీసుకురావడానికి వెళ్ళిన నౌకరు ఇంకా రాలేదనీ, కాని అధికారి ఆకలిని కొంచమైనా తగ్గించవచ్చునని తాను ఇంట్లో ఉన్న పిండిని ఉపయోగించి రెండు రొట్టెలు తయారుచేశానన్నాడు. వంటవాడు తానేమీ తినలేదు. వస్తువులు వచ్చిన తరువాత రొట్టెలు తయారుచేసుకుని తినాలి. అధికారి తన వంటవానిని మెచ్చుకోకుండా ఉండలేకపోయాడు. అమాయకుడైన తన వంటవానిపై అనవసరంగా కోపం తెచ్చుకోకుండా జగద్గురువుల సలహా తనను కాపాడిందని సంతోషించాడు.

(శ్రీ శృంగేరీ జగద్గురు శంకర సేవా సమితి, ఆంధ్రప్రదేశ్ వారి సౌజన్యంతో)





## అంగరంగ వైభవం

# శ్రీచరణుల షష్ట్యబ్దపూర్తి ఉత్సవం

**శృంగేరీ శ్రీ శారదా పీఠాధీశ్వరులు, జగద్గురువులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారి షష్ట్యబ్దపూర్తి ఉత్సవం మహావైభవంగా జరిగింది. లోకకల్యాణం కోసం కనీవినీ ఎరుగని రీతిలో మహాయాగాలు, విశేష పూజలను ఈ సందర్భంగా నిర్వహించారు. ప్రపంచ వ్యాప్తంగా తరలివచ్చిన ఆధ్యాత్మికవేత్తలు, ఉద్దండులైన వేదపండితులు, ప్రముఖుల సమక్షంలో జగద్గురువుల గురువందన కార్యక్రమం నేత్రపర్వంగా జరిగింది. స్వామివారి అనుగ్రహభాషణం ప్రతి ఒక్కరిలో ఆధ్యాత్మిక చైతన్యాన్ని కలిగించింది. జగద్గురువుల షష్ట్యబ్దపూర్తి ఉత్సవంపై 'దర్శనమ్' అందిస్తున్న నివేదిక.**

శ్రీశ్రీ జగద్గురు శంకరాచార్య మహాసంస్థానం దక్షిణామ్నాయ శ్రీ శారదా పీఠాధిపతి శ్రీ భారతీతీర్థ మహాస్వామివారి షష్ట్యబ్దపూర్తి ఉత్సవాలు శృంగేరిలో ఒక ఏడాది ముందు ప్రారంభమైనాయి. శృంగేరిలోనే కాక దేశంలోని వివిధ స్థలాలలో ఈ ఉత్సవాలు జరిగాయి. 2011 ఏప్రిల్ 9న శ్రీ జగద్గురువుల 61వ వర్ధంతి శృంగేరిలో ఎంతో వైభవంగా జరిగింది. ఈ వర్ధంతి ఉత్సవాలు ఏప్రిల్ 4న లక్షమోదక మహాగణపతి హోమంతో మొదలయ్యాయి. ఇందుకోసం శృంగేరిలోని నరసింహవనంలో ఒక ప్రత్యేక యాగశాలను నిర్మించారు. ఈ మహాగణపతి హోమంలో దేశం నలుమూలల నుంచి వచ్చిన 100 మంది ఋత్విజులు పాల్గొన్నారు. వేదోక్త రీతిలో ఆరణి మధించి అగ్నిని జ్వలింపజేసి హోమాన్ని నిర్వహించారు. జగద్గురువులు ఈ హోమం ప్రారంభంలో యాగశాలకు విజయం చేశారు. ఆ మధ్యాహ్నం శ్రీ ఆదిశంకరాచార్య మూర్తి కోసం కొత్తగా నిర్మించిన ఆలయానికి మండలాభిషేకం నిర్వహించి శ్రీ భారతీతీర్థ స్వామివారు మహాగణపతి హోమం



పూర్ణాహుతిలో పాల్గొన్నారు. హోమం ముగిసిన తర్వాత అక్కడ ఉన్న అశేష భక్తజనులకు తీర్థమూ మోదక ప్రసాదమూ వినియోగించారు.

ఏప్రిల్ 5న ఉదయం అతిరుద్ర మహాయాగం నరసింహవనంలో ఏర్పాటుచేసిన ప్రత్యేక యాగశాలలో మొదలయింది. శ్రీచరణులు యాగశాలకు విజయం చేసి సంకల్పం నిర్వహించారు. ఋత్విక్కులకు దీక్షా వస్త్రాలు,



రుద్రాక్షమాలలు తదితర యాగసామగ్రి ఇచ్చి 'వరణం' జరిగింది. 11 రోజుల పాటు నిర్వహించిన ఈ మహాయాగంలో నాలుగు దక్షిణ భారత రాష్ట్రాలనుంచే కాక మహారాష్ట్ర నుంచి కూడా వచ్చిన 121 మంది ఋత్విజులు పాల్గొన్నారు. ప్రతినిత్యమూ ఉదయం రుద్ర మంత్రాలను ఏకాదశ పర్యాయాలు పఠించడం, అనంతరం మంగళహారతి, సాయంకాలలో రుద్రక్రమ పాఠం అటుపిమ్మట మహామంగళ హారతి జరిగాయి. ఏప్రిల్ 16న జగద్గురువుల సమక్షంలో పూర్ణాహుతి నిర్వహించారు.

నరసింహవనంలో ప్రత్యేకంగా రూపొందించిన చండీయాగ శాలలో ఏప్రిల్ ఆరున మొదలైన అయుత చండీయాగం అపూర్వమైనది. అద్భుతమైనది. సంకల్పవేళ జగద్గురువులు యాగశాలను విచ్చేశారు. ఋత్విజవరణ కార్యక్రమంలో శ్రీచరణులు ప్రధాన ఋత్విక్కుకు దీక్షావస్త్రం, రుద్రాక్షమాల, పూర్ణఫలం తదితర సామగ్రిని అనుగ్రహించారు. శృంగేరి చరిత్రలోనే కాక దక్షిణ భారతదేశంలోనే మొదటిసారిగా ఏర్పాటు చేసిన ఈ అయుత చండీయాగంలో వేయి మంది వేద పండితులు పాల్గొన్నారు. వీరందరూ కలిసి ఐదు రోజులపాటు పదివేల పర్యాయాలు దుర్గాసప్తశతిని పఠించడం, కోటిమార్లకు పైగా చండీ నవాక్షరీ మంత్రజపం చేయడం అద్వితీయం. ఆరవ నాడు వేయిమంది ఋత్విజులు 100 హోమకుండాలలో పాయసంతో హోమం చేశారు. ఈ యాగానికి శృంగేరి మఠం ఆస్థాన అర్చకులు బ్రహ్మశ్రీ నరహరి సుబ్రహ్మణ్య భట్టు (శ్రీవిద్యా ఉపాసనా దురంధరులు) ప్రధాన ఋత్విజులు ఉండి ఐదునాళ్ళూ ఈ యాగం కోసం ప్రత్యేకంగా చేసిన దేవీచండిక నూతన మూర్తికీ యంత్రానికీ కల్పోక్త ఆవరణ పూజలు నిర్వహించారు. ఏప్రిల్ 11న ఈ అయుత చండీయాగం పూర్ణాహుతి కార్యక్రమం శ్రీ జగద్గురువుల సమక్షంలో జరిగింది.

ఏప్రిల్ 8 నాడు శ్రీ చరణుల షష్ట్యబ్ద పూర్తి సందర్భంగా ఉగ్రరథ శాంతీ, ఆయుష్య-మృత్యుంజయ-నవగ్రహ హవనాలూ జరిగాయి. శ్రీ శారదాంబను దర్శించిన తర్వాత శ్రీచరణులు ఈ హవనాల సంకల్ప కార్యక్రమానికి విజయం చేశారు.

ఈ హవనాలను శ్రీమఠం ఆవరణలోని జగద్గురు శ్రీ సచ్చిదానంద శివాభినవ నృసింహభారతీ యాగశాలలో నిర్వహించారు. శ్రీ సీతారామాంజనేయులు శర్మ నేతృత్వంలో 18 మంది వేద పండితులు ఈ కార్యక్రమాలలో పాల్గొన్నారు. **130 కలశాలలో పవిత్ర తీర్థం నింపి వాటిని యాగశాలలో స్థాపించారు. 60 కలశాలలో 60 సంవత్సరాల అధిదేవతలనూ, 27 కలశాలలో 27 నక్షత్రాల అధిదేవతలనూ, 9 కలశాలలో నవగ్రహ దేవతలనూ, 7 కలశాలలో 7 వారాల దేవతలనూ, 13 కలశాలలో 13 యోగాల దేవతలనూ, 14 కలశాలలో 14 కరణాల దేవతలను ఆవాహన చేశారు.** (మొత్తం 130 కలశాలు). కార్యక్రమాలలో భాగాలుగా పంచకాఠక పారాయణం, శాంతి సూక్తం పారాయణం, విష్ణుసహస్రనామ, శివసహస్రనామ, శివకవచ, ఆయుష్యసూక్త పారాయణాలు, నవగ్రహ జపం సూర్యనమస్కారాలు జరిగాయి.

వర్ధంతి మహోత్సవాల సందర్భంగా ఋగ్యజుస్సామ వేదాలకు సంబంధించి సంహితా యాగాలు నిర్వహించారు. నరసింహవనం లో శ్రీ సచ్చిదానంద విలాస్ ఎదుట విడివిడిగా కట్టిన మూడు యాగశాలలలో ఈ సంహితా యాగాలు జరిగాయి. యజు స్సంహిత యాగం మూడు రోజులు, ఋక్సామ సంహితా యాగాలు ఐదేసి రోజుల పాటు నిర్వహించారు. ఋక్సంహితా యాగం ఋగ్వేదంలోని శాకల సంప్రదాయానికి చెందిన 64 అధ్యాయాల మంత్రోచ్ఛారణతో నిర్వహించారు. కృష్ణ యజుర్వేదంలోని తైత్తిరీయ సంహితలోని మంత్రాల ఉచ్ఛారణతో యజు స్సంహితా యాగం జరిగింది. సామ సంహితా యాగం సామవేదంలోని కౌతువు సంప్రదాయంలోని మంత్రాల ఉచ్చారణతో జరిగింది. యజుస్సంహితా యాగం పూర్ణాహుతి ఏప్రిల్ 12న, ఋక్సామ సంహితాయాగాల పూర్ణాహుతులు ఏప్రిల్ 15 నాడు శ్రీ జగద్గురువుల సమక్షంలో జరిగాయి.

ఏప్రిల్ 9న శ్రీచరణులు షష్ట్యబ్ద పూర్తి మహోత్సవంలో మరపురాని రోజు. నాడే శ్రీచరణుల వర్ధంతి. ఈ ఏడాది ప్రత్యేకతను సూచిస్తూ గురునివాస్ నుంచి నరసింహవనం ప్రవేశద్వారం దాకా భక్తులు జగద్గురువుల దర్శనం కోసం బారులు తీరి నిలబడ్డారు. ఉదయం 7 గంటలకు ప్రారంభమైన జగద్గురువుల ఆహ్నిక దర్శనం 10 గంటలదాకా కొనసాగింది. భక్తులకు ఆహ్నిక దర్శనం అనుగ్రహించిన తర్వాత శ్రీ భారతీతీర్థ మహాస్వామి తుంగానది ఉత్తరపు గట్టుకు నాదస్వర వాద్యఘోషల నడుమ బయలు దేరారు. మఠం ప్రాంగణంలోని వివిధ ఆలయాలకు వెళ్ళి ఆయా దేవతామూర్తుల దర్శనం చేసుకుని శ్రీచరణులు శారదాంబ ఆలయంలోకి ప్రవేశించి అంబకు తమ వర్ధంతి సందర్భంగా ప్రత్యేక పూజ నిర్వహించారు. అనంతరం ఉగ్రరథ శాంతి, నవగ్రహ





ఆయుష్య మృత్యుంజయ హెూమాల పూర్ణాహుతి కార్యక్రమంలో పాల్గొన్నారు.

సాయంకాలం- గురువందనం కార్యక్రమం ఎంతో వైభవంగా జరిగింది. ఎందరో భక్తులు జగద్గురువులకు ఫలపుష్ప సమర్పణం చేశారు. తిరుమల తిరుపతి దేవస్థానాల పక్షాన కార్యనిర్వహణాధికారి శ్రీ ఐ.వై.ఆర్. కృష్ణారావు, శ్రీ వేంకటేశ్వరాలయ అర్చక బృందం శ్రీ భారతీతీర్థులకు శ్రీ వేంకటేశ్వరుల ప్రసాదాన్నీ వస్త్రాన్నీ వైదికాశీర్వచనంతో అందజేశారు. వివిధ దేవస్థానాల నుంచీ మఠాల నుంచీ వచ్చిన ప్రతినిధులు శ్రీచరణులకు గౌరవ ప్రసాదాలు అందజేశారు. ఈ సందర్భంగా జరిగిన కార్యక్రమంలో షష్ట్యబ్దపూర్తి మహోత్సవ విశేష సంచిక, జగద్గురు బోధనలు, జగద్గురు వైభవం మొదలైన అనేక గ్రంథాలను జగద్గురువులు ఆవిష్కరించారు. ఈ రచనలు సంస్కృతం, తెలుగు, కన్నడం, తమిళం మొదలైన భాషలలో ఉండడం విశేషం. తమ జీవితానికీ బోధలకూ సంబంధించిన డీవీడీని శ్రీ భారతీతీర్థులు ఆవిష్కరించారు. 'దర్శనం' పత్రిక ఏప్రిల్ సంచికను సంపాదకులు శ్రీ వెంకటరమణ శర్మ శ్రీచరణులకు సమర్పించారు.

గురువందన కార్యక్రమంలో శృంగేరిమఠం కార్య నిర్వాహకులు గౌరీశంకర్, విశ్రాంత న్యాయమూర్తి శ్రీకృష్ణ మొదలైనవారు శ్రీచరణుల ప్రశస్తి గురించి ప్రసంగించారు.

# జ్ఞానమార్గానికి చిత్తశుద్ధి ప్రధానం

**'షష్ట్యబ్దపూర్తి అనుగ్రహభాషణం'లో జగద్గురువుల ఉద్బోధ**

**శ్రీ భారతీతీర్థ మహాస్వామి తమ అనుగ్రహ భాషణంలో వేద వేదాంతాల గరిమ గురించీ ప్రవృత్తి నివృత్తి మార్గాలకు శ్రీ ఆదిశంకరులు చేసిన సమన్వయం గురించీ, నేటి కాలంలో ప్రభుత్వమూ, ప్రజలూ అనుసరించవలసిన ధర్మమార్గాల గురించీ ప్రస్తావించారు. కర్మమార్గానికీ, జ్ఞానమార్గానికీ దేని ప్రత్యేకత దానికి ఉందని చెబుతూ ఉన్నత పాఠశాల పరీక్షల కోసం చదివిన పుస్తకాలు కళాశాల చదువులకు నిమిత్తం లేదన్నట్టే- కర్మమార్గాన్ని తుదముట్ట పాటించి చిత్తశుద్ధి పొంది జ్ఞానమార్గంలోకి ప్రవేశించిన తరువాత కర్మమార్గంతో నిమిత్తం లేదన్నారు. జగద్గురువుల అనుగ్రహ భాషణం కన్నడంలో సాగింది. అందులోని కొన్ని అంశాలు :**

"భగవద్గీత ప్రాముఖ్యం అసదృశ్యమైనది. అటువంటి భగవద్గీతలో సాక్షాత్తూ భగవంతుడే 'నీవు ఈశ్వరార్థంగా చేసిన పని నీకు బంధకం కాదు' అని చెప్పిన తరువాత సందేహానికి తావేది? శంకర భగవత్పాదులు చెప్పిన పూర్వోత్తర కాండలకు సమన్వయం ఎట్లాగంటే- చిత్తశుద్ధి పర్యంతం పూర్వకాండకు, కర్మమార్గాన్ని అనుసరించాలి. చిత్తశుద్ధి కలిగిన తర్వాత జ్ఞానమార్గానికి పోవాలి. చిత్తశుద్ధి లేనివారు జ్ఞానమార్గానికి వెళ్ళడం వల్ల వారికి ఏవిధమైన ప్రయోజనమూ ఉండదు. మనసులో అనేకమైన ఆశలు ఉంటాయి. ఏ ఆశా పోలేదు. అయినా ఏదో గురువులు వేదాంత పాఠం చెబుతున్నారని తానూ వెళ్ళి వేదాంత పాఠంలో కూచుంటే- వేదాంత పాఠం జరుగుతున్నా వాడి మనసు ఎక్కడో ఉంటుంది కాని అక్కడ ఉండదు. ఎందుకంటే మనసులో ఏ ఆశా చావలేదు కనుక. అటువంటివాళ్లు వేదాంత పాఠానికిపోతే నిద్రవస్తుంది. ఇంకే ఉపయోగమూ ఉండదు. లౌకికులు ఒకరు మా వేదాంత పాఠానికి వచ్చేవారు. మా పాఠం రెండు గంటలు సాగేది. ఆయన అనేవాడు- పాఠం ఒక గంటసేపు అయిన తర్వాత ఒక కప్పు టీ దొరికితే చాలా బాగుంటుంది అని... ఎందుకంటే కాస్త నిద్ర వస్తున్నది కనుక... మనసులో ఆశలుండి మనసు పరిశుద్ధంగా ఉండనివాళ్లు వేదాంత పాఠంల కూచుంటే వచ్చేది నిద్రే. అందుకే పరిశుద్ధచిత్తులై వేదాంతాన్ని అధ్యయనం చేయాలి, జ్ఞానమార్గానికి రావాలి



అన్నారు. ఇదెందుకు చెబుతున్నానంటే శంకర భగవత్పాదులు చేసిన అత్యంత ఉత్కృష్టకార్యాలలో ఈ ప్రవృత్తి నివృత్తి మార్గాలకు- కర్మ బ్రహ్మకాండలకు చేసినటువంటి సమన్వయం అన్నది అసాధారణమైన పని. అటువంటి పనిని భగవత్పాద శంకరులు చేసి జగత్తుకు అద్వితీయమైన మార్గదర్శకులయ్యారు. నేటికి కూడా నిష్పక్షపాతంగా విమర్శ చేయగలిగిన తత్త్వమున్న వైదేశిక పండితులు భారతీయ దార్శనికులలో ఆదిశంకర భగవత్పాదులకు సమమైన దార్శనికులు ఇంకెవరూ లేరని ముక్తకంఠంతో అంటారు. ఆ పండితులకు ఎవరిపట్లా పక్షపాతం లేదు. ఎందుకంటే వారు పుట్టింది క్రైస్తవమతంలో... వారిది నిశితంగా విమర్శచేసే స్వభావం. ఎందులో న్యాయం ఎక్కువగా ఉంది, ఏది న్యాయసమ్మతమైనది అని యోచన చేయగల స్వభావం ఉంటుంది వారికి. భారతీయ దార్శనిక పరంపరలో వచ్చిన తత్త్వధారలన్నిటి గురించీ తీక్షణంగా విమర్శ చేసి వారు చివరికి చేసిన నిర్ణయం ఏమిటంటే- ఆదిశంకరుల ఆలోచనా



ధార అత్యంత న్యాయసమ్మతమైనది అత్యంత సముచితమైనది, అత్యంత ప్రామాణికమైనది- సర్వజన గ్రాహ్యమైనది- అని.

"అంతటి మహానుభావులైన ఆదిశంకరాచార్యులు తమ కాలంలో తాము చేయవలసిన పనులన్నిటినీ చేసేశాము. తాము చేయవలసిన పనులేవీ మిగలలేదు అని భావించక, తాము అక్కడికి అంతటితో విడిచిపెడితే పునః ఈ జనుల తత్త్వం ముందున్నట్టుగానే అవుతుందని ఆలోచించారు. మనం చూస్తున్నాం. అనేక జనులు అనేక విధాలుగా పేరుగడించి జనులలో ఒక విశేషమైన భావనను రూపొందిస్తుంటారు. వారు పోయిన వెంటనే కొన్నేళ్లలో వారు చూపిన మార్గాన్ని జనులు మరచిపోవడాన్ని మనం లోకంలో చూస్తు న్నాము. శంకరులు ఏం చేశారు? 'నేను దీనికి ఏ వ్యవస్థా చేయకుండా పోతే కొన్ని ఏళ్ళలో జనులు దీన్ని మరిచిపోతారు. ఇది నిరంతరంగా ఉండాలంటే దీనికి అత్యంత సుభద్రమైన వ్యవస్థను నేను ఏర్పాటు చేయాలి' అని యోచించి ఈ చతురామ్నాయ పీఠ స్థాపన చేశారు. ఇది నిరంతరంగా ఉండాలంటే ఒక గురుపరంపర ఉండాలి. ఆ పరంపరలో ఈ ధర్మప్రచారం అవిరతంగా సాగుతూ ఉండాలి. ఆయా కాలాలలో వచ్చే జనులకు ధర్మాన్ని గురించి తెలియజేయడానికి తగిన వ్యక్తి ఎప్పుడూ ఉండాలి. అందుకు ఒక గురుపరంపరను ప్రారంభించాలి అనే ఉద్దేశంతో శంకరులు చతురామ్నాయ పీఠ స్థాపన చేశారు. అందులో దక్షిణామ్నాయ పీఠాన్ని ఈ శృంగేరి క్షేత్రంలో స్థాపన చేశారు. ఆయన స్థాపన చేసిన గడియ అత్యంత ఉత్కృష్టమైన గడియ అనిపిస్తుంది. అప్పటి నుంచి ఈ పీఠంలో ఏ రకమైన విచ్ఛిత్తికీ ఆస్కారం లేకుండా గురుపరంపర కొనసాగుతూ వస్తున్నది. ఆ గురుపరంపరలో మా గురువులు ముప్పై అయిదవవారు. వారు ఈ శృంగేరి శారదాపీఠ కీర్తిని దేశంలోని అన్నివైపులా వ్యాపింపజేశారు. ప్రతి ఒక్కరికీ శారదాపీఠం పట్ల భక్తి కలిగేట్టు చేశారు. ధర్మప్రబోధం చేశారు. ఆయన తమ తర్వాత ఆ బాధ్యతను మేము స్వీకరించాలంటూ మమ్మల్ని ఆజ్ఞాపించారు. ఆయన ఆజ్ఞ ప్రకారం మేము ఈ గురుతరమైన ఉత్తరాధికారాన్ని స్వీకరించవలసి వచ్చింది. యద్యపి నా స్వభావానికి నాకు శాస్త్ర చింతన, అనుష్ఠానం- ఈ రెండూ ఎప్పటికీ చేస్తూ ఉండాలి అని ఉన్నా... గురువులు మాకొక ఆదేశం చేసినందువల్లా ఆ ఆదేశాన్ని పాటించడం మా కర్తవ్యం అయినందువల్ల ఆ కర్తవ్య దృష్టితో మా గురువుల ఆదేశాన్ని పాటించవలసి ఉంది. కాని మా స్వభావానికి ఇటువంటి గురుతరమైన జవాబుదారీని నడపడం కష్టం అని ఆ శారదాంబ యోచించి గౌరీశంకర్ అనే వ్యక్తిని నాకు చూపించారు... అందువల్ల నా శాస్త్ర చింతనకూ అనుష్ఠానానికీ ఏవిధమైన తొందరా కలగకుండా ఈ మఠాన్ని

> **మేము చేసే ప్రతి పనికీ సంకల్పం చేసేది అట్లాగే... 'ఏతద్దేశ పరిపాలకానాం ధర్మే శ్రద్ధాభివృద్ధ్యర్థం'- ఇప్పుడు మైక్‌లో అంటున్నట్టు నాటి నుంచి సంకల్పం చేస్తున్నాము. ఏతద్దేశ పరిపాలకానాం ధర్మే శ్రద్ధాభివృద్ధ్యర్థం- ధర్మం పట్ల శ్రద్ధ పెరగనీ... అందరూ ధార్మికులు కానీ... అధర్మం నుంచి దూరంగా ఉండనీ... అని. అధర్మం ఆచరిస్తే ఆరంభంలో మంచి జరుగుతున్నట్టు అనిపించవచ్చు. చివరకు దానివల్ల అత్యంత చెడు జరుగుతుంది. అశ్రేయస్సు కలుగుతుంది అనే భావన మన జనుల మనసుల్లో కలగాలి.**

నడిపించడానికి అవకాశం లభించింది. మా గురువుల కృప వల్ల మఠంలో ఎన్నో అభివృద్ధి పనులు జరిగాయి. వాటన్నిటికీ మాతో ఉండి ఇందుకు కారకుడైన గౌరీశంకర్‌కు నేను ఈ సందర్భంలో విశేషమైన ఆశీర్వాదాలను చేయవలసి ఉంది. ఎన్నో పనులు జరిగాయి. ముస్ముందు ఎన్నో పనులు జరుగనున్నాయి... కావలసినవి ఇంకా ఎన్నో ఉన్నాయి. ఆ జగన్మాత మా ద్వారా ఏమేమి నడిపించాని అనుకొని ఉన్నదో అవన్నీ జరిగి తీరుతాయి. అందుకు ఈ గౌరీశంకర్ ఆరోగ దృఢగాత్రుడై సదా ఉత్సాహభరితుడై ఇతోధికమైన శ్రద్ధతో ముందు జరగవలసిన కార్యక్రమాలను నడపడానికి వలసిన శక్తిసామర్థ్యాలను తల్లి శారద అతనికి ఇవ్వనీ అని ఆశీర్వదిస్తున్నాను...

"మా గురువుల షష్టిపూర్తి ఇదివరలో 1977లో జరిగింది. మా పరమగురువుల షష్టిపూర్తి 1953లో జరిగింది. వారికి 60 ఏళ్ళు నిండింది 1952లో. 1953లో సహస్ర చండీయాగాన్ని నిర్వహించారు. వారికి ఏ అవసరమై లేదు. వారి దగ్గరికి వెళ్లి తమ షష్టిపూర్తి సందర్భంలో కొన్ని పనులు చేయవలసి ఉంది అన్నప్పుడు 'ఏమీ చెయ్యనక్కరలేదు ఊరికే పొండి అవతలికి8 అన్నారు. 'నా షష్టిపూర్తికి మీరేమీ చెయ్యవద్దు. అవతలికి వెళ్ళండి' అన్నారు. కాని శిష్యజనులు వదలలేదు. శిష్యజనులు మేము ఇంకేమీ చేయబోవడం లేదు. దేవతారాధన చేస్తాము. దానికీ అనుజ్ఞ లేదా?' అంటే 'దేవతారాధన చేసేట్టుంటే చేయండి. అంతే!' అన్నారు."

"ఆ నిమిత్తమై అప్పుడు సహస్ర చండీయాగం చేశారు. విజయ నామ సంవత్సరంలో- 1953లో. అప్పుడే శృంగేరిలో మొదటిసారిగా సహస్రచండి చేసినది. ఆ సంవత్సరమే ప్రారంభమైనది."

"ఆ తర్వాత మా గురువులు షష్టిపూర్తిని 1977లో మద్రాసు నగరంలో విశిష్టమైన రీతిలో మద్రాసులోని శిష్యులు జరిపారు. 34 ఏళ్ళ క్రితం అప్పటికి అది చాలా వైభవంగా జరిగింది. అందరు శిష్యులూ వచ్చి పాల్గొన్నారు. 34 ఏళ్ళ క్రితం అందుకు రమారమి ఏడెనిమిది లక్షల రూపాయలు ఖర్చయ్యాయి. ఇప్పుడు జరుగుతున్న కార్యక్రమానికి- నాకు సరిగ్గా తెలియదు- దాదాపు నాలుగైదు కోట్లు ఖర్చవుతుండవచ్చు. అయితే ఇవన్నీ ఎందుకు ఖర్చు చేస్తున్నారు అంటే- ఏవిధమైన వ్యర్థమైన ఖర్చులూ కావు. దేవతార్చన కోసం.. ఈ అయుత చండీ మహాయాగం చేయాలి- దీని ద్వారా జగన్మాతను సంతృప్తిపరచి అట్లా మనదేశానికి క్షేమం కలగాలి... మన న్యాయమూర్తి శ్రీకృష్ణ చెప్పినట్లు మన దేశానికి మంచి జరగాలి. జనులకు సద్బుద్ధి కలగాలి. జనులకు ధర్మ మార్గంలో వెళ్లాలనే ప్రేరణ రావాలి."



"మేము చేసే ప్రతి పనికీ సంకల్పం చేసేది అట్లాగే... 'ఏతద్దేశ పరిపాలకానాం ధర్మే శ్రద్ధాభివృద్ధ్యర్థం'- ఇప్పుడు మైక్‌లో అంటున్నట్టు నాటి నుంచి సంకల్పం చేస్తున్నాము. ఏతద్దేశ పరిపాలకానాం ధర్మే శ్రద్ధాభివృద్ధ్యర్థం- ధర్మం పట్ల శ్రద్ధ పెరగనీ... అందరూ ధార్మికులు కానీ... అధర్మం నుంచి దూరంగా ఉండనీ... అని. అధర్మం ఆచరిస్తే ఆరంభంలో మంచి జరుగుతున్నట్టు అనిపించవచ్చు. చివరకు దానివల్ల అత్యంత చెడు జరుగుతుంది. అశ్రేయస్సు కలుగుతుంది అనే భావన మన జనుల మనసుల్లో కలగాలి."

"రావణుడికి సీతాపహరణం చేస్తున్నప్పుడు తానేదో గొప్ప సాధన చేశాననిపించింది. చివరకు దాని పరిణామం ఏమవుతుందో అతనాలోచించలేదు. ఆలోచించి ఉంటే సీతాపహరణం చేసేవాడు కాదేమో! దుర్యోధనుడు పంచపాండవులను అధర్మంగా గెలిచి వాళ్ళను అడవికి పంపుతున్నప్పుడు దాని పరిణామం ఏమవుతుందో ఆలోచించలేదు. ఆలోచిస్తే అతను ఆ పని చేసి ఉండేవాడు కాదేమో తెలియదు. ఇట్లా అనుభవించడానికి వీలుకాని ఫలాన్ని ఇచ్చే అధర్మాన్ని కేవలం తాత్కాలికమైన- అశాశ్వతమైన సుఖం కోసం చేస్తే 'నేను యోగ్యుడనయిన మనుష్యుడనవుతానా?' అనే దాన్ని కొంచెమైనా ఆలోచించాలి. అప్పుడు అనిపిస్తుంది- అధర్మం జోలికి పోకూడదని."

"అట్లా మేము ఈ దేవతార్చన చెయ్యడం- జనులకు ధర్మమార్గంలో ప్రవృత్తి ఎక్కువ కానీ... అధర్మమార్గం నుంచి జనులకు నివృత్తి ఎక్కువకానీ... పరస్పర ద్వేషం పరస్పర నింద పరస్పర హింస అనే ప్రవృత్తి దూరం కానీ... అని ఇంత సంకల్పంలో ఉంది. మేము సంకల్పం చేస్తున్నప్పుడు వస్తే- మీరు చూడవచ్చు- 'పరస్పర ద్వేష పరస్పర నిందా పరస్పర హింసా నివృత్త్యర్థం' అనడాన్ని... ముందు మనస్సులో ద్వేషం- దాని ఫలితంగా నోటి నుంచి నింద- దాని ఫలితంగా శారీరకంగా హింస వస్తాయి. అందువల్ల ఈ అన్నిటికీ

**ఈ అంతటికీ మా గురువులైన జగద్గురు శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వామివారి కృపయే కారణం. వారి అనుగ్రహమే ఇదంతా. వారు మాకు మంత్రోపదేశం చేసి ఒక మాట చెప్పారు. 'మీ కాలంలో మఠం చాలా బాగుంటుందప్పా' అని. అది ఇంకెవరికీ తెలియదు. ప్రత్యేకంగా నాకు చెప్పారు- మంత్రోపదేశం చేశాక. సన్యాస స్వీకారం చేశాక మంత్రోపదేశం చేసే సంప్రదాయం ప్రకారం తమ అనుష్ఠాన కక్ష్యలో నన్ను కూచోబెట్టి నాకు ఉపదేశం చేసి- 'మీ కాలంలో మఠం చాలా బాగుంటుంది' అన్నారు. ఆ మాట వీటన్నిటినీ నడిపిస్తున్నది.**



మూలంగా ఉన్న ద్వేష భావన అనేది తొలగనీ అని మేము సంకల్పం చేస్తుంటాం. ఈవిధంగా మనదేశంలో ధర్మజాగృతి పెరగనీ, ధర్మం పట్ల అభిరుచి పెరగనీ! అధర్మం దూరం కానీ అనే దృష్టితో ఈ దేవతార్చన జరుగుతున్నది. అట్లా చేస్తున్నప్పుడు ఇంకా ఎక్కువగా దేవతార్చన చేయాలనే దృష్టితో అయుత చండీ మహాయాగాన్ని చేయాలనే సంకల్పం మనసుకు వచ్చింది. అది సామాన్యులకు సాధ్యమయ్యే విషయం కాదు. ఒక వేయిమంది జనులను- అఖండ పారాయణం చేయగల అభ్యాసం ఉన్న వైదిక పండితులను ఒకచోటికి చేర్చాలి- ఆ వేయిమంది ద్వారా ఏకస్వరంలో చండీపారాయణ జరపాలి. అది అత్యంత క్లిష్టమైనది. తోచినట్టు చేసేది కాదు. సామాన్యంగా పదిమంది పారాయణం చేసేటప్పుడే ఒకరు రెండవ అధ్యాయంలో ఉండీ మరొకరు మూడవ అధ్యాయంలో ఉండడం, ఇంకొకరు నాల్గవ అధ్యాయంలో ఉండడం- ఒకరు ఒకటవ అధ్యాయంలోనే ఉండడం జరుగుతుంటుంది. పదిమంచి చేస్తేనే ఇట్లా ఉంటే వేయి మంది చేస్తే? అందరూ ఒకే క్రమంలో చేయాలంటే అది శృంగేరిలో మాత్రమే సాధ్యమవుతుంది.. అన్యత్ర ఎక్కడా సాధ్యంకాదు. మన వైదికులందరికీ తెలుసు. శృంగేరిలో జరుగుతున్నది అంటే అందరూ ఉత్సాహంగా వచ్చి పాల్గొంటున్నారు. ఆ అయుత చండీశాలలో ప్రవేశించగానే మనస్సుకు ఒక అనిర్వచనీయమైన ఆనందం కలుగుతున్నది- అనిర్వచనీయమైన ఆనందం- అది ఏమిటో చెప్పడానికి వీలుకానిది. ఆ అయుత చండీశాలలో ప్రవేశించగానే అటువంటి ఒక అభూతపూర్వమైన కార్యక్రమం ఈ సందర్భంలో జరుగుతుండడం మాకు చాలా సంతోషం కలిగించింది. మాకు షష్టిపూర్తి వైభవంగా జరగాలన్న ఇచ్ఛలేదు. మాకున్న ఇచ్ఛ ఒకటే- ఈ నెపంతో ఇంకా పెద్ద దేవతారాధన సాగుతుంది అంటే అంత మటుకు సాగనీ అని చెప్పాము మా షష్టిపూర్తిని వైభవీకరించమని ఎన్నడూ చెప్పలేదు. అటువంటి స్వభావం మాకు లేనూలేదు. ఆ దేవతారాధన సాగనీ అనేదే మా అభిప్రాయమై ఉండినది. అందుకే అయుత చండీ మహాయాగం, అతిరుద్ర మహాయాగం అట్లాగే ఋక్సంహితాయాగం యజుస్సంహితాయాగం, సామసంహితాయాగం అన్నిటినీ జరిపి ఏతన్మూలకంగా దేవతా ప్రార్థన చేసి ఆ దైవానుగ్రహానికి పాత్రులు కావలెననే దృష్టితో ఈ కార్యక్రమాలను ఈ సందర్భంలో ఏర్పాటు చేయడం. ఇందులో మన మఠం శిష్యులు ఎందరో పాల్గొన్నారు."

"శృంగేరి మఠంలో మనకొక సంప్రదాయం ఏమిటంటే మనం ఎవరినీ అడిగే అలవాటు లేదు. నేను ఈ కార్యక్రమం చేస్తున్నాను మీరు ఏమన్నా ఇస్తారా అని అడిగే సంప్రదాయం అప్పటి నుంచి ఇప్పటిదాకా రాలేదు. ఇకముందూ రాదు. అయితే మన మనస్సులో సంకల్పం పుట్టింది అంటే ఆ జగన్మాత శారద ఎవరెవరి మనస్సుల్లో ప్రవేశించి ఏ రీతిగా ఆ పనిని చేస్తుందనేది ఆ పని అయ్యాకే తెలుస్తుంది. ఇప్పుడూ అట్లాగే అయింది. మనసులోకి ఒక సంకల్పం వచ్చాక అమ్మవారు దాన్ని నడిపిస్తారనేది నా నిర్ణయం. ఎవరినీ ఏదీ అడగడానికి వెళ్ళవద్దన్నాను. వీళ్లు ఎవరూ ఏదీ అడగడానికి వెళ్ళలేదు. కొందరు వాళ్ళంతట వాళ్ళే వచ్చి 'ఈవిధంగా చండీయాగం చేస్తారట కదా మేమేదైనా యథాశక్తి ఇందులో పాల్గొనవచ్చా?' అని అడగసాగారు. 'మీ అంతట మీరు వచ్చి పాల్గొంటామంటే మేము వద్దనము' అన్నారు వీళ్లు. 'మేము పాల్గొంటామన్నారు వాళ్ళు'. కార్యక్రమం జరుగుతున్నది అంతే. మరేమీ లేదు.

ఆ విధంగా శృంగేరీ శారదాపీఠంలో 'అప్పటి నుంచి భగవత్పాదులు ఏ దారి చూపించారో అదే మార్గంలో నడవాలి, ఆ మార్గం నుంచి అటూ ఇటూ కాకూడదు. అదే మనకు శ్రేయస్కరమైనది' అనే నిర్ణయంతో ఈ గురుపరంపర

వస్తున్నది. సురేశ్వరాచార్యుల నుండి కూడా ఈ పరంపర చరిత్ర చూస్తే ఏ స్వామి కూడా ఆ మార్గానికి భిన్నంగా ప్రవర్తించలేదు. అదే మార్గాన్ని మేమూ అనుసరించాలని మా గురువుగారు ఆజ్ఞాపించారు. ఆ మార్గంలోనే మేము ముందుకు సాగుతున్నాము. ఈ అంతటికీ మా గురువులైన జగద్గురు శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వామివారి కృపయే కారణం. వారి అనుగ్రహమే ఇదంతా. వారు మాకు మంత్రోపదేశం చేసి ఒక మాట చెప్పారు. 'మీ కాలంలో మఠం చాలా బాగుంటుందప్పా' అని. అది ఇంకెవరికీ తెలియదు. ప్రత్యేకంగా నాకు చెప్పారు- మంత్రోపదేశం చేశాక. సన్యాస స్వీకారం చేశాక మంత్రోపదేశం చేసే సంప్రదాయం ప్రకారం తమ అనుష్ఠాన కక్ష్యలో నన్ను కూచోబెట్టి నాకు ఉపదేశం చేసి- 'మీ కాలంలో మఠం చాలా బాగుంటుంది' అన్నారు. ఆ మాట వీటన్నిటినీ నడిపిస్తున్నది. వారు అనిన మాటలలో ఒక అక్షరాన్నీ నేను అటూ ఇటూ మార్చలేదు- 'నిమ్మ కాలదల్లి మఠ చెన్నాగిరుత్తదె'. ఆ ఒక్కమాట ఈ పనులను జరిపిస్తున్నది.

"గురువుల మాటల ప్రభావం ఎంతటిదో ఏమిటో మాకు అనుభవవేద్యమయింది. గురువుల ఆ ఒక్కమాట వీటన్నిటినీ చేయిస్తున్నదంటే ఆశ్చర్యం కలగవచ్చు. ఈ మాటలు మొదట- సురేశ్వరులకు మఠం ఇచ్చినప్పుడు శంకరుల నోటినుండి వచ్చి ఉండవచ్చు. 'ఇకముందు ఈ మఠం బాగా ఉండనీ' అనే మాటలు మొదట శంకరుల నోటినుంచి వెలువడి ఉండాలి. ఆ తర్వాత ఒక్కొక్క గురువు నోటినుండి వస్తున్న ఆ మాటలు నా గురువు నోటి నుంచి వచ్చాయి. అట్లాగే మఠం ఇప్పుడు నడుస్తున్నది. మా శిష్యులైన మీరందరూ భక్తి, శ్రద్ధలతో పాల్గొంటున్నారు. మీ అందరికీ నేను పరిపూర్ణమైన ఆశీర్వాదం చేస్తున్నాను. భగవంతుడు మీకు సకల విధాలైన శ్రేయస్సులను ఇవ్వనీ! అధర్మం నుంచి దూరంగా ఉండేట్టు చేయనీ! సదా ధర్మంలోనే ప్రవృత్తి ఉండేట్టు చేయనీ! భగవంతుని పట్ల శ్రద్ధాభక్తులు, గురువు పట్ల శ్రద్ధాభక్తులు ఎల్లవేళలా ఉండేటట్లుగానూ ఎప్పుడూ ఇంకొకరికి ఉపకారం చేయగల భావన ఉండేటట్లుగానూ ఎప్పటికీ ఎవరికీ అపకారం చేయాలనే భావన పుట్టకుండా ఉండేటట్లుగానూ భగవంతుడు మీకు పరిపూర్ణమైన అనుగ్రహం చేయనీ అని ఆశీర్వదిస్తున్నాను."

"ఈనాటి కార్యక్రమంలో చాలామంది పాల్గొన్నారు. విశేషంగా తిరుపతి దేవస్థానం వారి కార్యనిర్వహణాధికారులు వచ్చి తమ గౌరవాన్ని అర్పించారు. వారు మమ్మల్ని తిరుపతికి ఆహ్వానించారు. తిరుపతికి వెళ్ళడమన్నది మాకు కొత్త కాదు. మా గురువులు తిరుపతికి వెళ్ళారు. నేనూ వెళ్ళాను. తిరుపతిలో వందలాది ఏళ్ళుగా- దాదాపు 600 ఏళ్ళకన్నా ఎక్కువ కాలం నుండి శృంగేరి మఠం ఉన్నది. నిన్నటిది



నేటిది కాదు. అన్ని వందల ఏళ్ళుగా శృంగేరి మఠం తిరుపతిలో ఉన్నందువల్ల శృంగేరి మఠానికీ తిరుపతికీ అవినాభావ సంబంధం ఉంది. అందువల్ల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి ఇక్కడికి రావడం మాకు సంతోషం కలిగించింది. అట్లాగే మనదేశంలోని అనేక దేవస్థానాల ప్రసాదాలను ఆయా దేవస్థానాల నిర్వాహకులు పంపి తమ గౌరవాన్ని ప్రకటించారు. వారందరికీ ఆశీర్వాదాలు చేస్తున్నాను. అట్లాగే మఠం శిష్యులు పలురకాల ప్రచురణలు- అత్యంత భక్తితో చేశారు. వారందరికీ ఆశీర్వాదం చేస్తున్నా. ఇంకా మా అధికారులు స్వామివారి చిత్రాలున్న 'జగద్గురు దర్శనం' అనే మూడు గ్రంథాలు తెచ్చారు. అవి శిష్యజనులకెంతో అపేక్షణీయాలు. అట్లాగే 'జగద్గురు వైభవం' అనే పేరుతో దేశంలోని ప్రఖ్యాత విద్వాంసులు విశేషంగా సంస్కృతంలో రాసిన రచనలతో ఒక గ్రంథం ప్రకటించారు. ఇవన్నీ కూడా శిష్యుల శ్రద్ధాభక్తులను సూచిస్తున్నాయి. ఆ శ్రద్ధాభక్తులు ఇతోధికంగా ఉండనీ!

"అదేదో డీవీడీ కూడా తీసుకువచ్చారు. డీవీడీ అంటే అర్థమేమో నాకు తెలియదు- డీవీడీ అంటున్నారు. దానినీ ఆశీర్వదిస్తున్నాను. అన్నిటికీ అందరినీ ఆశీర్వదిస్తున్నాను. నేటి కార్యక్రమం ఇంత అందంగా చక్కగా సాగడానికి మీ అందరి సహకారం కారణమైంది. మీ అందరినీ ఆశీర్వదిస్తూ ఈ ప్రసంగాన్ని ఇక్కడికి ముగిస్తున్నాను. ఆ భగవంతుడు మీ అందరినీ సదా సర్వదా కాపాడనీ!"

"హర నమః పార్వతీపతయే హర హర మహాదేవ!"

ఈ గురువందన కార్యక్రమం తర్వాత జగద్గురువులు శ్రీ భారతీతీర్థ మహాస్వామివారు వేదమంత్రోచ్చారణల నడుమ శ్రీ చంద్రమౌళీశ్వరునికి ప్రత్యేక పూజ చేశారు. రాత్రివేళలలో చేయని ఫలపంచామృత అభిషేకం ఈ పూజలో చేయడం విశేషం. 'గురునివాస్'లో క్రిక్కిరిసిన భక్త కోటికి జగద్గురువులు చేసిన ఈ విశేషపూజ అద్వితీయానందాన్ని కలిగించింది!

**- డా. పి.ఎస్. గోపాలకృష్ణ**
ఆకాశవాణి పూర్వ సంచాలకులు




# భాగ్యదర్శనమ్.. జగద్గురు వందనమ్

**అపూర్వం... అమోఘం... 'నభూతో...' వంటి పదాలు ఆ వైభవాన్ని వర్ణించడానికి చాలవు. అది మహత్తర సన్నివేశం... భక్తిభావం ముప్పిరిగొన్న అలౌకిక స్థితిలో వేలాది మంది భక్తజనులు సాక్షాత్తూ పరమేశ్వరుని ప్రతిరూపులైన జగద్గురు శ్రీచరణులకు సాష్టాంగ ప్రణామ పూర్వకంగా 'గురువందనమ్' సమర్పించిన పవిత్ర ఘట్టం అది.**

**తొ**మ్మిది సంవత్సరాలుగా తెలుగు ప్రజల ఆధ్యాత్మిక, ధార్మిక పరంపరకు ప్రతిరూపంగా నిలుస్తున్న 'దర్శనమ్' అంకిత భావంతో ఏర్పాటుచేసిన అపురూప కార్యక్రమం అది... భాగ్యనగరంలోని లలితకళా తోరణంలో డిసెంబరు 14వ తేదీ సాయంత్రం జరిగిన ఈ సార్వజనిక గురువందన సభకు రాష్ట్రం నలుమూలల నుంచి వేల సంఖ్యలో భక్తులు తరలివచ్చి పూజ్య జగద్గురు శ్రీచరణుల పాదపద్మాలకు అంజలి ఘటించి చరితార్థులయ్యారు. వివిధ సంస్థలు, ప్రముఖులు 'దర్శనమ్'కు వెన్నుదన్నుగా నిలిచి అన్నివిధాలా సహకరించి, కార్యక్రమాన్ని విజయవంతం చేయడంలో నిర్వహించిన పాత్ర వెలకట్టలేనిది. అకుంఠితదీక్ష, సమర్పణాభావనతో 'దర్శనమ్' తలపెట్టిన ఈ ధార్మిక యజ్ఞం నిర్దేశించుకున్న లక్ష్యాలను అధిగమించి జయప్రదమైంది.

'దర్శనమ్' ఆహ్వానాన్ని పెద్ద మనసుతో అంగీకరించి పలువురు ధార్మికవేత్తలు, కవి పండితులు 'గురువందనమ్'లో పాల్గొని జగద్గురు శ్రీచరణుల పట్ల తమ భక్తి ప్రపత్తులు చాటుకున్నారు. సనాతన ధార్మిక వారసత్వాన్ని పాలలో రంగ రించి పసిపిల్లలకు ఆధ్యాత్మిక సంపదను అందిస్తున్న ప్రత్యక్ష పరమేశ్వరీ స్వరూపిణులైన మాతృమూర్తులు మంగళహారతులు, పుష్పాంజలులతో జగద్గురువులకు నీరాజనాలు సమర్పించారు. భారతీయ ధర్మ సంపదలకు మూలాధారాలైన వేదాలను అనుష్ఠించిన పావనమూర్తులైన వేదపండితులు, అధ్యయనం సాగిస్తున్న వేదవిద్యార్థుల మంత్రోచ్చారణలతో గురువందనాన్ని పునీతం చేశారు. జయజయధ్వానాలు, మంగళ వాద్యాల మధ్య అనంతశ్రీవిభూషిత శ్రీశృంగేరి జగద్గురు శ్రీచరణులు లలితకళా తోరణానికి వేంచేశారు. పూజ్య జగద్గురువుల పవిత్ర ఆగమన ఘట్టానికి దర్శనమ్ బృందం అంజలి ఘటించి స్వాగతం సమర్పించింది. వేదఘోష మిన్నంటుతుండగా శ్రీచరణులు, భక్తిభావం ఉట్టిపడుతున్న వేదికపై సమాశీనులయ్యారు. ప్రసిద్ధ సంస్కృత విద్వాంసులు దోర్బల ప్రభాకరశర్మ స్వాగత పత్రాన్ని

# ధర్మం భగవత్ స్వరూపం



జగత్తును రక్షించేదీ, నిలిపేదీ- ధర్మం. ధర్మం ఉన్నప్పుడే భగవంతుడు కూడా ఉంటాడు. ఊరికే విగ్రహాలు నిలిపి, నైవేద్యాలు పెట్టి పూలదండలు వేస్తే భగవంతుడు ఉండడు. 'యతో ధర్మః తతః కృష్ణః' ధర్మం సంరక్షింపబడాలి. 'ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' అని స్వామి వాక్యం. ఆ ధర్మం, ప్రవృత్తి, నివృత్తి అనే శాఖాద్వయంగా ఉంది. ధర్మం ఏమిటో తెలియాలంటే వేదం, పురాణాలు, స్మృతులు విచారించినప్పుడే తెలుస్తుంది. లేకపోతే ధర్మం అధర్మంగా, అధర్మం ధర్మంగా ఆభాసంగా ఉంటుంది. కనుక అటువంటి ధర్మ నిర్ణయం చేయడానికి సదాశివుడు సాక్షాత్తూ కైలాసం నుంచి ఆదిశంకర భగవత్పాదులుగా అవతరించారు. సమస్త మతాలను సమన్వయించారు. సర్వ శృతి స్మృతి పురాణాలను చక్కగా సమన్వయించారు. జీవకోటికి కావలసిన ప్రవృత్తి, నివృత్తి ధర్మాలను నిర్వచించారు. ఆ మహానుభావుడు యోగశక్తితో ప్రపంచమంతా పర్యటించారు. అనేక గ్రంథాలు రాశారు. బ్రహ్మసూత్రాలకు భాష్యం రచించారు. అద్వైత ధర్మాన్ని ప్రవచించారు. ఎంతో చేశారు. అయితే తాను నెలకొల్పిన ధార్మిక పరంపర అనుస్యూతంగా శాశ్వతంగా కొనసాగడానికి నాలుగు వేదాల నుంచి మహావాక్యాలను స్వీకరించి, ఆమ్నాయ పీఠాలను స్థాపించారు. 'తస్య యజురేవశిరః' యజుర్వేదమే వేదపురుషుడి శిరస్సుగా చెప్పడం జరిగింది. అందుకే సకల కర్మకాండలు యజుర్వేద ప్రోక్తంగా నడుస్తాయి. అటువంటి యజుర్వేద మహావాక్యాన్ని స్వీకరించి, దక్షిణ భారతదేశంలో తొలి ఆమ్నాయపీఠంగా తుంగానదీ తీరంలో శారదాంబ ప్రధాన దేవతగా దక్షిణామ్నాయ పీఠాన్ని సాక్షాత్తూ పరమేశ్వరుడైన శ్రీమచ్ఛంకర భగవత్పాదులు ఈ శృంగేరీ మహాపీఠాన్ని స్థాపించారు. ఇక్కడ భాషా, ప్రాంత భేదాలు లేవు. 'నజాతు కామాన్ న భయాన్ న లోభాన్ ధర్మం జస్యాజ్జీవితస్యాపిహేతోః' ఆ ధర్మ సంస్థాపన చేశారు ఆదిశంకరులు. ఆ ధర్మం నిరంతరాయంగా అనుస్యూతంగా సాగడానికి నాలుగువేదాలూ, నాలుగు ఛందస్సులు ప్రధానంగా నాలుగు ఆమ్నాయ పీఠాలను స్థాపించారు. సర్వజ్ఞమూర్తి కనుక ఆ మహనీయుడు ధర్మం కోసం పరిశ్రమించారు. ఏదైనా అంశం వస్తే వీటిలో ధర్మనిర్ణయం చేసే అధికారాన్ని శృంగేరీ జగద్గురువులకు ధారాదత్తం చేశారు. అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్న ఈ పీఠం జగద్గురు పరంపరలో ప్రస్తుత గురువరేణ్యులు ముప్పయి ఆరవవారు. పన్నెండు ఆ వృత్తులకు శంకర స్వరూపం వ్యక్తమవుతుందని పెద్దల మాట. మూడు పన్నెండ్లు ముప్పయి ఆరు కనుక ఈ మహాస్వామివారు సాక్షాత్తూ శ్రీమచ్ఛంకర భగవత్పాదులే. 'శంకర శృంకర స్సాక్షాత్'. పూజ్య మహాస్వామివారు ధర్మనిర్ణయం చేయడానికి కంకణబద్ధులై ఉన్నారు. అఖండమైన తపస్సు, శాస్త్ర పరిజ్ఞానం, అవగాహనా వీరికి పుష్కలంగా ఉన్నాయి. వీరు సకల విద్యాకోవిదులు, వీరు వేదం శ్రుతి, స్మృతులు, శాస్త్రం, ఇతిహాసం, పురాణాల్లో సిద్ధహస్తులు, సమస్త శాస్త్ర పారంగతులు. సాక్షాత్ పరమేశ్వర స్వరూపులు. శారదాంబ ప్రతిరూపులైన ఈ మహనీయుల రాకతో భాగ్యనగరం సర్వసౌభాగ్యనగరమైంది. మనమంతా వారిని దర్శించి ధన్యులమయ్యాం. వారి పాదస్పర్శతో తెలుగు నేల పునీతమైంది. వారు పాదం మోపగానే ఈ సీమలో సమృద్ధిగా వర్షాలు కురిశాయి. వారి ఆగమనంతో ఎక్కడైనా తుష్టి, పుష్టి సిద్ధిస్తాయి. వారు ఇరవయ్యేళ్ళ తర్వాత వేంచేశారు. ఈ విజయయాత్ర వివిధ ప్రాంతాల్లో వారు వెలువరించిన అనుగ్రహభాషణాలు. సమస్త ధర్మ సారాంశాలు... ఒకటేమిటి అన్నీ ఉన్నాయి. వారి బోధనలు స్వీకరిద్దాం. చరితార్థులమవుదాం!

– మల్లాది చంద్రశేఖరశాస్త్రి

సమర్పించగా, గాయక శిరోమణి గంగాధర శాస్త్రి స్వాగత గీతాన్ని ఆలపించారు. గురువందనమ్ ఆహ్వాన సంఘాధ్యక్షులు పివిఆర్‌కె ప్రసాద్ స్వాగత వచనాలతో సభ ప్రారంభమైంది.

ముందుగా తిరుమల తిరుపతి దేవస్థానం ముఖ్య కార్యనిర్వహణాధికారి ఎల్.వి. సుబ్రహ్మణ్యం దంపతులు జగద్గురువుల పద సన్నిధిలో శ్రీవారి శేషవస్త్రం, ఫలప్రసాదాలు సమర్పించారు. రచన టెలివిజన్ సంస్థల అధినేత తుమ్మల నరేంద్ర చౌదరి దంపతులు జ్యోతి వెలిగించి శ్రీచరణులకు అంజలి ఘటించారు. 'నమస్తే తెలంగాణ' పత్రికాధిపతి సి.ఎల్. రాజం దంపతులు భక్తి ప్రపత్తులతో గురువందనమ్ అర్పించారు.

తర్వాత శృంగేరీ జగద్గురు పరంపర వైశిష్ట్యాన్ని వివరిస్తూ ఉద్దండ పండితులు విశ్వనాథ గోపాలకృష్ణ శాస్త్రి, మల్లాది చంద్రశేఖర శాస్త్రి, ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు, ఆకెళ్ళ విభీషణ శర్మ, గండ్లూరి దత్తాత్రేయ శర్మ ప్రసంగాలు భక్తులను ఉత్తేజపరిచాయి. 'దర్శనమ్' సాగిస్తున్న ఆధ్యాత్మిక ప్రస్థానానికి జగద్గురు శ్రీచరణులు




ఆశీరనుగ్రహాలు ప్రసాదించి ప్రోత్సహి స్తున్న తీరును వివరిస్తూ 'దర్శనమ్' బృందం పక్షాన సారథి మరు మాముల వెంకటరమణ శర్మ ఉద్వేగ భరితంగా ప్రసంగించారు.

జగద్గురువులు పవిత్ర ఆగమనానికి నిండు మనసుతో అంజలి ఘటిస్తూ దేవాదాయ శాఖ పక్షాన ప్రముఖ దేవస్థానాల ప్రతినిధులు భక్తి ప్రపత్తులతో శేషవస్త్రాలు, ఫల పుష్పాలను మేళవించి 'గురువందనమ్' సమర్పించుకున్నారు. భారతీయ ధార్మిక వారసత్వాన్ని ముందు తరాలకు పదిలంగా అందిం చాలనే అంకితభావంతో దశాబ్దాలకు పైగా కర్తవ్యదీక్షతో ఉద్యమిస్తున్న పలువురు ప్రముఖులు, వివిధ జీవన రంగాల ప్రతినిధులు శ్రీచరణులకు 'గురువందనమ్' అర్పించి పునీతు లయ్యారు. మెదక్ జిల్లా తొగుట రాంపురం శ్రీ గురుమదనా నంద శారదా పీఠాధిపతి శ్రీ మాధవానంద స్వామీజీ, అన్నోజిగూడ గాయత్రీ పీఠాధిపతులు శ్రీ గాయత్రీ తత్వానందరుషి, జగద్గురువుల సన్నిధిలో ఆశీనులై సనాతన ధర్మ ప్రత్యేకతను చాటి చెప్పారు.

ప్రసిద్ధ పండిత కవి జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు జానపద బాణీలో సమర్పించిన "నను మరసిపోకు స్వామీ

## శ్రీచరణులు సాక్షాత్ ఆదిశంకరులు



శ్రీమచ్ఛంకర భగవత్పాదులు ప్రబోధించిన మార్గం సనాతన ధర్మం. ఈ ధర్మం అందరి మేలు కోరుతుంది. దీనికి స్వార్థం లేదు. భేదం లేదు. మన జగద్గురువులకూ శ్రీమచ్ఛంకర భగవత్పాదులకూ విశేష సామ్యం ఉంది. ఆదిశంకరులు నర్మదానదీ తీరాన శ్రీమద్గోవింద భగవత్పాదులను ఆశ్రయిస్తే, జగద్గురు శ్రీచరణులు క్షిప్రానదీ తీరంలో శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వామివారి అనుగ్రహం పొందారు. బాల్యంలోనే ఆదిశంక రులు సకల ధర్మసారాన్ని ఆకళింపు చేసుకున్నారు. జగద్గురువులు పదేళ్ళ పసిప్రాయంలోనే తమ గురువర్యు లతో సంస్కృతంలో అనర్గళంగా మాట్లాడి, వారి అభిమానపాత్రు లయ్యారు. ఈ క్రమంలో గురువరే ణ్యుల అనుగ్రహం పొంది సకల విద్యలు వారివద్దే అభ్యసించి సన్యాసదీక్ష స్వీకరించారు. వారి మార్గదర్శనంలో సనాతన ధార్మిక చైతన్యం ప్రకాశిస్తోంది. ఆ మహనీయుల అనుగ్రహ భాషణం కోసం వేలాది మంది నిరీక్షిస్తున్నారు. ఈ తరుణంలో నేను జగద్గురువులకు సాష్టాంగ ప్రణామాలు ఆచరిస్తూ విరమిస్తున్నాను.

**- ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు**

## 'దైవం మానుష రూపేణా...'



ఈరోజు విశిష్టమైనది... గురువులకు వందనం సమ ర్పించి మనం చరితార్థులమైన రోజు... 'దేవదేవుని దర్శించు దినము దినము' అంటాడు శ్రీమద్భాగవతంలో ప్రహ్లాదుడు... ఆ దేవదేవుడే దక్షిణామూర్తిగా శ్రీమచ్ఛంకర భగవత్పాదులుగా, శ్రీ విద్యారణ్యస్వామివారిగా అవతరించారు. వారి పరం పరగా ప్రస్తుత జగద్గురువులు మనల్ని ఉద్ధరించడానికి ఆకృతి దాల్చారు. పూజ్య జగద్గురు వులు సాక్షాత్తూ ఋష్యశృంగ పురవరాధీశులు. వారి పాదం మోపిన చోట వర్షాలు సమృద్ధిగా కురుస్తాయి. కలియుగ దైవం వేంచేసిన తిరుమల క్షేత్రాన్ని ఆ మహనీయులు సందర్శించారు. వారి ఆగమనానికి ఒకరోజు ముందే సమృద్ధిగా వర్షం కురిసింది. నీటి కొరతతో అలమటిస్తున్న తిరుమల ఏడాదికాలం పాటు సరిపడే జలసిరితో కళకళలాడింది. పూజ్య జగద్గురువులు కరుణా సముద్రులు. వారి కృపాదృష్టిలో మనం ధన్యుల మవుదాం. ఆ మహనీయుల ఆగమనంతో తెలుగునేల పావనమైంది.'

**- బాచంపల్లి సంతోష్‌కుమార్ శాస్త్రి**

## 'న గురోరధికమ్'

మానవులుగా పుట్టిన వారికి తప్పనిసరిగా చేయాల్సిన కొన్ని బాధ్యతలు ఉంటాయి. వీటిలో అతి ముఖ్యమైనది గురువందనం. ఈ కార్యాచరణ మహత్తరమైంది. సకల



అభ్యుదయాలు కలిగిస్తుంది. గురుభక్తి ద్వారా సమస్త శుభాలూ చేకూరుతాయి. సద్గురువును ఆశ్రయిస్తేనే మనం సన్మార్గంలో జీవితాన్ని సార్థకం చేసుకోగలుగుతాం. ఎన్ని తీర్థాల్లో మునిగినా, ఎన్ని దానధర్మాలు చేసినా గురుభక్తి లేకపోతే ప్రయోజనం శూన్యం. గురువు కన్నా మిన్న ఏదీ లేదని ధర్మశాస్త్రాలు ఘోషిస్తున్నాయి. భక్తి, జ్ఞానం, వైరాగ్యం, కర్మకాండలున్నప్పటికీ జ్ఞానం ఒక్కటే అధికారికంగా శోభిస్తుంది. అంటే కర్మకాండలు అవసరం లేదని కాదు. ఇందుకు గురు అనుగ్రహం కావాలి సద్గురువును పొందిన శిష్యులు ధన్యులు. గురుభక్తి మనలను ఉద్ధరించి సక్రమ మార్గంలో నడిపిస్తుంది. దైవభక్తి ఏ స్థాయిలో ఉందో గురుభక్తి అదేస్థాయిలో ఉన్నవారి విద్య, జ్ఞానం శోభిస్తుంది. వారి జన్మచరితార్థమవుతుంది. అటువంటి గురువుకు వందనాలు అర్పించడానికి 'గురువందనమ్' ఏర్పాటుచేసిన కార్యకర్తలను మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.

**- విశ్వనాథ గోపాలకృష్ణ శాస్త్రి**

నువ్వు శృంగేరికి పోయి! ఆడనుంచె నాకూ నీ దీవెనలను ఇయ్యి!!" గీతం భక్తజనులలను ఉర్రూత లూగించింది.

శృంగేరీ జగద్గురువుల విజయయాత్ర రాష్ట్ర సమితి అధ్యక్షులు ఆర్. ప్రభాకరరావు, శంకర మఠ స్వాగత సమితి అధ్యక్షులు ఎం.వి.ఎస్ ప్రసాద్‌లు మార్గదర్శనం అందించి 'దర్శనమ్' బృందాన్ని నడిపించారు. ధాత్రీ కమ్యూనికేషన్స్ పక్షాన మధుసూదన్, రచన టెలివిజన్స్ సంస్థ పక్షాన తుమ్మల నరేంద్ర చౌదరి, శ్రీవేంకటేశ్వర భక్తి చానెల్ ముఖ్య కార్యనిర్వహణాధికారి ఎల్.వి. సుబ్రహ్మణ్యం, కార్యనిర్వహణాధికారి పాలకురి మధుసూదనరావు, ప్రత్యక్ష ప్రసారంతో గురువందనాన్ని ప్రపంచానికి ప్రదర్శించిన శ్రద్ధాసక్తులు వర్ణించడానికి మాటలు చాలవు. 'గళ మురళి'



ఈలపాట శివప్రసాద్ సమర్పించిన శాస్త్రీయ కచేరి ఆహూతులను అమితంగా ఆకట్టుకుంది.

వివిధ పత్రికలు, ప్రసార మాధ్యమాలు 'గురువందనమ్' ప్రచార బాధ్యతలను స్వచ్ఛందంగా స్వీకరించి ప్రకటనలు, ప్రోమో ప్రదర్శనలతో భక్తులకు ధార్మిక ప్రేరణలు కలిగించి లలితకళా తోరణానికి రప్పించాయి. శ్రీశృంగేరీ శారదా పీఠం ముఖ్యకార్యనిర్వహణాధికారి గురుసేవాధురీణ పద్మశ్రీ వి.ఆర్. గౌరీశంకర్, శృంగేరీ నుంచి ప్రత్యేకంగా విచ్చేసి, గురువందనమ్ లో పాల్గొన్నారు. శృంగేరీ పీఠం, జగద్గుర పరంపర విశిష్టతలను ప్రతిబింబించే ప్రామాణిక సమాచార సర్వస్వం 'గురువందనమ్' ప్రత్యేక సంచికను జగద్గురు శ్రీచరణులు ఆవిష్కరించి ఆశీరనుగ్రహాలు ప్రసాదించిన సందర్భం 'దర్శనమ్' బృందానికి కర్తవ్య దీక్షను



## కవితా వందనమ్



శ్రీకరముల్ జగజ్జన వశీకరముల్
శ్రితకోటి హృత్ సుధా
శీకరముల్, ప్రమోద రస శేఖరముల్
చతురాగమైక శో
భాకరముల్ నమస్య జన భాగ్య
సమీకరముల్ సశారదా
శ్రీకర చంద్రమౌళి సురశేఖర దృక్కులు
మమ్మునోముతన్

నరజన్మంబు ప్రశస్తమౌట నరుడే నారాయణుండై తమో
హరణోద్యమునన్ కృషిన్ సలిపి మాయాజాల విచ్ఛేదనా
సరణిన్ కాంచు జగద్గురు స్థితిని సాక్షాత్ శంకరాచార్య సు
స్థిర కీర్తి ప్రతిబింబమూర్తిగనరే శ్రీ భారతీతీర్థులన్

పలికిన పల్కులెల్ల యదపట్టున పుట్టిన పుట్టతేనె వా
కలు శ్రుతి శాస్త్ర సూక్తి పరికల్పిత దివ్యకళావబోధ రే
ఖలు, జననాంతర స్థిత సఖత్వ సముద్ధరణ ప్రభావ జే
తలు, నడిపించుగాత మము ధర్మపథంబున ధన్యతన్గనన్

స్వార్థస్పర్శ రవంతయేని కలలోనైనన్ కనన్రాదు స
ర్వార్థ ప్రోత సదాశివార్చనము నిత్యధ్యేయమై జీవితా
న్వర్థాచార సమాచితాచరణ లక్ష్యంబైన శ్రీ భారతీ
తీర్థస్వామి కృపాకటాక్షములు ప్రీతిన్ మమ్ము రక్షించుతన్

కామంబున్నది క్రోధమున్నది పురాకర్మంబు తోడున్నదీ
సామగ్రిన్ గురుదక్షిణాకృతిగ వాత్సల్యంబుతో కొమ్ము సం
క్షేమాభ్యున్నతినిమ్ము తత్కృపను శృంగేరి ఫలాధిష్ఠిత
శ్రీమృత్యుంజయ పాదసేవన కళా సిద్ధి ప్రియంభావుకా!

ఇది నా ఒక్కని గుండె స్పందనము కాదిందున్న వారందరున్
హృదయాశావధి కూడుకున్నయది స్వామీ! భక్త పక్షంబునన్
చదువన్ జాలు అదృష్టమబ్బెను భవత్ సంకల్ప సాక్ష్యంబుగన్
కుదిరెను మాకు త్వదీయ దర్శనము నీకున్ మా నమోవాకముల్

- శతావధాని శిరోమణి గండ్లూరి దత్తాత్రేయ శర్మ

## నను మరిసిపోకు సామీ...



నను మరిసిపోకు సామీ
ఆ శృంగేరికి పోయి
ఆడనుంచె నాకు
నీ దీవెనలందీయీ ॥ నను ॥
కూడవచ్చి తపసు చేసె
తాహతు లేనోన్ని
తాడుతో కట్టేసిన
లేగదూడలాంటోన్ని ॥ నను ॥

నీ ఫోటో చూడగానే నాకెంతో సంబరం
ఆటుపోటు తగ్గిపోయి మనసంతా సంతసం
ఫోటోలో ఉన్నట్టే మాటలోన గూసోని
పోసుకోలు ఊసులన్ని ఆపేసేలా సెయ్యి ॥ నను ॥

శృంగేరి చుట్టూతా బొంగరంలా తిప్పు
అమ్మోరు పెట్టుకునే ఉంగరంలా సెయ్యి
నేనడిగేదేంది సామీ నీకు తెల్వదాయేమి
ఇవ్వకుండెట్టుంటావు నా పిచ్చిగాని ॥ నను ॥

బందాలు లేనోడితో బందం పెట్టుకుంటి
బాదరబందీలన్ని అదేపనిగ సెబుతుంటి
నన్ను నా తీరు సూసి నవ్వుకోకు సామీ
నిన్ను నవ్విస్తే నాకదే గొప్ప సామీ ॥ నను ॥

ఆసీసు తప్పా ఏ లప్పా నిన్నడగనోన్ని
తిన్నగ ఉంట తప్ప తిరకాసేలేనోన్ని
అప్పుడప్పుడు నేనొత్తా ఆడ దరిసెనం ఇవ్వు
ఎప్పుడూ ఎదనుండి ఏదో మంచి సెబుతుండు ॥ నను ॥

- జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు

ఉపదేశించింది.

జగద్గురువుల ఆంతరంగిక కార్యదర్శి కృష్ణమూర్తి ఎప్పటి కప్పుడు తమ అమూల్యమైన సలహాలు, సూచనలతో 'దర్శనమ్' బృందానికి మార్గదర్శనం అందించి 'గురువందనమ్' కార్యక్రమం విజయవంతంగా పూర్తికావడంలో తోడ్పాటు అందించారు.

హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ ఎల్. నరసింహారెడ్డి, ప్రభుత్వ ప్రత్యేక ప్రధాన కార్యదర్శి ఐవైఆర్ కృష్ణారావు, దేవాదాయ శాఖ సంచాలకులు జి. బలరామయ్య, విశ్రాంత ఐపిఎస్ అధికారి ఎన్‌వి. గోపీనాథరెడ్డి, ఆంధ్రభూమి సంపాదకులు ఎం.వి.ఆర్. శాస్త్రి, ఆధ్యాత్మిక కార్యక్రమాల్లో ముందుండి నడిపించే ప్రముఖ పత్రికా రచయిత, విశ్లేషకులు వనం జ్వాలా నరసింహారావుతో సహా పలువురు ప్రముఖులు, ధార్మిక జీవనులు 'గురువం దనమ్' వేదిక

## ధార్మిక మార్గదర్శనం అనుగ్రహించండి

తొమ్మిదేళ్ళుగా ఆధ్యాత్మిక ప్రస్థానం సాగిస్తున్న దర్శనమ్‌కు పూజ్య జగద్గురువులు మహత్తర అవకాశాన్ని ప్రసాదించి ఆశీర్వదించారు. శ్రీచరణులు చెన్నైలో ఉండగా మేం వెళ్ళి 'గురువందనమ్' నిర్వహణకు అనుమతించాలని ప్రార్థించాం. వారు అంగీకరించి ఆశీర్వదించారు. వారి పవిత్ర మార్గదర్శ నంలో సనాతన ధర్మవ్యాప్తి కోసం దర్శనమ్ అంకితభావం తో కృషి చేస్తోంది. శ్రీచరణుల ఆశీరనుగ్రహాల బలంతో ఈ కార్యక్రమానికి శ్రీకారం చుట్టారు. మా శక్తికి మించి ఏర్పాట్లు చేయడంలో ఎందరో మహానుభావులు బాసటగా నిలిచారు. ఈ సందర్భంలో సనాతన ధర్మ సంస్కృతుల పరిరక్షణలో అనుసరించాల్సిన మార్గాన్ని ప్రబోధిస్తూ మా అందరికీ కర్తవ్యాన్ని అనుగ్రహించాలని పూజ్యశ్రీచరణులను త్రికరణ శుద్ధిగా ప్రార్థిస్తున్నాం.

**- 'దర్శనమ్' శర్మ**

## ధర్మోద్ధరణకు ప్రమిదలా...

**తి**రుమల తిరుపతి దేవస్థానం ఆధ్వర్యంలో ఉన్న వేదాధ్యయన సంస్థలో ఉన్నతోద్యోగిగా ఉన్నాను. పివిఆర్‌కె, ఉప్పలూరు సలహా మీద శిష్టా చార వేదాధ్యయన సంస్థగా వేద ధర్మోద్ధరణకు ప్రాజెక్టు నెలకొల్పేరో దాన్ని ఐవిఆర్ కృష్ణారావు, ఎల్.వి సుబ్రహ్మ ణ్యం సమున్నత దీక్షతో కొనసా గిస్తున్నారు. అయితే వారు ఉద్యోగించిన కాలం కృతయు గం. కాని ఇది కలియుగం. ఇప్పుడు కూడా 400 వేదపారాయణ స్కీములు పూరణ చెయ్యటం, కనుమూరి బాపిరాజుగారు ఆమోదించడం జరిగింది. ఈ వేదధర్మదీక్షలో సమిధను కాకపోయినా ప్రమి దనై వెలుగుతుండడం నా భాగ్యం. స్వామివారి సమక్షంలో అధిక ప్రసంగం చెయ్యవద్దని పెద్దల ఆదేశం. ఆజ్ఞా గురూణాం హ విచారణీయః. వారికి సాష్టాంగ ప్రణామం చెయ్యాలని వచ్చాను. దానికి అర్హతను ప్రసాదించమని వారిని వేడుకుంటున్నాను.

**- ఆకెళ్ళవిభీషణ శర్మ**

నలంకరించి శ్రీచరణుల ఆశీరనుగ్రహాలు పొందారు.

మహత్తర యజ్ఞంలా 'గురువందనమ్' నిర్వహించాలనే ఆకాంక్షతో మూడునెలల ముందునుంచి 'దర్శనమ్' బృందం అహెూరాత్రాలు పరిశ్రమించింది. చెన్నైలో బసచేసిన సందర్భం లో జగద్గురు శ్రీచరణులను దర్శించుకుని అనుమతి ప్రసా దించాలని సవినయంగా ప్రార్థించింది. 'దర్శనమ్' బృందం సమర్పించిన అభ్యర్థనకు శ్రీచరణులు ఆమోదపూర్వకంగా ఆశీరనుగ్రహాలు అందించి మంత్రాక్షతలు ప్రసాదించారు. జగ ద్గురువుల ఆశీర్బలం, మంత్రాక్షతల మహిమతో 'గురు వందనమ్' నిర్వహించి 'దర్శనమ్' చరితార్థమైంది.

'గురువందనమ్' సంకల్పించిన నాటినుంచి అంకితభావంతో 'దర్శనమ్' బృందం కార్యాచరణకు శ్రీకారం చుట్టి ముందుకు సాగింది. ఈ పవిత్ర ధార్మిక కార్యక్రమాన్ని నిర్వహించడంలో అనేకమంది తమవంతు బాధ్యతను స్వచ్ఛందంగా నిర్వహించి కృతార్థులయ్యారు. ఆర్థికంగా హార్దికంగా సేవాదృక్పథంతో బాధ్యతలు నెరవేర్చిన ఎందరో మహానుభావులకు 'దర్శనమ్' భక్తిపూర్వకంగా అంజలి ఘటిస్తోంది. నిర్వహణాపరంగా ఎదురైన ఆటంకాలను అధిగమించడంలో శ్రీచరణుల ఆశీరనుగ్రహాలు 'దర్శనమ్' బృందానికి కొండంత అం డగా నిలిచాయి. అడుగడుగునా తోడ్ప డి ప్రోత్సహించిన



అనేకమంది పెద్దలు, ధార్మిక శ్రేయోభిలాషుల సేవలను 'దర్శనమ్' కలకాలం పదిలంగా గుర్తు చేసుకుంటూ ముందుకు సాగుతోంది. ఈ క్రమంలో ప్రస్తావనకు నోచుకోకుండా పోయినా, నిండు మనసుతో మన్నించాలని 'దర్శనమ్' బృందం సవినయంగా వేడుకుంటున్నది.

## 'గురువందనమ్'

'గురువందనమ్' కార్యక్రమంలో శృంగేరి జగద్గురు మహాసంస్థానం శ్రీ శారదాపీఠం విశిష్టతపై సప్రమాణ సమాచార సర్వస్వంగా ఒక సంచికను ప్రచురించాలని 'దర్శనమ్' సంకల్పించింది. ఇందులో పూజ్య శ్రీచరణుల బోధనలతో పాటు వివిధ కోణాల్లో శృంగేరీ అంశాలను ఆవిష్కరించేందుకు శక్తివంచన లేకుండా సమష్టి కృషి కొనసాగింది. ఆకాశవాణి విశ్రాంత సంచాలకులు పి.ఎస్. గోపాలకృష్ణ, వరిష్ఠ పాత్రికేయ రచయితలు ప్రసాదవర్మ కామఋషి, బాచంపల్లి సంతోష్‌కుమార్‌శాస్త్రి, ఎం. దత్తాత్రేయ శర్మ, 'శరదిందు' అష్టకాల రామ్మోహన్‌ల సారథ్యంలోని సంపాదకమండలి ఈ కార్యాన్ని నిర్వహించింది. పలువురు కవి, పండితులు తమ రచనలు సకాలంలో అందించి 'గురువందనమ్' సర్వాంగ శోభితంగా రావడానికి తోడ్పడ్డారు. అపురూపమైన ఫోటోలు, రేఖాచిత్రాలు ఈ సంచికకు వన్నె తెచ్చాయి. మహత్తర యజ్ఞంలా సాగిన ఈ కార్యాచరణలో ప్రత్యక్షంగా, పరోక్షంగా ఎందరో సహకరించారు. అందరి తోడ్పాటు, భాగస్వామ్యంతో 'గురువందనమ్' ఆశించిన స్థాయిలో వచ్చింది. పూజ్య జగద్గురువుల కరకమలాల ద్వారా ఆస్తికలోకానికి చేరుకుంది.

**బాసటగా నిలిచిన...**

'గురువందనమ్' నిర్వహణలో అన్నివిధాలా బాసటగా



నిలిచి ప్రోత్సహించిన వారెందరో...! వారి భాగస్వామ్యం, తోడ్పాటుతోనే 'దర్శనమ్' లక్ష్యం అంచనాలకు మించి నెరవేరింది. వేద గాయత్రీ అగ్రహారం అధినేత యల్లాప్రగడ ప్రభాకరశర్మ సనాతన ధర్మం కోసం శక్తివంచన లేకుండా చేయూత అందిస్తున్న క్రమంలోనే 'గురువందనమ్' నిర్వహణలో ఔదార్యాన్ని ప్రదర్శించి సహకరించారు. ఇంకా ఎందరో అన్నివిధాలా సహకరించారు, విద్యుక్త ధర్మంగా కర్తవ్యాన్ని నెరవేర్చారు. రిద్ధి ఈవెంట్స్ అధినేత అడ్డా శ్రీనివాస్, వారి బృందం అపూర్వ స్థాయిలో వేదిక రూపొందించి తీర్చి దిద్దారు. సౌండ్, లైటింగ్ బాధ్యతను గణేశ్‌శర్మ నిర్వహించారు. వీణా డిజిటల్స్ అధినేత విజయ్ తమ బృందంతో ఆద్యంతాలు చక్కని తోడ్పాటునందించారు. లలితకళా తోరణంలో ఎందరెందరో నడుంకట్టి తోడ్పడ్డారు. వారందరి కృషి ఫలితం గానే జగద్గురువుల విజయయాత్రలో 'గురువందనమ్' అపురూప సన్నివేశంగా నిలిచిపోయింది.

ఇది ధర్మజ్యోతి కాంతి పుంజాలతో తెలుగు సీమను ప్రభావితం చేయాలనే చిన్న ప్రయత్నం... ఇందులో ప్రత్యక్షంగా పరోక్షంగా పరిశ్రమించిన ప్రతీ ఒక్కరికీ 'దర్శనమ్' సవినయ వందనమ్.

**- 'శరదిందు'**







# శంకరః శంకరస్సాక్షాత్

"శ్రుతి స్మృతి పురాణానామాలయం కరుణాలయం
నమామి భగవత్పాద శంకరం, లోకశంకరమ్"

భగవంతుని అవతార ప్రయోజనాన్ని గురించి సాక్షాత్తూ భగవంతుడైన శ్రీకృష్ణ పరమాత్మే 'యదాయదాహి ధర్మస్య గ్లానిర్భ వతి భారతః అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్' అన్నారు. అంటే ఎప్పుడు ధర్మం క్షయమై అధర్మం అధికమవుతుందో అప్పుడు తాను జన్మిస్తానని చెప్పారు. "శివాయ విష్ణు రూపాయ విష్ణవే శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయగ్ం శివః" అంటే- వచనాన్ననుసరించి శివకేశవులకు భేదం లేదు కాబట్టి సదాశివుడు కూడా భక్తరక్షణ, దుష్టశిక్షణ కోసం అవతరిస్తాడు. అవతారాలు ఆరు విధాలు. అంశావతారం, అంశాంశావతారం, కళావతారం, ఆవేశావతారం, పూర్ణావతారం, పరిపూర్ణావతారం. అయితే భగవంతుని అనేక అవతారాల్లో జ్ఞానదాతగా అవతరించడం మిక్కిలి శ్రేష్ఠం. శ్రీ మహావిష్ణువు జ్ఞానప్రదాతగా, హయగ్రీవ దత్తాత్రేయ రూపాలతో అవతరింపగా, సదాశివుడు దక్షిణామూర్తి రూపంతో అవతరించాడు. నలుగురు శిష్యులతో శంకరులు కలియుగంలో జ్ఞానదాతగా అవతరిస్తారని పురాణాలు వివరించాయి. ఆ లోకశంకరుల దివ్య చరిత్రను తెలుసుకోవాలంటే శ్రీమచ్ఛంకర శిష్యులు రాసిన శంకరచరిత్రలను చదవాలి. అయితే ఆ చరిత్రలన్నీ లభించడం లేదు. కానీ శ్రీ విద్యారణ్య విరచితమైన 'శంకర దిగ్విజయ' గ్రంథంలో ప్రాచీన శంకర విజయముల సారం ఉన్నట్టు తెలుస్తోంది.

ఒకసారి దేవతలు కైలాసానికి వెళ్లి పరమేశ్వరునికి సాష్టాంగ ప్రణామం చేసి ఈ విధంగా వేడుకున్నారు. ఓ పరమేశ్వరా! ఈ కలియుగంలో భూమి అంతా బౌద్ధమతస్థులతో, నాస్తికులతో నిండిపోయింది. వారి వల్ల వర్ణధర్మాలు, ఆశ్రమధర్మాలు లుప్తమైపోతున్నాయి. వేదనింద చేస్తున్నారు. సంధ్యావందనాదుల్ని ఆచరించేవాళ్లు లోపిస్తున్నారు. యజ్ఞం పట్ల విముఖతతో ఉన్నారు అని అనేక విధాలుగా వారి బాధల్ని విన్నవించారు. అప్పుడు శివుడు వారి మొరవిని మీ కష్టాలు తొలగించి మీ కోరిక నెరవేరుస్తానని చెప్పారు.

దుష్టాచార వినాశం ధర్మస్థాపన చేయడం కోసం వ్యాసభగవానుని బ్రహ్మసూత్రాల్ని సరైన అర్థ నిర్ణయం చేయడానికి తాను శంకర యతీంద్రుడనే పేరుతో భూలోకంలో జన్మిస్తానని చెప్పారు. నాలాగానే మీరు కూడా మనుష్య శరీరులై నన్ను అనుసరిస్తారని, మీ అభీష్టం సిద్ధిస్తుందని చెప్పారు. అప్పుడు శివుని కుమారుడైన కుమారస్వామి భట్టపాదుడు అనే పేరుతో అవతరించి జైమిని ముని ప్రణీతమైన పూర్వమీమాంస సూత్రాలకు భాష్యాన్ని రాశారు. ఇంద్రుడు సుధన్వ మహారాజుగా అవతరించాడు. సుధన్వుని రాజ్యంలో భట్టపాదుడు ప్రవేశించి ముందుగా బౌద్ధుల్ని జయించి వైదిక మార్గాన్ని స్థాపించాడు.

ఇదిలావుండగా కేరళ దేశంలో పూర్ణానదీ తీరంలో కాలటి అనే అగ్రహారం ఉంది. కాలరూపుడైన ఈశ్వరుడు



సంచరించే భూమి కాబట్టి దానికి కాలటి అనే పేరు వచ్చింది. ఆ అగ్రహారంలో విద్యాధిరాజు అనే మహాపండితుడు ఉండేవాడు. ఆయన భార్య ఆర్యాంబ వారికి చాలాకాలం వరకు సంతానం కలగలేదు. పరమేశ్వరుని ఆరాధించగా స్వామి కలలో ప్రత్యక్షమై సకల సద్గుణ సంపన్నుడైన, సర్వజ్ఞుడైన, అల్పాయుర్దాయం గల ఒక కుమారుడు కావాలా? లేక విపరీత బుద్ధుల గల మూర్ఖులు, దీర్ఘాయుర్దాయం గల అనేకమంది పుత్రులు కావాలా అని అడిగాడు. సర్వజ్ఞుడైన ఒక కుమారుడు చాలని ప్రార్థింపగా పరమేశ్వరుడు అలాగేనని అనుగ్రహించాడు. ఆర్యాంబకు శివగురువు తన స్వప్న వృత్తాంతాన్ని తెలియజేశాడు. ఆమె గర్భవతి అయింది. ఒక శుభముహూర్తంలో ఆర్యాంబ శంకరుణ్ణి ప్రసవించింది.

ఆ సమయంలో అద్వైత మతం కంటే భిన్నమైన ద్వైత, విశిష్టాద్వైత మతాల, బౌద్ధాది మతాలకు చెందిన ఆచార్యుల చేతిలో ఉన్న వారి వారి మతాల్ని ప్రతిపాదించే గ్రంథాలు జారి క్రిందపడ్డాయి. ఉపనిషద్దేవతలు సంతోషించి తమ ఉపనిషద్వాకములకు సరైన అర్థాన్ని చెప్పగల మహానుభావుడు జన్మించాడని ఎంతో సంతోషించారు. తాను రాసిన బ్రహ్మసూత్రాలకు అర్థ నిర్ధారణ చేయగల సమర్థుడు జన్మించాడని వ్యాసభగవానుడు కూడా ఆనందపడ్డాడు. శంకరునికి బాల్యం వచ్చిన తరువాత దేవతలు ఈశ్వరాజ్ఞ మేరకు పండితులు, శ్రోత్రియులైనవారి ఇళ్లలో పుట్టారు.

శ్రీ మహావిష్ణువు విమలుని కుమారునిగా పద్మపాదుడనే పేరుతోను, వాయుదేవుడు ప్రభాకరుని కుమారుడుగా హస్తా మలకుడుగా, బ్రహ్మదేవుడు మండన మిశ్రుడు తర్వాత సురేశ్వ రుడుగా, బృహస్పతి ఆనందగిరిగా, అరుణుడు సనందనుడుగా, వరుణదేవుడు చిత్సుఖాచార్యుడుగా ఆవిర్భవించారు. ఇతర దేవతలు కూడా యధోచితంగా జన్మించి భగవత్పాద కృపకు పాత్రులయ్యారు. సరస్వతీదేవి దుర్వాసముని శాపంతో శోణానదీతీరంలో విప్రుని ఇంట సమస్త వేదశాస్త్రాలు తెలిసిన భారతి లాగా 'ఉభయ భారతి' అనే పేరుతో పుట్టింది. అయిదో సంవత్సరంలో శంకరునికి ఉపనయమైంది. ఏ విద్యనైనా ఒక్కసారి చెప్పగానే శంకరుడు గ్రహించేవాడు.

శంకరుడు బాల్యంలో గురుకులంలో చదువుకునేటప్పుడు ఒకనాడు బిక్ష కోసం ఒక బీద బ్రాహ్మణుని ఇంటికి వెళ్లాడు. అతని ఇల్లాలు శంకరునికి బిక్ష పెట్టడానికి ఏమీలేక ఒక ఉసిరికాయని ఇచ్చింది. శంకరులు కనకధారాస్తవంతో లక్ష్మీదేవిని ప్రార్థించి కలకామలక వృష్టిని కురిపించి వారి దారిద్ర్యాన్ని పోగొట్టాడు. తల్లి ఆర్యాంబ వివాహం చేసుకోమని కోరగా, సంసారాన్ని అంగీకరింపక ఆమెను ఒప్పించి కొన్ని రోజుల తరువాత మళ్లీ వస్తానని చెప్పి వేదాంత విద్యా ప్రతిష్ఠాపన కోసం బయలుదేరాడు. గోవింద భగవత్పాదుల్ని ఆశ్రయించారు. యోగశక్తితో వ్యాకరణాన్ని పతంజలి దగ్గరనుంచి గ్రహించారు. వ్యాసభగవానుని దర్శించి, తాను రచించిన భాష్యాన్ని వినిపించి 32 సంవత్సరాల ఆయుర్దాయం కలిగేటట్టు వరం పొందారు.

– ఆచార్య ఎలవర్తి విశ్వనాథరెడ్డి
తెలుగు శాఖ



# ధర్మాచరణ వల్లే శ్రేయస్సు

**'గురువందనమ్'లో శ్రీచరణుల అనుగ్రహభాషణం**

వరమభయముదారం పుస్తకం చాక్షహారం
మణివలయమనోజ్ఞైః పాణిపద్మైర్దధానా ।
సితవసనలలామా కున్దముక్తాభిరామా
వసతు శశినిభాస్యా వాచి వాగ్దేవతా నః ॥

"ఈ లోకంలో కనపడే 84 లక్షల జీవరాశుల్లో మనుష్యుడే అత్యంత శ్రేష్ఠమైనటువంటి వాడని శాస్త్రములలో స్పష్టంగా చెప్పబడి ఉన్నది. ఎందుకని మనిషికి ఈ గొప్పతనం వచ్చింది. మిగతా ప్రాణుల్లో లేనటువంటి ఏ వైశిష్ట్యం మనిషిలో ఉన్నది అనే విషయాన్ని మనం కొద్దిగా ఆలోచించాలి. సామాన్యంగా చూస్తే ప్రాణుల వ్యవహారానికి, మన వ్యవహారానికి ఎక్కువ తేడా కనిపించడం లేదు. శంకరుల వారు తమ భాష్యంలో శెలవిచ్చారు.

ప్రాణుల వ్యవహారం మన వ్యవహారం సమానంగా ఉంది. ఎలాగని అంటే ప్రాణులకు ఎవరైనా ఆహార పదార్థాలు తీసుకుపోతే వాటి వెంట పడతాయి. ఎవరైనా కొట్టడానికి పోతే పరుగెత్తుతాయి. మనం కూడా ఎవరన్నా మనకేదన్నా ఇద్దామని వస్తే వాళ్ళ వెంటపడుతున్నాం. మనని కొట్టడానికి వస్తే పరుగెత్తుతున్నాం. ఈ విధమైన వ్యవహారాన్ని చూస్తే పశువులకు, మనకు ఈ విధమైన తేడా కనిపించకపోయినా మనిషి మాత్రం చాలా ఉత్కృష్టుడు, శ్రేష్టుడు అని దేన్నిబట్టి శాస్త్రం చెప్పింది అనేటటువంటి ప్రశ్నకు ఒక్కటే జవాబు ఏది అనంటే మనిషికి ఉండేటటువంటి ఒక యోగ్యత ప్రాణులకు లేదు. ఆ ఒక్క యోగ్యత ప్రాణులకు లేనందువల్ల వాటన్నిటికంటే మనుష్యుడు శ్రేష్ఠుడు అని శాస్త్రం చెప్పింది.

ఏమిటా యోగ్యత? ప్రాణుల్లో లేనటువంటి యోగ్యత ఏమిటి మనుష్యుల్లో ఉన్నది అని మనం అడిగితే దానికి జవాబు మనుష్యుడికి ధర్మాన్ని ఆచరించడానికి యోగ్యత అనేది ఉన్నది. ఆ యోగ్యత ప్రాణులకు లేదు. ధర్మాన్ని

ఆచరించేటటువంటి యోగ్యత మిగిలిన ఏ ప్రాణులకు లేనందువల్ల ఆ యోగ్యత మనుషుడు ఒక్కడికే ఉన్నందువల్ల మనుష్యుడు ఉత్కృష్టుడు అని శాస్త్రం చెప్పింది. కాబట్టి ఆ ప్రాణుల్లో లేనటువంటి యోగ్యత ఏదైతే ఉందో దానిని మనం ఉపయోగించు కోనట్లయితే ఆ ప్రాణులకు మనకు ఏమీ తేడా లేదు. కాబట్టి వాటి కంటే మనం ఉత్కృష్ట అని పించుకోవాలనంటే మనం తప్పకుండా ధర్మాచరణం చేయాలి. అప్పుడే మనం వాటికంటే ఉత్కృష్టులం కాగలుగుతాం.

**ఆ యోగ్యత మనిషికి ఉంది...**

ధర్మాన్ని ఆచరించడానికి కావలసిన యోగ్యత మనిషికి ఎలా ఉన్నది అంటే మనిషికి మాట్లాడడానికి నోరు ఉన్నది. పూజించడానికి చేతులున్నాయి. ఆలయానికి వెళ్ళడానికి కాళ్ళు ఉన్నాయి. భగవ్ కథా శ్రవణం చేయడానికి చెవులున్నాయి. భగవంతుని యొక్క నిర్మాల్యాన్ని ఆఘ్రాణించడానికి నాసిక ఉన్నది. భగవంతుని యొక్క పాదోదకం స్వీకరించడానికి జిహ్వ ఉన్నది. ప్రాణులకు చెవులున్నాయి కాని ఆ భగవత్ కథా శ్రవణం చెయ్యాలని వాటికి తెలియదు. కాళ్ళున్నాయి కాని ఆలయానికి వెళ్ళడం వాటికి తెలియదు. భగవంతుని పూజ చెయ్యడానికి చేతులనేవి లేవు. భగవన్నామోచ్చారణం చెయ్య డం వాటికి రాదు. కర్మానుష్ఠానం చెయ్యటానికి కావలసిన యోగ్యత లేదు. ఇది మన కున్నది. మన యొక్క శరీర రచన ధర్మానుష్ఠానానికి తగినట్లుగా భగవంతు డిచ్చాడు. ఈ రచన వేరే ఏ ప్రాణికీ లేదు. అందు వల్లనే ధర్మానుష్ఠానానికి తగినటువంటి ఈ జన్మను మనం పొంది ధర్మాన్ని ఆచరించకపోతే మనం అత్యంత నికృష్టులం అయిపోతాం. అందుకే లోకంలో మహాత్ముడు అని ఎవరిని అనాలి? కొంతమందంటారు బాగా డబ్బు సంపాయిస్తే వాడు మహానుభావుడు. లేదు లేదు బాగా విద్య చదివితే వాడు మహానుభావుడు. లేదు లేదు అధికారం సంపాదిస్తే వాడు మహానుభావుడు. లేదా శారీరకమైన శక్తి సంపాదిస్తే మహానుభావుడు. కానీ ఇవేవీ ఈ ప్రశ్నకు జవాబులు కావు. శంకరుల వారు ఒకచోట చెప్పారు తమ భాష్యంలో...

**యోహి ఇష్టాది లక్షణం కర్మ ఆచరతి**
**తమ్ లోకాహి ఆచక్షతే ధర్మం చ రత్యమ్ మహాత్మనః ॥**

ఎవడైతే శాస్త్రోక్తమైన కర్మాచరణ చేస్తాడో వాడినంటారు ఈయన మహాత్ముడని. వాడిని 'ధర్మం చ రత్యమ్ మహాత్మన' అని పిలుస్తారు. అంటే శంకరుల వారి కాలంలో ఆ ధర్మాన్ని ఆచరించేటటువంటి వాడికి అత్యున్నతమైన స్థానం ఉండేది. ఇవాళ్టికీ ధర్మం ఆచరించేవాడికి అత్యున్నత స్థానం వివేకుల దృష్టిలో. అవివేకుల దృష్టిలో లేకపోవచ్చు.



ఈ ధర్మాన్ని ఆచరించాలి అని చెప్పినప్పుడు కొంతమందికి కొన్ని ప్రశ్నలున్నాయి. ఏమిటి ధర్మం ఆచరించడ మంటే అర్థం? ఏమి చెయ్యమంటారు. మీ శక్తికి తగినట్లు ఆచరించండి. అంటే ఏం చెయ్యాలి? అదే చెప్పండి. భగవన్నామ జపం చెయ్యండి. యథాశక్తి ఇంకోడికి ఉపకారం చెయ్యండి. మాతాపితరు లను సేవించండి. ఇవన్నీ ధర్మాలే.

సంధ్యావందనం చెయ్యండి అని చెబితే కొంతమందడిగారు నన్ను మీరు సంధ్యావందనం చెయ్యండి, గాయత్రీ జపం చెయ్యండి అని చెపుతున్నారు. ఇవన్నీ వెనకటి కాలంలో వాళ్ళకు బాగా అవకాశం ఉండేది కాబట్టి చేస్తూ ఉండేవాళ్ళు. మాకు సుతరాము అవకాశం లేదు. ఇవన్నీ చెయ్యమంటే మేం ఎలా చెయ్యం? పొద్దున లేచామంటే ఆరు గంటలకు ఆఫీసుకి పరు గెత్తాలి. పిల్లవాడు స్కూలుకి పరుగెత్తాలి. ఏడు గంటలకి ఇవన్నీ చెయ్యమంటే ఇవాళ మాకు కుదురుతుందా? కాబట్టి మాకు అను గుణంగా ఉండేట్టు ధర్మసంహిత తయారు చెయ్యండి. మీరు జగద్గురు వుల స్థానంలో ఉన్నారు. దాన్ని తయారుచెయ్యడానికి మీకు అధి కారం ఉన్నది అని కొంతమంది నన్ను ప్రశ్నించారు.

నేను వాళ్ళకు చెప్పాను- "శంకరా చార్యులవారు ఈ

పీఠాన్ని స్థాపన చేసింది ధర్మాన్ని తారుమారు చెయ్యడానికి కాదు. జనం ధర్మాన్ని అనుసరించేలా చెయ్యండి అనడం కోసం ఈ పీఠాన్ని స్థాపించారాయన. ఈ పీఠంలో కూర్చుని నేనెలాగ ధర్మాన్ని తారుమారు చెయ్యమని చెప్పను నీకు."

**ఉన్నంతలోనే ఆచరించు...**

మరి మా గతేమిటి? అని అన్నారు. ఏం లేదు శాస్త్రంలో నీకు ఎంత చేతనయితే అంత చెయ్యి అని చెప్పబడియే ఉన్నది. వెనుకటి వాళ్ళు గంటల తరబడి సంధ్యావందనం, గాయత్రీ చేసేవాళ్ళు. నీకు గంటల తరబడి చెయ్యడానికి లేకపోయినా ఒక పది నిమిషాలు చెయ్యవయ్యా. అది నీకు చేతకాదని ఎలా అంటావు. నీకు దానిక్కూడా టైము లేదు అని చెబితే ఎవడూ నమ్మడు. నీకు టి.వి. చూడడానికి, పేపరు చదవడానికి, అర్ధగంట వాకింగ్ చెయ్యడానికి టైమున్నది, మిగతావాళ్ళతో బాతాఖానీ చెయ్యడానికి టైమున్నది. పది నిమిషాలు సంధ్యావందనం చెయ్యడానికి టైము లేదంటే ఎవడైనా నమ్ముతాడా.

నమ్మడానికి వీలులేదు. అందువల్ల నీకు సంధ్యావందనం ఎంతవరకు చెయ్యడానికి వీలైతే అంతవరకు చేసి నీవు ఆఫీసుకు పో. దానివల్ల నీకు శ్రేయస్సు కలుగుతుంది. వీళ్ళు నన్నడగటం ఏమిటంటే అలాకాదు సంధ్యావందనం ఎగగొట్ట డానికి మార్గం చెప్పండి. దానికి మార్గం లేదు. అలా మార్గం ఉన్నదని నేను చెప్పానంటే నేనీ స్థానంలో ఒక్క నిమిషం ఉండకూడదు. శాస్త్రాన్ని మనం ఎన్నడూ కూడా ఉల్లంఘించడానికి వీలులేదు. మనకు చేతనైనంత వరకే చెయ్యచ్చు. దాన్ని భగవంతుడే చెప్పాడు.

"శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మాత్స్వనుష్ఠితాన్
నిగుణో విశ్వధర్మః శ్రేయాన్" అన్నాడు. నిగుణః నీవు చెయ్యటంలో కొంత న్యూనత రావచ్చు. నీవు అంత ఎక్కువ చెయ్యడానికి వీలు లేకపోవచ్చు. దానికి నేను ఒక ఉదాహరణ చెప్పేను. ఒక స్కూలులో చదువుతుండే పిల్లవాడు పరీక్షకు వెళ్ళాడు. వెళ్ళడం తోటే వాడి చేతికి క్వశ్చన్ పేప రిచ్చారు. వాడు క్వశ్చన్ పేపర్ చూసుకున్నాడు. నూరు మార్కుల కున్నాయి ప్రశ్నలు. వాడికది చూడ్డంతోటే అర్థమైపోయింది నేను నూరు మార్కులకి జవాబులు రాయలేను అని. అప్పుడు వాడేం చేస్తున్నాడు. నేను నూరు మార్కులకి జవాబులు రాయలేను అని బ్లాంక్ పేపర్ ఇస్తున్నాడా? అథవా 40 మార్కులకైనా రాయాలని ప్రయత్ని స్తున్నాడు. నూటికి నూరు మార్కులకి రాయలేనని ఎవడు బ్లాంక్ పేపర్ ఇవ్వడం లేదే. అలాగే నీవు కూడా ధర్మాన్ని నూటికి నూరుపాళ్ళు అనుసరించడానికి వీలులేకపోయినా



నీకు ఎంత చేతనౌతుందో అంత చెయ్యి. దాన్నే భగవంతుడొకచోట చెప్పాడు 'స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్' దీన్ని ఏ కొద్దిపాటిగా నీవు ఆచరించినా దీనివల్ల నీవు శ్రేయస్సు పొందగలుగుతావు. కాని దీన్ని సర్వాత్మన వదిలేదెలాగా అని మాత్రం ఆలోచన చెయ్య వద్దు. ఆ ఆలోచన ఎలా ఉందంటే ఆ బ్లాంక్ పేపరు ఇచ్చి వచ్చిన విద్యార్థిలాగా ఉంటుంది. వాడు బ్లాంక్ పేపర్ ఇచ్చివస్తే ఎన్నటికీ పాసు కాలేడు. అలాగే నీవు ధర్మాన్ని సర్వదా వదలి పెట్టావంటే ఎన్నటికీ నీవు శ్రేయస్సు పొందడానికి వీలులేదు.

**'సత్యం వద' అనేదే శాస్త్రం**

అందువల్ల ఇంకొక ప్రశ్న- మీరేమంటున్నారు కాలానికి తగినట్లుగా అంటున్నారు ధర్మానికి కాలదోషం లేదు. సత్యం చెప్పడం ధర్మం అని అన్నారు. అదేమన్నా మారుతుందా? కొంతకాలానికి అసత్యం చెప్పడమే ధర్మం అవుతుందా? వెయ్యేళ్ళకి పూర్వం 'సత్యం వద' అనేది శాస్త్రం. ఇవాళ్టికీ అదే శాసనం ఇంకా వెయ్యేళ్ళయినా అదే శాసనం. ఎన్నటికీ 'అసత్యం వద' అన్నది శాసనం కాదు. అందువల్ల ధర్మానికి కాలదోషం లేదు. కాలానికి అనుగుణంగా ధర్మము యొక్క స్వరూపాన్ని పరివర్తనం చెయ్యాలి అనే సిద్ధాంతాన్ని మనం సర్వదా ఒప్పుకోవడానికి వీలులేదు. మన యొక్క శక్తిని అనుసరించి మన సామ ర్థ్యాన్ని అనుసరించి మన



అవకాశాన్ని అనుసరించి ధర్మాన్ని ఆచరించాలే తప్ప ధర్మాన్ని సర్వదా త్యజించ కూడదు. విడవకూడదు. అలా ధర్మాన్ని మనం విడిచేశామంటే అప్పుడు మనం ధార్మికులం ఎలా అవుతాం?

మరొక ప్రశ్న మాకు సంధ్యా వందనం చెయ్యడానికి వీలులేదు. తత్ స్థానంలో వేరే ఏదైనా చెప్పండి అని అంటున్నారు. మరి దానికి మటుకు నీకు అవకాశం ఎక్కడుంది? దానికి అవకాశం ఉండేట్టయితే ఇదే చెయ్యి. కాబట్టి మనం ధర్మం విషయంలో కుతర్కాలు చెయ్యకూడదు. అది అసలు విషయం. శంకరులవారన్నారు "దుస్ తర్కాత్ సువిరమ్యతా..." కుతర్కం చెయ్యడానికి వీలులేదు.

నన్ను ఒకడు ప్రశ్నించాడు "లోకంలో ఇన్ని ప్రాణులుంటే గోవునే వధ చెయ్యకూడదని మీరెందుకంటున్నారు?" అని. నేనన్నాను "లోకంలో ఇన్ని ప్రాణులుంటే నేషనల్ యానిమల్ అని టైగర్ ఒక్కదాన్నే ఎందుకు చెపుతున్నారు. మిగతావి నేషనల్ యానిమల్ కాకూడదా? రాష్ట్రీయ పశువులు కాకూడదా. టైగరొక్కటే కావాల్నా? దానికి మీదేమిటి సమాధానం?" దానికి మావద్ద సమాధానం లేదండి. అయితే ఈ ప్రశ్న ఎట్లా అడుగుతావు నన్ను. కాని ఈ ప్రశ్నకు సమాధానం ఉన్నది. ఏమిటి సమాధానం అంటే. గోవుని వధ చెయ్యకూడదు అని శాస్త్రంలో నిషేధం ఉన్నది. "మా గానునాగమది కిం వధిష్ఠ" అని శాస్త్రంలో నిషేధం. నిరపరాధి అయిన గోవును వధించకూడదు. మనం శాస్త్రాన్ని ప్రమాణంగా స్వీకరించిన వాళ్ళం. మనం నాస్తికులం కాదు. మనం ఆస్తికులం. నాస్తికులకు ప్రమాణం కాకపోతే వాళ్ళ విషయం మనకక్కర లేదు. అది ఒక కారణం. ఇంకొక కారణం ఏమంటే మిగతా ఏ ప్రాణి వల్లా కలగ నటువంటి ప్రయోజనం గోవు వల్ల మనకు కలుగుతున్నది? గోవు యొక్క పాలు, పెరుగు, నెయ్యి, గోమూత్రం, ఆవు పంచితం ఇవన్నీ మనకుపయోగ మయినటువంటివే. వేరే ఏ ప్రాణి యొక్క మూత్రం గానీ, పురీషం గాని మనం తీసుకోము. గోమూత్రం మాత్రం తీసుకుంటాం.

### కుతర్కాలు చెయ్యవద్దు

అదే విధంగా శాస్త్రాన్ని మనం ప్రశ్నించడం మనకు అనుచితమైన పని అవుతుంది. దాన్నే పుచ్చుకుని భగవత్పాదు లన్నారు. 'దుస్ తర్కాతసు విరమ్యత' ధర్మశాస్త్రంలో చెప్పేరు. శ్రుతి, స్మృతి అంటే ధర్మశాస్త్రం. వీట్ల మీద కుతర్కాలు చెయ్యటం అనేది సర్వదా అనుచితం. ఎందుకంటే ఇవే మనకు ధర్మాన్ని బోధిస్తుండేటటువంటివి. వాటినే మనం ప్రశ్నిస్తున్నా మంటే ఏ ఉపాధ్యాయుడి వల్ల మనం విద్యను గ్రహిస్తున్నామో ఆ ఉపాధ్యాయుణ్ణే శంకించినట్టు. ఏ గురువు మనకు జ్ఞానాన్ని ప్రబోధిస్తున్నాడో ఆ గురువునే మనం నీకేం తెలుసు అంటే, మీరు చెప్పేది చదువేనా అని మనం గురువునే అడిగితే ఇక ఆ గురువు దగ్గర మనం జ్ఞానాన్ని ఎలా పొందగలుగుతాం. అందుకే ఒక చోట చెప్పేరు. 'అంతేవాస్యనంతే వాసి భవతి గురావనైగుణ మాపత్యమానః'. గురువు యందు అజ్ఞానాన్ని ఆరోపించేటటు వంటి శిష్యుడు శిష్యుడే కాదు. ఆ గురువు నీకు విద్యని చెబుతున్నాడు. ఆయన వద్ద విద్యను నేర్చుకుం టున్నావు. మళ్ళీ ఆయనకు ఏమొచ్చు అని అడుగుతున్నావు. ఎంత ధూర్తతనం. అలాగే శాస్త్రాన్ని ఆ శ్రుతి, స్మృతులు మనకు ధర్మాన్ని తెలియజేసేటటు వంటి వాటినే మనం ప్రశ్నిస్తే అది కూడా అపరాధమౌతుంది. అందువల్ల ఎట్టి పరిస్థితిలో కూడా ధర్మాన్ని ఆచరించే విషయంలో ఉపేక్షాభావం ఉండకూడదు మనకు. ఏవో అనవసర మైనటువంటి కారణాలు చెప్పి ధర్మాష్ఠానాన్నుంచి తప్పించుకోవడమనేది సర్వదా అను చితం. దీన్ని మనం జ్ఞాపకంలో పెట్టుకోవాలి. దానికి లేనిపోని కారణాలు చెప్పడం. అలా కారణాలు చెప్పి తప్పించుకోవడం వల్ల మనకు జరిగేటటువంటి ప్రత్యవాయం ఏదైతే ఉందో దాన్ని పరిహరించుకోవడం ఎవడికీ సాధ్యం కాదు.



### ఆ రెండూ పాపాలే...

ప్రత్యవాయం అనే శబ్దం ఒకటి శాస్త్రంలో ఉంది. దానికి పాపం అని అర్థం ఎలాగైతే శాస్త్రంలో చెయ్యకూడదన్న దానిని చేస్తే పాపం వస్తుందో. అలాగే చెయ్యి అన్నదాన్ని చెయ్యక పోయినా కూడా పాపం వస్తుంది. రెండూ పాపాలే. కాబట్టి ఏదైతే చెయ్యకూడదని శాస్త్రం చెప్పిందో దాన్ని చెయ్యకూడదు. ఏదైతే చెయ్యమని శాస్త్రం చెప్పిందో దాన్ని చెయ్యాలి. అందుకే ఒక భక్తుడు భగవంతుని దగ్గర ప్రార్థించాడట. రోజూ రెండు పాపాలు నేను చేస్తూనే ఉన్నాను. "యత్కృత్యం తన్న కృతం, యదకృత్యం కృత్యవత్ తథా చరితమ్" శాస్త్రం ఏదైతే చెయ్యమని చెప్తుందో దాన్ని నేను చెయ్యటం లేదు. దేన్ని శాస్త్రం చెయ్యద్దని చెపుతుందో దాన్ని చేస్తూనే ఉన్నాను. రెండు రకాల తప్పులు నావల్ల రోజూ జరుగుతూనే ఉన్నాయి. వీటికి ఏం ప్రాయశ్చిత్తమో నాకు తెలియడం లేదు. నీ నామస్మరణం చేస్తాను. దానితో నాకు ముక్తిని ప్రసాదించు అని అడిగేడు.

కాబట్టి మనుష్యుడికి ఏ కారణం వల్ల మిగతా ప్రాణుల కంటే ఉత్కర్ష అనేది ఉన్నదో, ధర్మానుష్ఠానానికి యోగ్యత అనేదాన్ని సరిగ్గా ఉపయోగించుకోనట్లయితే ఈ జన్మ వ్యర్థమౌతుంది. ఒక విషయం మనం తెలుసుకోవాలి. ఈ మనుష్య జన్మ మళ్ళీ మనకొస్తుందన్న గ్యారంటీ లేదు. మళ్ళీ ఏదో ప్రాణి జన్మ వచ్చిందంటే అప్పుడేం చేస్తాం. ఇదేదో మన పూర్వపుణ్యం వల్ల వచ్చింది. ధర్మాను ష్ఠానానికి తగిన శరీరం వచ్చింది. ఈ సమయంలో మనం వివేకాన్ని ఉపయోగించుకుని ధర్మాన్ని ఆచరించినట్లయితే ఇంకా ఉత్కృష్టమైన శరీరం మనకు లభిస్తుంది. ఇప్పుడు మనం అవివేకంతో ధర్మాన్ని ఆచరించక ఈ దుర్లభమైన మనుష్యజన్మ వ్యర్థం చేసుకున్నామంటే మనకంటే అవివేకి ఎవడూ ఉండడు. కాబట్టి మనం అవివేకులం కాకూడదు.

భగవంతుడు ఏది సరి, ఏది తప్పు అని నిర్ణయించుకునే శక్తి మనకిచ్చాడు. నిప్పుమీద చెయ్యిపెడితే కాలుతుందనే బుద్ధి మనకిచ్చాడు. దారిలో పోతున్నాం. అక్కడ గొయ్యి ఉన్నది. ఆ గోతిలో పడకూడదు కాబట్టి ఆ దారిలో పోకూడదు అని తీర్మానించుకునే శక్తి మనకిచ్చాడు భగవంతుడు. అలాగే ఏది ధర్మం? ఏది అధర్మం అనేదాన్ని శాస్త్రం చెబుతుంది, పెద్దలు చెబుతున్నారు. శాస్త్రంలో ఇంకో మాట చెప్పారు. ధర్మాధర్మాల యొక్క స్వరూపాన్ని నీవుగా తీర్మానం చెయ్యడానికి నీకు శక్తి లేకపోయినా పెద్దలు ఏదయితే ధర్మమార్గాన్ని చూపిస్తారో దాంట్లో నడువు నువ్వు.

**"ఏతత్‌సత్ బ్రాహ్మణాసనామరిహిన యుక్తాయుక్తః**
**పరోక్ష ధర్మాకామాస్తు యథాతేత్ర వర్తేరన్**
**యథాతత్ర వర్తేచ..."** నీకేమన్నా సందేహం వచ్చిందంటే ఆ సందేహాన్ని నీ అంతట నీవు శాస్త్ర పుస్తకాన్ని తీసుకుని పరిహారం చేసుకునే యోగ్యత నీకు లేకపోవచ్చు. దానివల్ల

ప్రమాదం లేదు. పెద్దవాళ్ళు ఆ విషయంలో ఏవిధంగా నడుచుకుం టున్నారో ఆ విధంగా నడువు చాలు. నీకు శ్రేయం అవుతుంది అని స్మృతియే చెప్పింది. కాబట్టి ఏవిధంగాను మనం ధర్మం విషయంలో ఉపేక్షాభావంతో ఉండడానికి వీలులేదు.

యథాశక్తి- మనశక్తికి తగినట్లుగా. ఎవడినీ నీ శక్తికి మించి ధర్మం ఆచరించమని ఏ శాస్త్రంలోను చెప్పలేదు. ఇంకొకడికి దానం చెయ్యమంది శాస్త్రం. ఎంత చెయ్యాలి నీ చేతిలో ఎం తుందో అంత చెయ్యి. ఒకాయన లక్ష రూపాయలు విరాళం ఇచ్చాడు. నీవూ లక్ష రూపాయలు ఇవ్వాలని ఎక్కడా లేదు. నీ చేతిలో పది రూపాయలు ఉన్నది. ఐదు రూపాయలు విరాళం ఇవ్వు చాలు. లక్ష ఇచ్చినవాడికి ఎంత పుణ్యమో నీకూ అంతే పుణ్యం. ఇద్దరికీ ఒకటే పుణ్యం. లక్ష రూ పాయలు ఇచ్చే శక్తి ఉన్నాయనకి పది రూపా యలు పుణ్యం రాదు. నీకా శక్తి లేదు నీవిచ్చే ఐదు రూపాయలతోనే పుణ్యం వస్తుంది. కాబట్టి శాస్త్రం నీ యొక్క శక్తిని, అవకాశాన్ని, సామర్థ్యాన్ని అనుస రించి నీవు ధర్మాచరణ చేసి శ్రేయ స్సును పొందమని చెప్తుంది. ఆ శాస్త్రం యొక్క ఉపదేశాన్ని మాత్రం మనం సర్వదా మనస్సులో ఉంచుకోవాలి. అదే విధంగా ఆచరించాలి. శ్రేయస్సును పొందాలి. మన పూర్వీకులు ఇదే మార్గంలో వచ్చేరు కదా.

ఎవళ్ళనడిగినా నీ తండ్రి, తాత గురించి అడిగినా- మా తాత త్రికాల సంధ్యావందనం, షట్కాల శివపూజలు, నిరతాన్నదాత అని చెప్పుకుంటూనే ఉంటాం. ఆయనింట అతిథికి భోజనం పెట్టకుండా ఆయన భోజనం చేసిందే లేదు. మరి మీరేం చేస్తున్నారు. ఒక్క అతిథికి ఒక్క రోజయినా భోజనం పెట్టారా? మీ తాతగారు చేసేరు, ముత్తాత గారు చేసేరు అని అంటే లాభమేముంది? మీరు ఆ పని చెయ్యొద్దా. కాబట్టి మన తాత ముత్తాతలు ఏ ధర్మాన్ని అనుస రించి శ్రేయస్సును పొందేరో, వాళ్ళ యొక్క వంశంలో పుట్టిన మనక్కూడా అదే ఆచరణీయం అవుతుంది. దాని వల్లనే మనం శ్రేయస్సును పొంద వలసిందే తప్ప వేరే మార్గం లేదు. ఈ ధర్మాన్ని ప్రబోధం చెయ్యడానికే భగవత్పా దులు అవతరించారు. ఈ చతురామ్నాయ పీఠస్థాపన చేసేరు. మీరు ఎల్లకాలమందు జనులకు ధర్మ ప్రబోధం చేస్తూ ఉండాలని ఆ పీఠాల్లో తాము ప్రతిష్ఠించి నటువంటి శిష్యులకు ఆదేశించారు. అదేవిధంగానే ఈ ధర్మ ప్రచారం చెయ్యడ మనేది జరుగుతున్నది. మేము భాగ్యనగరం వచ్చి 20 ఏళ్ళవుతోంది. ఈ 20 ఏళ్ళలో శృంగేరిలో అనేక మై నటువంటి కార్యాలు చేయించడమైనది. కాని 20 ఏళ్ళు భాగ్య నగరం



రాకుండానే ఉన్నాననేటువంటి చింత నాక్కూడా ఉన్నది.

**మా ఆకాంక్ష కూడా అదే...**

ఇందాక ప్రసాదుగారు చెప్పినట్టు "బాబూ మళ్ళీ 20 ఏళ్ళ తరువాత రావాలని నియమం పెట్టుకోకండి. 20 ఏళ్ళ తరువాత ఎలా వస్తా? అప్పటికి నాకు 82 ఏళ్ళు వస్తాయి. అప్పటికి రావడానికి వీలుకాదు. కాబట్టి 20 ఏళ్ళ సావకాశం చెయ్యడానికి వీలులేదు. కాని మా భాగ్యనగరంలో ఉండేటటువంటి శిష్యుల యొక్క శ్రద్ధాభక్తులు అవర్ణనీయమై నటువంటివి. నేను ఈ 20 రోజులూ మా నల్లకుంట శంకరమఠంలో చూస్తూ ఉన్నాను కదా ఆ శ్రద్ధకు, ఆ భక్తికి ఎంత ప్రశంస చేసినా చాలదు. అటువంటి సత్ సంస్కారం కలిగినటువంటి శిష్యులు వేలాది సంఖ్యలో ఈ భాగ్యనగరంలో ఉన్నప్పుడు మిమ్మల్ని అప్పుడప్పుడు వచ్చి చూడాలి అనేటువంటిది నా ఆకాంక్ష కూడా. భగవంతుడు దాన్ని నెరవేర్చాలని నేను కూడా భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను.

'దర్శనమ్' పత్రిక ఎనిమిది సంవత్సరాల నుంచి అత్యంత ఉపయుక్తమైనటువంటి సమాచారాన్ని మన ధర్మానికి ఏమాత్రం వ్యత్యాసం రాకుండా ఉండేటటువంటి జనులకు ధర్మ విషయేకమైన సమాచారాన్ని అందిస్తూ ఉన్నది. ఆ దర్శనమ్ పత్రిక చేసే కృషికి నేను చాలా సంతోషించాను. వారి కృషిని అభినందిస్తున్నాను. అందుకే వారు తమరు హైదరాబాదులో ఉన్నప్పుడు ఒక సార్వజనిక

## దిగ్విజయంగా జగద్గురువుల విజయయాత్ర

శ్రీ శృంగేరి శారదా పీఠాధీశ్వరులు అనంతశ్రీవిభూషిత శ్రీ భారతీతీర్థ మహాస్వామి వారి విజయయాత్ర తెలుగునాట దిగ్విజయంగా కొనసాగుతోంది. శంషాబాద్ సమీపంలోని శారదానగర్‌లో నిర్మించిన శంకర మఠం, శ్రీ శారదాచంద్ర మౌళీశ్వర స్వామి దేవాలయాల్లో కుంభాభిషేకం, విగ్రహప్రతిష్ఠ, అనంతరం నవంబరు 25న జగద్గురు శ్రీచరణులు భాగ్యనగరం చేరుకున్నారు. బర్కత్‌పురా చమన్ నుంచి నల్లకుంట శంకరమఠం వరకు కన్నుల పండుగగా కొనసాగిన శోభాయాత్రతో జగద్గురువుల నగర ప్రవేశం జరిగింది. శంకర మఠంలో ధూళి పాదపూజ అనంతరం 'శ్రీ శారదాంబ దివ్య సన్నిధి శృంగేరి' గ్రంథాన్ని 'దర్శనమ్' డిసెంబరు సంచికను జగద్గురువులు ఆవిష్కరించి ఆశీస్సులందించారు.

నవంబరు 26న ఉదయం 11.30 గంటలకు కార్తిక సోమవారం సందర్భంగా పూజ్య జగద్గురువులు శ్రీ చంద్రమౌళీశ్వరస్వామి శివలింగానికి ప్రత్యేక పూజ జరిపారు. సాయంత్రం 'భక్తి' టివి వారు ఎన్టీఆర్ స్టేడియంలో నిర్వహించిన కార్తిక లక్ష దీపోత్సవంలో జగద్గురువులు పాల్గొని 'అనుగ్రహభాషణం' ప్రసాదించారు. లక్షదీపాల వెలుగులు జగత్తును కాంతిమయం చేసి, అజ్ఞాన తిమిరాన్ని పారద్రోలిన ఈ విశిష్ట ఘట్టాన్ని రచన టెలివిజన్ సంస్థ అధినేత తుమ్మల నరేంద్ర చౌదరి దంపతులు అపూర్వంగా నిర్వహించారు. వేలాది మంది భక్తులు రాష్ట్రం నలుమూలల నుంచి తరలివచ్చి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

నవంబర్ 27న జగద్గురు శ్రీచరణులు ఆర్టీసీ క్రాస్‌రోడ్స్‌లోని పంచముఖాంజనేయస్వామి దేవాలయం, అశోక్‌నగర్ సత్యనారా యణస్వామి దేవాలయం, ఇందిరాపార్క్ సమీపంలోని విజయగణపతి దేవాలయాలను సందర్శించారు. నవంబర్ 28న కార్తిక పౌర్ణమి పర్వం సందర్భంగా జగద్గురువులు శంకర మఠంలో ప్రత్యేక పూజలు జరిపారు. 29న భక్తజనులనుద్దేశించి అనుగ్రహభాషణ ప్రసాదించారు. 30వ తేదీన మౌలాలీ గాయత్రినగర్‌లోని గాయత్రీ దేవాలయం, సైనిక్‌పురి విజయగణపతి దేవాలయం, నేరేడ్‌మెట్ కృపా కాంప్లెక్స్‌లోని వేదభవన్‌లను జగద్గురువులు సందర్శించారు.

డిసెంబర్ ఒకటో తేదీన విద్యానగర్ శ్రీ సీతారామచంద్ర స్వామి దేవాలయం, నల్లకుంట సుబ్రహ్మణ్యస్వామి సమాజాన్ని జగద్గురువులు సందర్శించారు. డిసెంబర్ 2న శంకరమఠంలో శ్రీశక్తిగణపతి విగ్రహ ప్రతిష్ఠ, కుంభాభిషేకం, 3న కార్తిక సోమవార పూజలు జరిపారు. 4వ తేదీన శ్రీశంకరకృప మాసపత్రిక స్వర్ణోత్సవ వేడుకల్లో పాల్గొని జగద్గురువులు ఆశీస్సులు అందజేశారు. డిసెంబరు 5న శంకర మఠంలో జగద్గురువులు అనుగ్రహభాషణంలో భక్తులను అనుగ్రహించారు. 7వ తేదీన దిల్‌సుఖ్‌నగర్ శ్రీ శారదాచంద్రమౌళీశ్వరస్వామి ఆలయం, మారుతీనగర్ ప్రసన్నాంజనేయస్వామి ఆలయాలను జగద్గురువులు సందర్శించారు. 8న హస్తినాపురంలో అయ్యప్ప దేవాలయ నిర్మాణానికి శంకుస్థాపన చేసి అలకాపురి చంద్రమౌళీశ్వరస్వామి దేవాలయాన్ని సందర్శించారు. డిసెంబరు 10న కార్తిక సోమవార ప్రత్యేక పూజను శంకర మఠంలో నిర్వహించారు. 11వ తేదీన ముషీరాబాద్ జ్ఞానసరస్వతీ దేవస్థానం, మెహదీపట్నం రాజరాజేశ్వరీ ఆలయం, బషీర్‌బాగ్ కనకదుర్గా నాగలక్ష్మీ దేవాలయాలను జగద్గురువులు సందర్శించారు. 12న శంకరమఠంలో

"దర్శనమ్' పత్రిక ఎనిమిది సంవత్సరాల నుంచి అత్యంత ఉపయుక్తమైనటువంటి సమాచారాన్ని మన ధర్మానికి ఏమాత్రం వ్యత్యాసం రాకుండా ఉండేటటువంటి జనులకు ధర్మ విషయేకమైన సమాచారాన్ని అందిస్తూ ఉన్నది. ఆ దర్శనమ్ పత్రిక చేసే కృషికి నేను చాలా సంతోషించాను. వారి కృషిని అభినందిస్తున్నాను. అందుకే వారు తమరు హైదరాబాదులో ఉన్నప్పుడు ఒక సార్వజనిక సభను ఏర్పాటు చేస్తాం, తమరు వచ్చి ఆ సభలో మాట్లాడి వచ్చేటటువంటి భక్తులను ఆశీర్వదించాలి అన్నప్పుడు నేను సంతోషంతో అంగీకరించాను. ఎందుకంటే 'దర్శనమ్' పత్రిక వారు ఈ సభని ఏర్పాటు చెయ్యటంలో కేవలం వారికి ధర్మం మీద ఉండేటటువంటి శ్రద్ధ, శృంగేరి జగద్గురువుల యెడల ఉండేటటువంటి శ్రద్ధ, అనేక మంది భక్తులకు జగద్గురువుల వారి యొక్క సందేశాన్ని వినిపించాలి అనేటటువంటి ఆసక్తి... అవే వారి యొక్క ప్రార్థనకు కారణములు అనేటటు వంటి దాన్ని నేను గ్రహించి తప్పకుండా చెయ్యండి. నేను వచ్చి ఆశీర్వదిస్తాను అని చెప్పి... వచ్చాను. ఇవ్వాళ ఈ కార్యక్రమాన్ని చాలా భవ్యంగా చేశారు. అనేకమంది విద్వాంసులు, కవులు ఇక్కడికి వచ్చి తమ యొక్క శ్రద్ధను, భక్తిని ప్రదర్శించారు. అనేక మంది లౌకికులు, ఉన్నతోద్యోగులు ఇక్కడకు విచ్చేసి మాకు ఆనందాన్ని కలిగించేరు. మీకందరికీ నా యొక్క పరిపూర్ణమైన నారాయణ స్మరణ పూర్వక ఆశీస్సులు తెలియజేస్తున్నాను."

జగద్గురువులు భక్తులనుద్దేశించి అనుగ్రహభాషణ ప్రసాదించారు. 13న ఉప్పల్ స్వరూపానగర్ రాజరాజేశ్వరస్వామి దేవాలయాన్ని సందర్శించారు.

డిసెంబర్ 14న నాంపల్లి లలిత కళాతోరణంలో 'దర్శనమ్' ఆధ్యాత్మిక మాసపత్రిక అపూర్వగా నిర్వహించిన 'గురువందనమ్'లో జగద్గురువులు పాల్గొని అనుగ్రహభాషణతో భక్తులను ఆశీర్వదించారు. శృంగేరీ శంకరమఠం సేవలో పునీతులు అవుతున్న పలువురు పండితులు, కవులు, కళాకారులు, ఆధ్యాత్మికవేత్తలు ఈ కార్యక్రమంలో పాల్గొని జగద్గురువుల ఆశీరనుగ్రహాలు పొందారు. 15న శంకరమఠంలో భాగ్యనగర విజయయాత్ర ముగింపు సభలో జగద్గురువులు భక్తులను ఆశీర్వదించారు.

డిసెంబర్ 15న సికింద్రాబాద్ సిద్ధివినాయక దేవాలయాన్ని సందర్శించి, మరునాడు కుంభాభిషేకం జరిపారు. 16న భాగ్యనగరం నుంచి తెలంగాణ విజయయాత్ర ప్రారంభించి, మెదక్ జిల్లాలో నాలుగు రోజులపాటు పర్యటించి వివిధ ప్రాంతాల్లో భక్త జనులను అనుగ్రహించారు. 16న సాయంత్రం నాచారం శ్రీ లక్ష్మీనరసింహస్వామి దేవస్థానాన్ని సందర్శించి శ్రీశృంగేరీ శంకర మఠంలో ప్రత్యేక పూజలు జరిపారు. 17న వర్గల్ విద్యాధరి క్షేత్రాన్ని సందర్శించి గజ్వేల్‌కు చేరుకుని రాత్రి చంద్రమౌళీశ్వరస్వామి పూజ జరిపారు. 18న గజ్వేల్ నుంచి బయల్దేరి రిమ్మనగోడు గోలోకాశ్రమాన్ని, కొండపాక రుద్రేశ్వరస్వామి దేవాలయాన్ని సందర్శించి, సిద్ధిపేటకు చేరుకున్నారు. సిద్ధిపేటనలో రాత్రి చంద్రమౌళీశ్వరస్వామి పూజ జరిపారు. 19న శ్రీ శంకరమఠం నిర్మాణానికి శంకుస్థాపన చేసి శ్రీ భారతీతీర్థ వేదపాఠశాల సందర్శించి విద్యార్థులను ఆశీర్వదించారు. వేలాదిమంది భక్తులను అనుగ్రహించిన అనంతరం కరీంనగర్ జిల్లాలోని బదనకల్ శ్రీ వాసుదేవాశ్రమాన్ని జగద్గురువులు సందర్శించి లింగన్నపేటకు చేరుకున్నారు.

21న లింగన్నపేట హరిహర క్షేత్రంలో కుంభాభిషేకాన్ని పూర్తిచేసి, నిజామాబాద్ జిల్లా కామారెడ్డికి జగద్గురువులు చేరుకున్నారు. 22న కామారెడ్డి నుంచి నిజామాబాద్ చేరుకుని 23న లక్ష్మీగణపతి దేవాలయ ప్రతిష్ఠ జరిపి, లలితాశ్రమాలయంలో బసచేశారు. 24న నిజామాబాద్ నుంచి బాసర క్షేత్రానికి చేరుకుని శ్రీ జ్ఞానసరస్వతీ దేవాలయంలో ప్రత్యేక పూజలు జరిపిన పిమ్మట శ్రీ శంకరమఠం నిర్మాణానికి భూమిపూజ జరిపి శంకుస్థాపన చేశారు. 25న బాసర నుంచి నిర్మల్ పట్టణానికి చేరుకున్నారు. 26న నిర్మల్ నుంచి వేములవాడ క్షేత్రానికి జగద్గురువులు చేరుకున్నారు. 27న అక్కడే బసచేసి, 28వ



తేదీన శ్రీ రాజరాజేశ్వర దేవస్థానంలో స్వామికి కుంభాభిషేకం, శ్రీ దత్తాత్రేయ స్వామి దేవాలయ నిర్మాణానికి భూమిపూజ జరిపారు. 28న కాళేశ్వరం క్షేత్రాన్ని చేరుకుని శ్రీ కాళేశ్వర, ముక్తేశ్వర మహాలింగానికి ప్రత్యేక పూజలు జరిపారు. 29న ఆదిలాబాద్ జిల్లాలో గోదావరీ తీరాన ఉన్న చెన్నూరు చేరుకున్నారు. 30న మంచిర్యాల, 31న ధర్మపురి క్షేత్రాలను జగద్గురువులు సందర్శించి భక్తజనులను అనుగ్రహించారు.

నవంబరు 3వ తేదీన చిత్తూరు జిల్లా వెంకట నరసింహరాజు పేట వద్ద ప్రారంభమైన శ్రీ జగద్గురువుల విజయయాత్ర దిగ్విజయంగా కొనసాగుతోంది. జగద్గురువులు పర్యటించిన అన్ని ప్రాంతాల్లో అసంఖ్యాకంగా భక్తజనులు తరలివచ్చి శ్రీచరణులను దర్శించుకుని ఆశీర్మంత్రాక్షతలు స్వీకరించి, ధార్మిక ప్రేరణలు పొందారు.

### సిద్ధిపేటలో శ్రీచరణులు

పూజ్యజగద్గురు శ్రీచరణులు విజయయాత్రలో భాగంగా డిసెంబరు 18వ తేదీ సాయంత్రం మెదక్ జిల్లా సిద్ధిపేట పట్టణానికి వేంచేశారు. హైదరాబాద్ రహదారిపై వేలాదిమంది భక్తులు మంగళ వాద్యాలు, హారతులతో జగద్గురువులకు ఘనంగా స్వాగతం పలికారు. అపూర్వ శోభాయాత్రతో వేదిక వద్దకు విచ్చేసిన శ్రీచరణులకు పట్టణ పౌరుల పక్షాన స్వాగత సమితి అధ్యక్షులు ఇల్లెందుల అంజయ్య దంపతులు ధూళి పాదపూజ జరిపి వస్త్రాలు సమర్పించారు. ప్రముఖ సంస్కృత పండితులు దోర్బల ప్రభాకరశర్మ స్వాగతపత్రాన్ని సమర్పించారు. ఈ



సందర్భంగా జగద్గురు శ్రీచరణులు భగవద్గీతా ప్రాశస్త్యాన్ని తమ అనుగ్రహ భాషణలో వివరించి, భక్తజనులను ఆశీర్వదించారు. 19వ తేదీ ఉదయం పట్టణ శివార్లలోని శ్రీభారతీతీర్థ వేదపాఠశాలను జగద్గురు వులు సందర్శించి, శ్రీశృంగేరీ శంకరమఠం నిర్మాణానికి శంకుస్థాపన చేశారు. వేదవిద్య వికాసం కోసం కృషి చేయడం సనాతన ధర్మాచరణలో ప్రధానమని జగద్గురువులు తమ అనుగ్రహ భాషణలో పేర్కొన్నారు. వేదవిద్యార్థులను నిర్వాహకులకు శ్రీచరణులు ఆశీర్వదించారు. అనంతరం శ్రీ సహజానంద గీతా సమాజాన్ని శ్రీచరణులు సందర్శించి యాభై ఏళ్ళుగా ఇక్కడ గీతాపారాయణ, వివిధ ధార్మిక కార్యక్రమాలు నిర్వహించడం ఆనందాన్నిస్తోందని జగద్గురువులు తమ అనుగ్రహ భాషణలో ఆశీర్వదించారు. పలువురు భక్తజనులు శ్రీచరణుల సిద్ధిపేట విజయయాత్రలో పాల్గొని ఆశీరనుగ్రహాలు పొందారు.

### త్రికూటాలయానికి శంకుస్థాపన చేసిన శ్రీచరణులు

జగద్గురు శ్రీభారతీతీర్థ మహాస్వామివారు తమ విజయయాత్రలో భాగంగా, డిసెంబరు 18న మెదక్ జిల్లా కొండపాక వేంచేశారు. పూజ్య జగద్గురు శ్రీచరణులను దర్శించుకునేందుకు వందలాది మంది వేయికళ్ళతో నిరీక్షిస్తుండగా శ్రీ రుద్రేశ్వరాలయం ట్రస్ట్ అధ్యక్షులు అనంతుల శ్యాంమోహన్, శ్రీ సీతారామచంద్ర స్వామి దేవాలయం ట్రస్ట్ అధ్యక్షులు దేవేందర్‌రెడ్డి సారథ్యంలో గ్రామ ప్రజలు ఘనస్వాగతం పలికారు. 'దర్శనమ్' సారథి శర్మ వేదోక్తంగా పూర్ణకుంభంతో జగద్గురువులకు స్వాగతం పలికి రుద్రేశ్వరాలయంలోనికి తోడ్కొని వెళ్ళారు. ఈ సందర్భంగా పరివార దేవతా సహిత రుద్రేశ్వరస్వామి వారికి శ్రీచరణులు ప్రత్యేక పూజలు జరిపారు. అనంతరం 63 లక్షల వ్యయంతో నిర్మించనున్న త్రికూటేశ్వరాలయం నిర్మాణానికి జగ ద్గురువులు భూమిపూజ చేసి శంకుస్థాపన చేశారు.

జీర్ణాలయాలను పునరుద్ధరించడం విశేష పుణ్యప్రదమని రుద్రేశ్వరస్వామి సన్నిధిని సర్వాంగ శోభితంగా పునర్ నిర్మించడం ఆనందాన్నిస్తోందని తమ అనుగ్రహ భాషణలో జగద్గురువులు సంతోషం వ్యక్తం చేశారు. త్రికూటేశ్వరాలయం నిర్మాణం త్వరితగతిన పూర్తి కావాలని శ్రీచరణులు ఆశీర్వదించారు. మహత్తరమైన 'గురువందనమ్' కార్యక్రమాన్ని వైభవోపేతంగా నిర్వమించి 'దర్శనమ్' శర్మ గురుభక్తి చాటుకున్నారని ఆశీర్వదిస్తూ శాలువాతో సత్కరించి ఆశీర్వదించారు. వివిధ ప్రాంతాల నుంచి తరలివచ్చిన భక్తజనులు జగద్గురువుల ఆశీరనుగ్రహాలు పొందారు.

**- 'శరదిందు'**

# శ్రీ శారదాంబ దివ్యసన్నిధి

మన భారతదేశంలో తపోభూములుగా, పవిత్ర స్థలాలుగా, మహిమాన్విత క్షేత్రాలుగా ఖ్యాతి గాంచిన పుణ్య స్థలాలు అనేకం ఉన్నాయి. వాటిలో ముఖ్యమైనది శృంగేరి. కర్ణాటక రాష్ట్రంలో పశ్చిమ కనుమల చెంత జీవనదిగా గలగల పారే తుంగానదీ తీరంలో ఈ పవిత్రక్షేత్రం నెలకొని ఉన్నది. ఈ క్షేత్రానికి ఇంకా శ్రీఋష్యశృంగగిరి, శృంగగిరి అనే పేర్లు కూడా ఉన్నాయి. ఈ ప్రదేశాన్ని తిలకించినంతనే అందరూ ఆనందభరితులు అవుతారు. చక్కని ప్రకృతి సౌందర్యము, దైవిక పరిసరాలతో అలరారే శృంగేరీ క్షేత్రము, శ్రద్ధాభక్తులతో తరలివచ్చే భక్తులకు ఇహపర సుఖదాత్రియై, సకల పాపక్షయకారిణియై, ఆత్మజ్ఞాన ప్రదాత్రిగా భాసిస్తోంది.

ఈ స్థలం రామాయణ కాలానికన్నా పూర్వమే ఉన్నట్లు ఆధారాలు ఉన్నాయి. పూర్వము విభాండక మహర్షి ఈ ప్రాంతంలో నివసించేవారు. ఆ మహర్షి ఒకరోజు అరణ్యంలో సంచరిస్తుండగా అందమైన మగశిశువు కనిపించెను. కరుణా సముద్రుడైన ఆ మహనీయుడు శిశువును తమ వెంట తీసుకువెళ్ళి ఆలనా పాలనా చూడసాగారు. దివ్యతేజః ప్రకాశంతో భాసిల్లే ఆ శిశువు తలపై శృంగ సమాన విశేషము కలిగి ఉన్నందున విభాండక మహర్షి, ఋష్యశృంగుడు అని నామకరణం చేసి పెంచారు. ఆ బాలుడు దినదిన ప్రవర్ధమానుడై విభాండక మహర్షి వద్దనే వేదశాస్త్రాది విద్యలను అభ్యసించాడు. తపోధనునిగా అలరారే ఋష్యశృంగుడు, స్త్రీలను చూడనేలేదు. వనంలో లభించే కందమూలాలు మినహా మరే వస్తువులు ఆయనకు తెలియదు. ఈ విధంగా నిరుపమానమైన బ్రహ్మచర్యదీక్షతో ఆయన పెరిగారు.

ఈ సమయంలో ఆ ప్రాంతానికి సమీపంలోని రాజ్యాన్ని రోమపాదుడు అనే రాజు పాలించేవాడు. చాలాకాలం పాటు రాజ్యంలో తీవ్రమైన అనావృష్టి పరిస్థితులు వాటి ల్లటం మూలంగా కరువు కాటకాలు ఏర్పడడంతో రాజు చింతాక్రాంతుడై అమాత్యులతో మంత్రాం గము సాగించాడు. అప్పు డు మంత్రులు, అనితర బ్రహ్మచర్యదీక్షాదక్షుడైన ఋష్యశృంగమహర్షి గురించి రాజుకు వివరించి, ఆ మహనీయుడి పాదస్పర్శ తో రాజ్యం సుభిక్షమవుతుం దని వివరించారు. ఇందుకోసం ఋష్యశృంగ మహర్షిని రాజ్యానికి రప్పించేందుకు ప్రతిభా సంపన్నులైన కన్యామణులే సమర్థులని మంత్రులు ఉపాయాన్ని తెలిపారు. అయితే విభాండక మహర్షికి ఈ ప్రయత్నం ఆగ్రహాన్ని కలిగిస్తుందని రోమపాదుడు భీతిల్లాడు. కానీ ప్రజా సంక్షేమం కోసం ఈ ఉపాయాన్ని మహారాజు అంగీకరించాడు.

ఈ మేరకు రాజు ఆదేశాన్ని శిరసావహించిన సుందరీ మణులు విభాండక మహర్షి లేని సమయంలో వెళ్ళి



ఋష్య శృంగుడిని కలుసుకున్నారు. బ్రహ్మచర్య నిష్ఠాగరిష్ఠుడైన ఋష్య శృంగుడు వచ్చినవారు వేదాల్లో చెప్పిన స్వర్గలోకవాసులుగా భావించి అపరిమితమైన ఆకర్షణకు లోనయ్యాడు. ఇక వారి ఆహ్వానాన్ని అంగీకరించి, వారి వెంట వెళ్ళడానికి తండ్రిగారైన విభాండక మహర్షి అనుమతి తీసుకుని వెళ్ళాలని సైతం భావించకుండా వారివెంట రోమపాదుని రాజ్యానికి వెళ్ళాడు. ఈ విధంగా ఋష్యశృంగుడు పాదం మోపడంతోనే రాజ్యంలో కుంభవృష్టి కురిసి, ప్రజలు ఆనంద పరవశులయ్యారు. రోమపాద మహారాజు తన కుమార్తెను ఋష్యశృంగున కిచ్చి వివాహం జరిపించారు. కాగా విభాండక మహర్షి జ్ఞానదృష్టితో జరిగిన సంఘటనను గుర్తించి ఆగ్రహంతో రోమపాదుని రాజ్యానికి వెళ్ళాడు. అయితే వినయవిధేయతలతో రోమ పాదుడు, మహర్షికి ఉపచారాలు జరపడంతో శాంతించాడు. జరిగినదంతా దైవనిర్ణయంగా గ్రహించిన విభాండక మహర్షి, నవదంపతులను మనస్ఫూర్తిగా ఆశీర్వదించి తపోదీక్ష సాగించేం దుకు అరణ్యానికి వెళ్ళాడు. ఒక చిన్న కొండపై చాలాకాలం తపస్సు ఆచరించిన విభాండకుడు అంతిమ కాలంలో తనువు చాలించి, జ్యోతిరూపంతో ఆ కొండపై ఉన్న శివలింగంలో ఐక్యమయ్యాడు. ఇప్పటికీ ఆ కొండ శృంగేరిలో ఉంది. ఆ మహర్షి ఐక్యమైన శివలింగం ఉన్న ఆలయమే శ్రీ మలహా నికేశ్వర ఆలయంగా విరాజిల్లుతోంది.

ఈ క్రమంలో అయోధ్యను పాలించే దశరథ మహారాజు, ఋష్యశృంగ మహర్షి మహిమలు తెలుసుకుని, తనకు సంతాన ప్రాప్తికోసం తమరాజ్యానికి విచ్చేసి, యాగాన్ని జరిపించాలని ఋష్యశృంగమహర్షిని ప్రార్థించాడు. దశరథుని అభ్యర్థనను మన్నించిన ఋష్యశృంగుడు, అయోధ్యకు వెళ్ళి యాగం జరిపించిన పిదప దశరథునకు శ్రీరాముడు మొదలైన దివ్యపుత్రులు జన్మించారు.

కొంతకాలం తర్వాత ఋష్యశృంగుడు గృహస్థజీవనంపై వైరాగ్యం చెంది, కుటుంబ సభ్యులను, ప్రజలను ఆశీర్వదించి అడవులకు వెళ్ళి ధ్యానమగ్నుడయ్యాడు. చివరగా ఋష్యశృంగుడు దేహాన్ని త్యజించి తపస్సు చేసిన ప్రదేశంలోని శివలింగంలో ఐక్యమయ్యాడు. ఆ శివలింగం ఉండే ఆలయం, శృంగేరికి పదికిలో మీటర్ల దూరంలో ఉన్న కిగ్గాలో శ్రీఋష్య శృంగేశ్వరాలయంగా విరాజిల్లుతోంది. ఈ ఆలయంలోని శివలింగంపై శృంగం ఉండడం విశేషం. ఈ ఆలయానికి ఓ ప్రత్యేకత ఉంది. దేశంలో తీవ్ర అనావృష్టి పీడిస్తున్న ప్రాంతాల ప్రజలు శ్రీశృంగేరి జగద్గురువుల ఆదేశాల ప్రకారం శ్రీఋష్యశృంగేశ్వరునికి పూజలు జరిపిస్తారు. వెంటనే వారి ప్రాంతంలో వర్షాలు సమృద్ధిగా కురుస్తాయి.

శ్రీఋష్యశృంగ మహర్షి వసించిన పుణ్యప్రదేశమే ఋష్యశృంగగిరి, శృంగగిరి అనేపేర్లతో అలరారి ఇప్పుడు శృంగేరిగా విరాజిల్లుతోంది.

### శ్రీ శృంగేరి శారదాంబ సన్నిధిలో ఆలయాలు

ఆస్తికులైన భక్త జనులకు శృంగేరి క్షేత్రంలోని ఆలయాలు అమృతప్రాయాలు. రమ్యమైన ప్రకృతి సౌందర్యంతో అలరారే ఆ క్షేత్రంలో నిత్యం వేదఘోష శ్రవణానందం కలిగిస్తుంది. దివ్య శిఖరాలతో చక్కని శిల్పకళా శోభితంగా అలరారే ఆల యాల్లో దైవదర్శనం ద్వారా భక్తులు పొందే ఆనందం వర్ణనాతీతం, అనుభవైక వేద్యం.

1. తోరణ గణపతి సన్నిధి
2. శ్రీ శంకర భగవత్పాదుల సన్నిధి
3. శ్రీ శారదాంబ ఆలయం
4. శ్రీ శక్తి గణపతి సన్నిధి (శారదాంబ ఆలయం లోపల)
5. శ్రీ కోదండ రామస్వామి సన్నిధి (శారదాంబ ఆలయం లోపల)
6. శ్రీ మళయాళ బ్రహ్మ సన్నిధి ( శారదాంబ ఆలయ మార్గం)
7. శ్రీ సురేశ్వరాచార్యుల సన్నిధి
8. శ్రీ వాగీశ్వరీ విద్యారణ్య సన్నిధి
9. శ్రీ జనార్దనస్వామి ఆలయం
10. శ్రీ గరుడ సన్నిధి (శ్రీ జనార్దన స్వామి ఆలయ మార్గం)
11. శ్రీ ఆంజనేయ స్వామి సన్నిధి ( శ్రీ జనార్దన స్వామి ఆలయ మార్గంలో)
12. శ్రీ వృద్ధ నరసింహభారతీ స్వామివారి అధిష్ఠానం (శ్రీ జనార్దనాలయం వెనుక)
13. శ్రీవిద్యాశంకర తీర్థులు ఆలయం (ఈ ఆలయంలో శ్రీ విద్యాగణపతి, శ్రీదుర్గ, వెలుపల శిఖర పంక్తిలో శ్రీకార్తవీర్యార్జున సన్నిధులున్నాయి)
14. శ్రీ సుబ్రమణ్యస్వామి సన్నిధి, 15. శ్రీ తుంగానదీతీరం

### శ్రీ నరసింహవనంలోని ఆలయాలు :

16. జగద్గురు శ్రీ సచ్చిదానంద శివాభినవ నరసింహ భారతీమహాస్వామి వారి అధిష్ఠానం.
17. జగద్గురు శ్రీ చంద్రశేఖర భారతీ మహాస్వామివారి అధిష్ఠానం.
18. జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామివారి అధిష్ఠానం
19. శ్రీచంద్రమౌళీశ్వర సన్నిధి ( గురు నివాస్‌లో)
20. శ్రీకాలభైరవ ఆలయం,
21. శ్రీ వేదవ్యాసుల ఆలయం

### దర్శనమ్ ఆవిష్కరణమ్

రాజగోపురం కుంభాభిషేకం సందర్భంగా జరిగిన సార్వ జనికోత్సవ సభలో పూజ్య జగద్గురు శ్రీచరణులు, 'దర్శనమ్' ప్రత్యేక సంచికను ఆవిష్కరించి, తమ ఆశీస్సులను అనుగ్రహించారు. 'దర్శనమ్' సారథి ఎం.వి.ఆర్. శర్మ నేతృత్వంలోని బృందం సభ్యులు 'గురువందనమ్' సమర్పించారు. దర్శనమ్ కొనసాగిస్తున్న ధార్మిక కార్యాచరణ జయప్రదంగా పురోగమించాలని జ్ఞాపిక, శాలువా, నూతన వస్త్రాలతో 'దర్శనమ్' శర్మను శ్రీచరణులు ఆశీర్వదించారు.



## గోపుర రాజం... కుంభాభిషేకం

కర్ణాటక రాష్ట్రంలోని శృంగేరీ క్షేత్రంలో కొలువుతీరిన చదువుల తల్లి శారదాంబ, భక్తజనులకు మనోభీష్టాలను ప్రసాదించి అనుగ్రహించే దేవతగా పేరొందింది. శతాబ్దాల నుండి పవిత్ర చరిత్ర సొంతం చేసుకున్న ఈ ప్రాంగణం శ్రీమచ్ఛంకర భగవత్పాదుల సత్సంకల్ప బలంతో నాటి నుంచి నేటి వరకూ విశిష్ట ధార్మికస్ఫూర్తి కేంద్రంగా అలరారుతోంది. శారదాంబ ప్రధాన దైవతంగా అనేక దేవాలయాల సముదాయంగా రూపుదిద్దుకున్న ఈ క్షేత్రంలో అపూర్వ శిల్పకళా శోభితమైన రాజగోపురాన్ని నిర్మించాలని పూజ్యజగద్గురు శ్రీచరణులు సంకల్పించారు. తపోదీక్షాధనులైన శ్రీచరణుల సదాశయం కార్యరూపంలోకి రావడంతో శోభాయమానమైన దేవాలయ ప్రాంగణానికి అపురూపమైన ముఖద్వారంగా రాజగోపురం ఆకృతి దాల్చింది. సుమారు నూటడెబ్బై అడుగుల ఎత్తులో దాక్షిణాత్య శిల్పకళా శైలిలో రూపొందిన ఈ గోపురం కుంభాభిషేకం సందర్భంగా లోకకల్యాణాన్ని ఆకాంక్షిస్తూ వివిధ వైదిక కార్యక్రమాలను నిర్వహించారు. పద్నాలుగు రోజులపాటు వందలాదిమంది వైదికవేత్తలు, పూజ్య జగద్గురు శ్రీచరణుల పవిత్ర మార్గదర్శ నంలో లక్షమోదక హవనం, కోటి కుంకు మార్చన, అతిరుద్రం, చతుర్వేద సహస్ర చండీయాగాలను ఆదిత్య ఉపాసన, గణేశ పురాణ పారాయణాలు నిర్వహిం చారు. నూతనంగా నిర్మించిన శ్రీ తోరణ గణపతి దేవాలయం, రాజగోపుర మహాద్వార కుంభాభిషేకాలను పూజ్య జగద్గురు శ్రీచరణులు వేదమంత్రోచ్చారణలు, జయఘోషల మధ్య తమ కరకమ లాలతో జరిపించారు.

ఈ సందర్భంగా జరిగిన సార్వజనిక సభ, పూజ్య జగద్గురు శ్రీచరణుల సాన్నిధ్యంలో శృంగేరీ పీఠం ముఖ్య కార్యనిర్వహ ణాధికారి, పరిపాలనాధినేత వి.ఆర్. గౌరీశంకర్ నిర్వహించారు. జగద్గురు మహాస్వామి వారి ఆశీరనుగ్రహాల ప్రతిరూపంగా, ఆ మహనీయులు ఆదేశించిన విధంగా అపురూప శిల్పకళా శోభితమైన రాజగోపురం ఆకృతి దాల్చే కార్యాచరణ సమన్వయ పరచడం తన అదృష్టంగా భావిస్తున్నానని గౌరీశంకర్ వినమ్రంగా ప్రకటించారు. దేశంలో మరెక్కడా లేని విధంగా విశిష్టమైన రీతిలో శారదాంబ సన్నిధిలో రాజగోపురాన్ని ఆవిష్కరించాలనే ఆకాంక్ష, కార్యరూపం ధరించడంతో తాను పొందిన అనుభవా లను ఆయన సుదీర్ఘంగా పేర్కొన్నారు.

విశ్వశ్రేయస్సు, భక్తజనుల సుఖ సంతోషాలు లక్ష్యంగా రాజగోపుర నిర్మాణాన్ని సంకల్పించామని పూజ్య జగద్గురు శ్రీచరణులు తమ అనుగ్రహ భాషణంలో వెల్లడించారు. ఈ రాజగోపురం, గోపుర రాజంగా రూపుదిద్దుకోవాలనే లక్ష్యాన్ని కార్యరూపంలోకి తీసుకురావడంలో భాగస్వామ్యం స్వీకరించిన అందరికీ నారాయణ స్మరణపూర్వకంగా ఆశీస్సులు ప్రసాదిస్తు న్నట్టు శ్రీచరణులు అనుగ్రహించారు.

ఈ క్రమంలో రాజగోపుర నిర్మాణానికి నేతృత్వం వహించిన శిల్పకళావేత్తకు పూజ్యశ్రీచరణులు బంగారు హారం ప్రసాదించి ఆశీర్వదించారు. శ్రీమఠం కార్యకలాపాలను అంకిత భావంతో కొనసాగిస్తున్నట్టు ముఖ్య కార్యనిర్వహణాధికారి గౌరీశంకర్ కార్యదక్ష తను ప్రశంసిస్తూ, ఆయనకు బంగారు హారంతో పాటు రజత పతకం, శాలువాతో పూజ్యశ్రీచరణులు ఆశీరనుగ్రహాలు అందజేశారు. పూజ్యశ్రీచరణుల ఆశీరనుగ్రహాలతో భావోద్వేగా నికి లోనైన ముఖ్య కార్య నిర్వహణాధికారి సజల నయనాలతో తమ కృతజ్ఞతాభివందనాలను సమర్పించు కున్నారు. నేత్రపర్వంగా కొనసాగిన సార్వజనికోత్సవంలో వివిధ ప్రాంతాల నుండి తరలివచ్చిన భక్తజనులు, శ్రీచరణులకు గురువందనం సమ ర్పించి, సాష్టాంగ వందనాలతో తమ భక్తి ప్రపత్తులను చాటుకున్నారు.

**- శరదిందు**



# అద్వితీయం స్వర్ణగోపురం

**శృంగేరీ శారదాపీఠంలో చారిత్రక ఘట్టం... శ్రీ శారదాంబ ఆలయ స్వర్ణగోపుర కుంభాభిషేక మహోత్సవం.. విశేష ఆధ్యాత్మిక క్రతువులు.. విఖ్యాత కళాకారుల సంగీత, సాంస్కృతిక కార్యక్రమాలు... దేశ, విదేశాల నుంచి విచ్చేసిన ఎందరో పండితులు, ధార్మకవేత్తల కోలాహలం... సువర్ణ సొబగులద్దుకుని ధగధగలాడుతున్న శారదాంబ ఆలయ గోపురం, శిఖరానికి జగద్గురు శ్రీచరణులు తమ కరకమలములచే నిర్వహించిన కుంభాభిషేకం నేత్రపర్వం..ఈ సంరంభం నభూతో నభవిష్యతి.. జనవరి 28 నుంచి ఫిబ్రవరి 13 దాకా అత్యంత వైభవంగా జరిగిన ఈ మహోత్సవాలపై 'దర్శనమ్' అందిస్తున్న ప్రత్యేక వ్యాసం...**

ఫిబ్రవరి 1, 2017 శ్రీపంచమీ శుభదినాన దక్షిణామ్నాయ శ్రీ శారదా పీఠం శృంగేరి జగద్గురువులు శంకరాచార్య శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాసన్నిధానం వారు, జగద్గురు శంకరాచార్య శ్రీశ్రీ విధుశేఖర భారతీ సన్నిధానం వారు శృంగేరీ శ్రీ శారదాంబ ఆలయ స్వర్ణగోపుర కుంభాభిషేక మహోత్సవాన్ని నిర్వహించారు. ఉదయం 9 గంటలకు శ్రీ మహాసన్నిధానం వారు తొలుతగా గర్భాలయంలోని శ్రీశారదాంబకు 108 కలశాలలో నింపిన దివ్యమంత్రపూరిత మంగళద్రవ్య సంయుక్తమైన జలాలలో అభిషేకించారు. అర్చన, మహామంగళ ఆరతి, షోడశ ఉపచారాలను సమర్పించారు. ఈ సందర్భంగా సరస్వతీ సూక్తం, మేథాసూక్తం, శ్రీసూక్తం, లలితా సహస్రనామం వంటి దివ్యమంత్రాల, స్తోత్రాల పఠనం జరిగింది. అటుపిమ్మట శ్రీ మహాసన్నిధానం వారూ, శ్రీ సన్నిధానం వారు గర్భగృహంపై ఉన్న స్వర్ణశిఖరానికి కుంభాభిషేకాన్ని నిర్వహించారు. ఈ అభిషేక జలంలో గంగ, తుంగ, నర్మద, గోదావరి, కావేరీ, కృష్ణ వంటి



దివ్యనదుల పావనజలాలు వాడబడ్డాయి.

శిఖరంపై నుంచి తమ దివ్యానుగ్రహ భాషణాన్ని చేస్తూ శ్రీమహాసన్నిధానం వారు తమ పరమగురువులు జగద్గురు శ్రీ చంద్రశేఖరభారతీ మహాస్వాముల వారు ప్రస్తుతం ఉన్న శిలాలయాన్ని 1916లో నిర్మించి శ్రీశారదాంబను ప్రతిష్ఠించారని వివరించారు. శ్రీ శారదాంబ కృప, తమ గురువులరు జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వాముల దయాదృష్టి ఫలితంగా తాము ఈ ఆలయ శతాబ్ది సంబరా లను, కుంభాభిషేకంతో చేయ గలుగుతున్నామని, అమ్మవారికి స్వర్ణశిఖరాన్ని సమర్పించగలిగా మని చెప్పారు. ఈ సందర్భంగా వచ్చిన వేలాదిమంది శిష్యులకు, భక్తులకు శ్రీమహాసన్నిధానం వారు తమ ఆశీస్సులను అందించారు. ఆ తరువాత శ్రీ సన్నిధానం వారు లలితాపంచమీ సందర్భంగా శ్రీ శారదాంబకు ప్రత్యేక పూజలు చేశారు.

సాయంకాలం జగద్గురు శంకరా చార్య శ్రీశ్రీ భారతీతీర్థ మహాసన్ని ధానం వారు, జగద్గురు శంకరా చార్య శ్రీశ్రీ విధుశేఖర భారతీ సన్నిధానం వారి విద్యాశంకర దేవా లయం వద్ద భారీ సభలో నిర్మిం చిన వేదికపై ఆసీనులై, కార్యక్రమ శోభను ద్విగుణీకృతం చేశారు. వేదఘోషతోను, ప్రార్థనతో కార్య క్రమం ఆరంభమైంది. ముఖ్యకార్య నిర్వహణాధికారి శ్రీ వి.ఆర్. గౌరీశంకర్‌గారు సర్వులకు ఆహ్వానం పలికి, ఆపై శ్రీ శారదాంబ ఆలయ గర్భగృహంపై స్వర్ణశిఖరం సాకారమైన సుదీర్ఘ ప్రక్రియను వివరించారు. శ్రీ శారదాంబ దయ, శ్రీ మహాసన్నిధానం వారు, శ్రీ సన్నిధానం వారల అనుగ్రహం, భక్తుల శుభేచ్ఛ, దాదాపు 350 మంది కార్మికుల కృషి ఫలితంగా 12 కిలోల బంగారంతో కూడిన స్వర్ణశిఖరం కేవలం 9 నెలల రికార్డ్ కాలంలో పూర్తవగలిగిందని వివరించారు. ఈ సందర్భంగా ముఖ్య వాస్తుశిల్పి శ్రీ సుందరం, శిల్పరత్నం శంకర స్థపతి, శ్రీ ప్రసన్న ఆచార్, శ్రీ శృంగేశ్వర (ఇంజనీర్)లకు ప్రత్యేకంగా ఆశీర్వదించారు. కర్ణాటక తపాలా సర్కిల్, బెంగళూరు వారు సిద్ధపరిచి, కర్ణాటక పోస్ట్ మాస్టర్ జనరల్ తీసుకు వచ్చిన ప్రత్యే ఫస్ట్ డే కవర్‌ను, మై స్టాంప్ ను శ్రీ మహాసన్నిధానం వారు ఆవిష్కరించారు. ఆపై శ్రీ మహాసన్నిధానం వారు సంస్కృతం, హిందీ, కన్నడ, తెలుగు, ఆంగ్లం, మళయాళం, మరాఠీ భాషలలోని విఖ్యాతులైన రచయితలు రచించిన వ్యాసాలున్న విశిష్ట సంచిక సువర్ణ శారద అనే ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. ఈ సంచికను మఠానికి చెందిన శ్రీ శంకరాద్వైత శోధ కేంద్ర రూపొందించగా, మఠానికే చెందిన విద్యాభారతీ ముద్రణాలయం ముద్రించింది.

జగద్గురు శ్రీ చంద్రశేఖర భారతీ మహాస్వాముల వారి నేతృత్వంలో 1916లో శృంగేరీలో జరిగిన చారిత్రాత్మిక శారదాలయ కుంభాభిషేకం సందర్భంగా మైసూర్ సంస్థాన ఆస్థాన విద్వాంసులు కవిరత్నం, మందికల్ రామశాస్త్రిగారు సంస్కృతంలో రచించిన కుంభాభిషేక చంపు కావ్యాన్ని శ్రీ మహాసన్నిధానం వారు ఈ సందర్భంగా ఆవిష్కరించారు. ఈ కావ్యం పద్య, గద్యాత్మకమైన చంపూ శైలిలో కవి స్వయంగా దర్శించిన కుంభాభిషేక మహోత్సవ శోభను వర్ణించింది. శ్రీ మహాసన్నిధానం వారు జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామిగళ్ విద్యా ట్రస్ట్ వారి నేతృత్వంలో వచ్చే తత్త్వాలోక (ఆంగ్ల) మాసప్రతి ఆంగ్లంలోను, హిందీలోను ప్రచురించిన కుంభాభిషేక ప్రత్యేక సంచికను, దర్శనమ్ ఆధ్యాత్మిక పత్రిక ప్రచురించిన ప్రత్యేక సంచికను, స్తుతి సుధ అనే స్తోత్ర సంకలనాన్ని ఆవిష్కరించారు. శ్రీ వి.ఆర్. గౌరీశంకర్ గారు, వారి కుటుంబం భక్తులందరి తరపున శ్రీ మహాసన్నిధానం వారికి, శ్రీ సన్నిధానం వారికి శ్రీ శారదాంబ చందన ప్రతిమను సమర్పించారు. అంతకు ముందురోజు సాయంత్రం మఠంలోని సేవకులందరు కలిసి శ్రీశారదాంబకు సమర్పించిన పెద్ద వెండిపళ్లెంతో కుంభాభిషేక సందర్భంగా శ్రీశారదాంబకు విశేష అర్చన, అభిషేకం చేయబడ్డాయి.

ఈ సందర్భంగా అనుగ్రహ భాషణం చేస్తూ శ్రీ సన్నిధానం వారు ఇది చాలా సంతోషాన్ని కలిగించే సందర్భమని, తమ గురువులు శ్రీ మహాసన్నిధానం వారి చేతుల మీదుగా శాస్త్రానుసారం కుంభాభిషేక మహోత్సవం జరగిందని, ఇందుకు సాక్షులుగా మనం ఉండే భాగ్యం దక్కిందని చెప్పారు. పన్నెండు వందల సంవత్సరాల క్రితం శ్రీ



ఆదిశంకర భగవత్పాదులు శృంగేరీలో శ్రీ శారదాంబను ప్రతిష్ఠించారు. మన పరంపర గురువులు జగద్గురు శ్రీ సచ్చిదానంద శివాభినవ నృసింహ భారతీ మహాస్వాములవారు ప్రస్తుతమున్న దేవాలయ నిర్మాణాన్ని ప్రారంభించారు. పరంపర గురువులు వేలాదిమందిని దీక్షితులను చేసి గురుపరంపరలో విశిష్టమైన స్థానాన్ని పొందారు. గురుపరంపరలోని ఆచార్యస్వాములందరిని శ్రీ ఆదిశంకర భగవత్పాదుల అవతారాలుగా మనం గౌరవిస్తున్నాం. అయితే అభినవ శంకర అని కేవలం మన పరంపర గురువు గారినే స్మరిస్తున్నాం. ఆయన శృంగేరీ బెంగళూరు నుండి మూడురోజుల యాత్ర చేస్తేకాని శృంగేరీ చేరుకోలేని క్లిష్టకాలంలో ఈ ఆలయ నిర్మాణానికి పూనుకున్నారు. శృంగేరీ మారుమూల ప్రాంతమని, అక్కడ ఇంత విశాలమైన ఆలయం అనవసరమని అప్పట్లో ప్రజలు భావించేవారు. దూరదృష్టిగల ఆచార్యస్వాములు ఈ మహా లయాన్ని నిర్మించారు. నేడు వేలాదిమంది ఈ ఆలయాన్ని దర్శించడానికి వస్తున్నారు. ఇప్పుడు రెండువందల మంది భక్తులు ఒకేసారి శ్రీశారదాంబ దర్శనం పొందగలుగుతున్నారు.

**కుంభాభిషేక క్రతువు, మహాయాగాలు**

కుంభాభిషేకానికి సంబంధించిన క్రతువులను జనవరి 28, 2017న శ్రీ మహాసన్నిధానం, శ్రీ సన్నిధానం వారల దివ్య సమక్షంలో ఆరంభమైనాయి. వేదబ్రహ్మశ్రీ తంగిరాల సీతారామ శర్మ, వేదబ్రహ్మశ్రీ తంగిరాల వేంకట శివకుమార శర్మలు ఈ కుంభాభిషేక కార్యక్రమ క్రతువు నిర్వహణ చేశారు. ఆస్థాన విద్వాంసులు ఎం.ఎ. నాగరజ భట్ హోమ కార్యక్రమాన్ని నిర్వహించారు. సాయంకాలం శ్రీ సన్నిధానం వారి దివ్యసముఖంలో భక్తులు, శృంగేరీ పరిసరవాస్తవ్యులు సంప్రదాయ ధోరణిలో హొరె కణికె సమర్పించారు. మరునాడు (జనవరి 29) లక్షమోదక గణపతి హోమం సాగింది. ఈ కార్యక్రమంలో భాగంగా విశ్వశాంతి కోసం, ప్రజాసంక్షేమం కోసం, దేశప్రగతి కోసం అనేక ధార్మిక కార్యక్రమాలు నిర్వహించబడ్డాయి. అతిరుద్ర మహాయాగం (జనవరి 30 నుంచి ఫిబ్రవరి 10), కోటికుంకుమార్చన (ఫిబ్రవరి 2 నుంచి ఫిబ్రవరి 12), సహస్రచండీ మహాయాగం (ఫిబ్రవరి 5 నుంచి ఫిబ్రవరి 9), చతుర్వేద పారాయణలు,



ఆదిశంకరాచార్యుల ప్రస్థానత్రయ భాష్య ప్రవచనాలు, దేవిభాగవతం, లలితోపాఖ్యానం, సప్తశతి పారాయణ వంటి కార్యక్రమాలు నిర్వహింపబడ్డాయి.

కుంభాభిషేక కార్యక్రమాలలో భాగంగా ప్రతిరోజు శ్రీశారదాంబ ఆలయం ముందు సభామండపంపై విఖ్యాత కళాకారుల కళాప్రదర్శనలు, సంగీత కచేరీలు జరిగాయి. జనవరి 28, 2017న శ్రీ సన్నిధానం వారు దీపప్రజ్వలనతో సాంస్కృతిక కార్యక్రమాలను ఆరంభించారు. ప్రతి సాయంత్రం శ్రీ సన్నిధానం వారు సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొన్నారు. కళాకారులు సాయంకాలం తమ కళాప్రదర్శనకు ముందు మొదటగా గురునివాసంలో శ్రీ మహా సన్నిధానం వారి, శ్రీ సన్నిధానం వారి దర్శనం చేసుకున్నారు. ప్రతి కార్యక్రమం మొదట కార్యనిర్వహణాధికారి శ్రీ వి.ఆర్. గౌరిశంకర్ కళాకారులను శ్రీ సన్నిధానం వారికి పరిచయం చేసి, వారి దివ్యసమక్షంలో కళాకారులను సన్మానించారు. సంగీత సరస్వతి శ్రీమతి సుధా రఘునాథన్, సంగీత సుధాసింధు శ్రీమతి అరుణా సాయిరాం, శ్రీ రామకృష్ణన్ మూర్తి వంటి గాయకులు, సంగీత కళానిధి, ఆస్థానవిద్వాంసులు శ్రీ కదిరి గోపాలనాథ్ (సాక్సఫోన్), ఆస్థాన విద్వాంసులు శ్రీ ప్రవీణ్ గోడ్‌హోకింది (వేణువు), ఆస్థాన విద్వాంసులు పండిత నరసింబ వాదవతి (క్లారినెట్), ఆస్థాన విద్వాంసులు శ్రీ ఎస్. కాశిం, శ్రీ ఎస్.బాబు (నాదస్వరం), శ్రీ యు.రాజేశ్ (మండోలిన్), శ్రీ గురు కరైక్కుడి ఆర్. మణి బృందం (నాదనీరాజనం), శ్రీమతి సిక్కిల్ మాలా చంద్రశేఖర్ (వేణువు), శ్రీ ఆనూర్ అనంతకృష్ణశర్మ (ఫ్యూజన్), శ్రీ అశ్విన్ ఆనంద్ (వీణ), శ్రీ శ్రీధర్ (వాయులీనం), శ్రీ ఓ.ఎస్. అరుణ్ (భజనలు), ఆస్థానవిదుషి శ్రీమతి సంగీతా కులకర్ణి కట్టి, ఆస్థానవిద్వాన్ శ్రీ శెన్కోట్టై హరిహర సుబ్రహ్మణ్య భాగవతార్ వంటి కళాకారులు తమ కళాప్రదర్శనలు ఇచ్చారు.

వాయులీన విద్వాంసుడు శ్రీ ఆర్.కె. శ్రీరాంకుమార్, వేణుగాన నిపుణురాలు శ్రీమతి సిక్కిల్ మాలా చంద్రశేఖర్, మృదంగ విద్వాంసులు శ్రీ గురు కరైక్కుడి ఆర్. మణి, శ్రీ ఆనూర్ అనంతకృష్ణశర్మ, మాండోలిన్ విద్వాంసుడు శ్రీ యు. రాజేశ్, గాయకుడు శ్రీ రామకృష్ణన్ మూర్తి, భజన గాయకుడు శ్రీ ఓ.ఎస్. అరుణ్‌లను ఆస్థాన విద్వాంసులుగా నియమించారు. మఠంలోని నాదస్వర కళాకారుడు శ్రీ జ్ఞనమురుగన్‌హోను ప్రత్యేకంగా అభినందించారు. వీరు తండ్రిగారు శ్రీ సారంగపాణి దశాబ్దాలుగా నాదసర్వ విద్వాంసునిగ మఠం సేవలో ఉన్నారు. ఫిబ్రవరి 13, 2017న శారదాంబ రథోత్సవంనాడు శ్రీ జ్ఞానమురుగన్‌హోను సన్మానించి, ఆస్థాన విద్వాంసునిగా నియమించారు.

17 రోజుల పాటు సాగిన ఈ కుంభాభిషేక మహోత్సవంలో పాలుపంచుకోవడానికి దేశం నలుమూలల నుంచే కాక, విదేశాల నుంచి సైతం భక్తులు వచ్చారు. ఫిబ్రవరి 13, 2017న ఈ శ్రీ శారదాంబ మహోత్సవాలు ముగిసాయి. ఫిబ్రవరి 14, 2017న శ్రీ మహాసన్నిధానం వారి సమక్షంలో తెప్పోత్సవం నిర్వహించహడింది.

### కృష్ణ యజుర్వేద సాయణ భాష్య కన్నడానువాదం

మరుసటి రోజు శ్రీ మహాసన్నిధానం వారు కృష్ణ యజుర్వేదానికి శ్రీ సాయణాచార్యుల వారు వెలయించిన సాయణ భాష్యపు కన్నడ అనువాదపు 11వ గ్రంథాన్ని సానుగ్రహంగా విడుదల చేశారు. శ్రీ శృంగేరీ జగద్గురువుల వారి దివ్యాశీస్సులతో వైదిక విలువల ప్రచారం, సంప్రదాయ పరిరక్షణలో నిమగ్నమైన జ్యోతి సాంస్కృతిక ప్రతిష్ఠాన, బెంగళూరు వారు ఈ పుస్తకాలను ప్రచురించారు. ఈ సంకలనంలో తైత్తిరీయ సంహిత పంచమకాండ కు చెందిన పంచమ, షష్ఠమ, సప్తమ ప్రశ్నల భాష్యానికి అనువాదం ఉంది. ఈ ప్రతిష్టానానికి చెందిన శ్రీ నరసింహన్, సంపాదకుడైన విద్వాన్ శ్రీ ఎస్.టి.నాగరాజు గారలను శ్రీ మహాసన్నిధానం వారి ఆశీర్వదించారు. వీరిని ముఖ్య కార్యనిర్వహణాధికారి సన్మానిం చారు. ఈ సందర్భంగా అనుగ్రహ భాషణాన్ని అనుగ్రహిస్తూ శ్రీ మహా సన్నిధానం వారు వేద, శాస్త్ర ప్రాముఖ్యాన్ని వివరించారు.

### అద్వైత శారద ప్రాజెక్ట్
### రెండవ విడుదల

ఫిబ్రవరి 2, 2017 నాడు శార దాలయ స్వర్ణశిఖర కుంభాభిషేక ఉత్సవాలలో భాగంగా శ్రీ జగద్గురు

శంకరాచార్య శ్రీశ్రీ భారతీతీర్థ మహాసన్నిధానం వారు అద్వైత శారద ప్రాజెక్ట్ రెండవ దశను తమ కరకమలాలతో ఆవిష్కరించారు. తొలి దశలో దక్షిణామ్నాయ శ్రీ శారదా పీఠపు 33వ జగద్గురువులు శ్రీశ్రీ సచ్చిదానంద శివాభినవ నృసింహ భారతీ మహాస్వాముల వారి పర్యవేక్షణలో జగద్గురు శ్రీ ఆదిశంకరాచార్యుల వారి సమగ్ర సాహిత్యాన్ని ఆవిష్కరించడం జరిగింది. అనేక తాళపత్ర గ్రంథాలను సేకరించి, పరిష్కరించి సిద్ధం చేసిన ఈ సమగ్ర సాహిత్యాన్ని శ్రీరంగంలోని వాణీవిలాస ముద్రణాలయం శ్రీ శంకర గ్రంథావళి పేరిట ప్రచురించింది. కాలడిలోని శారదాంబ ఆలయం, ఆదిశంకర భగవత్పాదుల ఆలయాలకు 1910వ సంవత్సరంలో జరిగిన ప్రతిష్ఠ కుంభాభిషేక శు భసందర్భంలో జగద్గురువులు శ్రీ శంకర భగవత్పాదుల వారి ప్రస్థానత్రయ భాష్యాన్ని (ప్రస్తుత సంకలనంలోని 20 గ్రంథాలలో గల 10 గ్రంథాలు) తమ కరకమలాలతో ఆవిష్కరించారు. దాదాపు శతాబ్దికాలం తరువాత 2014లో శ్రీ శంకర జయంతి ఉత్సవాల సందర్భంగా ఈ ప్రస్థానత్రయ భాష్యపు శోధనకు అనుకూలమైన ఇంటర్‌నెట్ ప్రతికృతిని దక్షిణామ్నాయ శ్రీ శారదా పీఠ 36వ జగద్గురువులు శ్రీశ్రీ భారతీతీర్థ మహాసన్నిధానం వారు తమ దివ్య కరకమలాలతో ఆవిష్కరించారు.

శ్రీ శారదాపీఠం వారి శ్రీ శంకరాద్వైత పరిశోధన కేంద్రం ఆరంభిస్తున్న ఈ ప్రాజెక్టుకు అద్వైత శారద అని నామ కరణం చేయడం జరిగింది. ఈ ప్రాజెక్టుకు మైసూరుకు చెందిన శ్రీరంగ డిజిటల్ సాఫ్ట్‌వేర్ టెక్నాలజీస్ సాంకేతిక సహకారాన్ని అందిస్తున్నది. శ్రీ మహాసన్నిధానం, శ్రీ సన్నిధానం వారల పర్యవేక్షణలో సాగే ఈ అద్వైత శారద ప్రాజెక్టు తొలిసారిగా అనేక వ్యాఖ్యాన గ్రంథాలను అద్భుతమైన రీతిలో, సరళమై ఆకర్ష ణీయమైన తీరులో మనముందుకు తెస్తున్నది. అనేక మార్పులు, సంస్కరణల తరువాత విడుదలవుతున్న ఈ రెండవ ప్రచురణలలో బ్రహ్మసూత్రాలకు, గీతాభాష్యానికి వెలయించిన రత్నప్రభ, శ్రీ పద్మపాదాచార్యుల పంచపాదికలు, తైత్తిరీయో పనిషత్ భాష్యంపై శ్రీ సురేశ్వరాచార్యుల వార్తికలు ఉన్నాయి.

ఇతర గ్రంథాలలో శ్రీ శారదాపీఠ 11వ ఆచార్యులైన జగద్గురు భారతీ తీర్థ 1 స్వాములవారి 14వ శతాబ్దపు బ్రహ్మసూత్ర వ్యాఖ్యానం వైయశికవ్యాయమాల, శ్రీ తోటకాచార్యులవారి శ్రుతిసారసముద్ధరణం,శ్రీ శంకర భగవత్పాదుల వ్యాఖ్యానంతో కూడిన శ్రీ హస్తామలకాచార్యుల వారి హస్తామలకీయం ఉన్నాయి. శ్రీ శారదాపీఠ పంచమ పీఠాధీశ్వరులైన జగద్గురు శ్రీ





జ్ఞానోత్తమాచార్యుల వారి శిష్యుడైన శ్రీ ఉత్తమజ్ఞ యతివరులచే రచింపబడిన వక్తవ్య కాశికా అనే పంచపాదికా లఘుటీక వీటిలో ఉంది. అంతేకాదు భగవత్పాదులవారి వివేక చూడామణి, సర్వవేదాంత సిద్ధాంతసారసంగ్రహ, శతశ్లోకి వంటి ప్రకరణాను కూడ పొందపరచడం జరిగింది. రాబోయే కాలంలో మరిన్ని గ్రంథాలు, వ్యాఖ్యానాలు, టీకలను చేర్చడం జరుగుతుంది.

శ్రీ మహాసన్నిధానం వారి శ్రీముఖాలతో ఆశ్వీరదింపబడిన వెబ్ సైట్ http://www.advaitasharada.sringeri.net లో ఈ విషయసామగ్రిని ఎవరైనా పొందవచ్చు. ఈ సందర్భంగా శృంగేరి డిజిటల్ సాఫ్ట్‌వేర్ టెక్నాలజీస్ కు చెందిన ప్రొ. యోగానంద, శ్రీ అర్జున కశ్యప, విద్వాన్ రాఘవేంద్ర గారలను సన్మానించడం జరిగింది.

శృంగేరి ఆస్థాన పండితులు తంగిరాల శివకుమార శర్మ ఆంగ్ల నివేదకకు తెలుగు అనువాదం... పూర్ణప్రజ్ఞాభారతి.

# జగద్గురువుల అనుగ్రహభాషణం చారిత్రక సందర్భం

దక్షిణామ్నాయ శ్రీశృంగేరీ శారదాపీఠం చరిత్రలో జనవరి 4వతేదీ మరపురాని సందర్భాల్లో ముఖ్యమైంది. శృంగేరి పీఠాధీశులుగా శ్రీ భారతీతీర్థ మహాస్వామి వారి పీఠాధిరోహణ రజతో త్సవాలు ఆ రోజున వైభవంగా జరిగాయి. అంతకు ముందు రోజు నుంచే పీఠంలో ఘనంగా వైదిక, ధార్మిక కార్యక్రమాలు జరిగాయి. నాలుగో తేదీ సాయంత్రం జరిగిన సార్వజనిక గురు వందన సభలో ఓ చారిత్రక సన్నివేశం ఆవిష్కృతమైంది. శ్రీ కుప్పా వెంకటేశ్వర ప్రసాద శర్మ అను బ్రహ్మచారిని ఉత్తరాధి కారిగా నియమించుటకు శారదాంబ ఆజ్ఞానుసారము నిర్ణయిం చినట్లు జగద్గురువులు తమ అనుగ్రహభాషణంలో ప్రకటించారు. ఈ చారిత్రాత్మక శ్రీచరణుల అనుగ్రహభాషణం సందే శాన్ని యథాతథంగా "దర్శనమ్" పాఠకులకోసం అందిస్తున్నాం...

*"సనాతన ధర్మోద్ధారకులు శ్రీశంకర భగవత్పాదులు భారతదేశపు తత్త్వవేత్తలలో అగ్రగణ్యులు. శంకరుల వంటి తత్త్వజ్ఞాని ద్రష్ట మరొకరు పుట్టలేదీ దేశంలో. వారు కేవలం 32 సంవత్సరాలే జీవించినా వందమంది, వంద సంవత్సరాల కాలంలో కూడా చేయజాలని కార్యములు సాధించినవారు. మనమూహించుటకు సాధ్యముగాని విధముగా 8 సంవత్సరాలకే వేదములలోను, 12 సంవత్సరాలకే సర్వ శాస్త్ర ములలోను నిష్ణాతులయ్యారు. 16 సంవత్సరాలు నిండకముందే భాష్యరచన పూర్తిగావించారు. అంతటి మహిమా సంపన్నులు శంకరులు. శంకరుల దృష్టి అత్యంత విశాలమయినది. సంకుచిత భావమన్నది కానరాదు. కేవలము తన కాలమున మాత్రమే ధర్మ ప్రచారము జరిగిన చాలదని, శాశ్వతముగా ధర్మ ప్రచారము కొనసాగుటకు చతురామ్నాయ పీఠములను స్థాపించిరి. ఈ 4 పీఠాలలో దక్షిణామ్నాయ శృంగేరి పీఠము యెడ ప్రత్యేక ఆదరణ చూపినారు. వారికి పద్మపాద, సురేశ్వర, హస్తామలక, తోటక అను నలుగురు ప్రధాన శిష్యులున్నారు. అందు సురేశ్వరులు అత్యంత యోగ్యత కలవారు. సురేశ్వరుల యెడల ప్రీతి వాత్సల్యము చూపి వారిని ఈ పీఠమునకు ప్రథమ ఆచార్యునిగ నియమించారు. సురే శ్వరులు సకల శాస్త్రనిష్ణాతులు, ఆచారసంపన్నులు, శిష్యానుగ్రహ తత్పరులు. ఈ పీఠ ఆచార్యులకు ఉండవలెనని శంకరులు నిర్దేశిం చిన లక్షణములన్నియు గలవారు. అనంతరము వారి శిష్యులు నిత్యబోధఘనాచార్యులు మొదలు మా గురువుల వరకు ఈ పీఠము నధిష్ఠించిన ఆచార్యులందరు పండితులు, శిష్యానుగ్రహ తత్ప రులు, సంచార నిరతులు, ధర్మప్రచార నిరతులు, తత్త్వోపదేశ పరా యణులు అగు ఆదర్శ పీఠాధిపతులు. ఇట్లు ఈ పీఠము ఉజ్వల గురుపరంపర కలిగియున్నది. భగవత్పాదులచే నిర్దేశించబడిన కర్తవ్యములను పీఠ ఆచార్యులందరు నిర్దిష్టముగా పాటించినవారే. అదే ఈ పీఠ వైశిష్ట్యం. ఈ గురు పరంపరలో మా గురువులు అత్యంత దక్షతతో పీఠము నడిపి, ఆ బాధ్యతలను నాకు అప్పగించి జవాబుదారునిగా చేశారు. నేను మా గురువులను శాస్త్రాధ్యయనం కొరకే ఆశ్రయిం చాను. కొన్నేళ్ళ తర్వాత ఒక నాడు నన్ను పిలిచి "నిన్ను నా ఉత్తరాధికారిగా స్వీకరించుటకు నిర్ణయించాను" అని చెప్పారు. నా ఆశ్చర్యానికి అంతులేక పోయింది. శాస్త్రాధ్యయనం చేసుకుంటూ లౌకిక ప్రపంచానికి దూరంగా ఉంటూ నివృత్తి మార్గము ననుస రించవలెనని నా అభిలాష. మఠాధిపత్యము అన్నది నా మనసులో లేదు. మా గురువులు - మనసులో ఏ అనుమానము పెట్టుకో వలదు. శారదాంబ దివ్య నిర్ణయమువల్లనే అంతయు జరుగు చున్నది. ఒకసారి దైవ నిర్ణయం జరిగితే అవసరమగు యోగ్యతలన్నీ శారదాంబయే ప్రసాదించును. ఎట్టి సందేహము వలదు అని అభయమిచ్చిరి. నాటినుండి నా సందేహములన్నియు నశించినవి. అనంతరము విషయములెట్లు పరిణమించి, పురోగమించినవో మీరే ప్రత్యక్ష సాక్షులు.*

*మా గురువులు యే రీతిన నన్ను అనుగ్రహించినారో, అదే రీతిలో నా కర్తవ్య పరిపూర్తి గావించవలెనని ఆలోచన నా మనసులో ఉన్నది. నాకు 64 యేళ్ళ వయసు వచ్చినది. మా గురువులకు 57 సంవత్సరములప్పుడు నాకు సన్యాసాశ్రమం ఇచ్చారు. ఆ విధంగా చూస్తే నేను 7 సంవత్సరాలు వెనుకబడితిని. కొంతకాలంగా పీఠాధి పతిగా అత్యంత ముఖ్యమైన నా కర్తవ్యమునెట్లు నిర్వహించవలెనని యోచనలోనున్నాను. ఈ పీఠపు జగద్గురువుల ముఖ్య బాధ్యతలలో ఉత్తరాధికారి నియామకము ఒకటి. ఈ విషయములో మా గురువులు తమాషాగా : "స్వాములూ ఈ మఠానికి ఉత్తరాధికారి ఎంపిక అన్నది ఒక క్లిష్ట పరీక్ష. నేను ఆ పరీక్షలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడనయ్యాను" అని అంటూ ఉండేవారు. యోగ్యుడైన ఉత్తరాధికారిని ఎంపిక చేసినందుకు ఎంతో ఆనందించారు. అదే రీతిలో నేనూ ఆ పరీక్ష ఉత్తీర్ణత కావలసియున్నది.*

*ఆ శారదాంబ తన ఇచ్ఛను మా గురువులకెట్లు తెలియ*

పరచినదో అదేవిధంగా నేను కూడా ఉత్తరాధికారిని స్వీకరించుటకు శారదాంబ అనుమతి పొంది, మఠ పాలనా రీతి నీతులందు సుశిక్షితుని చేసి నా వలె తీర్చిదిద్దుటకు శారద అనుజ్ఞ పొందినాను. గత 5-6 సంవత్సరాలుగా నావద్ద శాస్త్రాభ్యాసము చేయుచున్న బ్రహ్మచారి, సంపూర్ణముగ న్యాయశాస్త్రము అభ్యసించిన కుప్పా వెంకటేశ్వర ప్రసాదశర్మ అను బ్రహ్మచారిని శిష్యునిగా స్వీకరించి, అతనికి యత్యాశ్రమ ప్రదానం చేసి, ఉత్తరాధికారిని చేయవలెనని తీర్మానించితిని. అమ్మవారి సన్నిధిలో శారదాంబ అనుజ్ఞ ననుస రించి ఈ సభా ముఖముగా ప్రకటన చేస్తున్నాను. క్రమాంత వేదాధ్యయనము, సంపూర్ణ న్యాయశాస్త్ర అధ్యయనం చేసి, విరక్తుడు, ఆచారవంతుడు, గురుభక్తి కలిగి, సకల సద్గుణలక్షితు డైన ఈ బ్రహ్మచారికి యత్యాశ్రమం ఇచ్చి, నా ఉత్తరాధికారిగ చేయుటకు తీర్మానించితిమి. ఈ శిష్యస్వీకార ఉత్సవములు మాఘ శుద్ధ ద్వితీయ, తృతీయలలో జరుపుటకు నిర్ణయమైనది. శారదాంబ కృపచే 22 మాఘ.శుద్ధ ద్వితీయనాడు సన్యాసప్రదాన కార్యక్రమాలు ప్రారంభమై, మాఘ శుద్ధతృతీయ నాడు ప్రణవ మహావాక్యోపదేశము చేసి ఉత్తరాధికారిగా పరిగ్రహించుట జరుగును.

ఈ పీఠ శిష్యులెల్లరు జగద్గురువుల ఆదేశములను ఏ సందేహములేక, శిరసా వహించువారే. మీరందరు యే విధముగా నా ఆదేశములను పాటించుచున్నారో, నా అభిప్రాయమును అనుసరించి నాకు సంతోషము కలిగించుచున్నారో, అదేరీతిన శిష్యపరిగ్రహ విషయమునగూడా సహకరించి, అదేరీతిలో మా ఆదేశములను అనుసరించి గురువును ఆనందింపచేయవలెనని ఈ సభాముఖముగా తెలియచేయుచున్నాను. శృంగేరి శారదా పీఠమున 40 సంవత్సరాల అనంతరము మరలా ఈ ఉత్తరాధికారి స్వీకారోత్సవం జరుగుచున్నది. 1974లో మాగురువులు ఈ కార్యక్రమం నిర్వహించారు. 40 సంవత్సరాల అనంతరం నేను మరల ఈ కార్యక్రమము నిర్వహించుచున్నాను. ఈ వార్త వెను వెంటనే అందరు శిష్యులకు చేరగలదని, ఇంతమంది సమావేశ మైన ఈ సందర్భములో ప్రకటించుట జరిగినది. మీరందరు నన్ను ఎంతో శ్రద్ధాగౌరవములతో సంభావించుచుందురు. ఎట్టి పక్షపాత భావనలేక అందరిని సమభావంతో చూచి, కర్తవ్య నిర్వహణ చేస్తానని మీకు తెలుసు. అదేరీతిలో ఉత్తరాధికారికూడా నా వలె ప్రవర్తించుననుటలో ఎట్టి సందియము లేదు. ఈ మఠ సన్యాసి అయిన పిదప, నేను ఈ ప్రాంతపువాడిని, ఆ రాష్ట్రపువాడిని అను భావన దరిచేరనిచ్చు అవకాశమే లేదు. శృంగేరి పీఠమునకు చెందినవారయినంతనే సమస్త జగత్తుతో సంబంధము గలవాడగును.

ఒక ప్రాచీన సూక్తి యిట్లు చెప్పుచున్నది : అయంనిజః పరోవేతి గణనా లఘుచేతసాం, ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబ కమ్. ఈ మఠమున కధిపతి అయిన వ్యక్తి ఉదారచరితుడు కావలె, లఘుచేతసుడై ఉండజాలడు. జననిశారద అట్లు జరుగనీయదు. మీరెల్లరు ఏవిధంగా నా ఆజ్ఞానువర్తులై ఈ పీఠ పురోగతిలో సహకరించిరో, అట్లే ఉత్తరాధికారి శిష్యస్వీకారోత్సవమున గూడ సహకరిస్తారని ఆశిస్తున్నాను. గత పాతిక సంవత్సరాలలో ఎన్నో సత్కార్యములు నిర్వ హించు టకు అమ్మ శారదాంబ నన్నొక సాధనంగా వినియో గించినది. ఇదంతయు నా వలన జరిగిన దని నేనెప్పుడూ భావించను. ఈ పట్టాభి షేక రజతోత్సవములు కేవలం శార దాంబ యొక్క మా గురువుల యొక్క సంకల్పబలం వల్లనే జరిగినవి. పూర్వము విద్యారణ్యులకు హక్క, బుక్కలు సహకరిం చినట్లు, నాకు గౌరీశంకర్ సహకరించి ఎన్నో మంచి కార్యములు సాధించుటకు అవకాశం కలిగించెను. హక్క, బుక్కలను విద్యా రణ్యులు ఆశీర్వదించిన విధముగనే నేను గౌరీశంకర్‌ను ఆశీర్వ దించుచున్నాను. ఈ మఠపురోభివృద్ధికి మీరెల్లరూ అందించిన సహకారమును హృదయ పూర్వకముగా స్వీకరిస్తున్నాను. ఇట్టి సహకారమునే భవిష్యత్తులో కూడా ఇచ్చెదరని ఆశిస్తున్నాను. ఈ మఠము సర్వులకు ధర్మమార్గమును చూపుగాక, నిరంతరాభివృద్ధి నొందుగాక, మీ అందరకు నా ఆశీస్సులు. గౌరీశంకరు నేతృత్వ ములో శృంగేరి పురజనులందరు ఎంతో భక్తివిశ్వాసములతో ఈ రజతోత్సవ కార్యక్రమాలు జరిపించారు. శృంగేరి పురజనులందరికీ, ముఖ్యముగా శృంగేరి ఎమ్.ఎల్.ఎ శ్రీ జీవరాజు గారికి నా ఆశీ స్సులు. ఈ దేశపు వివిధ ప్రాంతాల నుండి ఎందరో భక్తులు వచ్చి యున్నారు. ఇంకొక పక్షం దినములలో శిష్యస్వీకారోత్సవమునకు మరల రావలసి యుండును. మిమ్ములనందరను ఆశీర్వదించుచూ ఈ ప్రవచనము ముగించుచున్నాను.

హర నమః పార్వతీపతయే హరహర మహాదేవ ...



శ్రీవారి చరణారవిందాలు



# అంగరంగ వైభవం.. శిష్య స్వీకారోత్సవం

## సంప్రదాయబద్ధంగా సన్యాస స్వీకార మహోత్సవం... తరలివచ్చిన అశేష భక్తులు
## వాక్యోపదేశం, యోగపట్టా అందించిన జగద్గురు భారతీతీర్థ స్వామి

**ప్రపంచంలోని హైందవలోకం సువర్ణాక్షరాలతో లిఖించదగిన రోజది. ఆదిశంకర భగవత్పాదులు స్థాపించిన చతురామ్నాయ జగద్గురు పీఠాలలో అత్యంత విశిష్టతను, ప్రాముఖ్యతను సంతరించుకున్న శ్రీ శృంగేరి శారదాపీఠంలో ఉత్తర పీఠాధిపతి 'శిష్య స్వీకార మహోత్సవం' అంగరంగ వైభవంగా జరిగింది. 2015 జనవరి 22 మాఘ శుద్ధ విదియ నాడు సన్యాస గ్రహణ పూర్వాంగ కార్యక్రమాలు ప్రారంభ మయ్యాయి. 23వ తేదీ నాడు తుంగా నదీతీరంలో శ్రీమహాసన్నిధానం, శిష్యుడికి కాషాయ వస్త్రాలు, దండం, కమండలం అనుగ్రహించారు. శ్రీశ్రీశ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వాముల అధిష్ఠానంలో శ్రీచరణులు శిష్యుడికి ప్రణవోపదేశం చేసి, మహావాక్యోపదేశం చేసి వారికి 'శ్రీవిధుశేఖర భారతి' అనే యోగపట్టాను అనుగ్రహించారు. అక్కడ శ్రీ శారదాదేవి ఆలయంలో వ్యాఖ్యాన సింహాసనంపై ఆసీనులను చేసి, ఆయన శిరస్సు మీద ఒక సాలగ్రామం ఉంచి, దానికి పూజ చేశారు. తరువాత శ్రీ విధుశేఖర భారతి స్వామి వారు శ్రీ భారతీతీర్థ మహాస్వామివారికి పాదపూజ చేశారు. సన్యాసి యొక్క అనుష్ఠాన క్రమాన్ని శ్రీ మహాసన్నిధానం, శ్రీవిధుశేఖర తీర్థులకు తామే స్వయంగా ఉపదేశించారు. మఠంలో పాటించవలసిన సంప్రదాయాలన్నీ బోధించారు. శ్రీభారతీతీర్థ మహాస్వామి వారి ఆశీస్సులతో జగత్ప్రసిద్ధమైన శ్రీశృంగేరీ వ్యాఖ్యాన సింహాసనమున 37వ పీఠాధీశ్వరులుగా శ్రీశ్రీశ్రీ విధుశేఖర భారతి స్వామివారు నిర్ణయించబడటం తెలుగు జాతి చేసుకున్న పూర్వజన్మసుకృతం.**

శంకర భగవత్పాదులు భారతదేశపు నాలుగు దిక్కుల లోను ప్రతిష్ఠించిన పీఠాలలో శృంగేరి శ్రీ శారదాపీఠం ప్రధాన మైనది... సనాతన ధర్మానికి రాజధానిలా భాసిల్లుతోంది. ప్రస్తుత పీఠాధిపతులు జగద్గురు శంకరాచార్య శ్రీభారతీ తీర్థమహాస్వామి వారు పీఠం ఉత్తరాధికారిగా శ్రీ కుప్పా వెంకటేశ్వర ప్రసాదు అనే బ్రహ్మచారి యోగ్యుడని భావించి... శారదాపరమేశ్వరి ఆజ్ఞగా జనవరి 4 న శ్రీచరణులు సభాముఖంగా ప్రకటించారు. శ్రీ భారతీ తీర్థమహాస్వామి వారి సమక్షంలో వారి శిష్య స్వీకార మహోత్సవం శృంగేరిలో సంప్రదాయానుసారముగా, అత్యంత వైభవంగా జరిగింది.

సనాతనధర్మోద్ధారకులు, అద్వైత సిద్ధాంత ప్రతిష్ఠాప నాచార్యులునైన జగద్గురు శ్రీమచ్ఛంకరభగవత్పాదా

చార్యులవారు భారతదేశపు నాలుగుదిక్కులందు ప్రతిష్ఠించిన చతురామ్నాయ పీఠములలో దక్షిణామ్నాయ శృంగేరీశారదాపీఠము ప్రథమమూ, ప్రధానమూ అయినది. నాటినుండి నేటివరకు ఈపీఠము అవిచ్ఛిన్న గురుపరంపరా సముల్లసితమై విరాజిల్లుచున్నది. ఈపీఠము నధిష్ఠించిన ప్రతియొక్క ఆచార్యులూ సదాచారసద్ధర్మ పరిపాలనా నిరతులై జిజ్ఞాసువులగు శిష్యులకు ధర్మబ్రహ్మతత్త్వముల నుపదేశించుచూ ఈపీఠముయొక్క కీర్తిని సర్వవ్యాప్త మొనర్చియున్నారు. ప్రకృతము ఈపీఠమునందు విరాజమా నులగు జగద్గురు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారు ఈమహోజ్జ్వలపరంపరలో 36వవారు. వీరు సకలశాస్త్ర పారంగతులు, బహుభాషాకోవిదులు, అప్రతిమవాగ్వైఖరీ సంపన్నులు, ఆశ్రమధర్మానుష్ఠాననిష్ఠాగరిష్ఠులై, ఆదర్శ పీఠాధిపతిగ వెలుగొందుచున్నారు.

శృంగేరీమఠమును సర్వవిధముల అభివృద్ధిపరచి, అనేకజనోపయోగకార్య క్రమములను చేపట్టి, సర్వజనవందనీయులై యున్నారు. శ్రీచరణులు యోగ్యుడగు ఉత్తరాధికారి శిష్యుని పరిగ్రహింపవలయునని సంకల్పించినారు. శ్రీచరణుల సన్నిధిలో అయిదారు సంవత్సరములనుండి శాస్త్రాధ్యయనము చేయుచున్న శ్రీ కుప్పా వేంకటేశ్వరప్రసాదశర్మ అనుబ్రహ్మచారి అందుకు తగినవాడని శ్రీశారదాపరమేశ్వరి యాజ్ఞ అయినది. వేదశాస్త్రనిష్ణాతుడు, విరక్తుడు, సదాచారపరుడుగ నుండి సర్వవిధముల యోగ్యుడయియున్న ఈ బ్రహ్మచారికి శ్రీచరణులు సంన్యాసాశ్రమ మొసంగి, తమఉత్తరాధికారిగ స్వీకరింప నిశ్చయించి, తమనిశ్చయమును 4-1-2015న తమ పట్టాభిషేకరజతమహోత్సవ సందర్భమున శృంగేరిలో జరిగినసభలో తెలియపరచారు.

**సంన్యాసాశ్రమస్వీకారం**

సంన్యాసాశ్రమస్వీకార కార్యక్రమం జయసంవత్సర మాఘ శుద్ధ ద్వితీయ(విదియ) జనవరి 22వ తేదీనాడు ఉదయం ప్రారంభమైనది. ఆనాటి ఉదయం బ్రహ్మచారి శ్రీ వేంకటేశ్వరప్రసాదశర్మ, శ్రీజగద్గురువులకు ప్రణమిల్లి, శ్రీశక్తిగణపతి సన్నిధిలో జరిగిన అష్టద్రవ్య మహాగణపతి హోమం పూర్ణాహుతిలో పాల్గొని, శ్రీశారదాంబవారిని దర్శించి, శ్రీమఠప్రాంగణంలోని అన్ని దేవాలయములందు దేవతాదర్శన మొనరించి, నరసింహవనంలోని పూర్వాచార్యుల అధిష్ఠానమందిరానికి విచ్చేశారు. సంన్యాసస్వీకారాంగముగ కృచ్ఛ్రాచరణ, అష్టశ్రాద్ధములు, దండాభిషేకం మొదలగు కార్యక్రమములు గుర్వధిష్ఠాన మందిరమున జరిగినవి. సాయంకాలం బ్రహ్మాన్వాధానం జరిగినది. వివిధప్రాంతములనుండి విచ్చేసిన వేద పండితులు ఆ



సంన్యాసాశ్రమస్వీకారం ముందు రోజు తల్లిదండ్రులతో కుప్పా వెంకటేశ్వర ప్రసాద శర్మ

సందర్భంలో వేదపారాయణ మొనరించిరి. ఆరోజురాత్రి బ్రహ్మచారి వేంకటేశ్వరప్రసాదశర్మ గారు జాగరణ చేశారు.

మరునాడు (మాఘ శుద్ధతృతీయ, శుక్రవారం 23-1-2015) ఉదయం 7 గంటలకు గుర్వధిష్ఠానంలో బ్రహ్మచారి శ్రీశర్మగారు పురుషసూక్తహోమం, విరజాహోమం చేశారు. 9 గంటలకు తుంగానదికి వెళ్ళి, ప్రేషోచ్చారణ, సర్వభూతాభయప్రదానం చేశారు. తదుపరి శిఖను, యజ్ఞోపవీతాన్ని, శ్వేతవస్త్రాన్ని పరిత్యజించారు. జగద్గురు శంకరాచార్య శ్రీశ్రీశ్రీ భారతీతీర్థమహాస్వాములవారు వారికి కాషాయవస్త్రాన్ని, దండకమండలాలను అనుగ్రహించారు. తదుపరి గురుశిష్యస్వాము లిద్దరూ శ్రీమదభినవవిద్యాతీర్థమహాస్వాములవారి అధిష్ఠానమునకు విచ్చేశారు. అచ్చట శ్రీజగద్గురువులు శిష్యస్వాములవారికి ప్రణవోపదేశం, మహావాక్యోపదేశం కావించారు. అనంతరం ఉభయశ్రీచరణులు తుంగానది ఉత్తరంవైపునకు వేంచేశారు. అచ్చట శిష్యస్వామి (సన్నిధానం) వారికి పర్యంకశౌచము జరిగింది.

పిదప శ్రీశారదాంబాదేవాలయంలోని బ్రహ్మవిద్యా వ్యాఖ్యాన సింహాసనంపై శిష్యస్వామిని కూర్చుండబెట్టి, వారిశిరస్సుపై సాలగ్రామముంచి, దానిని శ్రీజగద్గురువులు పూజించారు. ఆతరువాత శ్రీమహాసన్నిధానంవారు వ్యాఖ్యానసింహాసనంపై కూర్చొనియుండగా, శ్రీసన్నిధానంవారు తమ గురుపాదుల పాదపద్మములను పూజించారు. శ్రీమహాసన్నిధానంవారు శిష్యస్వాములకు 'విధుశేఖరభారతి' అనెడియోగపట్టాను అనుగ్రహించారు. అప్పుడు అశేషభక్తజనులు హర్షధ్వానాలు చేశారు. పిమ్మట శ్రీమహాసన్నిధానంవారు శ్రీసన్నిధానంతో కూడి, శ్రీశారదా మాతను సందర్శించారు. దర్శనానంతరం ఉభయశ్రీ చరణులకు పలుమఠాధిపతులు, మహారాజులు, ప్రభుత్వ ప్రతినిధులు, మహాజనులు, భక్తజనులు కానుకలను సమర్పించారు. ఈకార్యక్రమంలో శృంగేరిశివగంగామఠా ధీశులు శ్రీపురుషోత్తమభారతీస్వామివారు, యడతొరె



యోగానందేశ్వరసరస్వతీ మఠాధీశులు శ్రీశంకరభారతీ స్వామివారు, హెబ్బూరుమఠాధీశులు మాధవాశ్రమస్వామి వారు, ధర్మపురి శ్రీసచ్చిదానందసరస్వతీస్వామివారు, విశ్వ కర్మ మఠాధీశులు శ్రీకాళహస్తీంద్ర స్వామివారు పాల్గొన్నారు.

అటుపిమ్మట ఉభయశ్రీచరణులు శ్రీమఠప్రాంగణం లోని అన్నిదేవాలయాలను సందర్శించి, నరసింహవనాన్ని చేరుకొన్నారు. ఆ రోజు సాయంత్రం గురువందన సభలో సన్నిధానంవారు అనుగ్రహభాషణమును చేయుచూ మానవజన్మప్రాశస్త్యమును వివరించి, మానవుడుగా జన్మించినందుకు మోక్షము సాధించవలె ననుకోరిక గాఢముగా నుండవలెననియు, అందుకు సాధనముగా సత్పురుషులతో సాంగత్యము తప్పక కలిగియుండ వలెననియు పేర్కొనిరి. మహాసన్నిధానంవారిఅపార మైనకరుణావిశేషం తమపై ప్రసరించడంవలననే జగద్గురువులకు శిష్యులై, శృంగేరిపీఠమునకు ఉత్తరాధికారి అగు అదృష్టము సిద్ధించినదని సెలవిచ్చిరి.

శ్రీ మహాసన్నిధానంవారు అనుగ్రహభాషణ మొనర్చుచూ శిష్యస్వాముల యోగపట్టము "విధుశేఖర భారతీ" అని ప్రదానం చేయుటలో తమ పరమగురువులైన శ్రీ చంద్రశేఖర భారతీ స్వాములవారిపై తమకున్న అపార గురుభక్తియే కారణమని సెలవిచ్చిరి. "విధు" అనే పదము "చంద్ర" అనే పదమునకు పర్యాయపదము. కావుననే "శ్రీ విధుశేఖర భారతీ" అని యోగపట్టము ననుగ్రహించుట జరిగినది. శ్రీ మహాసన్నిధానంవారు శిష్యస్వాములలో సన్న్యాసస్వీకారమునకు కావలసిన అన్ని సల్లక్షణములు ఉన్నవని, కావుననే శ్రీశారదాంబ అనుజ్ఞ మేరకు వారిని ఉత్తరాధికారిగా స్వీకరించుట జరిగినదని తెలిపిరి.

శ్రీసన్నిధానంవారి పూర్వాశ్రమములో వారికి వేదము మరియు సంస్కృత సాహిత్యము, వ్యాకరణమును నేర్పిన విద్వాంసులు శ్రీకుప్పా రామగోపాల వాజపేయయాజి, శ్రీ కుప్పా శివసుబ్రహ్మణ్యఅవధాని, శ్రీ తంగిరాలశివకుమార శర్మ, శ్రీ కృష్ణరాజభట్టుగారికి సన్మానము జరిగినది.

రాత్రి 9 గంటలకు శృంగేరిలోని రాజవీధిలో పల్లకి ఉత్సవం జరిగింది. శ్రీమహాసన్నిధానంవారు స్వర్ణపల్లకిని, శ్రీసన్నిధానంవారు రజతపల్లకిని అధిష్ఠించి ఊరేగింపులో పాల్గొన్నారు. ఆకార్యక్రమంతో ఉత్తరాధికారి శిష్య స్వీకారోత్సవం వైభవంగా ముగిసింది.

చాలామంది ప్రసిద్ధవ్యక్తులు, మఠాధిపతులు, అధి కారులు, దేశవిదేశాలనుండి వేలసంఖ్యలో వచ్చిన భక్తులు అపూర్వమైన ఈ మహోత్సవములో పాల్గొని ఉభయశ్రీ చరణుల అనుగ్రహమును పొంది కృతార్థులయ్యారు.

శ్రీసన్నిధానంవారి పూర్వాశ్రమ జీవితం

శ్రీశ్రీశ్రీ విధుశేఖర భారతీ సన్నిధానం వారి పూర్వాశ్రమ నామధేయం కుప్పా వేంకటేశ్వరప్రసాదశర్మ. వీరు శ్రీ కుప్పా శివసుబ్రహ్మణ్యఅవధాని - శ్రీమతి సీతా నాగలక్ష్మి దంపతు లకు ద్వితీయపుత్రునిగా జూలై 24, 1993 శ్రావణశుద్ధ పంచమినాడు తిరుపతిలో జన్మించారు. వారిది కౌండిన్య గోత్రం. గుంటూరుజిల్లా లోని అనంతవరం స్వగ్రామం.

కుటుంబపూర్వీకులు

కుప్పావారికుటుంబంలో ప్రఖ్యాతి చెందిన వేదశాస్త్ర పండితులు అనేకమంది ఉన్నారు. వారందరూ పరంపరగా శృంగేరి జగద్గురువుల శిష్యులే. 1961లో శ్రీశృంగేరీ శారదాపీఠ

35వ పీఠాధీశ్వరులు శ్రీమదభినవవిద్యాతీర్థ మహాస్వాముల వారు అనంతవరానికి విచ్చేసినప్పుడు శ్రీ వేంకటేశ్వరప్రసాదశర్మగారి తాతగారి అన్నగారైన శ్రీ కుప్పాబైరాగిశాస్త్రిగారు శ్రీచరణులను ఘనంగా స్వాగతించి, భక్తితో పాదపూజ చేసి, శ్రీజగద్గురువుల కృపకు పాత్రుల య్యారు. 1985లో శ్రీశ్రీశ్రీ భారతీతీర్థమహాస్వామివారు అనంతవరం విజయంచేసినప్పుడు బైరాగిశాస్త్రిగారు వారిని భక్తిశ్రద్ధలతో స్వాగతించారు. శ్రీవేంకటేశ్వరప్రసాదశర్మగారి తాతగారి మరో అన్నగారైన శ్రీ కుప్పా వేంకటాచలపతి యాజిగారు 2002లో శృంగేరి జగద్గురువుల అనుమతితో సంన్యాసాశ్రమాన్ని స్వీకరించారు.

శ్రీ కుప్పావేంకటేశ్వరప్రసాదశర్మగారి తాతగారైన శ్రీ కుప్పా రామగోపాల వాజపేయయాజి, కృష్ణయజుర్వేదాన్ని అధ్యయనం చేసినవేదపండితుడు. వాజపేయ మనేశ్రౌత యాగాన్ని చేసినవారు. శ్రీశృంగేరిజగద్గురువులశిష్యులు. శృంగేరిలో జరిగినఅనేకవైదికకార్యక్రమాలలో పాల్గొన్నారు. శ్రీ వేంకటేశ్వరప్రసాదశర్మ గారి తండ్రిగారైన శ్రీ కుప్పా శివసుబ్రహ్మణ్యఅవధానిగారు, హైదరాబాదు శంకర మఠములోనున్న జగద్గురు శ్రీమదభినవ విద్యాతీర్థ శాస్త్రసంవర్ధినీపాఠశాలలో తర్కశాస్త్రాన్ని అధ్యయనం చేశారు. శ్రీశృంగేరీజగద్గురువులపట్ల అమితమైన భక్తి గల శ్రీ అవధానిగారు వేదశాస్త్రపండితులు.

**బాల్యం:**

శ్రీవేంకటేశ్వరప్రసాదశర్మగారికి శ్రీకృష్ణభక్తి మెండు. తమఇంటిదగ్గరలో నున్న శ్రీకృష్ణదేవాలయాన్ని ప్రతినిత్యం సందర్శించేవారు. తండ్రి అయిదవ ఏటనే ఈబాలునికి ఉపనయనం చేశారు. తాతగారైన శ్రీకుప్పా రామగోపాలవాజపేయ యాజిగారు కృష్ణయజుర్వేదం ప్రారంభించారు. తరువాత తండ్రిగారు కృష్ణయజుర్వేదం క్రమాంతం నేర్పారు. వైదికజీవనం, దైవభక్తి మెండుగా గలవాతావరణంలో ఈబాల బ్రహ్మచారి పెరిగారు.

కృష్ణానది సముద్రంలో కలిసేసంగమప్రదేశంలో గల హంసలదీవి ఒకపుణ్య క్షేత్రం. అక్కడ శ్రీవేణుగోపాలస్వామిదేవాలయం ఉన్నది. గత కొన్ని సంవత్సరాలుగా శ్రీ వేంకటేశ్వరప్రసాదశర్మగారికుటుంబం అక్కడ భాగవతసప్తాహకార్యక్రమాన్ని నిర్వహిస్తోంది. శ్రీప్రసాదశర్మగారు ఆభాగవతసప్తాహకార్యక్రమంలో తండ్రితోపాటు పాల్గొనేవారు. బాల్యంలోనే అయోధ్య, హరిద్వార్, హృషీకేశ్, కాశీ, కాలడి, మధురై, మధుర, పశు పతినాథ్ (నేపాల్), రామేశ్వరం, ఉజ్జయిని మొద లగు పుణ్యక్షేత్రాలను సందర్శించారు.

శృంగేరిలో అధ్యయనం :



తమ తండ్రితాతలు శృంగేరిలో ధార్మికకార్యక్రమాలలో పాల్గొనటానికి వచ్చినప్పుడు, వారితో బాలు డైన శ్రీవేంకటేశ్వర ప్రసాదశర్మగారు కూడా వచ్చేవారు. మొదటిసారి 2006లో శృంగేరి వచ్చినప్పుడే జగద్గురు శ్రీశ్రీశ్రీభారతీతీర్థ మహాస్వాముల వారిప్రభావం 13 సంవత్సరాల ఆ బాలబ్రహ్మచారిపై పడింది. 2008లో వారు మళ్ళీ శృంగేరిలో శ్రీచరణులను సందర్శించారు. 2009లో మూడవసారి శృంగేరికి వచ్చినప్పుడు శ్రీజగద్గురువులవద్ద అధ్యయనం చేయాలనే తమకోరికను శ్రీజగద్గురువులకు విన్నవించారు. ఆబ్రహ్మచారికి విద్యార్జనపట్ల గల తీవ్రమైన కోరికను, వినయాన్ని, ప్రతిభను చూసిన శ్రీజగద్గురువులు ఆ బ్రహ్మచారికోరికను మన్నించారు. ఆనాటినుండి శృంగేరిలోనే ఉంటూ, శ్రీజగద్గురువుల మార్గదర్శనంలో శ్రీప్రసాదశర్మగారు శీఘ్రగతిన సంస్కృతభాషలో వ్రాయటంలో, మాట్లాడటంలో సామర్థ్యాన్ని సంపాదించారు. శృంగేరిలో విద్వాన్ శ్రీ తంగిరాల శివకుమారశర్మ గారివద్ద సంస్కృతకావ్యాలనూ, సాహిత్యాన్ని అధ్యయనం చేశారు. విద్వాన్ శ్రీకృష్ణ రాజభట్ గారివద్ద వ్యాకరణం నేర్చుకున్నారు.

శ్రీవేంకటేశ్వరప్రసాదశర్మగారిగురుభక్తిని, వినయాన్ని, ప్రతిభనూ, అధ్యయన శీలమునూ పరిశీలించిన శ్రీజగద్గురువులు ఈబ్రహ్మచారికి తామే శాస్త్రాలను బోధించాలని నిర్ణయించుకున్నారు. అలా 2011లో తర్కశాస్త్రం బోధించడం ప్రారంభించారు. 2012-13 విజయయాత్రలో అంతటి హడావిడిలో కూడా శ్రీ జగద్గురువులు పాఠం చెప్పడం ఒక్కరోజు కూడా మానలేదు. బ్రహ్మచారిని తర్క పండితునిగా మార్చారు. శృంగేరిలో జరిగే శ్రీమహాగణపతివాక్యార్థ విద్వత్ సభలో ఈబ్రహ్మచారి తర్కశాస్త్రపాండిత్యాన్ని చూసి, దేశం నలుమూలల నుండి వచ్చిన శాస్త్రపండితులు ఆశ్చర్యపోయారు. శ్రీజగద్గురువులు ప్రతిరాత్రి చేసే శ్రీచంద్రమౌళీశ్వర పూజాసమయంలో ఈబ్రహ్మచారి సంపూర్ణంగా



## శృంగేరి శ్రీశారదా పీఠం గురుపరంపర

| | | |
|---|---|---|
| 1. | శ్రీ శంకర భగవత్పాదులు | ఎడి820 |
| 2. | శ్రీ సురేశ్వరాచార్యులు | ఎడి820 - 834 వరకు |
| 3. | శ్రీ నిత్యబోధఘన | 834 - 848 |
| 4. | శ్రీ జ్ఞానఘన | 848 - 910 |
| 5. | శ్రీ జ్ఞానోత్తమ | 910 - 954 |
| 6. | శ్రీ జ్ఞానగిరి | 954 - 1038 |
| 7. | శ్రీ సింహగిరి | 1038 - 1098 |
| 8. | శ్రీ ఈశ్వరతీర్థ | 1098 - 1146 |
| 9. | శ్రీ నృసింహతీర్థ | 1146 - 1229 |
| 10. | శ్రీ విద్యాతీర్థ | 1229 - 1333 |
| 11. | శ్రీ భారతీతీర్థ | 1333 - 1380 |
| 12. | శ్రీ విద్యారణ్య | 1380 - 1386 |
| 13. | శ్రీ చంద్రశేఖరభారతి...1 | 1386 - 1389 |
| 14. | శ్రీ నరసింహభారతి.......1 | 1389 - 1408 |
| 15. | శ్రీ పురుషోత్తమభారతి | 1408 - 1448 |
| 16. | శ్రీ శంకరభారతి | 1448 - 1455 |
| 17. | శ్రీ చంద్రశేఖరభారతి....2 | 1455 - 1464 |
| 18. | శ్రీ నరసింహభారతి........2 | 1464 - 1479 |
| 19. | శ్రీ పురుషోత్తమభారతి..2 | 1479 - 1517 |
| 20. | శ్రీ రామచంద్రభారతి | 1517 - 1560 |
| 21. | శ్రీ నరసింహభారతి.......3 | 1560 - 1573 |
| 22. | శ్రీ నరసింహభారతి.......4 | 1573 - 1576 |
| 23. | శ్రీ నరసింహభారతి.......5 | 1576 - 1600 |
| 24. | శ్రీ అభినవనృసింహభారతి...1 | 1600 - 1623 |
| 25. | శ్రీ సచ్చిదానందభారతి....2 | 1623 - 1663 |
| 26. | శ్రీ నరసింహభారతి...6 | 1663 - 1706 |
| 27. | శ్రీ సచ్చిదానందభారతి...2 | 1706 - 1741 |
| 28. | శ్రీ అభినవసచ్చిదానందభారతి | 1741 - 1767 |
| 29. | శ్రీ నరసింహభారతి...7 | 1767 - 1770 |
| 30. | శ్రీ సచ్చిదానందభారతి...3 | 1770 - 1814 |
| 31. | శ్రీ అభినవసచ్చిదానందభారతి...2 | 1814 - 1817 |
| 32. | శ్రీ నరసింహభారతి...8 | 1817 - 1879 |
| 33. | శ్రీ సచ్చిదానంద శివాభినవ నరసింహభారతి | 1879 - 1912 |
| 34. | శ్రీ చంద్రశేఖరభారతి...3 | 1912 - 1954 |
| 35. | శ్రీ అభినవ విద్యాతీర్థ | 1954 - 1989 |
| 36. | శ్రీ భారతీతీర్థ | 1989 నుంచి ... |
| 37. | శ్రీ విధుశేఖర భారతి (ఉత్తరాధికారి) | |

కృష్ణయజుర్వేదాన్నీ, కృష్ణయజుర్వేద క్రమాన్నీ పారాయణ చేసారు.

శ్రీప్రసాదశర్మగారిది చక్కటిస్వభావం. ఎల్లపుడూ శాంతచిత్తులై, మితభాషులై ఉంటారు. లౌకికవిషయములందు అనాసక్తులై, నిరంతరం అధ్యయననిరతు లైఉంటారు. ఇతరవిద్యార్థులు చదువులో ఆయనను సహాయ మడిగేవారు. తమఅధ్యయనం కొనసాగిస్తూనే, విద్యార్థులకు వేదం, సంస్కృతసాహిత్యం, తర్కం నేర్పేవారు. శ్రీజగద్గురువులవద్ద వేదాంత మీమాంసాది శాస్త్రములను అధ్యయనం చేశారు.

2009 నుండి 2015 వరకు సుమారు అయిదున్నర సంవత్స రాలకాలం శ్రీజగద్గురువులవద్ద అధ్యయనం చేస్తున్న సమయంలో వైదికసంప్రదాయాలకాణాచి అయ్యారు. వివేక వైరాగ్యాలను అలవరచుకొన్నారు. విద్యార్థిగా, విద్వాంసుడిగా, అధ్యాపకునిగా, భక్తునిగా పరిణతిచెందారు. ఆబ్రహ్మచారి అందరిప్రేమను పొందారు. శ్రీజగద్గురువులు, వారిగురుభక్తికి, దైవభక్తికి, అధ్యయనశీలానికి, పాండిత్యానికి సంతోషించారు. వారిని ఉత్తరాధికారిగా స్వీకరించి సంన్యాసాశ్రమమును అనుగ్రహించారు.

సన్న్యాసాశ్రమధర్మములను, అనుష్ఠానక్రమమును శ్రీమహా స్వాములవారు శ్రీసన్నిధానంవారికి తామే స్వయంగా ఉపదేశించారు. మఠంలో పాటించవలసిన సంప్రదాయాలన్నీ కూడ వారికి తెలిపారు. 2017 శృంగేరిలో శారదామాతకు స్వర్ణశిఖర కుంభాభిషేకమహోత్సవము వైభవంగా నిర్వహించారు. ఆ సంవత్సరములోనే ఉభయశ్రీచరణులు తమిళనాడు, కేరళ రాష్ట్రాలలో విజయయాత్ర చేయుచూ అనేకగ్రామనగరాలలో సంచరించి, అనుగ్రహభాషణలు, ఉపదేశాలతో భక్తజనులను అనుగ్రహించిరి.

శ్రీమహాసన్నిధానంవారిఆజ్ఞానుసారం సన్నిధానంవారు 2018లో ఆంధ్ర దేశములో విజయయాత్ర చేయుచూ అనేక గ్రామ, నగరములలో సంచరించుచు శ్రీశైలం, విజయవాడ, కాళేశ్వరం, ద్వారకాతిరుమల, మొ॥గు క్షేత్రములలో భగవంతుని అర్చించి, శ్రీమహాసన్నిధానంవారి ప్రతిరూపులై భక్తులను అనుగ్రహించిరి.

శ్రీవిధుశేఖరభారతీస్వామివారు గురుచరణుల యడుగు జాడలలో నడచుచూ వారియపారకృపా పాత్రులై వెలుగొందుచున్నారు.

శ్రీవిధుశేఖరభారతీ సన్నిధానం వారి ఆలోచనలు, పనులు కూడ ఎల్లప్పుడూ శ్రీమహాసన్నిధానంవారి పూజనీయములైన పాదపద్మముల మీదనే కేంద్రీకృతము లయ్యాయి.

శిష్యజనులందరు శ్రీమహాసన్నిధానంవారిని మరియు శ్రీసన్నిధానంవారిని భక్తిశ్రద్ధలతో సేవించి శ్రేయః ప్రాప్తినందుదురుగాక.

# ధర్మనిష్ఠ.. తపశ్శక్తి.. ప్రజ్ఞాననిధి

## అద్వైత దీప్తి ...జగద్గురు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి




శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య వర్య, పదవాక్యప్రమాణ పారావార పారీణ, యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణధ్యాన సమాధ్యష్టాంగయోగానుష్ఠాననిష్ఠ, తపశ్చక్రవర్తి అనాద్యవిచ్ఛిన్న శ్రీ శంకరాచార్యగురు పరంపరాప్రాప్త, షడ్దర్శనస్థాపనాచార్య, వ్యాఖ్యాన సింహాసనాధీశ్వర, సకల నిగమాగమ సార హృదయ, సాంఖ్యత్రయ ప్రతిపాదిక, వైదిక మార్గ ప్రవర్తక,సర్వతంత్ర స్వతంత్ర, ఆది రాజధానీ, విద్యానగర మహారాజధానీ, కర్ణాటక సింహాసన ప్రతిష్ఠాపనాచార్య, శ్రీమద్రాజాధి రాజగురు భూమండలాచార్య, ఋష్యశృంగపురవరాధీశ్వర, తుంగభద్రా తీరవాసి, శ్రీమద్విద్యాశంకర పాదపద్మారాధక, శ్రీ శృంగేరీ జగద్గురు శ్రీ మదభినవ విద్యాతీర్థ మహాస్వామి గురుకరకమల సంజాత, శ్రీ శృంగేరి జగద్గురు శ్రీమద్భారతీతీర్థ మహాస్వామి వారి చరణారవిందములకు సాష్టాంగ ప్రణామములు.. త్రికరణశుద్ధి, ధర్మ నిబద్ధత, సమాజహితకాంక్ష ద్వారా మానవ జీవన సాఫల్యతకు చేరువకాగలమని ప్రబోధిస్తున్న జగద్గురు భారతీతీర్థులు అపర ఆదిశంకరులే. వారి బోధనలే శిరోధార్యంగా స్వీకరించడమే మనం పూజ్య జగద్గురువులకు సమర్పించే గురువందనమ్. శ్రీచరణుల 66వ జన్మదినోత్సవాల సందర్భంగా 'దర్శనమ్' భక్తిపూర్వకంగా సమర్పిస్తున్న ఈ అక్షరార్చన.

"గురుపదాంభోజముల్ గొలువక గల్గునే ప్రవిమల వైరాగ్య భాగ్య మహిమ" అని సీతారామాంజనేయ సంవాద గ్రంథములో ప్రతి మనిషికి జ్ఞాన వైరాగ్యాలు కావాలంటే తప్పక గురు పదములను ఆశ్రయించాలి అని పేర్కొన్నారు.

చాతుర్యవాన్ వివేకీచ ఆధ్యాత్మ జ్ఞానవాన్ శుచిః
మానసం నిర్మలం యస్య గురుత్వం తస్య శోభతే ॥

కార్యనిర్వహణ చాతుర్యం కలవాడు, వివేక జ్ఞానం కలవాడు, ఆధ్యాత్మ జ్ఞాన సంపన్నుడు, బాహ్య అభ్యంతర శుచిత్వం కలవాడు, నిర్మలమైన మనస్సుగలవాడు ఎవరో వారికే గురుత్వం శోభించును. అనగా గురు అనే పదమునకు అర్హుడు.

గురవో నిర్మలా శ్శాంతాః సాధవో మిత భాషిణః సంసార మాలిన్యం లేనివారు, ప్రకృతి దోషము శమించినవారు, సాధుస్వభావము కలిగినవారు, సదాచార సంపన్నులు ఎవరో వారే గురువులు కాగలరు అని స్మృతి గ్రంథాలు పేర్కొంటున్నాయి. ఈ లక్షణాలన్నీ ఒకేచోట వీక్షించాలంటే శృంగేరీ పీఠ జగద్గురువులను దర్శించాలి. 1974లో అప్పటి జగద్గురువులు శ్రీశ్రీశ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి వారు నవరాత్రి ఉత్సవాలు సమాప్తం అయిన తరువాత శ్రీ శారదాదేవి గర్భాలయంలో ప్రవేశించి అక్కడ

ధ్యానమగ్నులయ్యారు. కొంతసేపటి తర్వాత బయటకు వచ్చి అక్కడి భక్తులతో శ్రీ శారదా అమ్మవారి ఆజ్ఞానుసారంగా శ్రీ తంగిరాల సీతారామాంజనేయులును మా ఉత్తరాధికారిగా నియమించాలని నిర్ధారణయైనది. శిష్యస్వీకార తేదీ 11.11.1974 అని ప్రకటించారు. అనగా ఆజన్మశుద్ధులు కాబట్టి శారదాదేవి ఆజ్ఞ వల్లనే జగద్గురువులు కాగలిగారు. ఆనంద నామ సంవత్సరం ఆశ్వయుజ కృష్ణ ఏకాదశి, ద్వాదశి తిథులలో శృంగేరీ శారదాపీఠ ఉత్తరాధికారిగా శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ అనే పట్టాతో నియమించబడ్డారు. క్రీ.శ. 19.10.1989 ఆశ్వయుజ కృష్ణ పంచమినాడు దక్షిణామ్నాయ శృంగేరి శారదా పీఠానికి 36వ జగద్గురువుగా పట్టాభిషేకం జరిగింది. విశేషం ఏమిటంటే జగత్తు మొత్తం కీర్తించిన జగద్గురువులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారు మాత్రమే. ఈ దేశంలో గురువులు చాలామంది ఉన్నారు. శాస్త్ర ప్రకారం - 1. సూచక గురువులు 2. వాచక గురువులు 3. బోధక గురువులు 4. నిషిద్ధ గురువులు 5. విహిత గురువులు 6. కారణ గురువులు 7. పరమ గురువులు అని. వీరిలో నిషిద్ధ గురువులు తప్ప తక్కిన ఆరుగురు అంగీకరింపబడినవారే. కానీ లోకంలో ఇటువంటి వారు చాలామంది ఉన్నప్పటికీ దక్షిణామూర్తి శారదా స్వరూప పరమగురు స్వరూపులు అయిన జగద్గురువులు మాత్రం ఒక్కరే ఉంటారు వారే శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారు. మన తరం వీరిని చూడగలగటం మన భాగ్యం. ఈ శతాబ్దంలో వీరికంటే గొప్ప గురువును మనం చూడలేము అని చెప్పడంలో అతిశయోక్తి లేదు. ఎందుకనగా శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి వారిలో ఈ లక్షణాలు ఒకసారి చూద్దాం.

1. **బహుభాషా పాండిత్యం** :- శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారి మాతృభాష తెలుగు. కానీ మాతృభాషతో సమానంగా కన్నడం, తమిళం, సంస్కృతం, మలయాళం, హిందీ, ఇంగ్లీష్ మొదలైన భాషలు అనర్గళంగా మాట్లాడుతారు. ఏ భాషా ప్రాంతంలో ఆ భాషలో అనుగ్రహ భాషణం చేసే జగద్గురువులు ప్రస్తుత కాలంలో ఒక్కరే. వారే శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారు. అద్భుతమైన కవిత్వం జగద్గురువుల సొంతం. మహాకవిపుంగవులు కూడా రాయలేని పదజాలం, అన్వయక్లేశం లేని అనేక రచనలు చేశారు. ఎన్నో స్తోత్రాలు, కృతులు, గీతాలు వ్రాశారు. ఈ రోజుల్లో చాలామంది గురువులను మనం చూస్తాం. కాని ఏ ప్రాంతంలో ఉన్నా ఒకే దినచర్య పాటించేవారు చాలా అరుదు. శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారు శృంగేరిలో ఉన్నా, మహారాష్ట్రలో ఉన్నా, తెలంగాణలో ఉన్నా ఎక్కడ ఉన్నా వారి రోజువారీ కార్యక్రమాలు నిర్విరామంగా నిశ్చిత పద్ధతిలోనే ఉంటాయి. ఉదయం నాలుగు గంటలకు లేచి దేవతాస్మరణం. 8 గంటల వరకు అనుష్ఠానం. విద్యార్థులకు పాఠం చెప్పడం. 10.30 నుండి గురుభవనంలో భక్తులకు దర్శనం ఇవ్వడం. మధ్యాహ్నం ఒంటి గంటకు మళ్ళీ స్నానం చేసి మాధ్యాహ్నికానుష్ఠానం, భిక్ష, తర్వాత సాయంకాలం నాలుగు గంటలకు విద్వాంసులతో, విద్యార్థులతో శాస్త్ర చర్చలు, అనంతరం సెక్రెటరీ తెచ్చిన ఉత్తర ప్రత్యుత్తరాలను పరిశీలించి అన్నిటికీ ఓపికగా సమాధానాలు



చెప్పి, మరల సాయంత్రం 5.30 నుండి 6.30 వరకు భక్తులకు దర్శనం, సాయంకాల అనుష్ఠానం. మరలా రాత్రి 8.30 నుండి 10 వరకు చంద్రమౌళీశ్వర పూజ రాత్రి 11 వరకు శాస్త్ర గ్రంథాల అవలోకనం చేసి విశ్రమిస్తారు. విశేషం ఏమిటంటే శ్రీచరణులు ఎక్కడ ఉన్నా ఇలాగే ఉంటారు. పండుగ రోజుల్లో ఇంకా ఒత్తిడిగా ఉంటుంది. శృంగేరీ పీఠ జగద్గురువులు సంప్రదాయమును, శాస్త్ర మర్యాదను, పీఠ నియమాలను తప్పక పాటిస్తారు కాబట్టే ఆనాటి శంకర భగవత్పాదుల నుండి నేటి భారతీతీర్థ మహాస్వామి వారు, విధుశేఖర భారతీ స్వామివారి వరకు అవిచ్ఛిన్న గురుపరంపరతో అలరారుతున్న ఏకైక పీఠంగా శ్రీ శృంగేరీ శారదాపీఠం విలసిల్లుతోంది. ఈనాటి కాలంలో కాలానుగుణంగా చాలామంది సన్యాసులు సాంకేతిక టెక్నాలజీ, కంప్యూటర్, సెల్‌ఫోన్ (కరవాణి), ల్యాండ్ ఫోన్ (స్థాపితవాణి)లను అధికంగా వాడుతుంటారు. కాని శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారు మాత్రం ఈనాటికీ ఫోన్‌లో సంభాషణ చేయకపోవటం విశేషం. అనగా సంన్యాస ధర్మములను ఇంత ఖచ్చితంగా పాటించే వారిని మనం ఈ శతాబ్దంలో చూడలేము. కావుననే శ్రీచరణులు ఈ శతాబ్దపు మేటి జగద్గురువులు.

శ్రీచరణులు ఎప్పుడూ శిష్యులకు చెబుతూ ఉంటారు ప్రతీ మనిషి ముఖ్యంగా బ్రాహ్మణులు అనుష్ఠానము, తపస్సు వదలకుండా చేయాలని. ఈ రెంటినీ ఆచరిస్తూ ప్రబోధించే జగద్గురువులు శ్రీచరణులు మాత్రమే. ఆధ్యాత్మిక సేవయే కాదు సమాజసేవలో భాగంగా ఎన్నో ఆస్పత్రులు కట్టించారు. రక్తనిధి కేంద్రాలు, భారత సైన్యానికి విరాళాలు, వికలాంగులకు కుర్చీలు ఇలా చెబుతూ పోతే అనేకం ఉన్నాయి. శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారు ఆర్భాటాలకు, ఆడంబరాలకు, అహంకారం, దర్పములకు దూరంగా ఉంటారు. కాబట్టే టీవీ మాధ్యమాలలో ప్రచారాలకు ఇష్టపడరు. గొప్ప విషయం ఏమిటంటే ప్రపంచంలో ఏ మూల నుండి ఎవరు వచ్చినా వారికి సరియైన మార్గదర్శకత్వం చేసేవారు శ్రీచరణులు మాత్రమే. అతి శ్రేష్ఠమైన జ్ఞానంతో కలుషిత మనస్సులను కూడా పరిశుద్ధం చేసి ఆధ్యాత్మిక మార్గం వైపు నడిపిస్తారు. ముఖ్యంగా శారదాపీఠాధిష్ఠిత జగద్గురువులు చేసే వేదశాస్త్ర సంరక్షణ ఇంకా ఎవ్వరూ చేయలేరు. అనేక వేద శాస్త్ర పాఠశాలల్లో వేలాది మందికి ఉచిత విద్యాబోధన చేస్తున్నారు. పూర్వాకాలం పాటలీపుత్ర నగరంలో ఏవిధంగా శాస్త్ర సభలు, పరీక్షలు జరుగుతాయో నేడు శృంగేరిలో సంవత్సరం పొడవునా అనేక సభలు జరుగుతాయి.

శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ స్వామివారి తపోశక్తిని ఆంధ్రదేశ



విజయయాత్రలో అనేకమార్లు ప్రత్యక్షంగా దర్శించడం నా భాగ్యం. నా పురాకృత పుణ్యం. భాగ్యనగరం నుండి లింగన్నపేట వరకు విజయయాత్రలో శ్రీచరణులకు విపరీతంగా దగ్గు పట్టుకున్నది. వేరే ఎవరైనా మనబోటి సామాన్యులైతే ఆస్పత్రిలో ఒక పేషెంట్‌గా ఉండేవారు కాని శ్రీ భారతీతీర్థ మహాస్వామివారు మాత్రం ఒక్క మాత్రను కూడా తీసుకోక కేవలం కషాయం తాగి విజయయాత్రలో ఒక్క రోజు కూడా విశ్రాంతి తీసుకోక నిర్విరామంగా అనుగ్రహ భాషణాలు చేస్తూ ముందుకు వెళ్లారు. ఇంతటి తపోశక్తి శ్రీచరణులకు మాత్రమే సొంతం. అందుకై వర్తమానకాలంలో వేదశాస్త్ర అధ్యయన విషయంలో, పరిరక్షణ విషయంలో మార్గదర్శకత్వం చేయడంలో, తపోశక్తి విషయంలో, అనుగ్రహ శక్తి విషయంలో శ్రీ భారతీతీర్థ మహాస్వామివారికి వారే సాటి. అనన్వయాలంకార భూషితులు ఈ జగత్తులో ఒక్కరే. అటువంటి జగద్గురువులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారిని ప్రత్యక్ష నేత్రాలతో వీక్షించే భాగ్యం మన తరానికి దక్కడం మన భాగ్యం. అందుకే ఈ శతాబ్దమే ఏకైక అద్భుత, అప్రమేయ, అనంత అనుగ్రహ జగద్గురువులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారు మాత్రమే. వారి దివ్య చరణాలకు సాష్టాంగ ప్రణామాలు.

**డా. బాచంపల్లి సంతోషకుమారశాస్త్రి**
*రచయిత శ్రీ శృంగేరి శారదాపీఠ ఆస్థాన పౌరాణికులు*



## జగద్గురు ఉపదేశాలు....

# వేద పరిరక్షణ - అందరి కర్తవ్యం

వేదానికి మంత్రం ఒక ముఖ్య అంగం. ఆ మంత్రశాబ్దాలు ఎన్నో శతాబ్దాలుగా గురుశిష్య పరంపరగా రక్షింపబడుతూ వుంది. ఈ పరిరక్షణ అన్నది చాతుర్వర్ణాల వారి బాధ్యత. పూర్వ కాలం నుండి మన సంస్కృతి మీద ఎన్నో దాడులు జరిగాయి జరుగుతున్నాయి. ఎన్నో సంస్కృతులు బట్టలు కట్టడం కూడా నేర్వని రోజులలోనే మన సంస్కృతి అద్భుతంగా పరిఢ్విమిల్లింది. మన తక్షశిల, నలంద విశ్వవిద్యాలయాలలో ఉన్న వాంగ్మయాన్ని నిప్పు పెడితే ఆరు నెలల దాకా మండుతూనే వున్నదని చరిత్ర చెబుతోంది. ఎన్నో అవైదిక మతాలు ఇక్కడ వేళ్ళూనుకోవడానికి కేవలం మన సంస్కృతికి ఆయువుపట్టైన వాంగ్మయాన్ని నిర్మూలించడం ద్వారా, ఆ ధర్మం ఆచరిస్తున్నవారిని ఇక్కట్లు పెట్టడం ద్వారానో, లేక ఆ ధర్మం పట్ల విముఖులుగా చెయ్యడం ద్వారానో, లేక వారిని నయానో, భయానో, డబ్బు, హోదా చూపించో, లోబరుచుకునో వారి మతాన్ని మనవాళ్ళ మీద రుద్దబడింది.

ఈ క్రమంలో ఒకానొక మతం అయితే మౌఢ్యం ద్వారా హిందూ ధర్మావలంబకులను ఊచకోత కోసింది. గొప్ప గొప్ప ప్రభువులు అని మనకు పాఠ్యపుస్తకములలో చెప్పిన వారందరూ హిందువులను దారుణంగా నరికిపోగులు పెట్టిన వారే. హిందువులను రక్షించడానికి వచ్చిన సిక్కులను నానా హింసలు పెట్టింది. కొన్నాళ్ళకు వారు సర్దుకున్నాక ఒక గొర్రెల మతం వచ్చిపడింది. కొన్ని చోట్ల హింసాత్మకంగా వారు కూడా వారి మతాన్ని బలపరుచుకున్నారు. దానికి గోవా ఇంక్విజిషన్ ఒక ఉదాహరణ. తరువాత వారిది ప్రేమ, దోమ అనే అబద్ధపు ప్రచారం మొదలుపెట్టారు. జనాల ఆర్థిక అవసరాలను ఆసరా చేసుకుని, సేవ అనే ముసుగులో అడుగిడి నెమ్మదిగా వారి మతాన్ని ప్రచారం చేసుకున్నారు. ఇప్పుడు ఈ పైత్యం కొత్త పుంతలు తొక్కుతోంది. ప్రపంచంలో ఉన్న ఎన్నో సంపన్న దేశాలు విరాళాల రూపేణ పంపిన డబ్బు, దస్కం కేవలం మతమార్పిడులకు ఉపయోగించుకుని ప్రజలను వంచిస్తున్నారు.

అన్ని సమయాలలో ఇదే పద్ధతి కొనసాగక కొత్త కొత్త వేషాలు మొదలు పెట్టారు. మన సంస్కృతికి ఆయువుపట్టు సంస్కృతం, వేదం కావున, వాటిని భ్రష్టు పట్టించడం మొదలుపెట్టారు. డివైడ్ అండ్ రూల్ అనేది వారికి వెన్నతో

పట్టిన విద్య. అందుకు వారు సంస్కృతం నేర్చుకుని, మన వాఙ్మయాన్ని పూర్తిగా అర్థం చేసుకోకుండా వాటికి వారికి తోచిన భాష్యాలు రాయడం మొదలుపెట్టారు. పురాతన యుగాలలో ఉన్న ధర్మ శాస్త్రాలను తీసుకు వచ్చి ఇదే మీ మతం అని చెప్పడం మొదలుపెట్టారు. వాటిలో కొన్ని ప్రక్షిప్తాలు చేసి అదే నిజమని నమ్మించడం మొదలుపెట్టారు. మీ మతంలో శూద్రులు, పంచములు ఉన్నారంటూ పూర్తిగా అవగాహనా రహితమైన గోబెల్స్ ప్రచారం చెయ్యడం పరిపాటి అయిపోయింది. వేదం చెప్పినది చాతుర్వర్ణాల సంగతి అయితే ఎక్కడో సంఘ బహిష్కృతులను పంచములని, వారే శూద్రులని విషాన్ని పంచిపెట్టారు. శూద్రులు వేరు, సంఘ బహిష్కృతులు వేరు. కానీ వారినందరినీ ఒకే తాటికి కట్టేసి ఇదే మీ వేదం, సంస్కృతి అంటూ జనాలను మభ్యపెట్టారు. వేదాన్ని తమ జీవనవిధానంగా బ్రతుకుతున్న బ్రాహ్మణులను కించపరచడం, వారి మీద అందరికీ ద్వేషం పెంచడం ప్రధాన ఎజెండాగా పెట్టుకున్నారు. వేదానికి వక్రభాష్యం చెబుతూ జనాలలో వేదం, పురాణం, ఇత్యాది వాంగ్మయం మీద ఎన్నో అనుమానాలు, ఎన్నో తప్పుడు అర్థాలను, ప్రక్షిప్తాలను ఇరికించి ఏమిటి మన వాంగ్మయం ఇలా చెప్పిందా అనే సంశయాన్ని కొందరిలో నాటడంలో కృతకృత్యులు అయ్యారు. సంశయాత్మా వినశ్యతి అనే ఆర్యోక్తి ఆధారంగా ఈ సంశాయాత్ములు మరెందరినో తమ వాదనా పటిమ ద్వారా తమ వైపు తిప్పుకుంటూ ఉన్నారు. మనవారేప్పుడూ పాశ్చాత్య చదువులకు గులాములై అసలు మన వాంగ్మయం చదవడం, సరిగ్గా అర్థం చేసుకోవడం మానేశారు. కేవలం అపార్థాలే నిజమనేలా కొందరు దురాత్ములు పుస్తకాలు రాసి మరింత ప్రచారం చేసుకుంటున్నారు. ఇప్పుడు ఆ గొర్రెల పాచిక పారడం మొదలుపెట్టింది. మనలో మనం కొట్టుకు చావడం, మంత్రాలకు చింతకాయలు రాల్తాయా అనే ఎద్దేవా చెయ్యడం లాంటి దౌర్భాగ్యం చుట్టుకుంది. ఇదే పద్ధతిలో ఎన్నో ఖండాలలో అక్కడున్న సంస్కృతిని నాశనం చేసారు. ఇప్పుడు ఇది మన వంతు.

మనం ఇలాగే కూర్చుంటే కొన్నాళ్ళలో మనం నిజంగా మైనారిటీగా మారిపోతాము. వేదాన్ని రక్షించుకోవడం మన అందరి కర్తవ్యం. ఇది బ్రాహ్మణుడి బాధ్యత, లేదా క్షత్రియుల బాధ్యత అని కాదు, మన అందరిదీ. పక్క వాడి వాక్యాలను వారి లోపాలను ఎత్తి చూపించి వారిని చీల్చి చెండాలే క్షత్రియుడు కావాలి, వారిని వారి భాషలో బేరమాడి వారి స్థానం చూపించగలిగే వైశ్యుడు కావాలి, వారిని కూకటివేళ్ళతో పెళ్ళగించి బయటకు విసిరే శూద్రుడు



కావాలి. మనకున్న దార్శనికులు ఏ ఒక్క వర్ణానికి చెందిన వారు కారు, వారు జన్మత: అన్ని వర్ణాల వారు, మహర్షులై మనకు మార్గదర్శనం చేసారు. మనమంతా ఒక సంఘానికి చెందినవారం. ఏ వర్ణానికి చెందిన వారమైనా మనమంతా సనాతన ధర్మ వారసులం. ఈ వేదరాశి మన అందరిదీ. ఇది ఏ ఒక్కరి సొత్తు కాదు, అలాగే దీన్ని కాపాడడం అందరి బాధ్యత. ఇప్పటికైనా ఇంకా ఆలస్యం కాకుండా మనమంతా ఏకమవ్వాలి. పరిరక్షణ అనేది ఒక యజ్ఞం కావాలి. ముందుగా మనమంతా సంస్కృతం నేర్చుకోవాలి. మన పురాణ వాంగ్మయం, ఇతిహాసం ఏమి చెబుతోందో, అంతరార్థం ఏమిటో మనం అర్థం చేసుకోవాలి. మన మీద బురద చల్లుతున్న పందులను, గొర్రెలను మన జ్ఞానం అనే ఇనప చువ్వలతో, చర్నాకోలుతో అదిలించాలి. మన వాన్మయం తెలుసుకుందాం. మన సంస్కృతి నిలబెడదాం. భారతదేశ ఔన్నత్యం మన చేతిలో ఉంది.

మనకు మనం ఎప్పుడూ అన్ని నమ్మకాలను గౌరవిస్తాం, గౌరవిద్దాం. హిందువులు తమంత తాము మరొక గ్రంథం లోని విషయాలను ఎత్తి చూపడం నేను చూడలేదు. కానీ మూలకు నెట్టి మన మూలాలను విమర్శించి , దేవుళ్ళను తిట్టి, తెలిసీ తెలియక పూర్తిగా వక్రీకరించి చెప్పి, దేవతా విగ్రహాల మీద మలమూత్ర విసర్జన చేయించి వంచించి మతమార్పిడులకు పాల్పడి, వారి చేత హైందవాన్ని దునుమాడితే మనం మాట్లాడకుండా కూర్చుంటే పాకిస్తాన్ భారత దేశం మీద ఉగ్ర చర్యలకు పాల్పడితే ఏమి చెయ్యలేక గాజులు తొడుక్కుని కూర్చుని శాంతి వచనాలు వల్లించినట్టు వుంటుంది. ఇదం బ్రాహ్మణం ఇదం క్షాత్రం. మన గ్రంథాలను విమర్శించి చెండాలంగా చెబుతుంటే మనం పరుశారామావతారం ఎత్తక తప్పదు.

ఉత్తిష్ఠ !! జాగ్రత !! ప్రాప్యవరాన్నిబోధత !! క్షురస్య ధారా నిశితా దురత్యయ కఠోపనిషత్తు

!! ఓం నమో వేంకటేశాయ !!

!! సర్వం శ్రీ వేంకటేశార్పణమస్తు !!

# భక్తి మార్గంవల్లే జన్మ సార్ధకం

## (జగద్గురు శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థ మహాస్వామి ఉపదేశామృతం)

**అజ్ఞానాం జాహ్నవీ తీర్థం విద్యా తీర్థం వివేకినాం!**
**సర్వేషాం సుఖదం తీర్థం భారతీ తీర్థమాశ్రయే!**

పరమాత్మ పట్ల భక్తి లేకపోతే మన జీవితాలు నిష్ప్రయోజనాలు. చక్రి చింతలేని జన్మంబు జన్మమే తరళ సలిల బుద్బుదంబు గాక. మానవ జన్మ అరుదుగా లభిస్తుంది. అట్టి దుర్లభమైన మానవ జన్మ సార్ధకం కావాలంటే భక్తి మార్గాన్ని ఎన్నుకోవడం తప్పనిసరి. మనం అసంగతమైన అనేక విషయాలను చర్చిస్తుంటాము. యెప్పుడైఇనా మన లక్ష్యమేమిటో ఆలోచించామా? జీవిత ప్రయోజనాన్ని ఎలా సాధించాలో ఆలోచించామా? మోక్షం గురించి ఆలోచించే బదులు వ్యర్థమైన విషయాల గురించి ఆలోచించి కాలహరణం చేస్తూంటాం. ఇతరుల గురించి ఆలోచించటానికి ముందు తమ శ్రేయోమార్గం పట్ల ఆలోచించటం చాలా ముఖ్యం. కానీ వాస్తవానికి మన మోక్ష సాధనముల పట్ల ఉదాసీనులమై భౌతికమైన విషయాలపై సమయాన్ని వృథా చేస్తాము. ఇది చాలా వింతైన సంగతి.

మా పరమగురువులు శ్రీ చంద్రశేఖర భారతీ మహాస్వాములు జీవన్ముక్తులు వారెప్పుడూ అంతర్ముఖులుగా ఉండేవారు. ఆత్మ ధ్యాన నిరతులు. చాలా అరుదుగా బయటకు వచ్చేవారు. మఠం కార్యనిర్వహణాధికారి ఈ సంగతి గ్రహించి వీలు చూసుకుని శ్రీవారితో " ఈ మధ్య తమరు భక్తులను చూడడానికి బయటకు రావడం లేదు. వేల సంఖ్యలో భక్తులు తమ దర్శనం లభించక నిరుత్సాహంతో తిరిగి వెళ్ళిపోతున్నారు. మీరు ఒకసారి వారి క్షేమసమాచారాలు విచారింప ప్రార్థన" అని నివేదించారట. దానికి శ్రీవారికి "ముందు నేనెవరో తెలుసుకోనివ్వండి. ఆ తరువాత ఇతరుల గురించి తెలుసుకుంటాను" అని సమాదానమిచ్చారట. ఆత్మవిచారణలో నిమగ్నుడైన వ్యక్తి అలాగే సమాధానమిస్తారు. మనం కూడా ఈ విధంగా ఉన్నత స్థితికి చేరుకోవడానికి ప్రయత్నించాలి.

ముక్తిని పొందటానికి అన్నింటిలో సులభమైన మార్గం భక్తి మార్గమే. ఎందుకంటె కర్మ మార్గంలో చాలా నియమాలకు కట్టుబడి ఉండాలి. విహితమైన కర్మకాండను ఆచరించడము కష్టమే. కర్మలను సక్రమంగా ఆచరించకపోతే వాటిని పూర్తిగా ఆచరించకపోవడంతో



సమానం అని శాస్త్రాలు చెబుతున్నాయి. జ్ఞానమార్గాన్ని అనుసరించదానికి అందరికీ అర్హత ఉండదు. సాధన చతుష్టయము (నిత్యానిత్య వస్తు వివేకము, శమాది షట్కసంపత్తి, వైరాగ్యము, ముముక్షుత్వము ) జ్ఞాన మార్గానుయాయులకు తప్పనిసరి. అందరికీ అనువైనదీ, సులభమైనది, అందుబాటులో ఉండేది భక్తి మార్గమే. శరీరంలో అన్ని అవయవయాలతోను స్వామిని అర్చించాలి. ఆయన గురించే మాట్లాడాలి, ఆయననే దర్శించాలి, ఆయన కథలు వినాలి, ఆయనదగ్గరకు అడుగులు పడాలి. పరమాత్మను భక్తితో స్మరివ్చడమే సర్వోత్తమ ధర్మం అని భీష్మాచార్యుడు చెబుతాడు.

మన భారతదేశంలో ప్రతి ఒక్కరూ ఆస్తిక భావ సంపన్నులై ఉందురు గాక. ప్రతి ఒక్కరూ భక్తియుత జీవనాన్ని గడిపి ఈశారుని కృపాపాత్రులగుదురు గాక. శ్రీ చంద్రమౌళీశ్వర, శ్రీ శారదాంబలు సర్వులకు సకల సన్మ0గళములు అనుగ్రహింతురుగాక.

!!ఓం నమో వేంకటేశాయ!!

!! సర్వం శ్రీ వేంకటేశ్వరార్పణమస్తు!!

# దయాహృదయులు... దార్శనికులు

## జగద్గురు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారి గురుస్మరణం



**సాక్షాత్పరశివవతారులై శ్రీమచ్ఛంకరభగవత్పాదా చార్యుల వారు సనాతన ధర్మ ప్రచారం కోసం భారతదేశంలో నాలుగు దిక్కులలో ప్రతిష్ఠించిన చతురామ్నాయ పీఠాలలో సర్వశ్రేష్ఠమైన దక్షిణామ్నాయ శ్రీశృంగేరీ శారదాపీఠం శ్రీ సురేశ్వరాచార్యులవారు, విద్యారణ్యస్వాములవారు మొదలైన యతిశ్రేష్ఠుల చేత అధిష్ఠింపబడి విరాజిల్లుతున్నది. ఈ పీఠంనందు 35వ అధిపతులుగా మా గురువర్యులు ప్రాతఃస్మరణీయులైన జగద్గురు శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వాములవారు ప్రకాశించారు. దిగంత వ్యాప్తి కీర్తి శోభితులు మహానుభావ తల్లజులునైన వారి పవిత్ర చరిత్ర అందరికీ ఆదర్శం.**

ఆ మహాపురుషులు పింగళ నామ సంవత్సర ఆశ్వయుజ కృష్ణ చతుర్దశి నాడు బెంగుళూరు నగరంలో కైపు రామశాస్త్రి, వెంకటలక్ష్మమ్మ అనే పుణ్య దంపతులకు పెద్ద కుమారునిగా అవతరించారు. వారి పూర్వాశ్రమ నామధేయం శ్రీనివాస. చిన్నతనం నుండి భగవద్భక్తి, ప్రాపంచిక విషయ విరక్తి, సత్పురుషులయందాసక్తి, విశేష సదాచారము ఉండేవి. ఆ సమయంలో శ్రీశృంగేరీ శారదాపీఠ జగద్గురువులుగా ఉన్న పరమపూజ్య శ్రీశ్రీ చంద్రశేఖరభారతీ మహాస్వాముల వారికి వీరి మీద అపారమైన దయ కలిగింది. ఆ గురువర్యులే వీరిని శృంగేరికి పిలిపించి ఉపనయన సంస్కారాన్ని జరిపించారు. వేద సంస్కృత సాహిత్యాలలో విద్వాంసుల చేత ఉత్తమ శిక్షణ వీరికి లభించింది. వీరి పదునాల్గవ సంవత్సరంలో గురువర్యులు వీరికి సన్యాసాశ్రమం, 'అభినవ విద్యాతీర్థ' అనే యోగపట్టాన్ని అనుగ్రహించి, తమ ఉత్తరాధికారులుగా ప్రకటించారు.

తదుపరి న్యాయశాస్త్రాధ్యయనం ప్రారంభించిన వీరు స్వల్పకాలంలోనే అపార పాండిత్యాన్ని పొంది, శిష్యులకు పాఠ ప్రవచనం చేసేవారు. ప్రతి క్షణం వీరి అభ్యుదయాన్ని కాంక్షిస్తూ, వీరి శాస్త్రాభ్యాస క్రమాన్ని తెలుసుకుని గురువర్యులు ఎంతో సంతోషించేవారు. అనంతరం గురువర్యులు వీరికి వేదాంతశాస్త్రాన్ని బోధించారు. దానిని

కూడా క్షుణ్ణంగా అధ్యయనం చేసి, విశేష పాండిత్యాన్ని సంపాదించారు. సంస్కృత భాషను కూడా బాగా చదివి అందులో అనర్గళంగా ప్రసంగించటం, చక్కగా వ్రాయడంలో ప్రావీణ్యం పొందారు. కవిత్వం విషయంలో వీరికి ఎక్కువ ఆసక్తి లేకపోయినా తమ గురువర్యులను స్తుతిస్తూ సుందరమైన శ్లోకాలను రాశారు. ఉదాహరణకు...

**పాదప్రభావినిర్ధూతా విద్యాంధతమసాయ తే ।**
**యతయే చితి నిర్విష్ట చిత్తాయాస్తు నమో మమ ॥**
**శ్రీమతాం దేశికేంద్రాణాం పాదపద్మే నమామ్యహమ్ ।**
**మందోపి వందనాద్యేషాం విందేత గురుతుల్యతామ్ ॥**

ధర్మశాస్త్ర గ్రంథాలను విశేషంగా పరిశీలిస్తూ, శిష్యుల ధార్మిక సంశయాలను ప్రమాణ, వచన ఉదాహరణ పూర్వకంగా తీర్చేవారు. సంస్కృతం, తెలుగు, తమిళం, కన్నడ భాషలలో సొగసుగా మాట్లాడగలిగినవారు హిందీ భాషలో కూడా ఉత్తమమైన ప్రావీణ్యాన్ని కలిగివున్నారు. వారి పరిశుద్ధమైన హిందీ ఉపన్యాసాలను విన్న ఉత్తరదేశ విద్వాంసులు కూడా ఆశ్చర్యాన్ని పొందేవారు.

గురువర్యులు సామాన్యంగా అంతర్ముఖంగానే ఉండేవారు. శ్రీమఠ వ్యవహారాలలో వారి మనస్సు కొంచెం కూడా లగ్నమయ్యేది కాదు. ఆ సమయంలో వారి ఆనతితో వీరే అన్ని వ్యవహారాలను గమనిస్తూ, శ్రీమఠం కార్యక్రమాలన్నీ సక్రమంగా నడిపిస్తూ శిష్య జనులకు దర్శనాన్ని, సంభాషణను అనుగ్రహిస్తూ శ్రీమఠం యొక్క కీర్తి ప్రతిష్ఠలను కాపాడారు. గురువర్యుల షష్ట్యబ్దపూర్తి సందర్భంలో లోక క్షేమార్థం ఒక పెద్ద యాగాన్ని జరిపించాలన్న శిష్యుల ప్రార్థనను అంగీకరించి విజయ నామ సంవత్సరంలో (1953) సహస్రచండీ యాగాన్ని అత్యంత వైభవంగా జరిపించారు. స్వతంత్ర భారత ప్రథమ రాష్ట్రపతి రాజేంద్రప్రసాదుగారు 1954లో గురువర్యుల దర్శనానికై శృంగేరికి వచ్చినప్పుడు వారికి గురువర్యుల దర్శనం చేయించి గురువర్యులు సంస్కృతాన్ని హిందీలోకి, రాజేంద్ర ప్రసాదుగారి హిందీని సంస్కృతంలోకి అనువదించేవారు. అదే సంవత్సరంలో గురువర్యులు బ్రహ్మీభూతులవడంతో, ఆ సమయంలో అత్యంత దుఃఖంలో ఉన్నా కర్తవ్యనిష్ఠులై వారి ఆరాధనా కార్యక్రమాన్ని సంప్రదాయానుసారంగా జరిపించారు.

జయ సంవత్సర ఆశ్వయుజ కృష్ణ పంచమి (16-10-1954)న శ్రీ శృంగేరి శారదాపీఠంలో పట్టాభిషిక్తులయ్యారు. పట్టాభిషేకానంతరం శ్రీచరణుల సుమారు ఒకటిన్నర సంవత్సరాల పాటు తమ గురువర్యులను ధ్యానిస్తూ శృంగేరిలోనే ఉన్నారు. ధర్మ దిగ్విజయ యాత్రను చేయాల్సిందిగా శిష్య మహాజనులు



ఎక్కువగా ప్రార్థించారు. అందువల్ల 1956లో శృంగేరి నుండి బయలుదేరి శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులవారి అవతార స్థలమైన కాలడి క్షేత్రాన్ని చేరి, అక్కడ చాతుర్మాస్య, నవరాత్రి ఉత్సవాలను జరిపారు.

అక్కడి నుండి దక్షిణ భారతదేశంలో ఆరు సంవత్సరాలు సంచారం చేశారు. అనేక స్థలాలలో చాలా ధర్మకార్యాలను జరిపించారు. శంకరభగవత్పాదులపై ప్రజలలో భక్తిని ఇనుమడింప చేయడానికి 'అఖిల భారత శంకర సేవాసమితి' అనే సంస్థను స్థాపించారు. కాలడిలో అభివృద్ధి కార్యక్రమాలను జరిపించడానికి 'శంకర ఎడ్యుకేషనల్ ట్రస్టు' అనే ఒక సంస్థను ఏర్పరచారు. ఆంధ్రప్రదేశ్ రాజధానియైన భాగ్యనగరు (హైదరాబాదు)లో నూతనముగా శంకరమఠాన్ని నిర్మించి అక్కడ శ్రీ శారదా శంకరమూర్తి ప్రతిష్ఠలను జరిపించారు.

1960లో శ్రీచరణులు మద్రాసునందున్నప్పుడు రాష్ట్రపతి శ్రీ బాబు రాజేంద్రప్రసాద్‌గారు శ్రీచరణులను దర్శించారు. వారి సద్గుణాలకు సంతసించినవారై, శ్రీచరణులు వారికి 'రాష్ట్రరత్నం' అను బిరుదును అనుగ్రహించారు.

శ్రీచరణులు తిరుపతి క్షేత్రాన వేంకటేశ్వరస్వామి వారిని సేవించి, అచ్చట విద్వత్ సభ జరిపారు. శ్రీశైల క్షేత్రానికి వేంచేసి భ్రమరాంబా మల్లికార్జునస్వామి వార్లను

పూజించారు. ఇదేవిధముగా ఆంధ్రదేశములో పెక్కు క్షేత్రాలను దర్శించారు.

బెంగుళూరు శంకర మఠంలో తమ పరమగురువులచే స్థాపింపబడిన 'భారతీయ గీర్వాణ ప్రౌఢ విద్యాభివర్ధినీ పాఠశాల' స్వర్ణోత్సవాలను జరిపించారు. 1962లో శృంగేరికి దయచేశారు.

ఆ సమయానికి శృంగేరిలో గురువర్యుల సమాధిపై సుందరమయమైన శిలామయమగు దేవాలయము శ్రీచరణుల ఆజ్ఞతో నిర్మింపబడింది. ఆ మందిరంలో గురువర్యుల అమృత శిలామూర్తిని, చక్కటి శివలింగాన్ని శ్రీచరణులు ప్రతిష్ఠించారు. అప్పుడు సహస్రచండీ మహాయాగం కూడా జరిగింది. శ్రీ శారదాంబ దేవాలయంపై నూతనంగా గోపురాన్ని నిర్మింపజేసి, శారదాదేవికి కూడా ఆ సమయంలోనే కుంభాభిషేకం జరిపించారు. ఆ ఉత్సవ వైభవాలను చూసిన జనులు ఇప్పుడు కూడా వాటిని జ్ఞాపకం చేసుకుంటూ అమితమైన ఆనందాన్ని అనుభవిస్తున్నారు.

శ్రీచరణులు 1964 నుండి 1968 వరకు తమ రెండవ ధర్మ దిగ్విజయ యాత్రను ఆసేతు శీతాచల పర్యంతం జరిపారు. ఈ యాత్రలో విశేషంగా ఉత్తర భారతదేశంలో అనేక పుణ్యక్షేత్రాలను సందర్శించారు. వారణాసిలో గంగా స్నానమాచరించి, విశ్వేశ్వరుని పూజించి, విద్వత్సభను జరిపించి, విద్వాంసులను సత్కరించి అత్యంత సంతోషాన్ని పొందారు. శ్రీ శంకర భగవత్పాదులు సర్వజ్ఞ పీఠాన్ని అధిరోహించి కాశ్మీరులో కూడా సంచారం చేసి, శ్రీనగరులోని శంకరాచార్య పర్వతాన్ని అధిరోహించి, అక్కడ శివాలయంలో ఈశ్వరుని పూజించారు. బదరీ క్షేత్రంలో భగవత్పాదులచే పునః ప్రతిష్ఠాపితుడైన బదరీ నారాయణుని సేవించారు. శ్రీ భగవత్పాదులు అంతర్ధానమొందిన ప్రదేశమని జగద్విఖ్యాతమైన కేదార్‌నాథ్ క్షేత్రానికి దయచేసి, మందాకినీ నదిలో స్నానమాచరించి, కేదారనాథుని పూజించారు. అయోధ్యలోని సరయూ నదిలో స్నానం చేసి శ్రీరామచంద్ర ప్రభువును దర్శించారు. శ్రీకృష్ణ పరమాత్మ లీలా విహార ప్రదేశమైన బృందావన క్షేత్రమందు మూడు రోజులు విడిది చేసి, యమునా నదిలో స్నానం చేసి, అమితానందాన్ని పొందారు. ఇదేవిధముగా అనేక ప్రదేశములు శ్రీచరణుల పాదధూళిచే పవిత్రములైనవి. ఇదే యాత్రలో శ్రీచరణులు నేపాల్‌కు విజయం చేసి, మహాశివరాత్రి పర్వదినమున పశుపతినాథునకు పూజలొనర్చారు. శ్రీ శంకర భగవత్పాదులు నేపాల్‌కు విజయం చేశారన్న విషయం వారి చరిత్ర వలన మనకు తెలుస్తోంది. ఆ తర్వాత కాలంలో శ్రీ శాంకర చతురామ్నాయ



పీఠాధీశ్వరులలో నేపాలుకు విజయం చేసిన వారిలో శ్రీచరణులే అగ్రగణ్యులు. శ్రీచరణులను అప్పటి నేపాల్ మహారాజు రాజా మహేంద్ర అత్యంత భక్తిశ్రద్ధలతో సేవించారు. ఆ సమయంలో వారితో మాటల సందర్భంలో మహారాజుగారి తండ్రి విషయం ప్రస్తావింపబడింది. వారి తండ్రిగారైన త్రిభువన మహారాజుగారు 1950 సంవత్సరంలో తమ దేశంలోని శత్రుబాధను తట్టుకొనలేక భారతదేశానికి చేరారు. అప్పటి వారి పరిస్థితిని తెలుసుకొని కరుణామయులైన శ్రీ జగద్గురు చంద్రశేఖరభారతీ మహాస్వాములవారు మహారాజులు కష్టాలు స్వల్పకాలంలోనే నివృత్తియగుగాక అని ఆశీర్వదించి వారికి శ్రీముఖమును, ప్రసాదాన్ని అనుగ్రహించారు. ఆ ప్రసాదం వారికి చేరిన నెలలోనే వారి కష్టాలు తొలగి, వారి రాజ్యం వారికి తిరిగి లభ్యమైంది. ఈ విషయాన్ని శ్రీచరణులు జ్ఞాపకం చేసినప్పుడు రాజా మహేంద్రులు సంతోషాన్ని పొంది, పెద్ద వ్యాఘ్ర చర్మాన్ని, విశేష కానుకలను శ్రీచరణులకు సమర్పించారు.

శ్రీచరణులు భారత రాజధాని నగరమైన క్రొత్తఢిల్లీలో 'శ్రీ శంకరాద్వైత విద్యాశ్రమము' అనే పేరుతో శ్రీ శృంగేరి శంకరమఠాన్ని ఏర్పరచారు. శ్రీ శారదా శంకరభగవత్పాద, శ్రీ చంద్రశేఖర భారతీస్వామి ప్రతిష్ఠలనొనరించారు.



శ్రీచరణులు ఢిల్లీలో మకాము చేసిన సమయంలో రాష్ట్రపతి, ప్రధానమంత్రి మొదలైన గణ్య వ్యక్తులు వారిని దర్శించి ఆశీస్సులను పొందారు. కలకత్తా నగరంలో కూడా శ్రీచరణుల మార్గదర్శనంలోనే శంకర మఠం ఏర్పడింది. బొంబాయి మహానగరంలో కూడా శ్రీచరణుల కృప చేతనే 'శారదా సేవాసమితి' అను సంస్థ ఏర్పడింది. అక్కడ సుందరమైన శృంగేరీ శంకరమఠ నిర్మాణానికి శ్రీచరణుల ప్రేరణ, మార్గదర్శనం ముఖ్య హేతువులైనాయి. ఈవిధంగా యావద్భారతదేశం విస్తారంగా సంచారం చేసి 1968లో శృంగేరికి తిరిగి వచ్చారు.

శృంగేరిలో శ్రీచరణులు పెక్కు అభివృద్ధి కార్యక్రమాలను ఒనరించారు. శృంగేరిలో పూర్వం కేవలం ఒకే ఒక అతిథి గృహం ఉండేది. శ్రీచరణులు శంకర కృప, శంకర నికేతనం, జయశంకర నికేతనం, శారదా నికేతనం, భారతీ విహార మొదలైన అనేక అతిథి భవనాలను నిర్మించి భక్తజనులకు మహోపకారం చేశారు.

సద్విద్యా సంజీవినీ సంస్కృత పాఠశాలా భవనాన్ని నవీకరించారు. శారదా దేవాలయ పైభాగమందు పెద్ద గ్రంథాలయాన్ని కట్టారు. ఆవులు, ఏనుగుల రక్షణ కొరకు ఉత్తమమైన గోశాల, గజశాల నిర్మించారు. శ్రీచరణులు కరుణా సముద్రులై ఉన్నారు కనుకనే వారు శృంగేరిలో శారదా ధన్వంతరి చికిత్సాలయం స్థాపించారు. ఆ చికిత్సాలయం లక్షలాది జనులకు ఉపయోగకరంగా ఉంది.

బెంగుళూరు నగరంలో తమ గురువర్యులు శారదాదేవి పేర్లతో రెండు కళ్యాణ మండపాలను కట్టించారు. హైదరాబాదు శృంగేరి శంకరమఠంలో కూడా శ్రీచరణుల చేతనే ఉత్తమమైన కళ్యాణ మండపం నిర్మింపబడింది. మద్రాసు నగరంలో శృంగేరీ మఠం, ప్రవచన మందిరం శ్రీచరణుల అనుగ్రహం చేతనే ఏర్పడినాయి. ఇదేవిధంగా అక్కడక్కడ శృంగేరీ మఠాలు, ధర్మశాలలు, విద్యాలయాలు శ్రీచరణుల చేత స్థాపింపబడి అభివృద్ధిలోకి వచ్చాయి.

వేదశాస్త్రముల ప్రచారం, ప్రసారం చేయడంలో వారికి ఆసక్తి ఉండేది. పాత పాఠశాలలను అభివృద్ధిపరచి నూతనంగా పాఠశాలలను ఏర్పాటుచేసి ఆ కార్యాన్ని నిర్వహించారు. ప్రతి సంవత్సరం శ్రీ శంకర జయంతి, గణపతి చతుర్థి సందర్భాలలో విద్వత్సభలను జరిపి శాస్త్ర పండితులను విశేషంగా సన్మానించేవారు. 'వేద పోషక సభ' అనే పేరుతో ఒక పరిషత్తును స్థాపించి, దాని ద్వారా వేద పరీక్షలను జరిపించి, వేద పండితులను సత్కరించి వేద విద్యా ప్రచారాన్ని బహుళంగా జరిపించారు.

'భారతీయ చతుర్ధామ వేదభవన న్యాస్' అనే సంస్థ వేద శాఖల రక్షణకు ఏర్పడింది. శ్రీచరణులు ఆ సంస్థకు సంరక్షకులుగా ఉండి, దానిని విశేషంగా ప్రోత్సహించారు. ఆ సంస్థ శాఖలు కాలటి, రామేశ్వరం, శ్రీరంగంలో ప్రస్తుతం కూడా శృంగేరీ మఠం ఆధ్వర్యంలోనే నడుపబడుతున్నాయి అంటే అది శ్రీచరణుల పరిశ్రమ ఫలితమే. దేశమంతటా సంస్కృత భాషా ప్రచారం జరగాలన్న మహోద్దేశంతో

'సురసరస్వతీ సభ' అనే పరిషత్తును వారు ఆరం భించారు. ఆ సభ సంస్కృత ప్రచారాన్ని నిరంతరంగా జరుపుతోంది. సంవత్సరానికి రెండుసార్లు ఆ సంస్థ జరిపే సంస్కృత పరీక్షలకు పదివేల కంటే ఎక్కువమంది విద్యా ర్థులు హాజరవుతున్నారంటే ఈ సంస్థ సాఫల్యానికి అది తార్కాణం.

శ్రీచరణులు సంస్థానం ద్వారా అనేక ఉత్తమ గ్రంథాలను ప్రచురించారు. వాటిలో 'వివేక చూడమణి వ్యాఖ్యానం' సర్వోత్కృ ష్టమైంది. శంకర భగవత్పాదుల వారిచే రచింపబడిన 'వివేక చూడామణి' అను వేదాంత గ్రంథానికి జగద్గురు శ్రీచంద్రశేఖర భారతీస్వాములవారు రచించిన అత్యద్భుతమైన వ్యాఖ్యానమిది. అదేవిధంగా శృంగేరి జగద్గురు పరంపరలో 24వ పీఠాధిపతులు జగద్గురు శ్రీమదభినవ నృసింహభారతీ మహాస్వాముల వారిచే వ్రాయబడిన 'శివగీతాభాష్యము'ను కూడా శ్రీచరణులు ప్రచురించారు. ఇదేవిధంగా అనేక భాషలలో అనేక సద్గ్రంథాలు శ్రీచరణుల కృప చేతనే ప్రచురించబడ్డాయి.

సనాతన ధర్మం, వేదాంతతత్వ ప్రచారం కోసం ఆధ్యాత్మిక మాసపత్రికలను శ్రీచరణులు ప్రారంభించారు. ప్రప్రథమంగా తమిళంలో 'శంకరకృప' అనే పత్రికను తరువాత అదే పేరుతో తెలుగు, కన్నడములలో పత్రికలను ప్రారంభించారు. ఆంగ్ల భాషలో కూడా ధర్మ ప్రచారం కోసం 'తత్త్వలోక' అను ద్వైమాశిక పత్రికను ప్రారంభించారు. ఇదేవిధంగా సనాతన ధర్మ ప్రచారం కోసం అనేక విధాలుగా వారు కృషి సల్పారు.

సంగీత శాస్త్రంలో నిష్ణాతులైన వందలాది విద్వాంసులు శ్రీచరణుల కృపకు పాత్రులైరి. ప్రతి సంవత్సరం వసంత నవరాత్రి, శరన్నవరాత్రులలో సంగీత విద్వాంసులను పిలిపించి, వారిచే సంగీత గోష్ఠులను ఏర్పరచి భక్తజనులను సంతోషపరుస్తూ సంగీత కళను విశేషంగా పోషించారు.

శ్రీచరణులు అనేక ప్రదేశాలలో అనేక వైదిక కార్యక్రమాలను జరిపించారు. శృంగేరిలో అతిరుద్ర మహాయాగాన్ని సహస్ర చండీ యాగాన్ని శారదాంబకు కోటి కుంకుమార్చనలను పలుమార్లు జరిపించారు. ఇదేవిధమైన యాగాలను మదరాసు, వారణాసి, రుద్ర పట్టణం, కాలటిలలో కూడా జరి పించారు.

ఏయే ప్రాంతాల్లో ఈ కార్యక్రమాలు జరిగినా ఆయా ప్రాంతాలందు గల వైదికులనే ఆ కార్యక్రమంలో విశేషంగా శ్రీచరణులు నియమించేవారు. వారికి అన్ని ప్రాంతాలలోని వైదికుల మీద సమానము లైన ప్రతి, వాత్సల్యములు ఉండేవి.

శ్రీచరణులు నడిపించిన మహా కార్యక్రమాల్లో కాశీ



క్షేత్రంలో జరిపిన అన్నపూర్ణామూర్తి ప్రతిష్ఠా కార్యక్రమం మహత్త్వపూర్ణ మైంది. పూర్వామ్నాయ పూరీ గోవర్ధన పీఠాధీశ్వరులు శ్రీచరణుల అభిప్రాయానుసారం ఆ కార్యక్రమంలో పాల్గొని శ్రీచరణులకు ఆనందం కలిగించారు.

భగవత్పాదులచే ప్రతిష్ఠింపబడిన ఆమ్నాయ పీఠాధీశ్వరులతో శ్రీచరణులకు ప్రీతి, విశ్వాసపూర్వకమైన సంబంధముండేది. భగవత్పాదుల తరువాత చతురామ్నాయ పీఠాధీశ్వరులు ఒకే ప్రదేశంలో సమావేశమైనట్లు లేదు. శ్రీచరణులు అటువంటి సమావేశాన్ని శృంగేరిలో ఏర్పరిచారు. సిద్ధార్థి సంవత్సర శంకర జయంతి (1.5.1979) రోజు జరిగిన చతురామ్నాయ పీఠాధీశ్వరుల సమ్మేళనం చరిత్రాత్మకం, మహత్త్వపూర్ణమై ఉన్నది. దానిని నడిపిన కీర్తి శ్రీచరణులకే చెందుతుంది.

దానికి పూర్వం కాలటీ క్షేత్రంలో 1965వ సంవత్సరం శంకర జయంతి రోజున శృంగేరీ, ద్వారకా పూరీ పీఠాధీశ్వరుల సమ్మేళనం జరిగింది. దానికి పూర్వం పూరీ పీఠాధీశ్వరులు తమిళనాడులోని మధురలో శ్రీచరణులతో



సమావేశమయ్యారు. అదేవిధంగా బెంగుళూరు నగరంలో ద్వారకా పీఠాధీశ్వరులు శ్రీచరణులతో సమావేశమయ్యారు. 1971లో బెంగుళూరు శంకర మఠంలోని శాస్త్ర పాఠశాల వజ్రోత్సవానికి పూరీ పీఠాధీశ్వరులు విచ్చేసి శ్రీచరణులకు సంతోషం కలిగించారు.

ప్రస్తుతం ద్వారకా పీఠంలో అధిపతులుగా ఉన్న జగద్గురు శ్రీ స్వరూపానంద సరస్వతీ స్వామివారు పట్టాభిషేకాన్ని వారి కోరిక ప్రకారం శ్రీచరణుల ద్వారకా క్షేత్రానికి దయచేసి జరిపించారు. అదే ప్రకారం వారు మధ్యప్రదేశ్‌లోని పరమహంసీ గంగాశ్రమమను ప్రదేశంలో నిర్మించిన శ్రీరాజరాజేశ్వరీ దేవాలయంలో అమ్మవారి ప్రతిష్ఠా కుంభాభిషేకాలు వారి కోరిక ప్రకారమే నెరవేర్చారు. అట్లే శ్రీచరణులు శృంగేరిలో 1985వ సంవత్సరంలో జరిపిన శ్రీ భవానీ మలహా నికరేశ్వరస్వామి కుంభాభిషేకంలో శ్రీచరణుల అభిప్రాయానుసారం ద్వారకా పీఠాధీశ్వరులు పాల్గొనినది ఉల్లేఖింప దగినది. ప్రయాగ క్షేత్రంలో నల సంవత్సరం పుష్య అమావాస్యనాడు మహాకుంభ పర్వంలో భక్తజనులతో శ్రీచరణులు త్రివేణీ సంగమంలో స్నానమాచరించడం చిరస్మరణీయం.

శాఖా మఠాధిపతులు శ్రీచరణుల యందు విశేషమైన గౌరవాదరాలను కలిగివున్నారు. శివగంగా మఠపు ప్రస్తుతాధిపతులు, వారి గురువులు, పరమగురువులు శ్రీచరణుల కృపాశీర్వాదముల చేతనే ఆ మఠానికి అధిపతులయ్యారు. వారందరూ శృంగేరికి వచ్చి శ్రీచరణులను సేవించారు. శ్రీచరణులను శివగంగా క్షేత్రానికి ఆహ్వానించి, వారిని విశేషంగా సేవించి, వారి కృపకు పాత్రులయ్యారు. శ్రీచరణులు 1961లో మహాశివరాత్రి ఆచరణకు హంపీ క్షేత్రానికి దయచేసిన సందర్భంలో హంపీ విరూపాక్ష మఠాధిపతులు శ్రీచరణులను భక్తితో సేవించి వారి కృపకు పాత్రులయ్యారు. తరువాత వారు శృంగేరికి వచ్చి, శ్రీచరణులను దర్శించి, వారి ఆశీర్వాదాన్ని పొందారు. హరిహరపుర మఠాధిపతులు శ్రీచరణుల పట్ల అమితమైన భక్తిశ్రద్ధలను కలిగియుండి, వారిని అనేకసార్లు సేవించి, వారి కృపాశీర్వాదములను పొందారు.

పశ్చిమబెంగాల్‌లో కలకత్తాకు సమీపం లోని తారకేశ్వరము అనే శివక్షేత్రంలో అద్వైత సంప్రదాయ మఠమొకటి ఉంది. ఆ మఠాధిపతులైన హృషీకేశాశ్రమ స్వామివారు శ్రీచరణులను భక్త్యాదరములతో తమ మఠంలో సేవించి, శ్రీచరణుల పరిపూర్ణ కృపకు పాత్రులయ్యారు. శ్రీచరణుల వర్ధంతి మహోత్సవం 1982లో కలకత్తాలో జరిగిన సందర్భంలో వారు అక్కడికి వచ్చి శ్రీచరణులను విశేషంగా కొనియాడి, ఆశీస్సులను పొందారు. ఇదేవిధంగా పుష్పగిరి, భండిగడి, నెలమావు, తీర్థమత్తూరు మొదలైన మఠాధిపతులు శ్రీచరణులను సేవించి వారి కృపకు పాత్రులయ్యారు.

మైసూరు మహారాజులు వంశ పారంపర్యంగా శృంగేరీ జగద్గురువుల శిష్యులై వారి వద్ద మంత్రోపదేశాలను పొంది, వారి పరిపూర్ణ కృపకు పాత్రులయ్యారు. అదే పరంపరలో వచ్చిన మైసూరు మహారాజా శ్రీజయచామరాజ వడయరుగారు శ్రీచరణులకు అత్యంత ప్రియశిష్యులుగా ఉన్నారు. శ్రీచరణుల వద్ద అనేక మంత్రాలను ఉపదేశం పొంది పునశ్చరణ చేశారు.

శృంగేరిలో అతిరుద్రం, సహస్రచండీ మొదలైన ధర్మకార్యాలను జరిపించారు. భక్తి, వినయాది సద్గుణాలను చూచి అత్యంత ప్రసన్నులైన శ్రీచరణులు వారికి 'గురుభక్తావతంస' అనే బిరుదును అనుగ్రహించారు.

కొచ్చిన్ సంస్థాన మహారాజులైన శ్రీరామవర్మ పరీక్షిత్‌గారు దర్శనములలో విశేషంగా న్యాయశాస్త్రంలో అపారమైన పాండిత్యాన్ని, అందుకు తగ్గ వినయాన్ని కలిగివుండేవారు. శ్రీచరణులు కాలటీ క్షేత్రంలో జరిపిన

# శిష్యవాత్సల్య సముద్రులు అభినవ విద్యాతీర్థులు

శ్రీ మహాసన్నిధానం వారు 1974వ సంవత్సరంలో శ్రీశారదాదేవి నవరాత్రి ఉత్సవాలలో ప్రతి రోజు ఆ దేవిని అర్చించి, దీర్ఘంగా దేవి సన్నిధిలో గర్భగృహంలో ఏకాంత ధ్యానం చేసేవారు. నవరాత్రి ఉత్సవాలు ముగింపు దశకు వచ్చాయి. ఏకాదశి రోజున ఉదయం శ్రీ మహాసన్నిధానం వారు శ్రీ శారదాదేవి ఆలయ గర్భగృహంలో సాధారణంగా గడిపే సమయం కంటే ఎక్కువ కాలం ధ్యానం చేసి తరువాత ముఖ మండపానికి వచ్చి, అక్కడ గుంపుగా ఉన్న శిష్యులను చూసి... వారితో రాబోయే ద్వాదశి రోజున తాము శిష్య స్వీకారం చేయడానికి తీర్మానించినట్లు తెలిపారు. ఆ శిష్యుడు శ్రీమఠమునందు ఉండే విద్యార్థి బ్రహ్మచారి శ్రీ సీతారామాంజ నేయులు అని ప్రకటించారు. శృంగేరి మఠంలో ప్రాచీన కాలం నుండి పీఠాధిపతిని నియమించ డంలో శ్రీ శారదాదేవి ఆజ్ఞ ప్రకారమే చేయడం ఆచారం.అలా ఆ అంబ ఆజ్ఞ ఇచ్చేవరకు దానిని గురించి ఆలోచించేవారు కారు. ఈ విషయంలో శ్రీ శారదాంబ ఆజ్ఞ అతి ముఖ్యం.

ఆనంద నామ సంవత్సరం ఆశ్వయుజ బహుళ ద్వాదశి నవంబరు 17వ తేదీ సోమవారం నాడు శిష్య స్వీకారోత్సవం జరిగింది. అంతకు ముందు రోజు శాస్త్ర ప్రకారం సన్యాస స్వీకారానికి ముందు చేయాల్సిన అష్ట శ్రాద్ధములు, విరజా హోమం మొదలైనవి పలువురు ఋత్విక్కుల సహాయంతో జరిగాయి. శ్రీసీతారామాంజనేయుల మాతాపితలు ముందు గానే శృంగేరికి వచ్చి ఉన్నారు. వారు, వారి కుమారుడు సన్యాసం స్వీకరించడానికి అనుమతి ఇచ్చారు.

నవంబరు 11వ తేదీ నాడు ఉదయం తుంగానది మధ్యలో బ్రహ్మచారి శ్రీసీతారామాంజనేయులు నిలబడి తమ యజ్ఞోప వీతం, వస్త్రాలు, కౌపీనం మొదలైన వానిని ఒక్కొక్కటిగా నదిలో పడవేసి దిగంబరంగా ఎదురుగా నదీతీరాన నిలబడ్డారు. శృంగేరి జగద్గురువులు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వాములను చూసి 'త్వమేవ శరణం' అన్నప్పుడు వారికి శ్రీ గురునాథులు అభయం ఇచ్చి, సన్యాసికి కావలసిన కాషాయ వస్త్రాలు, దండం, కమండలం, కృష్ణాజినం మొదలైన వాటిననుగ్రహించారు. వారికి శాస్త్ర ప్రకారం యజుర్వేద మహావాక్య క్రమంగా మహావాక్య ఉపదేశం చేశారు. తరువాత శిష్యసమేతంగా శ్రీ శారదాదేవి ఆలయానికి వచ్చి, అక్కడ సర్వజ్ఞ పీఠము నందు తమ శిష్యస్వాములను ఆసీనులను చేసి, వారి శిరస్సునందు సాలగ్రామాన్ని ఉంచి, గురునాథులైన శ్రీ మహాసన్నిధానం వారు శాస్త్ర ప్రకారం పూజ చేసి, శిష్య స్వాములకు 'శ్రీభారతీతీర్థ' అనే యోగపట్టాన్ని ప్రసాదించి అనుగ్రహించారు. తరువాత శ్రీ మహాసన్నిధానం వారిని సర్వజ్ఞ పీఠంపై ఆసీనులను గావించి వారి పాదాలకు శాస్త్ర ప్రకారం శ్రీ సన్నిధానం వారు (బాలస్వాములు శ్రీభారతీ తీర్థులవారు) పూజ చేశారు. సాయంకాలం శ్రీ జగద్గురువులిద్దరూ కలిసి భక్తులకు దర్శనమిచ్చారు. ఆ రోజు రాత్రి శ్రీ మహాసన్నిధానం వారు బంగారు పల్లకిలోనూ, శ్రీ సన్నిధానం వారు వెండి పల్లకి లోను కూర్చొని శృంగేరి వీధులలో ఊరేగింపునకు విచ్చేశారు.

విద్వత్సభలో పాల్గొని శాస్త్రార్థ చర్చలు జరిపి శ్రీచరణుల విశేష కృపకు పాత్రులయ్యారు. కొచ్చిన్‌లో తమ రాజ ప్రసాదానికి శ్రీచరణులను ఆహ్వానించి వారిని విశేషంగా సేవించారు. వారి పాండిత్యానికి సంతసించిన శ్రీచరణులు వారికి 'అభినవతర్క వాగీశః' అనే బిరుదును అనుగ్రహించారు.

తిరువనంతపురం మహారాజులు శ్రీచరణులకు అత్యంత ప్రియశిష్యులుగా ఉండేవారు. శ్రీచరణులు తిరువనంతపురానికి వచ్చినపుడు అత్యంత శ్రద్ధాభక్తులతో సేవించి, వారి పరిపూర్ణ కృపకు పాత్రులయ్యారు. 85 సంవత్సరాలకు పూర్వం కాలటిలో శృంగేరీ మఠ నిర్మాణ సందర్భంలో ఆ భూమిని తిరువనంతపురం మహారాజులే అప్పటి శృంగేరీ శ్రీచరణులకు సమర్పించారనేది సర్వవిదితము.

గ్వాలియర్ మహారాజు శ్రీ మాధవరావు సిధియాగారు, వారి తల్లి శ్రీమతి విజయరాజే సింధియాగారు శ్రీచరణులు ఉజ్జయినిలో చాతుర్మాస్యానుష్టానము, గ్వాలియర్‌లో నవరాత్రోత్సవాలు జరిపినప్పుడు శ్రీచరణులకు సకల సౌకర్యాలను ఏర్పాటుచేసి, అత్యంత భక్తిశ్రద్ధలతో వారిని సేవించి వారి విశేష కృపకు పాత్రులయ్యారు.

రామనాథపురం మహా రాజులు పరంపరగా శృంగేరీ జగద్గురువులకు శిష్యులై వున్నారు. శ్రీచరణులు రామేశ్వర క్షేత్రానికి దయచేసినప్పు డల్లా రామనాథపురంలో మహారాజులవారి ప్రాసా దంలో మకాం చేసి, వారి సేవలను



స్వీకరించి, వారిని ఆశీర్వదించడం సాంప్ర దాయంగా ఉండేది. 1975లో రామేశ్వర క్షేత్రంలో రామనాథస్వామివారి కుంభాభిషేకాన్ని రామనాథపుర మహారాజులవారి ప్రార్థనానుసారం శ్రీచరణులొనర్చారు.

కాశీ మహారాజులైన విభూతి నారాయణ సింహ బహదూరుగారు శ్రీచరణులు కాశీకి దయచేసినప్పుడు తమ రాజప్రాసాదంలో శ్రీచరణులకు అత్యంత వైభవోపేతమైన స్వాగత సత్కారాలను చేశారు. తరువాత వారు శృంగేరికి వచ్చి శ్రీచరణులను సేవించి వారి కృపకు పాత్రులయ్యారు. ఇదేవిధంగా సండూరు, ఇండోరు మొదలైన సంస్థానాధీశ్వరులు శ్రీచరణులను భక్తి శ్రద్ధలతో సేవించి వారి కృపకు పాత్రులయ్యారు. శ్రీచరణులు సరళ సుందరమైన శైలిలో ఉపన్యాసాలు చేసేవారు. గంభీరమైన వేదాంతతత్వాన్ని కూడా సులభంగా జనానికి బోధించేవారు. వారి ఉపన్యాసాలను విన్న ప్రజల మనస్సులో విశేషమైన పరిణామం కలుగుతూ ఉండేది. శృతి, స్మృతి, ఇతిహాస పురాణాదులలో ప్రతిపాదింపబడిన విషయాలు సామాన్యులకు కూడా శ్రీచరణుల అనుగ్రహ భాషణం ద్వారా అర్థమయ్యేవి.

శ్రీచరణులకు ఎటువంటి పట్టుదల ఉండేది కాదు. ప్రాచీనులు భూమి నిశ్చలమైనదని తెలుసుకున్నారు. కాని విజ్ఞానులు భూమి తిరుగుతున్నదని చెపుతున్నారు.

**శ్లో ॥ పురాణమిత్యేవ న సాధు సర్వం న చాపి కావ్యం నవమిత్యవద్యమ్ । సంతః పరీక్ష్యాన్యతరద్ భజంతే ॥**

అను కాళిదాసు సూక్తిని అనుసరించి శ్రీచరణులు భూమి తిరుగుతున్నదన్నదే సత్యం అనే తీర్మానానికి వచ్చారు. అదేవిధంగా ప్రాచీన నవీన భేదాన్ని పరిగణించక యుక్తియుక్తము, ప్రమాణ సమ్మతమనే విషయాన్నే శ్రీచరణులు స్వీకరించే వారు. ఇంతటి ఔదార్యం అన్యులలో చాలా అరుదుగా కనపడుతుంది.

సేవకుల విషయంలో శ్రీచరణులకు అమితమైన వాత్సల్యం ఉండేది. వారు తప్పులు చేసినా, విశాల హృదయంతో వారిని క్షమించి, వారికి హితాన్ని బోధించి, వారిని సరియైన మార్గంలో పెట్టేవారు. శిష్యజనుల విషయంలో శ్రీచరణులకు అమితమైన వాత్సల్యముండేది. వారి యోగక్షేమాలను తెలుసు కుంటూ, వారి సమస్యలను పరిష్కరిస్తూ, వారికి సంతోషాన్ని కలగజేయడమే వారికి సర్వస్వమై ఉండేది.

కాళిదాస మహాకవి అజమహారాజును గురించి 'అహమేవ మతో మహీపతేరితి సర్వః ప్రకృతి ష్వచింతయత్' అన్న మాటలు శ్రీచరణులకు సార్థకమైనవి.

ఇంతటి సద్గుణనిధులు, దయాసముద్రులు, ధైర్యశాలురు అయిన జగద్గురు శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వాములవారు దిగంత విశ్రాంత యశోభూషితులై శుక్ల సంవత్సర భాద్రపద కృష్ణ సప్తమి నాడు (21-9-1989) మహాసమాధిగతులయ్యారు. పావన చరిత్రులైన ఆ మహాపురుషులను స్మరించి సర్వులు శ్రేయస్సులను పొందుదురుగాక.

**శ్లో ॥ జాతః పింగళ హాయనే యతిరభూద్యశ్చ ప్రజాపత్యభి ఖ్యేబ్దే పీఠపతిర్బభూవ జయవర్షే యశ్చ శృంగాచలే ।**

# అంగరంగ వైభవం... 'సద్గుణనిధి' శతజయంత్యుత్సవం

తపశ్చక్రవర్తి... మహాయోగి... శ్రీ శృంగేరి జగద్గురు శంకరాచార్య శ్రీశ్రీశ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామివారి శతజయంతి మహోత్సవాలు శృంగేరి శారదాపీఠంలో నేత్రపర్వంగా కార్యక్రమాలు నిర్వహించారు. ప్రతిరోజూ అభినవ విద్యాతీర్థ మహాస్వామి వారి జీవనరేఖలు, ఆధ్యాత్మిక ప్రస్థానంపై ప్రత్యేక తత్త్వచింతన సదస్సును నిర్వహించారు. ప్రతిరోజూ విఖ్యాత సంగీత విద్వాంసులచే కచేరీలను నిర్వహించి, సంగీతార్చన గావించారు. జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి అధిష్ఠానంలో జగద్గురువులు శ్రీ భారతీతీర్థ మహాస్వామి, శ్రీ విధుశేఖర భారతీస్వాములు ప్రత్యేక పూజలు అర్చనలు చేశారు. అక్టోబర్ 5 నుంచి 19వ తేదీ వరకు శతజయంతి ఉత్సవాలలో భాగంగా విశేష ధార్మిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి. దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి వేదపండితులు, ధార్మికవేత్తలు పెద్దయెత్తున పాల్గొన్నారు. ప్రధానంగా 2017 అక్టోబర్ 5వ తేదీ నుంచి 16 వరకు అతి రుద్ర మహాయాగం జగద్గురువుల పర్యవేక్షణలో జరిగింది.

శ్రీ శృంగేరి శారదా పీఠాధీశ్వరులు జగద్గురు శంకరాచార్య శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి, శ్రీశ్రీ విధుశేఖర భారతీ స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో, వారి దివ్యాశీస్సులతో చెన్నయ్‌లోని శ్రీ విద్యాతీర్థ ఫౌండేషన్ సంస్థవారు అక్టోబర్ 11 నుంచి 18వ తేదీ వరకు విశేష కార్యక్రమాలు నిర్వహించారు. జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామివారి అధిష్ఠానంలో 10 తేదీ నుంచి 19వ తేదీ వరకు ప్రత్యేక పూజలు జరిపారు.

అక్టోబర్ 17న జగద్గురువులు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామివారి అష్టోత్తర అఖండ పారాయణం ఘనంగా జరిగింది. 12 నుంచి 18వ తేదీ వరకు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామివారి అభినవ సప్తాహం జరిగింది. సప్తాహానికి ముందు రోజు 11వ తేదీ ఉదయం సహస్ర మోదక గణపతి హోమం జరిగింది. శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి శతజయంతి మహోత్సవాల సందర్భంగా స్మరణ సప్తాహాన్ని శృంగేరి శారదా పీఠాధీశ్వరులు శ్రీశ్రీశ్రీ జగద్గురు భారతీతీర్థ మహాస్వామి వారు ప్రారంభించారు. శ్రీశ్రీ జగద్గురు విధుశేఖర భారతీ స్వామి వారు పాల్గొన్నారు. ఈ సప్తాహంలో రోజూ సాయంత్రం 4 గంటల నుంచి 6 వరకు విఖ్యాత సంకీర్తన కళాకారులచే నామ సంకీర్తనం, భజన కార్యక్రమాలు జరిగాయి. ప్రారంభ, సమాపనోత్సవ రోజుల్లో నృత్య, నాటక ప్రదర్శనా కార్యక్రమాలు కన్నుల పండువగా జరిగాయి.

పెద్దయెత్తున తరలివచ్చిన భక్తులు, శిష్యులు, ఆధ్యాత్మిక వేత్తల సమక్షంలో జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి వారి శత జయంతి ప్రధాన ఉత్సవం వారి జయంతి రోజైన అక్టోబర్ 18 తేదీన జరిగింది. పలు విశేష కార్యక్రమాలు నిర్వహించారు. మధ్యాహ్నం పన్నెండు గంటలకు అభినవ విద్యాతీర్థ స్వామివారి అధిష్ఠానంలో విశేష పూజలు, అర్చనలు జరిగాయి. జగద్గురు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి, శ్రీశ్రీ విధుశేఖర భారతీ స్వామివార్లు స్వయంగా శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి వారికి అభిషేకం, అష్టోత్తర శతనామావళి పూజలు, ప్రత్యేక అర్చనలు నిర్వహించారు ఈ సందర్భంగా శ్రీ అభినవ విద్యాతీర్థుల విగ్రహానికి సువర్ణ హారం, సువర్ణ కవచ రుద్రాక్ష హారాలను శ్రీ భారతీతీర్థ స్వామివారు సమర్పించారు. సాయంత్రం ఐదు గంటలకు గురు నిలయంలో అభినవ విద్యాతీర్థ స్వామివారి శతజయంతి ప్రధాన ఉత్సవం జరిగింది. సజీవమూర్తిగా భాసిల్లిన అభినవ విద్యాతీర్థుల విగ్రహం వద్ద జ్యోతి ప్రకాశనం, పూజలు చేసి ఉభయ జగద్గురువులు విగ్రహానికి ఇరువైపులా ఆశీనులయ్యారు. వేలాదిమంది భక్తులు హాజరైన ఈ కార్యక్రమం చతుర్వేద పఠనం, స్వామివారి స్మృతి స్మరణ సభ కొనసాగింది.

ఈ సందర్భంగా శ్రీఅభినవ విద్యాతీర్థ ఫౌండేషన్ (చెన్నయ్) వారు ప్రచురించిన ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. అనంతరం 'దర్శనమ్' ఆధ్యాత్మిక మాసపత్రిక ప్రచురించిన 'సద్గుణనిధి-తపశ్చక్రవర్తి' ప్రత్యేక గ్రంథాన్ని జగద్గురువులు శ్రీ భారతీతీర్థ మహాస్వామి వారు ఆవిష్క రించారు. తొలిపత్రిని శ్రీ దక్షిణామూర్తిగారికి అందజేశారు. శ్రీ అభినవ విద్యాతీర్థ స్వామి వారిని సంస్మరించుకుంటూ వక్తలు స్తుతిం చారు. చివరగా జగద్గురువులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి, శ్రీశ్రీ విధుశేఖర భారతీతీర్థ స్వామివార్లు తమ అనుగ్రహ భాషణాన్ని అందిస్తూ గురువరేణ్యుల శ్రీ అభినవ విద్యాతీర్థుల విశిష్టతను, వారి పీఠాధిపత్యంలో శృంగేరి శారదాపీఠ వైభవాన్ని, ప్రత్యేక సందర్భాలను స్మరిస్తూ కొనియాడారు.

# శ్రీ శృంగేరి శారదాపీఠాధిష్ఠిత జగద్గురువుల వేదశాస్త్ర సంరక్షణదీక్ష



చామీకరప్రభాహాసిచారుశారీరతేజసః ।
జగద్గురూనభినవవిద్యాతీర్థానుపాస్మహే ॥
తత్కరా మ్బుజసంజాతాన్ వేదశాస్త్రాబ్ధిపారగాన్ ।
వన్దే శ్రీభారతీతీర్థయతీన్ శిష్యహితైషిణః ॥

'నాగరికత' 'సంస్కృతి' అను రెండు పదాలు ఈనాడు ఎక్కువగా వింటూంటాం. ఈ నాగరికతా - సంస్కృతులు పరస్పరసంబంధం కలవి. కొంత వైలక్షణ్యం కలవికూడ. మానవులు ప్రయత్నపూర్వకంగా సాధించిన లౌకికసుఖోన్నతికి ఉపకారకమైన అభ్యుదయం 'నాగరికత'. ధనధాన్యాది సమృద్ధితో, దినదినప్రవర్ధమాన వివిధ సుఖసాధనాలతో ఏ దేశంలోనైనా ప్రజలందరూ, ఎల్లప్పుడూ సుఖాలు అనుభవిస్తున్నట్లు కనబడితే అది 'నాగరికత' అని అంటాం. ఇది బాహ్యమైన జీవనవిధానానికి సంబంధం చినది. మతానికి సంబంధించిన విచారాలు, వాటితో పెనవేసికొని ఉండే ఆచారాలూ, ఆధ్యాత్మిక చింతన, తత్త్వజిజ్ఞాస - ఇవన్నీ కలిస్తే 'సంస్కృతి'. ఈ సంస్కృతి ప్రభావం నాగరికతలో కూడ, అనగా ప్రజల జీవనవిధానాలలో కూడా కొంతవరకు ప్రతిబింబి స్తూంటుంది. అందుచేతనే ఇవి పరస్పర సంబంధం కలవి అని అంటారు. అయితే ఉత్తమసంస్కృతి లేని నాగరికత, ఉన్నత నాగరికత లేని సంస్కృతి కూడ ఉండవచ్చును. అందుచేతనే వీటికి వైలక్షణ్యం కూడ ఉన్నదని అంటారు. భారతదేశంలో మహోన్నతమైన నాగరికత, అత్యుత్తమమైన సంస్కృతి కూడ ఒకదానితో ఒకటి పెనవేసికొన్నట్లు కలిసిమెలిసి ఉంటూ అనాదికాలం నుంచీ అవిచ్ఛిన్నంగా పరిఢవిల్లుతున్నాయి.

నిజానికి సంస్కృతి భారతదేశంలో అనాదికాలంనుంచీ ఉన్నాకూడ 'సంస్కృతి' అను పదం మాత్రం ఆధునికకాలంలో ఆంగ్లభాషా సంప్రదాయాలతో సంబంధం ఏర్పడిన తరువాత 'కల్చర్' అను ఆంగ్లపదానికి సమానార్థకంగా మనం ఏర్పరచుకున్నది. 'ధర్మము' 'ధార్మికప్రవృత్తి' అను అతి ప్రాచీనములైన పదాల అర్థంలో, 'సంస్కృతి' అంతర్గతం అవుతుంది. ధర్మంలోనే 'లౌకిక జీవనవిధానము' 'ఆధ్యాత్మిక జీవనవిధానము' అను రెండు పక్షాలు ఉన్నాయి.

పై రెండు విధానాలకు సంబంధించిన అతి విస్తృతమైన వాఙ్మయం అవిచ్ఛిన్నంగా మన దేశంలోని వేలకొలది మేధావంతులచేత పరిపుష్టం చేయబడుతూ అన్నికాలాలలోనూ జిజ్ఞాసువులకు లభిస్తున్నది. అర్థశాస్త్ర - నీతిశాస్త్ర - వాస్తుశాస్త్రాదికము బాహ్యజీవనవిధానానికి, నాగరికతాభివృద్ధికి ఉపయోగించే వాఙ్మయం. కర్మ - యోగ - భక్తి - జ్ఞానాదులను బోధించే వాఙ్మయం ఆధ్యాత్మిక జీవనవిధానానికీ, మహోన్నత సంస్కృతి పరిరక్షణకూ సంబంధించినది. కర్మకాండకుచెందిన కొన్ని కామ్యకర్మలు కూడ ఐహికాభ్యుదయానికి హేతువులవడంచేత కొంతవరకు అవికూడ ఆద్యపక్షానికి చెందుతాయి.

వివిధ విషయాలను బోధించే శాస్త్రాలకు 'విద్యాస్థానాలు' అని పేరు. ఇవి పధ్నాలుగు అని యాజ్ఞవల్క్యస్మృతిలో చెప్పబడినవి.

పురాణ న్యాయ మీమాంసా ధర్మశాస్త్రాఙ్గమిశ్రితాః ।
సదా స్థానాని విద్యానాం ధర్మస్య చ చతుర్దశ ॥
(యా.స్మృ.1-3)

ఈ విషయాన్ని మధుసూదనసరస్వతి 'ప్రస్థానభేదః' అను ఒక లఘుగ్రంథంలో ఇలా విశదీకరించారు. "ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము అని వేదాలు నాలుగు. శిక్ష, కల్పం, వ్యాకరణం, నిరుక్తం, ఛందస్సు,

జ్యోతిషం అని వేదాంగాలు ఆరు. పురాణం, న్యాయం, మీమాంస, ధర్మశాస్త్రం అని ఉపాంగాలు నాలుగు. ఉపపురాణాలకు పురాణాలు అంతర్భాగం. వైశేషికానికి న్యాయశాస్త్రంలోను, వేదాంతశాస్త్రానికి మీమాంసలోను (మీమాంసా శబ్దంచేత పూర్వమీమాంసా ఉత్తరమీమాంసలు గ్రహించాలని అర్థం), మహాభారత - రామాయణ - సాంఖ్య - పాతంజల - పాశుపత - వైష్ణవాది శాస్త్రాలకు ధర్మశాస్త్రంలోను అంతర్భావం. ఈవిధంగా మొత్తం విద్యాస్థానాలు పధ్నాలుగు. వీటికి నాలుగు ఉపవేదాలు కలిపితే పద్దెనిమిది విద్యలవుతాయి. ఆయుర్వేదం, ధనుర్వేదం, గాంధర్వవేదం, అర్థశాస్త్రం అనేవి నాలుగు ఉపవేదాలు. ఈవిధంగా మొత్తం విద్యలన్నీ ఈ అష్టాదశ విద్యలలో ఏదో ఒకదానిక్రిందికి వస్తాయి.

పై విద్యలలో వేదాంతశాస్త్రం తప్ప మిగిలిన అన్ని విద్యలూ కూడ అభ్యుదయహేతువులు; అనగా ఐహిక - ఆముష్మిక సుఖహేతువులు. వేదాంతశాస్త్రం ఒక్కటే నిఃశ్రేయసహేతువు, మోక్షమార్గ ప్రదర్శకం. ఈ భేదాన్నిబట్టి ముండకోపనిషత్తులో విద్యలు 'పరా' 'అపరా' అని రెండు తెగలుగా విభజింపబడ్డాయి. ఔపనిషదమైన బ్రహ్మవిద్య ఒక్కటే 'పరావిద్యా'; మిగిలిన అన్నివిద్యలూ అపరవిద్యలే.

"ద్వే విద్యే వేదితవ్యే ఇతి హ స్మ యద్బ్రహ్మవిదో వదన్తి, పరా చైవాపరా చ । తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదో-థర్వవేదః శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్దో జ్యోతిషమితి । అథ పరా యయా తదక్షరమధిగమ్యతే..." (ముం.ఉ.1-1)

శ్రీశంకరభగవత్పాదులు ఉపనిషద్బ్రహ్మసూత్ర భగవద్గీతాభాష్యాలు, అనేక ప్రకరణ గ్రంథాలూ రచించి ఔపనిషదమైన అద్వైత సిద్ధాంతాన్ని సుదృఢంగా స్థాపించి వేదాంతశాస్త్రాపరనామధేయమైన ఈ అద్వైత సిద్ధాంతాన్ని పరిరక్షిస్తూ, రాబోయే తరాలవారికి అవిచ్ఛిన్న ప్రవాహరూపంలో అందజేయడానికై స్థాపించిన పీఠాలలో ప్రధానమైన ఆద్యపీఠం శ్రీశృంగేరి శారదాపీఠం, బృహదారణ్యకోపనిషద్భాష్యవార్తిక - తైత్తిరియోపనిషద్భాష్యవార్తిక - నైష్కర్మ్య సిద్ధ్యాది గ్రంథాల రచనలద్వారా తమ ఆచార్యులు స్థాపించిన అద్వైతసిద్ధాంత మహాప్రాసాదానికి సుదృఢప్రాకారం నిర్మించినవారు, శ్రీశంకరభగవత్పాదాన్తేవాస చతుష్టయంలో వరిష్ఠులూ అయిన శ్రీసురేశ్వరాచార్యులు ఆచార్య పాదాశీస్సులతో ఈ పీఠాన్ని అధిష్ఠించిన ప్రథమ శారదాపీఠాధిపతులు. వారు మొదలు ఆయా కాలాలలో ఈ పీఠాన్ని అలంకరించిన శ్రీభారతీతీర్థ శ్రీ విద్యారణ్య - శ్రీసచ్చిదానంద శివాభినవ నరసింహభారతీ - శ్రీచంద్రశేఖరభారతీ - శ్రీ అభినవ



విద్యాతీర్థ - యతీంద్రాది మహావిద్వదాచార్య పరంపరకు చెందిన నేటి శ్రీభారతీతీర్థస్వామి చరణుల వరకు అద్వైతశాస్త్రప్రచారం అవిచ్ఛిన్నంగా జరుగుతుండడం ఈ పీఠం చేస్తున్న శాస్త్రపరిరక్షణకు నిదర్శనం. "కాణాదం పాణినీయం చ సర్వశాస్త్రోపకారకమ్" అన్నట్లు న్యాయ - వ్యాకరణశాస్త్రాల పరిచయం లేనివారి ఇతర శాస్త్రపాండిత్యం చాల స్థూలంగా మాత్రమే ఉంటుంది. వేదాంతశాస్త్ర పాండిత్యసంపాదనకు ఈ రెండు శాస్త్రాలతోపాటు పూర్వమీమాంసాశాస్త్రంలో కూడ ప్రవేశం చాలా ఆవశ్యకమైనది. అందుచేత శాస్త్రాలు అనగానే ఈ నాలుగు శాస్త్రాలే ప్రధానమన్నట్లు ప్రసిద్ధి, ప్రచారమూ కొన్ని శతాబ్దాలుగా ఏర్పడ్డాయి.

శ్రీశృంగేరి శారదాపీఠం శాస్త్రసంరక్షణానికి చాలాకాలం నుండి పేరు గాంచినది. ప్రస్తుతం శ్రీశారదాపీఠం అధిష్ఠించి ఉన్న జగద్గురు శ్రీభారతీతీర్థ మహాస్వామి చరణులు తమ పూర్వాచార్యులవలెనే సమస్త శాస్త్రపారంగతులు. వాస్తవంలో శాస్త్రం అనగా వేదం ఒక్కటే. అదే ప్రధానమైన శాస్త్రం. వేదాలలో ప్రత్యక్షంగానో, పరంపరారీతితోనో సంబంధించి ఉండడంచేతనో ఇతర శాస్త్రాలకు శాస్త్రత్వం లభించినది. అట్టి వేదంలో కూడా నిష్ణాతులైన శ్రీచరణులు తమకు ఈ పీఠంలో సంబంధం ఏర్పడినది మొదలు ఎంతో శ్రద్ధతో వేదశాస్త్ర పరిరక్షణ కొరకై నిరంతరము ప్రయత్నం చేస్తూనే ఉన్నారు.

ఈ పీఠం చేపట్టిన వేదశాస్త్ర పరిరక్షణకార్యక్రమం మూడు పద్ధతులలో నడుస్తున్నది. ఒకటి - వేదశాస్త్రపాఠశాలలు నెలకొల్పి అక్కడ వీటి అధ్యయనం ఉన్నతస్థాయిలో జరిపించడం. రెండు - శాస్త్రార్థసభలు నిర్వహించడం. మూడు - శాస్త్రాధ్యయనం చేసిన యువవిద్వాంసులకు పరీక్షలు జరిపి భూరిపారితోషికాదులతో వారిని సత్కరించి ప్రోత్సహించడం.

1) శృంగేరిలోను, బెంగుళూరు మొదలైన మహానగరాలలోనూ మఠానికి సంబంధించిన పాఠశాలలు



చాల సంవత్సరాలనుండి పనిచేస్తున్నాయి. వీటిలో శాస్త్రాధ్యయనం చేసిన ఎందరో పండితులు దేశం అంతటా వ్యాపించి ఉన్నారు.

2) ప్రతి సంవత్సరము గణపతి నవరాత్రోత్సవ సందర్భాన ఎన్నో సంవత్సరాలుగా జగద్గురువులు నిర్వహిస్తున్న శాస్త్రార్థసభలు సకలభారతదేశ ప్రసిద్ధములు. ఇవి చాతుర్మాస్యదీక్షాకాలంలో జరుగుతాయి. జగద్గురువులు ఆ సంవత్సరం ఏ నగరంలో చాతుర్మాస్య దీక్షలో ఉంటారో అక్కడ ఈ సభలు జరుగుతాయి. అది భారతదేశంలోని ఏ ప్రాంతమైనా కావచ్చును. భారతదేశంలోని దాదాపు 50-60 మంది ఉద్ధండ పండితులు ఈ సభలలో పాల్గొని నాలుగు శాస్త్రాలలో వాక్యార్థం, అనగా శాస్త్రాలలో ప్రతిపాదించిన కొన్ని క్లిష్టమైన విషయాలకు సంబంధించిన వాదప్రతివాదరూపమైన చర్చ జరుపుతారు. ఇది 'వాద' ప్రధానంగా, అనగా శాస్త్రతత్త్వనిర్ణయప్రధానంగా జరిగే వాక్యార్థం, విజిగీషావేశానికి కూడ అవకాశం అనగా ఒకరిని మరొకరు జయించాలి అనే అభిమానంతో ఉండడం అనేది, ఏమాత్రమూ లేకపోవడం వలన వీటిలో 'జల్ప', 'వితండ' కథల ప్రసక్తియే ఉండదు. గణపతినవరాత్ర పవిత్రదినాలలో జగద్గురువులు అధ్యక్షతన జరిగే ఈ వాక్యార్థసభలు, ఇతర దేశాలలోగాని, ఇతర వాఙ్మయాలలోగాని ఎక్కడా కనబడని ఈ అద్భుత ప్రక్రియను అక్కడ సమావిష్టులైన భక్తులకు చూపి వాళ్లను ఆశ్చర్యముగ్ధులను చేస్తూంటాయి. పాల్గొనే పండితులకు ఉత్సాహవర్ధకాలుగా ఉంటాయి. ప్రేక్షకులకు శ్రోతలకు కూడ ఇదొక అపూర్వానుభూతి.

ఈ వాక్యార్థసభలు హైదరాబాదు నగరంలో రెండు పర్యాయాలు జరిగినపుడు వాటిని తిలకించి ఆనందించే అవకాశం నాకు లభించినది. శ్రీభారతీతీర్థ మహాస్వామిచరణులు అప్పటికి సకలశాస్త్రాభ్యాసం పూర్తిచేసికొని శ్రీశారదాపీఠానికి ఉత్తరాధికారిగా నిర్ణీతులై తురీయాశ్రమం స్వీకరించి తమ గురుచరణులతో కలిసి విజయయాత్ర చేసిన కాలం అది. అప్పుడు వీరిని 'సన్నిధానం' అని, శ్రీఅభినవ విద్యాతీర్థచరణులను 'మహాసన్నిధానం' అని శిష్యులు గౌరవభావంతో నిర్దేశిస్తూండేవారు. శ్రీసన్నిధానంవారు రెండు పర్యాయాలు హైదరాబాదులో చాతుర్మాస్య దీక్షలో ఉన్నపుడు ఆ రెండు దీక్షాకాలాలలో గణపతివాక్యార్థసభలు జరిగాయి. మొదటి పర్యాయం (1977లో) ఆచార్యచరణులిద్దరూ హైదరాబాదులో చాతుర్మాస్యవ్రతం అనుష్ఠించారు. రెండవ పర్యాయం (1985లో) మహాసన్నిధానంవారి ఆజ్ఞమేరకు సన్నిధానంవారు మాత్రమే ఇక్కడికి దయచేసి చాతుర్మాస్యానుష్ఠానం జరిపారు. ఆ సభలలో చాలామంది పండితులు పాల్గొన్నారు. కేరళదేశీయులైన ముగ్గురు పిషారడీకులానికి చెందినవారు కూడ పాల్గొన్నారు. వారు వ్యాకరణశాస్త్రంలో గొప్ప పండితులు. వారిలో ఒకరు వృద్ధులు. ఇద్దరు వారి శిష్యులు మధ్యమ వయస్కులు. ఆంధ్రదేశంలో కూడ సంస్కృతాభ్యాసం చేసిన ద్విజేతరులున్నారు కాని ఇంత పాండిత్యం ఉన్నవారిని అంతకుపూర్వం నేనెన్నడూ చూడలేదు. ఆ సభలలో శ్రీసన్నిధానంవారు, అన్ని శాస్త్రాలలోను చూపిన పాండిత్యప్రకర్షకు, విషయప్రతిపాదన చాతుర్యానికి, స్పష్టతకు పండితులందరూ ఆశ్చర్యం చెందారు. ఎవరైనా పండితులు ఒక విషయం ప్రతిపాదించే సందర్భంలో కొంచెం తడబడినపుడు శ్రీసన్నిధానంవారు వెంటనే అందుకొని సరిదిద్దిన సంఘటనలు నేను చాలా చూచాను. భాగ్యనగరవాసులైన శృంగేరీపీఠభక్తులు ఆ సభలలో ప్రేక్షకులుగా, శ్రోతలుగా పాల్గొనడం తమ భాగ్యవిశేషఫలమని సంతోషించారు. శిష్యుని ప్రతిభను చూచి మహాసన్నిధానంవారు లోలోన ఆనందిస్తున్నట్లు వారి ముఖవికాసాన్ని బట్టి తెలుస్తూండేది. ప్రతి సంవత్సరము ఇనుమడించుచున్న నూతనోత్తేజముతో శ్రీభారతీతీర్థమహాస్వాములువారు, పీఠాధిపత్యము వహించినది మొదలు ఈ శాస్త్రార్థసభలను నిర్వహించుచున్నారన్న విషయం పండితలోకవిదితం.

3) పీఠం నడుపుతున్న పాఠశాలలో శాస్త్రాభ్యాసం చేసిన విద్యార్థులకు, దేశంలోని ఇతర ప్రాంతాలకు చెందిన పాఠశాలలోగాని, ప్రసిద్ధ పండితులవద్దగాని శాస్త్రాభ్యాసం చేసిన యువపండితులకు ప్రతి సంవత్సరము ఆయా శాస్త్రాలలో ప్రసిద్ధ పండితుల ద్వారా పీఠాధిపతుల సమక్షమునందు పరీక్షలు నిర్వహించి, ఉత్తీర్ణులైనవారికి పారితోషికములిచ్చుచు, వాళ్లకు గణపతిశాస్త్రార్థ సభలలోను, ఇతర ప్రాంతాలలో పీఠంద్వారా జరిపే శాస్త్రార్థసభలలో కూడ

అనుప్రవేశం కలిగిస్తూ, వాళ్ల పాండిత్యానికి సానబట్టుతూండడం శ్రీశారదాపీఠం నిర్వహిస్తున్న తృతీయ శాస్త్రపరిరక్షణ విధానం, శృంగేరీ శాస్త్రపరీక్షలలో ఉత్తీర్ణత్వమనేది ఆయా శాస్త్రాలలో సాధించిన పాండితీప్రకర్షసూచక విజయపతాకముగా పరిగణింపబడుతుంది.

పూర్వకాలంలో ప్రతిసంవత్సరము, పాటలీపుత్రనగరంలో శాస్త్రకారపరీక్ష జరుగుతూండేదనీ, ఆ పరీక్షలలో ఉత్తీర్ణతపొంది ఉపవర్ష - వర్ష - పాణిని - పింగల - వ్యాడులు, వరరుచి - పతంజులులు ప్రపంచఖ్యాతి పొందారని క్రీ.శ. తొమ్మిదవ శతాబ్దికి చెందిన రాజశేఖరుడు కావ్యమీమాంసలో, ఒక ప్రాచీన శ్లోకం ఉదాహరిస్తూ చెప్పి ఉన్నాడు. శ్రూయతే చ పాటలిపుత్రే శాస్త్రకారపరీక్షా -

అత్రోపవర్షవర్షావిహ పాణిని పిఙ్గలావిహ వ్యాడి ।
పరరుచిపతంజలీ ఇహ పరీక్షితాః ఖ్యాతిముపజగ్ముః ॥
(కా.మీ. 10.33)

ఉజ్జయినిలో కావ్యకారుల పరీక్ష జరుగుతూండేదట -
శ్రూయతే చోజ్జయిన్యాం కావ్యకారపరీక్షా -
ఇహ కాళిదాసమీణా వత్రామరరూపసూరభారవయః ।
హరిచన్ద్రచన్ద్రగుప్తౌ పరీక్షితావిహ విశాలాయామ్ ॥
(కా.మీ. 10.22)

ఇది కేవలం ఉపలక్షణ మాత్రమే. ఆ కాలంలో కొన్ని శతాబ్దాలపాటు, అనేక ప్రాంతాలలో శాస్త్ర - కావ్యపరీక్షలు జరుగుతూండేవి. వాటిలో మెప్పు గడించగలిగినవారు మాత్రమే, యథార్థమైన యోగ్యత కలవారుమాత్రమే, పండితులుగా, కవులుగా, గౌరవపాత్రులవుతూండేవారు.

అదేరీతిలో ఈనాడు శృంగేరి పరీక్షోత్తీర్ణులను గూర్చి -
శ్రీశృంగేరిజగద్గురు పరంపరామహితశారదాపీఠే ।
నికషోపలే-త్ర ఘృష్టా దేశే సర్వత్ర భాన్తి విద్వాంసః ॥
అని నిస్సంశయంగా ఉద్ఘోషించవచ్చును.

శ్రీభారతీతీర్థ శ్రీచరణులు మహాపండితులేకాక ఉత్తమకవితాచాతుర్యచరణులు కూడ. తమ ఆచార్య ప్రాచార్యాదులను వివిధ దేవతలను స్తుతిస్తూ వీరు రచించిన అనేక స్తోత్రాలు ఇందుకు నిదర్శనం. అందుచేతనే వీరు అవకాశం లభించినపుడు అవధానాదులకు, కవిసమ్మేళనాదులకు విచ్చేసి కవులను ప్రోత్సహించి ఆశీర్వదిస్తూంటారు. వీరు హైదరాబాదు వేంచేసినపుడు ఏవైన అవధానకార్యక్రమాలు నడపవలసిందిగా నన్ను ఆదేశింపగా నేను ప్రష్టలను సమకూర్చి రెండు పర్యాయాలు శ్రీమాడుగుల నాగఫణిశర్మ, శ్రీకడిమెళ్ల వరప్రసాద్ అను అవధాన విద్యానిపుణులైన కవివర్యుల అవధానాలు హైదరాబాదు శంకరమఠం ప్రాంగణంలో శ్రీచరణుల సమక్షంలో ఏర్పాటు



చేయడం జరిగింది. రెండు వేరు వేరు సంవత్సరాలలో జరిగిన ఈ అవధానాలలో శ్రీచరణులే అనేక ఘట్టాలలో దిశానిర్దేశం చేస్తూ ప్రత్యక్షంగా పాల్గొనడం అటు అవధానులకు ఇటు ప్రష్టలకు సదస్యులకు కూడ గొప్ప ఆనందం కలిగించింది. అవధానాలకు సంతసించిన శ్రీచరణులు సువర్ణాలంకారాలతోనూ, నూతన వస్త్రాదులతోను కవులను ఆశీర్వదించారు. తాము అవధానప్రక్రియ ప్రారంభించిన దివసాలలో శ్రీభారతీతీర్థ మహాస్వాముల ఆశీస్సులు ప్రత్యక్షంగా అందుకొన్న ఆ ఇరువురు అవధానులు కాలక్రమంలో భారతదేశంలోనేకాక ఇతర దేశాలలోకూడ తమ అవధానకళను ప్రదర్శించి గొప్ప విఖ్యాతి సంపాదించారు. ఇదంతా శ్రీస్వామివారి ఆశీర్వాద మహిమయే అని వారు ఇప్పుడు కూడా నేను కనబడినపుడు అంటూంటారు.

ఈవిధంగా ప్రథమపీఠాధిపతులైన శ్రీసురేశ్వరాచార్యులతో ప్రారంభించిన ఈ వేద-శాస్త్ర పరిరక్షణ కార్యక్రమాన్ని, వేద-శాస్త్రాధ్యయనం విషయంలో ఆసక్తి జనులలో సన్నగిల్లిన ఈ కాలంలోకూడ తగు ఉపాయాలు అన్వేషిస్తూ ద్విగుణీకృతోత్సాహంతో ముందుకు సాగించుచున్న శ్రీభారతీతీర్థమహాస్వామిచరణుల కార్యనిర్వహణదీక్ష అత్యాశ్చర్యకరమైనది.

భారతీతీర్థయతిరాడ్విద్యారణ్యయతేర్గురుః ।
భూయో-ద్య శారదాపీఠమధిష్ఠాయ విరాజతే ॥
ఇతి యాన్ మన్మహే సర్వే విద్యాజ్ఞానతపోనిధీన్ ।
తే భారతీతీర్థపాదాః విజయన్తాం శతం సమాః ॥

**- కీ.శే. డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు**

# మన జగద్గురువులు



'యతో వాచో నివర్తంతే । అప్రాప్య మనసా సహ' అని శ్రుతిమాత 'పరబ్రహ్మ గురించి చెప్పటం అసాధ్యం' అని అన్నది. అట్లే పరబ్రహ్మ స్వరూపులైన జగద్గురు శ్రీశ్రీభారతీతీర్థ మహాస్వాములవారి గురించి ఏమి వ్రాయగలం. కాకపోతే మనకు తెలిసిందేదో వ్రాసి తృప్తిపడదాం.

శ్రీచరణులను తలచుకోగానే వారి చిరునవ్వుతో కూడిన పలకరింపు మనకు గుర్తుకు వస్తుంది. "మీరు వచ్చారా! చాలా సంతోషం. ఎప్పుడు వచ్చారు?" అంటూ వారు పలికే మాటలు మన హృదయపు లోతుల్ని తాకుతాయి. 'వారు మా గురువుగారు, మా ఆత్మీయులు' అనే భావన మనస్సులో స్థిరపడిపోతుంది. ఇంటిదగ్గర బయలుదేరేముందు వారికి ఎన్నో విషయాలు, మన కష్టసుఖాలు చెప్పాలనుకుని బయలుదేరుతాం. వారి చిరునవ్వు మన సమస్యలకు, కష్టాలకు పరిష్కారమారమార్గాన్ని చూపించిందనే సంతృప్తితో సంతోషంతో వెనుతిరుగుతాం.

శ్రీచరణులు ఔదార్యం, సహనం అసామాన్యమైనవి. అందరినీ సమానంగా ఆదరించగల, అందరిలో మంచినే చూడగల మనస్సు వారిది. జగద్గురు శ్రీ చంద్రశేఖర భారతీమహాస్వామివారు తమ్మాశ్రయించిన ఆర్తులను, ఆదరించి, సముదాయించి, హితోపదేశం చేసి, రహస్యసాధనా మర్మాలను చెప్పి పంపించెడివారట. వారివలెనే వారి శిష్యులైన జగద్గురు శ్రీమదభినవవిద్యాతీర్థ మహాస్వామివారును పరమ ఔదార్య మూర్తులు. వారి హితోపదేశం కూడ విశ్వజనీనమైనదిగా ఉండేది. వారి కరకమల సంజాతులైన జగద్గురు శ్రీభారతీతీర్థ మహాస్వాములవారి ఉపన్యాసములు, హితోపదేశములు కూడ అట్లే ఔదార్యభావవిలసితములుగా ప్రకాశించుచున్నవి. "ఈశ్వరునియందు పరిపూర్ణ విశ్వాసము, నిష్కామముగా విహిత ధర్మాచరణము, మనస్సు ఆత్మరూపుడైన పరమాత్మయందు లగ్నము చేయుటకు నిత్యసాధన" ఇవీ శ్రీచరణులు తమ శిష్యులకు నిరంతరం చెప్పే విషయాలు.

అయితే ఈ విషయాలను శ్రీభారతీతీర్థమహాస్వాముల వారు బహుచమత్కారంగా చెబుతారు. చిన్న కథలతో, హాస్యోక్తులతో, తమ గురుపాదుల జీవితమునుండి రమణీయోదాహరణములతో చాల గహనవిషయాలను సులభసుందరమైన మాటలతో అందరికీ అర్థమయ్యేరీతిలో చెబుతారు. వారు శాస్త్రవివరణపూర్వకమైన వ్యాఖ్యానం వారి అనుగ్రహభాషణములలో సాక్షాత్కరిస్తుంది. సాధకుని అభీష్టానుసారంగా ఈశ్వరుడు రూపాన్ని దాల్చునని అందువలన ఏదో ఒక రూపాన్ని ఇష్టదేవతగా స్వీకరించి మనస్సులో ఆ రూపాన్ని స్థిపరచుకొని సాధన చేయమని వారి ఉద్బోధ. లోకంలో సమస్తం భగవల్లీలావైభవాన్నే చాటుతుందనీ, దానిని మనం గుర్తించాలనీ భక్తులకు వారు బోధిస్తూంటారు.

శ్రీచరణుల మాతృభాష తెలుగు. చదువుకున్నది సంస్కృతంలో. శ్రీమఠంలో ఉండటం కారణంగా కన్నడ భాషలో వ్యావహారిక సంబంధం. అందువలన ఆ మూడు భాషలలో అద్భుతమైన అధికారికత, అవికాక తమిళం, హిందీలలో కూడ ఉపనిషత్ప్రతిపాదిత తాత్త్వికరహస్యాలను

వివరించటంలో వారి ప్రతిభను చూసి పండితులకెల్లరకు దిగ్భ్రాంతి కలుగుతోంది.

"పరమాత్మను అంతర్దృష్టితో కనుగొనాలి. బహిరింద్రియాలతో అది సాధ్యంకాదు. అంతశ్శుద్ధి లేని జ్ఞానం జ్ఞానమేకాదు. ఇంద్రియాలచేత మనస్సుచేత తెలిసికొనలేనిదొకటి ఉన్నదని గ్రహించుట గొప్ప వివేకము. ఇదే సర్వమతాలకు సారభూతమైన విషయం. ఈశ్వరుడు విశ్వరూపుడు, విశ్వవ్యాపి, గుణాతీతుడు, త్రికాలాతీతుడు".

"వాసనలలో భిన్న భిన్న వాసనలున్నవి. వాటిని గుర్తుపట్టి వివరించుటకు మాటలు చాలవు. శబ్దములు అనంతవిధములు. వాటిని వివరించుటకు మాటలు చాలవు. అట్లే రుచులు బహువిధములు. వాటిని వివరించుటకు మాటలు చాలవు".

"మనం అప్పుడప్పుడు పలికిన మాటలు అనుకున్న అర్థమును చెప్పజాలవు. ఏవో శబ్దములు మూగవాని సంజ్ఞలుగా అవుతాయి. ఊహలను సూచించవచ్చు. కాని వ్యక్తం చేయలేము. భగవంతుని విషయము అంతే. చూస్తున్నా చూడలేం".

"ఈశ్వరుని ఊహించుటకు కూడా అలవికాదు. ఉపమించుటకు మరియొకటి ఉంటేకదా ఈశ్వరుడలా ఉన్నాడని చెప్పటం. అందుచేత వాక్యచిత్రణమునకవకాశములేదు. ఆయన అద్వితీయుడు. "స ఏక ఏవ ప్రభురద్వితీయ" అని ఆయన మాయావియని, జగన్నాటక సూత్రధారుడని చెప్పవచ్చు. ఇంద్రియములద్వారా ఆయనను ప్రత్యక్షముగా తెలిసికొనుటకు అవకాశమేలేదు. పరిపక్వములైన మనస్సు హృదయము అపరోక్షానుభూతికి ఉపకరణములు కావచ్చును. సాధన ఎవరికి వారు చేయవలసినది. సిద్ధి ఎవరికి వారిది. సద్గురుని అనుగ్రహమువలన సాధనామార్గము సుగమము కావచ్చును. సాధనామార్గమున ప్రయాణము సులభము కావచ్చును. అతి శీఘ్రగమనము కావచ్చును".

శ్రీచరణులను దర్శించినవారికి శ్రీవారు చేయు ఉపదేశముల సారాంశమావిధముగా ఉంటుంది.అది శ్రీశృంగేరి శారదాపీఠ ఆచార్యపురుషుల వైశిష్ట్యము.

శ్రీచరణుల హయాంలో శ్రీశంకరభగవత్పాదుల మందిరాన్ని శిలామయముగా, అతిసుందరముగా పునర్నిర్మించి మహాకుంభాభిషేకాన్ని జరిపారు. శ్రీమఠానికి రాజగోపురాన్ని నిర్మింపజేయిస్తున్నారు. నిత్యాన్నపథకాన్ని ఏర్పాటు చేశారు. అద్వైత వేదాంతదర్శనానికి ఒక పరిశోధనాసంస్థను ఏర్పాటు చేశారు. కాలడిలో సంస్కృత



విశ్వవిద్యాలయ ప్రారంభానికి ముఖ్యకారకులయ్యారు. కాలడిలో శ్రీశంకర కళాశాల శ్రీమఠమే నిర్వహిస్తోంది. శృంగేరిలో తమ గురువుగారిచేత ప్రారంభింపబడిన వైద్యశాలను మరింతగా విస్తరింపజేసి, అనేక సదుపాయాలతో చుట్టుప్రక్కల వారి ఆరోగ్యం మెరుగుపడేటట్లు చేశారు.

శ్రీసచ్చిదానంద శివాభినవ నృసింహాభారతీ మహాస్వామివారు చెప్పినట్లు జగద్గురువులంటే, ప్రపంచంలో ఎక్కడున్నా వారు కోరుకున్నా వారికి సందేహనివృత్తి చేయువారు. అట్టి లక్షణం మన శ్రీచరణులయందు సంపూర్ణంగా ఉంది. అందువలననే అమెరికాలో కూడ శ్రీశంకరమఠ స్థాపనకు అంగీకరించారు.

ఈవిధంగా శిష్యుల ఆధ్యాత్మిక ఔన్నత్యంతోపాటు, శ్రీమఠానికున్న వివిధ సౌకర్యాలను శిష్యుల సామాజిక అవసరాల అనుగుణంగా ఏర్పాటు చేయించారు.

శ్రీచరణులు ఇలాగే శిష్యసముదాయానికి మార్గదర్శనం చేస్తూ మరింతకాలం ఉండాలని శ్రీశారదాచంద్రమౌళీశ్వరులను ప్రార్థిస్తున్నాను.

శ్రీభారతీతీర్థమహాస్వాములవారి పాదపద్మములకు సాష్టాంగ ప్రణామములు.

- తుమ్మలపల్లి హరిహరశర్మ

# సకల సద్గుణసంపన్నులు గురుదేవులు

**1989 అక్టోబరు 4వ తేదీన జరిగిన బ్రహ్మీభూత జగద్గురు శ్రీశ్రీశ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వాములవారి ఆరాధన రోజున జగద్గురు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారి అనుగ్రహ భాషణం.**

నిఖిలానుగ్రహదీక్షం నిఖిల తమఃపుంజ నిగ్రహే దక్షమ్ ।
అభినవ విద్యాతీర్థం హంసావళి సేవితం వందే ॥

శ్రీశంకర భగవత్పాదులు కైలాసవాసియైన పరమేశ్వరుని అవతారం. సనాతన ధర్మోద్ధరణకై పుట్టిన ఆ మహాపురుషులు ఎందుకు అవతరించారో ఆ పనిని పూర్తిగా సాధించారు. ఆయన దానిని ఎలా సాధించారు? అని అంటే మొదటి విషయం ఏమనగా ఆయన ప్రస్థానత్రయానికి భాష్యాలు రచించారు. వాటిని సంప్రదాయజ్ఞులైన వారందరూ పరమప్రమాణంగా అంగీకరించారు. రెండవ విషయం - ఆయన ఒకచోట ఉండకుండా అన్నిప్రాంతాలూ సంచరించి నాస్తిక సిద్ధాంతాలవలంబించిన వాళ్ళతో వాదించి వాళ్ళనందరినీ సనాతనధర్మం అనుసరించేటట్లు చేశారు. మూడవ విషయం తాము చేపట్టిన సనాతనధర్మ ప్రచారం నిరంతరమూ కొనసాగటం కొరకు భారతదేశానికి నాలుగు మూలలా నాలుగు ఆమ్నాయపీఠాలు స్థాపించారు.

శ్రీ శంకరభగవత్పాదులు వంటి దూరదృష్టిగలవారు చాలా అరుదుగా ఉంటారు. శ్రీశంకర భగవత్పాదులు ఈ భూమిమీద జన్మించిన అత్యుత్తమ మహామేధావులలో ఒకరు. ఆయన వేలకొలది సంవత్సరాల ముందుచూపు ఉన్నవారు. అలాంటి స్పష్టమైన దూరదృష్టితో ఆ మహానుభావులు నాలుగు ఆమ్నాయ పీఠాలను స్థాపించారు. ఈ పీఠాలను స్థాపించడానికి వారెన్నుకొన్న ప్రదేశాలు కూడా ఆశ్చర్యజనకమైనవి.

మా గురుచరణులు ఎల్లప్పుడూ ఇలా చెపుతూండేవారు. "రెండు పీఠాలు పర్వతసానువులమీద, రెండు పీఠాలు సముద్ర తీరాన స్థాపించబడ్డాయి. పూర్వ - పశ్చిమ పీఠాలవు సముద్ర తీరాన స్థాపించబడ్డాయి. దక్షిణోత్తర పీఠాలు పర్వత సానువులమీద స్థాపించబడ్డాయి. ఆ మహాపురుషుల గొప్పతనం అలాంటిది".

శ్రీ ఆదిశంకర భగవత్పాదులు అలా ఎందుకు చేసారు? వారు ఆ పీఠాలను పెద్ద నగారాలలో గాని, నగరాల దగ్గరగానీ స్థాపించి ఉండవచ్చును. అయితే ఆయన అభిప్రాయం వేరు. ఎవరైనా పీఠానికి వస్తే వాళ్ళ మనస్సుకు



శాంతి లభించాలి. శ్రీభగవత్పాదులు తమ దక్షిణామ్నాయ పీఠాన్ని ప్రాకృతిక సౌందర్యంతో నిండిన ప్రశాంతమైన శృంగేరిలో స్థాపించారు.

నాలుగు పీఠాలు స్థాపించడానికి కారణాలేవనగా - వేదాలు నాలుగు, దిక్కులు నాలుగు, బ్రహ్మదేవుని ముఖాలు నాలుగు. అందుచేత శ్రీ భగవత్పాదులు కేవలం నాలుగు ఆమ్నాయ పీఠాలు మాత్రమే స్థాపించారనేది శాశ్వతిక సత్యం. నాలుగు పీఠాలు స్థాపించినపుడు శ్రీ భగవత్పాదులు అధిష్ఠాన దేవతను, పవిత్ర స్థానాన్నీ, పవిత్ర తీర్థాన్నీ, పీఠాధిపతిని నిశ్చితంగా నిర్ణయించారు. అంతేకాదు, ఎవరు పీఠాన్ని అలంకరించవచ్చును అనే విషయం కూడా స్పష్టంగా చెప్పియున్నారు. ఏవో కొన్ని భావాలు ఏర్పరచుకొన్న ప్రతివ్యక్తి ఈ పీఠాలను అధిష్ఠించడానికి యోగ్యుడు కాడు.



మతానుశాసనంలో శ్రీభగవత్పాదులు విధించిన నియమాలు అలాంటివి. ఎవరు పీఠం అధిరోహించాలి అని వారు చేసిన నియమాలు ఇవి:

"శుచిర్జితేన్ద్రియో వేద వేదాంగాది విచక్షణః ॥

వారి ఆజ్ఞ ఏమనగా మా పీఠమును అధిష్ఠించవలసిన వానికి ఈ యోగ్యతలు ఉండాలి.

1. శుచిః : అతడు పవిత్రుడై ఉండాలి. అనగా అతని చరిత్ర పవిత్రమైనదిగా ఉండాలి. పవిత్రమైన చరిత్ర కలిగి వుండటం అన్నిటికంటే గొప్పది. ఆ పవిత్ర చరిత్ర లేనివాడు ఎంత మహాపండితుడైనా, ఎంత ఆకర్షణశక్తి కలవాడైనా అతడు పీఠాధిపతి కావడానికి అనర్హుడు.

2. జితేంద్రియః : అతను తన ఇంద్రియాలను జయించి ఉండాలి. ఎల్లప్పుడూ ఇంద్రియ సుఖాలమీదనే ఆసక్తుడై ఉండేవాడు, ఇతరులకు ఏమి బోధిస్తాడు? ఈ విషయం శ్రీ భగవత్పాదులు 'వివేక చూడామణి'లో బాగా విశదీకరించారు. జంతువులు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములలో ఒక్కొక్కదానిని పొందడంకోసం తమ ఆయా ఇంద్రియాలకు వశములై ఎంతో దుఃఖాన్ని అనుభవిస్తున్నాయి. ఐదు ఇంద్రియాలద్వారా - శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు అన్నింటినీ పొందుటకు ప్రయత్నిస్తున్న మానవుడు చెప్పడానికి శక్యంకాని కష్టాలకు లోనౌతున్నాడు. అందుచేత తన ఇంద్రియాలను అదుపులో ఉంచుకొన గలిగినవాడు మాత్రమే ఈ పీఠాన్ని అధిష్ఠించడానికి యోగ్యుడు.

3. వేదవేదాంగాది విచక్షణః : గురువు ఎవరు? అను ప్రశ్నకు "అధిగత తత్త్వః శిష్య హితాయోద్యతః సతతమ్" అని శ్రీశంకర భగవత్పాదులతు జవాబు చెప్పారు. గురువు తత్త్వం స్పష్టంగా తెలిసినవాడై ఉండాలి. అతడు ఎల్లప్పుడూ శిష్యుల హితం కోరేవాడైనా వాళ్ళ సంశయాలను నివారించజాలకపోతే అతడు ఆచార్యుడవడానికి తగడు. అందుచేత ఈ గుణం కూడ ఎవరిలో ఉంటుందో అతడే పీఠాన్ని అధిష్ఠించడానికి యోగ్యత కలవాడని శ్రీశంకర భగవత్పాదులన్నారు. శ్రీశంకర భగవత్పాదులు ఈ పీఠాన్ని స్థాపించినది మొదలు మఠామ్నాయంలో చెప్పిన ఈ గుణాలన్నీ ఉన్నవారే ఈ పీఠాన్ని అధిష్ఠించడం శిష్యుల అదృష్టం.

శ్రీశంకర భగవత్పాదులు చెప్పిన ఈ సద్గుణాలన్నీ మా పూజ్య గురువులైన జగద్గురు శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వాములవారిలో ఉండేవి. వారి జితేంద్రియ తత్త్వాన్ని గూర్చిగానీ, వారి పవిత్ర చరిత్రను గూర్చిగాని, వారి పాండిత్యాన్ని గూర్చిగాని చెప్పడానికి సామాన్య మానవునకెవనికీ శక్యంకాదు.

శ్రీశంకర భగవత్పాదులు భాష్యంలో ఒకచోట ఈ క్రింది శ్లోకం ఉదాహరించారు: "శకునీనామివాకాశే జలే వారి చరస్య చ । పదం యథా న దృశ్యేత తథా జ్ఞానవతాం గతిః ॥" ఈ శ్లోకాన్ని బృహదారణ్యక ఉపనిషద్భాష్యంలోను, మరొకచోట కూడా ఉదాహరించి ఉన్నారు. "ఆకాశం మీద ఎగిరే పక్షులు వెళ్ళిన జాడ ఆకాశంమీద ఏ విధంగా

గుర్తింపశక్యంకాదో, నీళ్లలో ఈదే చేపల జాడ ఏవిధంగా గుర్తింప శక్యంకాదో అదేవిధంగా జ్ఞానుల మార్గంకూడా తెలియశక్యంకానిది".

మా గురుచరణులు అలాంటి జ్ఞానులలో అగ్రగణ్యులు. బాల్యావస్థలోనే సన్న్యాసం స్వీకరించిన శ్రీశంకరాచార్యులవలె, వారు కూడ తమ బాల్యంలోనే అనగా 14 సంవత్సరాల వయస్సులోనే సన్న్యాసాశ్రమం స్వీకరించి ఉండడంచేత వారికి తృతీయ పురుషార్థంతో పరిచయం లేదు. వారికి తెలిసినదల్లా నాల్గవ పురుషార్థమే. అనగా మోక్షమే. వారితో మాటలాడడానికి ఎవరైనా వచ్చినపుడు వారు "ఉపయుక్తమైన విషయాలేవైనా మీరు చెప్పదలచుకొంటే చెప్పండి. ఏ ప్రయోజనమూ లేకుండా కాలక్షేపం చేయదలచుకుంటే అది మాతో కుదరదు" అంటుండేవారు. ఉపనిషత్తులోని ఈ వాక్యం ఉపనిషత్తులు చదివిన వారికందరికీ గుర్తుంటుంది.

"నానుధ్యాయాద్బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్ ॥"

మాటలతో సమయం వ్యర్థం చేయడంకంటే మౌనంగా ఉండడం మంచిది. అలాచేస్తే మన నోటికి శ్రమ ఉండదు. కనీసం ఇదొక లాభం. మా గురుచరణులు అభిప్రాయం ఇదే. మనం మాట్లాడాలనుకొంటే ఉపయోగకరమైన మాటలు మాట్లాడాలి.

ఎల్లప్పుడూ శ్రీశంకర భగవత్పాదుల గ్రంథాలు చదవడం, వారి ఉపదేశాలను మననం చేసికొనడం అంటే వారికి చాలా ఇష్టం. "సంచరించేటపుడు కూడ ప్రతి ఒక్కడూ శ్రీశంకర భగవత్పాదులు చెప్పిన విషయాలను గూర్చి మననం చేస్తూ ఉండాలి. మనం ఇప్పుడే దేవీదేవాలయం నుంచి తిరిగి వచ్చాం. మనం దేవి సమక్షంలో సాష్టాంగ ప్రణామం చేశాం. ఇది కేవలం బాహ్యమైన పని. అంతర వ్యాపారం ఈ విధంగా ఉండకూడదు. శ్రీభగవత్పాదులు ప్రతిపాదించిన సిద్ధాంతాలను గూర్చి మననం చేస్తేనే మన జన్మ సార్థకం అవుతుంది. అలా చేయకపోతే మనం మన జన్మ ఎలా సార్థకం చేసికొనగలం?" అని వారు సెలవిస్తూ ఉండేవారు. ఉపనిషదర్థాలను మననం చేయడం శాంకర సిద్ధాంతాలను మననం చేయడమూ వారిలోని అసాధారణమైన లక్షణాలు.

రఘువంశ మహాకావ్యంలో కాళిదాస మహాకవి "ద్వేష్యోపి సంమతః శిష్టః తస్యార్తస్య యథౌషధమథ్ । త్యాజ్యో దుష్టః ప్రియోప్యాసీ - దంగులీవోరగక్షతాః ॥" అని అన్నాడు. ఇది మా గురుచరణులకు చాలా ఇష్టమైన శ్లోకం. "స్వాములూ! మనం ఎల్లప్పుడూ ఇలా ఉండాలి" అని వారు నాతో అంటూండేవారు. రఘువంశ మహారాజుల్ని వర్ణించే సందర్భంలో కాళిదాసమహాకవి, దిలీప మహారాజు ఎవరిని



ప్రేమించేవాడు, ఎవరిని ద్వేషించేవాడు అనే విషయం చెప్పాడు. కొందరిని చూడగానే మనం వాళ్ళు మన మిత్రులు, బంధువులు అని అనుకొంటాం. అప్పుడు వాళ్ళని ప్రేమిస్తాం. అటువంటిదేమీ లేకపోతే వాళ్ళని చూడగానే ద్వేషిస్తాం. ఇది సామాన్య జనులపద్ధతి. దిలీపమహారాజు ఆవిధంగా ఉండేవాడు కాడట. ఎవడు బాగా పనిచేస్తాడో వానిని అతడు పరీక్షిస్తూండేవాడు. "అతనికి నా మీద స్నేహభావం ఉన్నదా లేదా అనే దానితో నాకు సంబంధంలేదు. అతడు యోగ్యుడైతే అతడు నాకు కావాలి. బహుశా అతనికి నామీద స్నేహం లేకపోవచ్చును. కానీ అతనిలో ఉన్న యోగ్యతనుబట్టి నేనాతనిని గౌరవిస్తాను".

ఇందుకు కాళిదాస మహాకవి ఒక ఉపమానం చెప్పాడు. ఒకడు ఏదో ఒక రోగంతో బాధపడుతూన్నాడనుకోండి. ఆ రోగికి వైద్యుడు ఒక మందు నిర్ణయిస్తాడు. ఆ మందు చాలా చేదుగా ఉంటుంది. వెగటుగా ఉన్నది కదా అని ఆ మందును విడిచి వేయటం మంచిదా? ఆ మందు తీసికొనకపోతే రోగం తగ్గదు. అందువల్ల "తస్యార్తస్య యథౌషధమ్" రోగాన్ని తగ్గించే గుణం ఉండడంవల్ల చేదుగా ఉన్నాఆ మందును ఆ రోగి స్వీకరిస్తాడు. అదేవిధంగా ఒకడంటే తనకిష్టమున్నా లేకపోయినా వానిలో ఉన్న సద్గుణాలను పట్టి దిలీపుడు వారిని గౌరవిస్తానంటాడు.

దీనికి విరుద్ధంగా అర్హతలేని మరొకడున్నాడు. అతడు స్నేహితుడే అయినా, బంధువే అయినా అతనిని దూరంగా ఉంచడం మంచిది. కాళిదాసు మళ్ళీ మరొక ఉపమానం ఇచ్చాడు. "అంగులీవోరగక్షతా" సర్పం మన వ్రేలిమీద కాటువేసినపుడు మనం ఏం చేస్తాం? వెంటనే మనం ఆ వ్రేలును ఖండించి వేస్తాం. అలా చేయకపోతే విషం శరీరమంతా వ్యాపిస్తుంది. వ్రేలు పోయినందుకు మనం ఎక్కువ బాధపడం. అదేవిధంగా అయోగ్యుడైన వాడు ఎవడైనా సరే వానిని దూరంగా ఉంచడం మంచిది. దిలీపుడు ఆవిధంగా ప్రవర్తించేవాడు. మా గురుచరణులలో కూడ దిలీపునిలో ఉన్న ఇలాంటి ఉదాత్తములైన గుణాలన్నీ ఉండేవి.

వారి మనస్సు సర్వదా దయతో నిండివుండేది. వారు ఇలా

అంటూండేవారు : "మనం ఎందుకున్నాం?" ఇతరులకు ఉపకారం చేయడానికే ఉన్నాం. మనం ఉపకారం చేయకపోతే మనకీ జన్మవల్ల ప్రయోజనం ఏమిటి? ఏదోవిధంగా మనం ఇతరులకు ఉపకారం చేయాలి. చాలామంది ఎన్నో పర్యాయాలు తప్పులు చేసేవారు. సహజమైన దయాభావంతో వారు ఆ అపరాధాలన్నీ మరచిపోయేవారు. అదే మరొకరైతే అవన్నీ మనస్సులో పెట్టుకొని "వీనికి ఏం చెయ్యాలో చూద్దాం" అనుకొంటారు.

మా గురుచరణులు ఎన్నోసార్లు మాతో ఇలా చెపుతూండేవారు. "స్వాములూ! మనం ఎన్నడూ "కృతస్య ప్రతి కర్తవ్యమ్" (చేసినదానికి ప్రతీకారం చేయాలి) అనే భావాన్ని మనస్సులోనికి రానీయకూడదు. ఇది రాజస ప్రవృత్తిగలవాళ్ళ విషయంలో చెప్పినమాట. మనం సన్న్యాసులం. మనకు ఇలాంటి స్వభావం ఉండగూడదు". ఈ భావంతో మా గురుచరణులు అపరాధం చేసిన వాళ్ళను వెంటనే క్షమించి ఆశీర్వదించేవారు. ఇందుకు మేం చూసిన ఉదాహరణలు ఎన్నో ఉన్నాయి. మా గురుచరణులు ఎవరికీ బాధ కలిగించేవారు కాదు.

ఇరవై మూడు సంవత్సరాలపాటు వారితో ఉండే అవకాశం లభించడం నా అదృష్టం. ఆశ్చర్యకరమైన విషయం ఏమనగా వారు కూడ వారి గురువులతో ఇరవై మూడు సంవత్సరాలు కూడ సన్న్యాసిగానే కలిసి ఉన్నారు. నేను ఎనిమిది సంవత్సరాలు బ్రహ్మచారిగాను, మిగిలిన పదిహేను సంవత్సరాలు సన్న్యాసిగాను వారితో కలిసి ఉన్నాను. నేను బ్రహ్మచారిగా ఉన్నప్పుడు కూడా వారికి నామీద ఎంతో వాత్సల్యం ఉండేది. ఒకనాడు, నేను శృంగేరి వెళ్ళిన క్రొత్తరోజుల్లో ఒక ప్రదోషం రోజున నది అవతలి ఒడ్డుకు వెళ్ళాను. ఆ రాత్రి పూజకు కూర్చునేముందు వారు "నువ్వు అవతలి ఒడ్డుకు వెళ్ళావా?" అని ప్రశ్నించారు. ఔనన్నాను. "అలా వెళ్ళవద్దు, నువ్వు నరసింహవనంలోనే ఉంటే చాలు" అని వారన్నారు. "నిన్ను నేను కనిపెడుతూనే ఉన్నాను" అని కూడ వారు తరువాత అన్నారు. దీనినిబట్టి వారికి నా విషయంలో ఎంత ప్రేమ యున్నదో అర్థమయింది.

విద్యాభ్యాసకాలంలో ఇతరమైన వ్యవహారాలేవీ ఉండ కూడదని వారు నాకు ఉద్బోధిస్తూండేవారు. "ఇతర వ్యవహారాలేవైనా ఉంటే నీ చదువు సరిగా సాగదు. తరువాత ఎంత ప్రయత్నం చేసినా నువ్వు పండితుడవు కాజాలవు" అంటూండేవారు. వారు తమ అనుభవాన్ని ఈ క్రిందివిధంగా చెపుతూండేవారు. "నేను అత్యల్ప సమయం చదవకపోయినా మా గురువులు 'ఏమి? ఇప్పుడు పుస్తకం చూడలేదే' అని నన్ను మందలిస్తూండేవారు". ఈవిధంగా వారు తమ అనుభవాలు చెబుతూ, ఎలా ప్రవర్తించాలో మఠ



సంప్రదాయాలు ఎలా పాటించాలో, శిష్యుల్ని ఏవిధంగా చూచుకోవాలో ఈ విషయాలన్నీ నాకు బోధిస్తూండేవారు. "మనదగ్గరికి వచ్చేవాళ్ళ ప్రవృత్తి ఎలా ఉన్నా మనం మాత్రం అందరి విషయంలోను, ప్రేమ చూపించాలి. మనం ఈ విషయం మరచిపోకూడదు" అని వారు అనేక పర్యాయాలు చెబుతూండేవారు. "అహమేవ మతో మహీపతే రితి సర్వః ప్రకృతిష్వచింతయత్" "ప్రజలలో ప్రతి ఒక్కడు తానే రాజుకు చాల ఇష్టుడను అనుకొనేవాడు" - అనే కాళిదాసు వాక్యం ఉదాహరిస్తుండేవారు. అజమహారాజు ప్రతి ఒక్కడూ ఆవిధంగా తలచేటట్లు ప్రవర్తించాడు. మా గురుచరణులు నాతో "స్వాములూ! ఇది కేవలం కాళిదాసు కాలానికి మాత్రమే లేదా ఆ రాజు కాలానికే మాత్రమే సంబంధించినది అని మనం అనుకొనకూడదు. ఇది మనకు కూడా అన్వయించేటట్లు నడచుకోవాలి" అనేవారు. శ్రీగురుచరణులు అందరి ఆదరాన్ని చూరగొన్న మహాపురుషులు.

వారికి 1931లో శృంగేరిలో సన్న్యాసదీక్ష ఇవ్వబడింది. తరువాత వారు 1954వ సంవత్సరం వరకు 23 సంవత్సరాలపాటు తమ గురుపాదులతో కలిసి ఉన్నారు. వారి గురుపాదులు మహాసమాధి తరువాత వారు పట్టాభిషిక్తులయ్యారు.

ఈ సమయంలో ఒక ఆశ్చర్యకరమైన విషయం స్మృతిపథానికి వస్తున్నది. శృంగేరి సంప్రదాయం ప్రకారం



శ్రీశంకర భగవత్పాదుల తరువాత శృంగేరీ మఠానికి మా గురువులవారు 35వ మఠాధిపతిగా పట్టాభిషిక్తులయ్యారు. 35 సంవత్సరాలు ఈ పీఠాన్ని ప్రకాశింపచేశారు. ఈ ఈశ్వర సంకల్పాన్ని అర్థం చేసుకొనడం మన శక్యంకాదు. ఈ 35 సంవత్సరాలకాలంలో వారు మఠాభివృద్ధికి చేసిన కృషి అమోఘమైనది. తమ శిష్యుల విషయంలోను, మఠ పరిపాలనా విషయంలోను, వేదశాస్త్ర ప్రచార విషయంలోను వారు వైయక్తికంగా శ్రద్ధ చూపేవారు. వారు తలపెట్టిన ప్రతి పనిలోను వారి ప్రగాఢ శ్రద్ధ కనబడుతుంది.

శృంగేరీ మఠ సంప్రదాయం ప్రకారం పీఠాధిపతులు తమ శిష్యుల్ని ఆశీర్వదించడంకోసం దేశ సంఆచరం చేస్తూంటారు. ఇది ప్రారంభం నుంచి ఉన్న సంప్రదాయం. కన్యాకుమారి నుండి హిమాలయ ప్రాంతం వరకు మా గురుచరణులవలె దీర్ఘంగా సంచారంచేసిన గురువులు చరిత్రలో మనకు లభించరు. అంతేకాదు, ఆదిశంకరుల తరువాత ఆమ్నాయ పీఠాధిపతిగా నేపాలు దేశంకూడ వెళ్ళినవారు మా గురుచరణులే. శివరాత్ర్యుత్సవం చేయడంకోసం మా గురుచరణులు 1967లో నేపాలు వెళ్ళారు. నేపాలు దేశ రాజు భక్తిపూర్వకంగా, గౌరవపూర్వకంగా పంపిన ఆహ్వానాన్ని పురస్కరించుకొని వారు అక్కడికి వెళ్ళారు.

1950వ సంవత్సరంలో మహేంద్ర మహారాజు తండ్రియైన త్రిభువన మహారాజుకు పెద్ద ఉపద్రవం కలిగింది. మూడువారాలపాటు ఆయన భారతదేశంలో అజ్ఞాతవాసం చేయవలసి వచ్చింది. అప్పుడు జగద్గురు శ్రీచంద్రశేఖర భారతీ మహాస్వాములవారు "కొద్ది రోజులలో మీ రాజ్యం మరల మీకు లభిస్తుంది. ఈ విషయంలో శ్రీశారదాదేవి, పశుపతి నాథుడు మిమ్మల్ని అనుగ్రహిస్తారు" అని అంటూ ఆశీఃపూర్వకంగా శ్రీముఖం పంపారు. మహేంద్రమహారాజుకు ఈ విషయం గుర్తుంది. తమ తండ్రిగారికి శృంగేరి మఠం నుండి లభించిన ఆశీస్సులకు తాము సర్వదా కృతజ్ఞులమై ఉన్నామని చెబుతూ ఆయన మా గురుచరణులను నేపాలుకు రావలసిందిగా ఆహ్వానించారు. ఆయన వారిని పశుపతి నాథుని దర్శనానికి తీసికొని వెళ్ళారు. ఎంతో భక్తిభావంతో గౌరవించి, సేవించారు.

శ్రీ గురుచరణులు 1956లో దక్షిణదేశ యాత్ర ప్రారంభించి ఆంధ్ర, ద్రావిడ, కర్ణాటక, కేరళ దేశాలలో అతి విస్తృతంగా పర్యటించి 1962లో శృంగేరి చేరుకొన్నారు. మళ్లీ 1964లో శృంగేరిలో బయలుదేరి నాలుగు సంవత్సరాలపాటు ఉత్తర - దక్షిణ భారతదేశాలలో విస్తృతంగా పర్యటించి 1968లో శృంగేరి చేరుకొన్నారు. ఇది వారి రెండవ యాత్ర. ఈ రెండు యాత్రలలో వారు భారతదేశంలోని అనేక ప్రదేశాలలో ఎన్నో మఠ శాఖలు స్థాపించారు. శ్రీగురుచరణులు ఈ యాత్రకు బయలుదేరటానికి ముందు శృంగేరి మఠానికి చాలా కొద్ది శాఖలు మాత్రమే ఉండేవి. అవి బెంగుళూరు, మైసూరు, మద్రాసు, కాశీ, హరిద్వార్, నాసిక్, నంజనగూడు మున్నగు చోట్లలో ఉండేవి. మా గురుచరణులు అనేక ప్రదేశాలలో శ్రీశారదా, శంకరభగవత్పాదుల మూర్తుల ప్రతిష్ఠ చేశారు. చాల ప్రదేశాలలో జనులకు మతం విషయంలో ఆసక్తి కలిగించే ఎన్నో లాభకరములైన కార్యక్రమాలు ప్రారంభించారు. చాలాచోట్ల పాఠశాలలు స్థాపించారు. ప్రారంభం నుంచీ బెంగుళూరు శంకరమఠంలో ఒక శాస్త్ర పాఠశాల ఉంది. అదే మఠంలో మా గురుచరణులు నిరంతర వేదాధ్యయనం కొనసాగటం కొరకు ఒక వేదపాఠశాల కూడా స్థాపించారు. శృంగేరిలోని పాఠశాలను బాగా అభివృద్ధిపరిచారు.

సంస్కృత భాషా ప్రచారం కోసం మా గురుచరణులు "శ్రీసురసరస్వతీ సభా" అనే పేరుతో ఒక సంస్థను నెలకొల్పారు. ఈ సంస్థ సంవత్సరానికి రెండు పర్యాయాలు సరళ సంస్కృత పరీక్షలు జరుపుతుంది. ప్రతి పరీక్షకు సుమారు ఆరువేల మంది పరీక్షార్థులు కూర్చుంటూంటారు.

సనాతన ధర్మాన్నీ, వేదాంత సిద్ధాంతాన్నీ ప్రచారం చెయ్యడం కొరకు మా గురుచరణులు ఒక పత్రిక కూడా ప్రారంభించారు. 1959లో 'శంకరకృప' అనే పత్రిక



ముందుగా తమిళభాషలో ప్రారంభించబడింది. ఇప్పటికి అది స్థాపించి ముప్పై సంవత్సరాలు దాటింది. తరువాత ఆంధ్రదేశంలో సంచరిస్తున్న కాలంలో వారు అదే పేరుతో తెలుగులో కూడ పత్రిక ప్రారంభించారు. తరువాత 'శంకరకృప'ను కన్నడంలో కూడ ప్రారంభించి ప్రచురించే ఏర్పాటు చేశారు.

శృంగేరి మఠం అభివృద్ధికి వారు ఎంతో శ్రద్ధతో చేసిన పనినిగూర్చి వర్ణించి చెప్పటం కష్టం. పూర్వం శృంగేరికి వచ్చే భక్తులకు నివాస సౌకర్యాలు విశేషంగా ఉండేవికావు. మా గురుచరణులు చేప్టిన కార్యక్రమానికి ఫలితంగా ఈనాడు మనం ఇక్కడికి వచ్చే వేలాది జనులకు నివాససౌకర్యం కల్పించగలుగుతున్నాం.

మా గురుచరణులు చెప్పిన మరొకవిషయం కూడ ఇప్పుడు చెప్పదలచుకొన్నాను. "స్వాములూ! మనం పని చెయ్యాలి. దాని ఫలాన్ని మనమే అనుభవించాలని అనుకొనగూడదు. దానిని ఇతరులకు విడిచి పెట్టాలి. నేను ఎన్నో కొబ్బరిమొక్కలు నాటాను. నేనే అనుభవించాలని నేను నాలేదు. వాటిని నాటడం నా కర్తవ్యం. నా కర్తవ్యం నేను చేశాను. వాటి ఫలాలను ఎవరైనా అనుభవించవచ్చును. నేను ఎన్నో భవనాలు కట్టించాను. ఆ భవనాలలో నేను నివసించాలని కట్టించలేదు. భక్తులు వచ్చి వాటిలో నివసిస్తారనే అభిప్రాయంతో నేను వాటిని కట్టించాను" అని అంటూండేవారు. మా గురుచరణులు ఒక వైద్యశాల కట్టించారు. వారు ఎక్కువగా ఆ వైద్యశాలకు వెడుతూంటారు. తాము ఔషధం తీసుకొనడానికి కాదు. అది ఎలా అభివృద్ధి చెందుతున్నదో చూడడానికి. కొండమీద మలహానికరేశ్వర దేవాలయం పూర్వం ఎలా ఉండేది. ఇప్పుడెలా ఉంది? పూర్వం దాన్ని చూచినవాళ్ళు ఇప్పుడు దానిని చూస్తే ఆశ్చర్యపోతారు. వారు చేసిన ప్రతి ఒక్కపనీ కూడ వారి దూరదృష్టికీ, వారి లోకహిత చింతకీ ఉదాహరణం.

ఈవిధంగా శ్రీగురుచరణులను గూర్చి మాట్లాడుకుంటూ పోతే నేను అర్ధరాత్రి వరకూ మాట్లాడవచ్చును. మా గురుచరణులు సమాధి పొందినపుడు నేను దుఃఖాన్ని ఆపుకొనలేకపోయాను. శ్రీగురుచరణులు నాకు ఏ ప్రదేశంలో దండకమండలాలు ఇచ్చి అనుగ్రహించారో, సన్న్యాసదీక్ష ఇచ్చారో అదే ప్రదేశంలో అదే కమండలంతో వారి శరీరంమీద నీళ్ళు పోసి స్నానం చేయించవలసి వచ్చినపుడు నేను పెల్లుబికి వస్తున్న దుఃఖప్రవాహాన్ని ఆపుకొనలేకపోయాను. అయితే ఎంతో శ్రమపడి నన్ను నేను సంభాళించుకొన్నాను. అంతమంది జనులముందు నేను అంత దుఃఖాన్ని పైకి వ్యక్తం చేయగూడదు కదా!

"స్వాములూ! ఈ శరీరం పోయినపుడు మీరు దుఃఖాన్ని ఆపుకొనజాలరని నాకు తెలుసును. కానీ ఇది అనివార్యం" అని వారు నాతో అంటూండేవారు. శ్రీనరసింహ భారతీస్వాములవారు తమ శిష్యులైన శ్రీసచ్చిదానంద శివాభినవ నరసింహ భారతీస్వాముల వారితో ఇలాగే "నా ఈ శరీరం పోతే మీరు దుఃఖం ఆపుకొనలేరని నాకు తెలుసును. కానీ అది అవశ్యం భావి. దైవాన్ని ఎవరూ దాటజాలరు. ఈ మాత్రం వివేకం అలవరచుకొనండి" అనేవారట. మా గురుచరణులు కూడా మాతో ఈ మాటలే అన్నారు. వారిప్పుడు మన మధ్యలేరు.

బాణభట్టు కూడా - "కిమిత్ర క్రియతాం దైవాయత్తే వస్తుని" అని అన్నాడు. మనం మన మనస్సులను అలాంటి మాటలతో ఓదార్చుకోవాలి. వారి అనుగ్రహంచేత, శారదా పరమేశ్వరి అనుగ్రహంచేత మేం సరియైన పద్ధతిలో నడిచి శ్రీగురుచరణులు మా మీద ఉంచిన ఈ గొప్ప బాధ్యతను నిర్వహించవలసి యున్నది. వారి విషయంలో మేం చూపదగిన కృతజ్ఞతా భావం ఇదే. అదే వారికి మేం చేయవలసిన నిజమైన సేవ.

శ్రీగురుచరణులు బ్రహ్మీభావం పొందిన మరునాడు సెప్టెంబర్ 22వ తారీఖు ప్రధానమంత్రి శృంగేరి వచ్చి "మీమీద పెద్ద బాధ్యత వచ్చిపడింది" అన్నారు. "శ్రీగురుచరణుల అనుగ్రహంచేత, మీ వంటివారి సహకారంచేత నేను నా బాధ్యతను నెరవేర్చగలనని



అనుకొంటున్నాను" అని నేను సమాధానం చెప్పాను. అందుచేత శ్రీగురుచరణులు చూపిన మార్గాన్ని అనుసరించి మనం వారి అనుగ్రహానికి పాత్రులం కావాలి. మా గురుచరణులకు ప్రతి ఒక్కరిమీద వాత్సల్యం ఉండేది. ఈ విషయంలో సందేహం ఏమీలేదు. నాకు పెద్ద బాధ్యత అప్పగించిన తరువాత వారు నా విషయంలో అసాధారణమైన ప్రేమను ప్రదర్శించేవారు. నన్ను చూచుకొని గర్వపడేవారు.

నా విషయంలో వారు ప్రేమచూపే విధానాన్ని గూర్చి చెప్పాలంటే ఈ సంవత్సరం నేను వారి అనుజ్ఞ తీసికొని యాత్రకు బయలుదేరాను. ఈ యాత్రలో ఉత్తరభారతం అంతా సంచరించాలనరి వారి అభిప్రాయం. నేను కూడా అదే అభిప్రాయంతో బయల్దేరాను. అప్పుడప్పుడు నేను వారికి యాత్రలో జరిగిన విశేషాలతో లేఖలు వ్రాస్తూండేవాణ్ణి. వారు నన్ను ఆశీర్వదిస్తూ వ్రాస్తూండేవారు. వాటిలో వారి చివరి లేఖ నేను పూనాలో ఉన్నపుడు మఠ పరిపాలనాధికారి గౌరీశంకర్ ద్వారా నాకు అందింది. ఆ లేఖ సంస్కృతంలో ఉంది. దాని సారాంశం ఇది. "వైశాఖ బహుళ ప్రతిపత్తున మీరు వ్రాసిన లేఖ ధార్వాడలో అందినది. తరువాత ఆషాఢ శుక్ల తృతీయనాడు మీరు వ్రాసిన లేఖను నేను గురువుల అధిష్ఠానంలో ఉన్నపుడు నిన్ననే కార్యదర్శి తీసుకొని నాకిచ్చాడు. ఆ రెండు లేఖలద్వారా మీరు క్షేమంగా ఉన్నట్లు తెలిసి సంతోషించాను.

నేను కాలటి నుండి ధార్వాడ వెళ్ళాను. అక్కడ శ్రీశారదాంబ భగవత్పాదుల మూర్తులను ప్రతిష్ఠించి శృంగేరి తిరిగివచ్చాను. కొన్ని రోజులు శృంగేరిలో విశ్రాంతి తీసికొని శిష్యజనుల సవినయ ప్రార్థనానుసారం మైసూరు, బెంగళూరు వెళ్ళి వాళ్ళను ఆశీర్వదించి ఆషాఢ శుక్ల పంచమినాడు శృంగేరి చేరుకున్నాను. పూర్ణిమనాడు చాతుర్మాస్య సంకల్పం చేశాను.

ఇక్కడ తుంగానది మీద వంతెన మాఘమాసం నాటికి పూర్తి కావచ్చును. నా ఆరోగ్యపరిస్థితి నా వయస్సును అనుసరించి ఉంది. తప్పనిసరియైన పనులు మాత్రమే చేస్తూ మనస్సులో ఏమీ చింతలేకుండా నేను సుఖంగా ఉన్నాను. మిమ్మల్ని ఆశీర్వదిస్తున్నాను. భగవంతుడు మీకు క్షేమం కలిగిస్తాడు".

ఈ లేఖ వారికి నామీద ఉన్న దయను, అనుగ్రహాన్ని సూచిస్తున్నది. నేను ఈ లేఖను మాటిమాటికి చదువుకొంటూ శ్రీగురుచరణులను చూస్తున్నట్లే సంతోషిస్తూంటాను.

శ్రీసచ్చిదానంద శివాభినవ నరసింహభారతీ స్వాములవారు కూడ తమ గురువులు విదేహముక్తి పొందినపుడు చాలా విషాదగ్రస్తులయ్యారు. ఒకరోజున గురువులు వారి స్వప్నంలో కనబడి "నువ్వు ఎందుకిలా స్త్రీవలె కూర్చున్నావు? నేను ఏమయ్యాను? పూర్వం ఒక శరీరంలో ఉండేవాణ్ణి. ఇప్పుడు సర్వగతమైన చైతన్యం అయ్యాను" అన్నారట.

శ్రీనరసింహభారతి మహాస్వామివారి మాటలు జ్ఞాపకం తెచ్చుకొని "మన గురుచరణులు మనల్ని విడిచి ఎక్కడికీ వెళ్ళలేదు, అనే నిశ్చయంతో మనస్సును కుదుటపరచుకొని శ్రీగురుచరణులు చూపినమార్గాన్ని అనుసరిస్తూ మీరందరూ శ్రేయస్సును పొందెదరుగాక! ఇక్కడ మా పరమగురువులైన శ్రీచంద్రశేఖర భారతీ స్వాములవారికి, పరమేష్ఠి గురువులైన శ్రీసచ్చిదానంద శివాభినవ నరసింహ భారతీస్వాములవారికి బ్రహ్మాండమైన దేవాలయాలు ఉన్నవి. మా గురుచరణులకు కూడ అదేవిధమైన ఒక దేవాలయం నిర్మిద్దాం. ఈ ఉపన్యాసాన్ని మా గురుచరణుల స్మృతితో ముగిస్తున్నాను.

వివేకినం మహాప్రజ్ఞం ధైర్యౌదార్య క్షమానిధిమ్ ।
సదాభినవ పూర్వం తం విద్యాతీర్థ గురుం భజే ॥



# జీవిత ప్రయోజనం

## జగద్గురు ఉపదేశామృతం

మానవ జీవిత సార్థకత జ్ఞానము ద్వారానే సాధ్యమవుతుంది. కాని మరో దానితో కాదు.

మానవ దేహాన్ని పొందిన తరువాత కూడా జ్ఞాన సముపార్జనకై ప్రయత్నించని వారు మానవ జన్మను వృథా చేస్తున్నట్లే, అటువంటివారు పశువులుగా జన్మించడమే మేలు. ఎందుకని? పశువులకు ప్రత్యవాయం అంటూ ఉండదు కాబట్టి.

అపి మానుష్యకం లబ్ధ్వా జ్ఞానినో న యే ।

పశుతైవ వరం తేషాం ప్రత్యవాయా ప్రవర్తనాత్ ॥

సంధ్యావందనాన్ని మనం నిర్ణీత సమయంలో చేయకపోతే పాపం వస్తుంది. కాని పశువు సంధ్యావందనం చేయకపోతే ఏ పాపమూ రాదు. సంధ్యావందనం చేయని బ్రాహ్మణుని కంటె పశువే ఉత్తమమైనది. ఎందువలన అనగా పశువుకు పాపం రాదు. ఆ విధంగా అది మంచి స్థితిలో ఉన్నది.

ఇవి మా మాటలు మాత్రమే కాదు. శాస్త్రాలలో నిర్ణయించిన దానినే మేము చెప్తున్నాము. అందువలన మానవ జన్మ జ్ఞాన సముపార్జనకే అని తీర్మానం. మనం జ్ఞానాన్ని పొంది జీవితాన్ని సార్థక మొనరించుకోవాలి. ఈ జ్ఞానం గురుకృప వలన లభిస్తుంది. వేదంలో ఇలా చెప్పబడింది.

అచార్యా ద్ధైవ విద్యా విదితా సాధిష్ఠం ప్రాపత్

గూరూపదేశం ముక్తిని లభింపజేస్తుంది. పాండిత్యం ఒక్కటే ఉంటే లాభం లేదు.

గురువు యొక్క అవసరమేమిటి? జ్ఞాన సముపార్జనకు అవసరమైన ఉపదేశం గురువు నుండి లభిస్తుంది. అయితే ప్రస్తుత పరిస్థితులు దయనీయంగా ఉన్నాయి. సదా పరమాచార్యుల వారి వద్దకు ఒకసారి మఠం అధికారి వెళ్ళి భక్తులకు తమ దర్శనం లభించడం చాలా కష్టంగా ఉన్నదని చెప్పగా శ్రీవారిలా సమాధానమిచ్చారు. "మా దగ్గరకు వ్యక్తులెందుకు వస్తారు? మేమేదో వైద్యులమో, మాంత్రికులమో అని భావించి వస్తారు. ఆ తదుపరి ఈ వ్యాధిని నయం చేయండి. ఈ భూతాన్ని పారద్రోలండి అంటూ అడుగుతుంటారు.



మేమందుకేనా ఉన్నది? జ్ఞానాన్వేషణకు ఎవరైనా వస్తున్నారా?" అని. ఆచార్యపాదులు జ్ఞానాన్ని బోధించడానికే ఉన్నారు. మనం అసలైన జ్ఞానాన్ని పొందగలిగితే ముక్తి తప్పక లభించగలదు. ఈ జన్మలోనే ముక్తిని సాధించగలమని ఖచ్చితంగా ఎవరూ చెప్పలేరు. అయినా ముక్తి సాధనకై ప్రయత్నాలను మనం ప్రారంభించక తప్పదు. ఋజువైన మార్గంలో పయనం ప్రారంభిస్తే ఎప్పటికైనా గమ్యాన్ని చేరుకోగలము. కాని అసలు ప్రయత్నమే చేయకపోతే గమ్యాన్ని ఎప్పటికీ చేరము.

అగచ్ఛన్వైనతేయో పి పదమేకం న గచ్ఛతి

గరుడుడు ఇలా భావించ వచ్చును. "నేను ఎగరటం ప్రారంభిస్తే రెండు నిమిషాలలో వేల మైళ్ళు పయనించగలను" అని. అయితే అతను ఎగరకపోతే అడుగు కూడా ముందుకు వెళ్ళలేడు. అందువలన మనం ముందు మోక్షమార్గంలో పయనం ప్రారంభిం చాలి. అందుకోసం మనం శాస్త్ర విహిత కర్మలను శ్రద్ధతో ఆచరించాలి. వర్ణాశ్రమ ధర్మాలను పాటించాలి. ఎవరైనా "నాకు ఇవన్నీ అవసరం లేదు. నేను జ్ఞానిని అయ్యాను. నాకు విహిత నిషేధ కర్మలంటూ ఏమీ లేవు" అని చెప్పూనే సమయానికి భోజనం కోసం ఎదురుచూస్తుంటే వారిని జ్ఞాని అనుకోవడం పొరపాటు.

వర్ణాశ్రమ ధర్మాలను పాటించాలంటే శ్రద్ధ కావాలి. విహిత కర్మలలో సంధ్యావందనం అత్యంత ముఖ్యమైనది. బ్రహ్మచారికి దానితోపాటు అగ్నికార్యం వేదాధ్యయనం ముఖ్యమైనవి. విహితమని చెప్పిన దానినంతా ఆచరించలేకపోతే, సాధ్యమై నంత వరకన్నా ఆచరించడానికి ఆటంకమేమిటి? వేదాలను బోధించడానికి గురువు లభ్యమవుతున్నప్పుడు, వేదాధ్యయానానికి అధికారమున్నప్పుడు, వేదాధ్య యనం చేయడానికి ఇబ్బంది ఏమిటి? అధికారమున్నా వేదాధ్యయనం చేయకపోతే పాపం వస్తుంది. అయితే వేదాధ్యయానానికి అధికారం లేనివారి సంగతి వేరే విషయం.

ఒకసారి ఒక వ్యక్తి ఆచార్యపాదుల వద్దకు వచ్చి, ఇంకో వ్యక్తి గురించి ఇలా చెప్పాడు. "అధికారం లేకపోయినా అతను వేదాధ్యయనం చేస్తున్నాడు. తప్పనిసరిగా నరకానికి పోతాడు." ఆ మాటలను విన్న ఆచార్యపాదులిలా సమాధానమిచ్చారు. "అధికారమున్నా నీవు వేదాధ్యయనం చేయడం లేదు. నీవు ఎక్కడికి పోతావు? నిన్ను సరిదిద్దుకుని ఆ తరువాత ఇతరుల సంగతి ఆలోచించు" అని. బ్రహ్మచారికి విహిత కర్మలుగా చెప్పబడిన అగ్ని కార్యం, వేదాధ్యయనంతో పాటు, పెద్దల పట్ల గౌరవం కలిగి ఉండాలి. పెద్దలను ఎంతగా అవమానపరిస్తే అంత గొప్ప వాళ్ళమవుతామని చాలామంది అనుకుం టున్నారు. తమ తల్లిదండ్రుల పట్ల కూడా మర్యాదపూర్వకంగా కొందరు యువకులు ప్రవర్తించడం లేదు. అయితే వేదాలు

మాతృదేవో భవ । పితృదేవో భవ ।

అని చెప్తున్నాయి. కాబట్టి తమ తల్లిదండ్రుల పట్ల పెద్దల పట్ల గౌరవ భావంతో మెలగాలి. గృహస్థులకు అతిథి సత్కారం చాలా ముఖ్యం. వాళ్ళకు తల్లిదండ్రుల సేవ కూడా ముఖ్యమే. అభ్యాగతః స్వయం విష్ణుః అని శాస్త్రం చెప్తోంది.

ఆచార్యపాదులు ఒకసారిలా అన్నారు. "వ్యక్తులు స్వార్థపరులు కాకూడదనీ, తమకున్న దానిని అవసరమున్న వారితో పంచుకోవాలనీ ఇప్పుడు చాలామంది చెప్తుంటారు.



కాని మన పూర్వీకులు ఇదే విషయాన్ని ఎప్పుడో చెప్పారు. ఇంకొకరికి భోజనం పెట్టకుండా తినకూడదని. అలాగే ఇంకో మాట కూడా చెప్పారు.

పరాగ్ని పక్వం నాశ్నీయాత్- అని.

ఇతరులకు ఆహారం పెట్టాలని చెప్తూనే ఇతరుల ఆహారాన్ని మనం స్వీకరించడాన్ని నిషేధించారు. గృహస్థు "ఈరోజు నేను ఏ మహానుభావునికి ఆతిథ్యమివ్వగలను?" అని ఆలోచించాలి. అలాగే మరోవైపు అతిథి "మరోచోట నేను భోజనం చేయరాదు. కాని చాలా దూరం నేను ప్రయాణం చేశాను. ఈ ప్రదేశం నాకు ఎవరూ తెలియదు. ఉత్తములెవరైనా నాకు ఆహారాన్ని ఇస్తే సాయంత్రానికి ఇంటికి చేరుకోగలను" అని అనుకోవాలి. అతిథి వెనకాముందు చాలా సంకోచంతో ఆలోచిస్తూ వస్తాడు. గృహస్థు ఉత్తముడైన అతిథి కోసం ఎదురుచూస్తుంటాడు. అతిథికి చాలా సంతోషంగా ఆతిథ్య మిస్తాడు. ఇదీ ఆనాటి పరిస్థితి. కాని ప్రస్తుత పరిస్థితి ఏమిటి? అది కూడా ఆచార్యపాదులే వివరించారు.

"ఈ రోజుల్లో గృహస్థు తన ఇంటి తలుపును మూసివేసి, ఇతరులకు ఆతిథ్యమివ్వడానికి నిరాకరిస్తాడు. అతిథి బలవంతంగానైనా ఇంట్లోకి రావాలని చూస్తాడు." ఈ ధోరణులు మంచివేనా? ఎన్నటికీ కాదు. గృహస్థులకు అతిథి సత్కారం యొక్క ప్రాధాన్యతను తెలియజేయ డానికే ఈ విషయాన్ని చెప్పాను. సన్న్యాసుల విషయంలో ఇలా చెప్పారు.

యతిర్యాదృచ్ఛికో భవేత్

సన్న్యాసి ఒకేచోట నివాసమేర్పరుచు కుని ఉండరాదు. పరివ్రాజకుడై తిరు గుతూ ఉండాలి. నిత్యమూ అనుష్ఠాన మాచరిస్తూ, ఎక్కువగా మాట్లాడకుండా, పరబ్రహ్మ ధ్యాన నిరతుడై వైరాగ్యభావం కలవాడై ఉండాలి. సన్న్యాసులకు చెప్పిన నియమాలివి. మీరలా ఉంటున్నారా అని మీరు మమ్ము అడుగవచ్చు. శ్రీ భగవత్పాదుల వారు పీఠమునకు బాధ్యతను అప్పగించారు. అందువలన మేము ప్రస్తుత రీతిలో ఉండాలి. మౌనంగా పరివ్రాజకునిగా ఉండడం మాకు సంతోషమే కాని ఆచార్యపాదులు మరోవిధంగా ఆజ్ఞాపించారు. మా ప్రస్తుత ప్రవర్తనకు అదే కారణం.

శాస్త్రం ఆదేశించిన విధులను ఆచరించడం జ్ఞానసముపార్జనా మార్గంలో మొదటి అడుగు. దానివలన మనస్సు పరిశుద్ధమవుతుంది. ఆ తరువాత గురువుగారి బోధనల వలన జ్ఞానం లభిస్తుంది. దానితో మోక్షం సిద్ధిస్తుంది. మానవ దేహం లభ్యమవడం నిజానికి మన యొక్క గొప్ప అదృష్టం. అందువలన మనం సక్రమ మార్గంలో పయనించి శ్రేయస్సును పొందాలి.

హర నమః పార్వతీపతయే హరహర మహాదేవ ॥

జానకీ కాన్త స్మరణం జయ జయ రామ రామ ॥

# మృత్యువును జయించడమెలా...

## శ్రీ చరణుల అనుగ్రహభాషణం

ఇటీవల చెన్నైలో శ్రీ చరణులు పర్యటన సందర్భంగా అనేక కార్యక్రమాల్లో పాల్గొనడం జరిగింది. ఆ సాయంత్రం గురువందన కార్యక్రమం జరిగింది. నగరు మేయర్, ప్రముఖ న్యాయవాదులు, వైద్యులు ఈ కార్యక్రమంలో పాల్గొని శృంగేరి పీఠాన్ని, శ్రీజగద్గురు పరంపర గురించి ప్రస్తుతిస్తూ ప్రసంగించారు. సభలో పాల్గొన్న ఒక వైద్యుడు మృత్యుభయం నుండి తప్పించుకోవటం ఎలా అని ప్రశ్నించగా, శ్రీ జగద్గురువులు తమ అనుగ్రహభాషణంలో ఆ ప్రశ్నకు సమాధానంగా ఇలా మాట్లాడారు.

శాస్త్రాలనుండి ఒక శ్లోకాన్ని శ్రీ జగద్గురువులు ఉటంకించారు.

మృత్యోర్బిభేషి కిం మూఢ భీతం ముంచతి కిం యమః ।
అజాతం నైవ గృహ్ణాతి కురు యత్నమజన్మని ॥

మూఢుడా! మృత్యువంటే భయపడుతున్నావని యముడు నిన్ను వదలిపెడతాడా? అయితే జన్మించనివారిని (అసలు పుట్టుకే లేనివారిని) యముడు ఏమీ చేయడు. అందువలన జన్మ లేకుండా ప్రయత్నించు.

ప్రపంచంలో కొన్ని సందర్భాలలో భయపడుతున్నవారిపై సానుభూతితో వారిని వదలిపెడతారు. కాని మృత్యువు విషయంలో మాత్రం అలా కాదు. జీవితకాలం అయిపోగానే ఎక్కడున్నా, మృత్యువంటే భయమున్నా లేకపోయినా యముడు వస్తాడు. అందువలన ఆత్మజ్ఞానాన్ని అలవరచుకోవటానికి ప్రయత్నించాలి. ఆత్మజ్ఞానమంటే ఏమిటి? చాలామంది మన గురించి తెలుసుకోవలసిన దేముంటుంది అని అడుగుతుంటారు. మీ గురించి చెప్పండి అంటే "నేను ఫలానా తేదీనాడు జన్మించాను. ఫలానా వ్యక్తులు నా తల్లిదండ్రులు. నా ఎత్తు బరువు వగైరాల వివరాలివి. నా వయస్సు ఇది" అని చెబుతారు. కాని ఇది ఆత్మగురించి చెప్పటంకాదు. అవి మనదేహం యొక్క వివరాలు. ఆత్మ నిత్యం, శాశ్వతం. ఎటువంటి మార్పులు దానికుండవు. నేను ఆత్మనే అనే విషయం తేలికగా అనుభవానికి రాదు. చాల జన్మలుగా 'శరీరాన్నే నేను'గా భావిస్తూ వచ్చాం. దీనినే సంస్కారం అని చెబుతారు. ఒకాలోచనగాని, అనుభవంగాని పదేపదే కలుగుతున్నా ఒక కర్మను అనేకసార్లు ఆచరిస్తున్నా ఒక భావమేర్పడుతుంది. అనేక జన్మలుగా శరీరం - ఆత్మ ఒక్కటే అనే భావంలో మానవులున్నారు.

శ్రీశంకరులు అట్టి భావనను తొలగించుకోవాలన్నారు. నాహం దేహో నేన్ద్రియాణ్యన్త రంగః (నేను దేహాన్ని కాను,



ఇంద్రియాలను కాను. అంతరంగాన్ని కాను) మార్పులన్నీ శరీరానికే. ఆత్మశుద్ధ చైతన్యమనీ, నిత్యమనీ గ్రహించాలి. అయితే ఈ అవగాహన తేలికగా అందరికీ కలుగదు. వేదాంతం వింటూ చాలామంది నిద్రపోతుంటారు. శ్రీజగద్గురువులు ఈ సందర్భంలో ఒక కథను చెప్పారు. ఒక ధనవంతుడు నిద్ర పట్టటానికై వేదాంతాన్ని చెప్పించుకునేవాడట. వేదాంతాధ్యయనానికి చిత్త శుద్ధి కావాలి. ఎంత బోధించినా అది లేనినాడు నిష్ప్రయోజనమే. తదుపరి శ్రీ జగద్గురువులు మనస్సును పరిశు ద్ధమొనరించటానికి మార్గాలను వివరించారు. ప్రస్తుతం ఈ భాషణం (ప్రవచనం) వింటున్నారు. కాని మీ మనస్సు ఎక్కడెక్కడో విహరిస్తోంది. అందువలననే అనుగ్రహభాషణంద్వారా ఏమి తెలుసుకొన్నారంటే "స్వాములవారు తమిళం కూడా చాలా చక్కగా మాట్లాడగలరని గ్రహించా"నంటారు. కాని చెప్పిన విషయాలు మాత్రం అర్థంకావు. దానికి కారణం కోరికలు వదలిపెట్టవు. సంతృప్తి ఉండదు. కాబట్టి కామాన్ని అదుపులో ఉంచాలి.

క్రోధంయొక్క ప్రభావం గురించి చెప్తూ శ్రీజగద్గురువులు హనుమంతుని ఉదహరించారు. కోపంలో లంకను తగులబెట్టి తరువాత "అయ్యో, సీతమ్మవారు కూడ లంకలోనే ఉన్నారు కదా, అగ్ని ఆమెకు ఇబ్బంది కలుగజేయలేదు కదా" అని బాధపడ్డాడట. అహంకారం మరో మానసిక వికారం. ధనం, పదవి, విద్య, అధికారం అహంకారానికి కారణమవుతాయి. అసూయ కూడ ఒక దోషమే. ఇతరుల మంచిని గ్రహించకుండ వారిలోని అల్పమైన దోషాలను పెద్దవిగా చేసి చూపిస్తుంటారు.

ఈ రోజు మనం సత్పురుషునివలె గడిపామా? లేదా పశువువలె గడిపామా? అని ప్రతిరోజు బేరీజు వేసుకోవాలి. ఈ రోజు నేను ఏమీ తప్పు చేయలేదు అని చెప్పగలిగిన రోజు సద్వినియోగమైనట్లు అటువంటి రోజుల సంఖ్య పెరిగితే మనస్సు పరిశుద్ధమవుతున్నట్లే.



# అద్భుత ఘట్టం.. జగద్గురు అభినవ విద్యాతీర్థుల శతజయంతి మహోత్సవం

**అక్టోబర్ 5 నుంచి 16 వరకు అతిరుద్ర మహాయాగం... 18న శతజయంత్యుత్సవం**

తపశ్చక్రవర్తి... మహాయోగి... శ్రీ శృంగేరి జగద్గురు శంకరాచార్య శ్రీశ్రీశ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామివారి శతజయంతి మహోత్సవాలు శృంగేరి శారదాపీఠంలో నేత్రపర్వంగా కార్యక్రమాలు నిర్వహించారు. ప్రతిరోజూ అభినవ విద్యాతీర్థ మహాస్వామి వారి జీవనరేఖలు, ఆధ్యాత్మిక ప్రస్థానంపై ప్రత్యేక తత్త్వచింతన సదస్సును నిర్వహించారు. ప్రతిరోజూ విఖ్యాత సంగీత విద్వాంసులచే కచేరీలను నిర్వహించి, సంగీతార్చన గావించారు. జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి అధిష్ఠానంలో జగద్గురువులు శ్రీ భారతీతీర్థ మహాస్వామి, శ్రీ విధుశేఖర భారతీస్వాములు ప్రత్యేక పూజలు అర్చనలు చేశారు. అక్టోబర్ 5 నుంచి 19వ తేదీ వరకు శతజయంతి ఉత్సవాలలో భాగంగా విశేష ధార్మిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి. దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి వేదపండితులు, ధార్మికవేత్తలు పెద్దయెత్తున పాల్గొన్నారు. ప్రధానంగా అక్టోబర్ 5వ తేదీ నుంచి 16 వరకు అతి రుద్ర మహాయాగం జగద్గురువుల పర్యవేక్షణలో జరిగింది.

శ్రీ శృంగేరి శారదా పీఠాధీశ్వరులు జగద్గురు శంకరాచార్య శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి, శ్రీశ్రీ విధుశేఖర భారతీ స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో, వారి దివ్యాశీస్సులతో చెన్నయ్‌లోని శ్రీ విద్యాతీర్థ ఫౌండేషన్ సంస్థవారు అక్టోబర్ 11 నుంచి 18వ తేదీ వరకు విశేష కార్యక్రమాలు నిర్వహించారు. జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామివారి అధిష్ఠానంలో 10 తేదీ నుంచి 19వ తేదీ వరకు ప్రత్యేక పూజలు జరిపారు.

అక్టోబర్ 17న జగద్గురువులు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామివారి అష్టోత్తర అఖండ పారాయణం ఘనంగా జరిగింది. 12 నుంచి 18వ తేదీ వరకు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామివారి అభినవ సప్తాహం జరిగింది. సప్తాహానికి ముందు రోజు 11వ తేదీ ఉదయం సహస్ర మోదక గణపతి హోమం జరిగింది. శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి శతజయంతి మహోత్సవాల సందర్భంగా స్మరణ సప్తాహాన్ని శృంగేరి శారదా పీఠాధీశ్వరులు శ్రీశ్రీశ్రీ జగద్గురు భారతీతీర్థ




మహాస్వామి వారు ప్రారంభించారు. శ్రీశ్రీ జగద్గురు విధుశేఖర భారతీ స్వామి వారు పాల్గొన్నారు. ఈ సప్తాహంలో రోజూ సాయంత్రం 4 గంటల నుంచి 6 వరకు విఖ్యాత సంకీర్తన కళాకారులచే నామ సంకీర్తనం, భజన కార్యక్రమాలు జరిగాయి. ప్రారంభ, సమాపనోత్సవ రోజుల్లో నృత్య, నాటక ప్రదర్శనా కార్యక్రమాలు కన్నుల పండువగా జరిగాయి.

పెద్దయెత్తున తరలివచ్చిన భక్తులు, శిష్యులు, ఆధ్యాత్మిక వేత్తల సమక్షంలో జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి వారి శత జయంతి ప్రధాన ఉత్సవం వారి జయంతి రోజైన అక్టోబర్ 18 తేదీన జరిగింది. పలు విశేష కార్యక్రమాలు నిర్వహించారు. మధ్యాహ్నం పన్నెండు గంటలకు అభినవ విద్యాతీర్థ స్వామివారి అధిష్ఠానంలో విశేష పూజలు, అర్చనలు జరిగాయి. జగద్గురు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి, శ్రీశ్రీ విధుశేఖర భారతీ స్వామివార్లు స్వయంగా శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి వారికి అభిషేకం, అష్టోత్తర శతనామావళి పూజలు, ప్రత్యేక అర్చనలు నిర్వహించారు ఈ సందర్భంగా శ్రీ అభినవ విద్యాతీర్థుల విగ్రహానికి సువర్ణ హారం, సువర్ణ కవచ రుద్రాక్ష హారాలను శ్రీ భారతీతీర్థ స్వామివారు సమర్పించారు. సాయంత్రం ఐదు గంటలకు గురు నిలయంలో అభినవ విద్యాతీర్థ స్వామివారి శతజయంతి ప్రధాన ఉత్సవం జరిగింది. సజీవమూర్తిగా భాసిల్లిన అభినవ విద్యాతీర్థుల విగ్రహం వద్ద జ్యోతి ప్రకాశనం, పూజలు చేసి ఉభయ జగద్గురువులు విగ్రహానికి ఇరువైపులా ఆశీనులయ్యారు. వేలాదిమంది భక్తులు హాజరైన ఈ కార్యక్రమం చతుర్వేద పఠనం, స్వామివారి స్మృతి స్మరణ సభ కొనసాగింది.

ఈ సందర్భంగా శ్రీఅభినవ విద్యాతీర్థ ఫౌండేషన్ (చెన్నయ్) వారు ప్రచురించిన ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. అనంతరం 'దర్శనమ్' ఆధ్యాత్మిక మాసపత్రిక ప్రచురించిన 'సద్గుణనిధి-తపశ్చక్రవర్తి' ప్రత్యేక గ్రంథాన్ని జగద్గురువులు శ్రీ భారతీతీర్థ మహాస్వామి వారు ఆవిష్క రించారు. తొలిపత్రిని శ్రీ దక్షిణామూర్తిగారికి అందజేశారు. శ్రీ అభినవ విద్యాతీర్థ స్వామి వారిని సంస్మరించుకుంటూ వక్తలు స్తుతిం చారు. చివరగా జగద్గురువులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి, శ్రీశ్రీ విధుశేఖర భారతీతీర్థ స్వామివార్లు తమ అనుగ్రహ భాషణాన్ని అందిస్తూ గురువరేణ్యుల శ్రీ అభినవ విద్యాతీర్థుల విశిష్టతను, వారి పీఠాధిపత్యంలో శృంగేరి శారదాపీఠ వైభవాన్ని, ప్రత్యేక సందర్భాలను స్మరిస్తూ కొనియాడారు.

# గురు సాన్నిధ్యం

(శ్రీ భారతీ తీర్థుల 66వ వర్ధంతి సందర్భంగా)

మాటల ద్వారా వివరించలేని, ఊహకందని వ్యక్తిత్వాలు కొన్ని ఉంటాయి. మన భాషకు అక్షరాలు యాభయ్యారేనా. ఇంకా ఉంటే మరింత వివరించే అవకాశ ముండేదేమో అనిపిస్తుంది. అట్టి సాన్నిధ్యంలో కూచుంటే ఎదో శాంతి, తృప్తి. మాట్లాడక పోయినా మార్గ దర్శనం లభిస్తుంది. అటువంటి మహనీయ వ్యక్తిత్వాలలో శ్రీశ్రీ భారతీ తీర్థస్వామి ఒకరు.

విలు చిక్కితే చాలు శృంగేరి బయలుదేరుతారు, దూరా భారం లెక్క చెయ్యకుండా. అక్కడ కెళ్ళి ఏంచేస్తారు, ఏం చూస్తారు( చిన్న గ్రామం కదా) అని ప్రశ్నించే మిత్రులకు - ఏం చెయ్యట మేమిటి? గురువు గారి దగ్గర, ఆ సన్నిధిలో అలా ఉండటమే అని జవాబు. ఈ జవాబు వెనుక ఉన్న అనుభూతి, ఆనందం ఎన్ని మాటల్లో వ్యక్త పరచగలం. ప్రశాంతంగా నిర్లిప్తంగా భక్త జనావళిని కలయ జూసే చూపు, ఆ చూపులోని వాత్సల్యం ఆ మందహాసం జగత్తును ఆర్ద్రం చేస్తుంది. శిష్యవాత్సల్యం శతపత్రమై విరిసిన జగద్గురు పరంపరలో ఒక మహనీయమైన మజిలీ! శిష్యకోటి దర్శనార్తి, మార్గదర్శనా ర్తి తీర్చే ఒక చలివేంద్రం! ఇన్ని వందల మంది మధ్య మసలుతున్నా, ఇంత మఠకార్య భారం వహిస్తున్నా భౌతిక పరిసరాల నుండి విడివడి దైనందిన చింతలకు అతీతమైన అంతర్ముఖత్వ శక్తి సంపన్నులు గురు చరణులు.



గురుభవనానికి విశ్రాంతి లేదు. పాదపూజలు చేసుకునే వారు, గురువందనం సమర్పించే వారు

కానుకలు ( ఒకటి రెండు కొబ్బరి కాయలు మొదలు భారీ విరాళాల వరకు) సమర్పించే వారు, నిత్య దర్శనాభిలాషులు ఇలా .. . . . ఎప్పుడు కోలాహలం గానే ఉంటుంది. శృంగేరి ఆశ్రమంలో అందరూ చేసే వాళ్ళే గాని చెప్పే వాళ్ళు కనపడరు. జరగవలసిన అన్ని పనులూ చకచకా జరిపోతూ ఉంటాయి. పాద పూజకో మరో కార్యానికో ముగ్గురు నలుగురే ఉన్నా నలభై మంది ఉన్నా సమయ పాలనతో పూర్తవుతాయి. గురువులిచ్చే మంత్రాక్షతలు, ఆశిస్సులు, తీర్థప్రసాదాలు అందరికీ ఒకేలా అందుతాయి. సంస్థానంలో ఎక్కడి నుంచ్చి ఏ విభాగం నుంచి వస్తారో తెలియదు. భక్తులను పిలిచి పాదపూజాదికాలు చేయిస్తారు. హమ్మయ్య చక్కగా పాదపూజ అయ్యింది అనుకుంటూ లైనులో నిలబడి గురువుగారి పలకరింపులు, మంత్రాక్షతలు ఆశీస్సులు స్వీకరించి బయట పడేసరికి విరెవరూ కనపడరు. తమ తమ విధులలోకి అదృశ్యమవు తారు కాబోలు! ఆ ఆవరణలో ఆ సన్నిధిలో బాహ్య దృష్టికి గాని మనో నేత్రానికి గాని మరేదీ గోచరించదు. మనసుకు మరో మాట తోచదు. ఏదో తన్మయత, ప్రశాంత అవ్యక్తానుభూతి . అన్ని వందల



మంది ఎవరికివారే ని నన్నే ఇంతగా ఆదరించారు, అభయమిచ్చారు, ఆశీర్వదించారు ని అని అనుకుంటూ కదులుతారు. గురు వాత్సల్య ధారలో తడిసిన వాళ్ళకు లింగ వయో బేధాలు గుర్తుకు రావు.ాయాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ...ౖ అంటే ఇదేనేమో.

ని గురు దర్శన మాత్రం చేత గురుకృప లభిస్తుందా?ు అని ఒక పాత్రికేయుడు అడిగిన ప్రశ్నకు గురుచరణుల జవాబు ుఅది గురువు గారి శక్తిపై ఆధారపడి ఉన్నది. కొంతమంది గురువులు ఉన్నత స్థితిలో ఉంటారు. వారి దర్శనం వల్లనే మన జీవితాలు ఫలవంత మవుతాయి. గురువులు జీవితాలను మార్చ గలరు. తమ దృక్కుల చేతనే ప్రజల పాపాలను క్షాళితం చెయ్యగలరు. ని వారి జవాబు వారికీ అన్వయిస్తుంది సంపూర్ణంగా.

శ్రీచరణులు అనుక్షణం, అహరహం గురు ధ్యాన తత్పరులై, గురువాక్య పరిపాలనా దక్షులై అచంచల గురు భక్తికి నిలువెత్తు నిదర్శనం గా నిలచిన వారు. ఆత్మ నిగ్రహం, మౌనం, సత్యసంధత, క్రమశిక్షణ, కార్యదక్షత సమయపాలన వంటి సుగుణాలు అలవరచు కొని నిత్యజీవితంలో ఆచరించి చూపుతున్న ఆచరణాత్మక వేదాంతి. మనసు మల్లెపూవు వలె సున్నితం. నియమపాలన లో వజ్ర కఠోరం. ప్రతి జీవిలోను పరబ్రహ్మను దర్శించ గల తాత్త్వికులు వారు. ఎన్ని వందల మంది వారి దర్శనాని కొచ్చినా ఎన్నెన్ని ప్రశ్నలతో విసిగించినా ఆ ప్రశాంత వదనం లో ఆ మందస్మితం లో మార్పు ఉండదు. వశ్యవాక్కు, శబ్ద ప్రభుత తో, వ్యాఖ్యాన వైభవంతో అలరారే విరి అనుగ్రహ భాషణాల గురించి చెప్పాలంటే ఒక బృహద్గ్రంథమే అవుతుంది. ధర్మాచరణ ప్రాశస్త్యం చెప్పినా, గురు శిష్య లక్షణాలు వివరించినా, సంధ్యావందనం గురించి చెప్పినా, వేదసారము అద్వైతమే అని విశదీకరించినా కాళిదాసు కవిత గురించి చెప్పినా, కాలం విలువ వివరించినా ...... సామాన్యుని సజీవ భాషలోనే చెపుతారు. హిందీ మాట్లాడే ఉత్తరాది వారూ, దక్షిణాది నాలుగు భాషల వారూ ఎవరికి వారే గురువు గారి మాతృభాష మా భాషే అనుకోవటం పరిపాటి. వారి అనుగ్రహ భాషణములను విన్న అదృష్ట వంతులకు అనుభవైక వేద్యమే ఇవి.

శ్రీచరణుల 66వ వర్థంతిని పురస్కరించుకొని ఈ నాలుగు ముక్కల అక్షరాంజలి సమర్పించే సాహసం చెయ్యటానికి కారణం వారి శిష్యవాత్సల్య ప్రవాహం లో తప్పొప్పుల తబిశీళ్ళు క్షాళిత మవుతాయి లే అన్న ఆశతోనే!

శ్రీ చరణుల గురించి ఎన్ని వ్యాసాలు రాస్తే మాత్రం, ఎన్ని మాటలు చెపితే మాత్రం మహా సన్నిధానం సాన్నిధ్యానికి సాటి కాగలవు!

అస్తే సేశిక చరణం నిరవధి రాస్తే తదీక్షణే కరుణా
అస్తే కిమపి తదుక్తం కిమతః పరమస్తి జన్మ సాఫల్యమ్.

గురు చరణం ఉన్నది. ఆయన కటాక్షంలో అనంత మైన ప్రేమ ఉన్నది. ఆయన ఉపదేశం ఉన్నది. ఇంక దీనిని మించిన జన్మ సార్థక్యం ఏమున్నది.

- ప్రసాదవర్మ కామర్షి.

దక్షిణామ్నాయ శ్రీ శృంగేరీ శారదా పీఠాధీశ్వరులు జగద్గురు శంకరాచార్య శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థమహాస్వామి
శ్రీశ్రీశ్రీ విధుశేఖర భారతీ స్వామి వారలకు సాష్టాంగప్రణామాలు

భారతీ కరుణా పాత్రం భారతీ పదభూషణం।
భారతీ పదమారూఢం భారతీ తీర్థమాశ్రయే॥

విద్యావినయ సంపన్నం వీతరాగం వివేకినాం।
వందే వేదాంత తత్త్వజ్ఞం విధుశేఖర భారతీమ్॥





దివ్యసప్తతిపూర్తి మహోత్సవం సందర్భంగా
దక్షిణామ్నాయ శృంగేరి శ్రీ శారదాపీఠాధీశ్వరులు జగద్గురు శంకరాచార్య
శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాసన్నిధానం వారికి సాష్టాంగ ప్రణామాలు

ధార్మిక ప్రేరణలతో... **శాంత-వసంత ట్రస్టు**